వుప్పల లక్ష్మణరావు

# అతడు - ఆమె

## నవల



1950

ప్రకాశకులు
కొమర్రాజు వినాయకరావు
రామచంద్రరావు రోడ్డు :: విజయవాడ.

## తొలి పలుకు

పాతికేళ్లక్రితం నేను జర్మనీలో వున్నప్పుడు మా కుటుంబపత్రిక "ఉషఃకాలం" కోసం యీ నవల వ్రాయడం ప్రారంభించాను. స్ఫురణ భార్యాభర్తల దినచర్యగా ఆలీవ్ వాడ్స్లీ రచించిన చిన్న కథ. నా నవలలో కొన్ని ప్రకరణాలు అప్పుడప్పుడు "ఉషఃకాలం" లో పడుతూ వచ్చాయి. పదేళ్లపాటు వూరుకుని మళ్లీ కొన్ని ప్రకరణాలు చేర్చి మొన్న యూరపు వెళ్లొచ్చాక ప్రచురిద్దాం అనుకున్నాను. కాని కథ ఇంకా పెంచివ్రాస్తే బాగుంటుందనితోచి వెనుకటిది కొంతమార్చి క్రొత్తఘట్టాలు కొన్ని కల్పించి కథ పూర్తిచేశాను. కథను ప్రచురించడానికి అనుమతి ఇచ్చిన మా "ఉషఃకాలం" వారికిన్నీ, ప్రచురణకు అన్నివిధాల నాకు తోడ్పడిన మిత్రులకున్నూ కృతజ్ఞుణ్ణి.

బరంపురం
ఏప్రిల్ 1949.

రచయిత

శాంతమ్మ ఎం. ఏ. ప్యాసయింది. చెన్నపట్నం క్వీన్ మేరీ కళాశాలలో పని చేస్తూండేది. తెలివైంది. చురుకైంది. సరదామనిషి. నాలుగేళ్ల క్రింద ఆమెకు చిదంబర శాస్త్రి పరిచయం అయింది. అతనూ అప్పుడే సీమనుంచి బారిస్టరీ ప్యాసై, చెన్నపట్నంలో ప్రాక్టీసు పెట్టాడు. అతనూ మంచి మనిషే. అతనికి కూడా సరదాలు కావాలి. ఇద్దరూ కూడా తెలుగువాళ్ళవడంచేత, ఒకటే మోస్తరుద్దేశా లుండడంచేత, యిద్దరూ పెళ్ళి కానివాళ్ళవడంచేత స్నేహం బాగా కుదిరిపోయి, రెణ్ణెల్ల క్రింద రిజిస్ట్రారాఫీసులో పెళ్ళి చేసుకొన్నారు. పెళ్ళి చేసుకొన్ననాడే మనుగుడుపులకి కాశ్మీరు బయలుదేరి వెళ్ళిపోయారు. అక్కడ రెణ్ణెల్ల సెలవలూ ఖులాసాగా గడిపేశారు. మళ్ళీ చెన్నపట్నంవచ్చేశారు. కొత్తసంసారం మొదలుపెట్టి రెండుసంవత్సరాలుఅయింది. కోర్టులకి శెలవలైపోడాన్ని తెరిచారు. శాంతమ్మ పని మానేసింది. ఇంక యీ సంసారంవల్ల శాంతమ్మకీ, శాస్త్రులకీ సుఖమే కలుగుతుందో కొసకి విడాకులే వస్తాయో?

ఇంత కొత్తగా, యింత సంతోషంగా యింత సరదాగా మొదలెట్టిన సంసారం సుఖంగా ఉండడంకోసం వచ్చిందో, చెక్కలవడంకోసమే వచ్చిందో? పైకెలాగున్నా కడుపులో మాట లోకానికి తెలియనిస్తారా? ఇవి శాంతమ్మ, శాస్త్రి యెవరిమట్టుకు వాళ్లు రోజూ వ్రాసుకొనే దినచర్యలు. ఇవి చదివితే మనకేమైనా తెలుస్తుందేమో?

# I

## ఆమె

ఖులాసాగా ఆనందంగా గడిచిపోతున్నాయి రోజులు! శాస్త్రి ప్రేమ నాకున్నంతకాలం – తిండీ తిప్పలూ ఇల్లూ వాకిలీ – కొసకి ప్రపంచంతో కూడా నిమిత్తం లేదనిపిస్తూంది! జన్మరాహిత్యం అంటే ఇదే! రెండేళ్లయిపోయింది – కాశ్మీరునుంచి చెన్నపట్నంవచ్చి. అయినా ఆ తేనెవెన్నెలయొక్క తియ్యదనం చల్లదనం ఇప్పటికీఆనందిస్తూనేవున్నాం. మా సంసారం మా మనుగడ అంతా ఆదిమధ్యాంతంలేని ఆ తేనెవెన్నెటిరాత్రిలాగే సాగిపోవాలి! మా యిద్దరికోరిక ఇదే!

శాస్త్రి ఆ కాశ్మీరం రోజులని వివరాలతో జాములు గడియలు లిప్తలతోసహా జ్ఞాపకంపెట్టుకున్నాడు. నేనింకా వకటి రెండు విషయాలు మర్చిపోతే మర్చిపోయానేమో. "శాంతం! ఆవేళ ఝీలం వంతెన దగ్గిర జైనులబ్దీను పాదుషాయొక్క తల్లి సమాధి జ్ఞాపకంవుందీ?" అంటాడు. జ్ఞాపకంలేకేం? "మనంవెళ్ళిన రోజున హిందూ స్త్రీలు తురకస్త్రీలు కూడా పువ్వులతో ఆ సమాధిని పూజించారుకదూ?" అంటాను. "అంతేనా నీకు జ్ఞాపకం? వాళ్ళందరూ వెళ్ళిపోయాక ఆ గోరీయెదుట నిన్ను నేను ముద్దుపెట్టుకొని - ఆవిడకు ఇదే మన ప్రేమాంజలి అన్నానుకదూ!" అంటాడు. "శాంతం! మకైసబాల్ తోట గుర్తుందీనీకు?" అని అడుగుతాడు. "ఎంతరమ్యమైన ఫూల్ భాగోయి అది! షాలిమార్ తోటకంటేను, నిషాత్ గులిస్తాను కంటేను అందంగా వుండేను - శాస్త్రీ!" అంటాను నేను. "అవునుకాని అసలుసంగతి మర్చిపోయావు! సరస్సులో సహాంమునిగిపోయిన ఆ దేవాలయంలో విగ్రహాంముందు నిరంతరప్రేమ వొట్టేసుకున్నాం - జ్ఞాపకంతెచ్చుకో!" అంటాడు. "ఆనాడు ప్యారీమహాల్ కి వెళ్ళాం - జ్ఞాపకంవుందానీకు?" అని అడుగుతాడు. "ప్యారీమహాలు మర్చిపోతానా? పచ్చని తివాచీలాంటి పచ్చికబయళ్లు - తెల్లని వెన్నపువ్వులు - బంగారపు జుంకా పువ్వులు! కాని - యే ఆదివారము నువ్వన్నది?" అంటా. "ఆ ఆదివారం! జంట యెర్రగులాబీలగుత్తి వక్కటేవుంటే దాన్ని మనం వాసనచూస్తూంటే మనయిద్దరి పెదవులు కలుసుకున్నాయి. అప్పుడు 'నా జీవాధార' అని నువ్వు పాడేవు - ఇప్పుడేనా జ్ఞప్తికివచ్చిందా?" అంటూ ముద్దుపెట్టుకుంటాడు. నాకు జ్ఞాపకంలేకనా! శాస్త్రినోట మ్మటు అనిపిస్తే విని ఆరోజుల మాధుర్యం మళ్ళీ అనుభవించి తన్మయంపొందుతాను!

తాజా: మధ్యాహ్నం ఫలహారానికి శాస్త్రి యింటికొచ్చాడు. కాఫీ తాగుతున్నప్పుడు నేనన్నా: "చెక్కుపుస్తకం తీసుకెళుతూన్నట్టున్నావు. గోపాలరావునాయుడు మాటలు విని పెద్దకారు కొనేవుసుమా!" అన్నాను. అంతేనేనన్నది. వెళిపోయేటప్పుడు నన్ను ముద్దుపెట్టుకోకుండా వెళిపోయాడు! కచేరికి వెళ్ళేటప్పుడు, కచేరి నుంచి వచ్చేటప్పుడు రోజూ తప్పకుండా నన్ను ముద్దుపెట్టుకుంటాడు. వక్కనాడేనా తప్పలేదు. అటువంటిది - యీవేళ వెనక్కితిరిగైనా చూశాడుకాడు! ఇంత పిసరుకే నామీదప్రేమ చూపించకపోవడమా? అయ్యో! రోజూ కచేరీనుంచి యింటికి వచ్చేటప్పుడు నాకోసం యేదోవకటి తెస్తూంటాడుకదా! నిన్నను: "యీచేతిలో యేముంది చెప్పుకో - శాంతం?" అన్నాడు. "తెలీదు" అన్నా. "కళ్లుమూసుకో!" అన్నాడు. కళ్లువిప్పిచూసేసరికి - వజ్రాలు తాపితంచేసిన సేఫ్టీపిన్ను! అతని ముఖంలో - ఆ సంతోషం ప్రేమ - నాకెన్నడేనా మరుపుకొస్తుందా! ... అటువంటిది - ఈవేళ - ఇది! ప్రేమంటే భ్రాంతే కాంసు? భ్రాంతి మాయకాకపోతే - ఇంతస్వల్పానికే నామీద కోపంవచ్చి ప్రేమచూపించక పోవడమా? శాశ్వతం అనుకున్నాను మా ప్రేమ! ... ఈవేళకిలా అనిపిస్తుంది. నిజంగా ఆలోచిస్తే ఎంతస్వల్పవిషయం! శాస్త్రి నేను ముసలి

వాళ్లంఅయి—మునిమనవలని యెత్తుకుంటూన్నప్పుడు దీనిగురించి యేమేనా జ్ఞాపకం వుంటుందీ ? ... ఎంతమర్చిపోదాం అనుకున్నా మరుపురాకుండావుంది. యెన్నడూ నన్నిలా ముద్దుపెట్టుకోకుండా వెళ్ళిపోలేదే ? ఎలామర్చిపోను ? నామీద కోపంవచ్చి అసలు యింటికి రావడమే మానేస్తాడేమో ? ఆతని ప్రేమలేకపోతే నేనెలాబ్రతుకను ?

## 2

## అ త డు

మధ్యాహ్నం ఫలహారంచేసి ఆలోచిస్తూ పరధ్యాన్నంగా చెక్కుపుస్తకం జేబులోవేసుకుని శాంతంతో వీడుకోలుచెప్పి కచేరీకివెళదాం అనుకుంటూనే మర్చిపోయి శాంతంతో చెప్పకుండానే కారెక్కి కచేరీకి వచ్చేశా. నేనూ కోర్టులో కాలుపెట్టేను - కేసు పిలిచారు. రెండోఅపీలు 'నాన్‌జాయిండరు' అని వాదిస్తున్నాను - మధ్యలోతట్టింది శాంతాన్ని ముద్దుపెట్టుకోకుండా వచ్చేశానే - అని ! ఏంచెయ్యను ? టెలిఫోనుచేసి క్షమాపణ చెప్పకుందామా అంటే - వాదన నడిమధ్యలో ఎల్లాగు ? ఏంతపన్తైపోయింది.

తనమీద నిజంగా ప్రేమలేకపోవడంచేతనే ముద్దుపెట్టుకోడం మానేశాననుకుంటుందో యేమిటో ? భయంవేస్తూంది. గోపాల్రావు గురించి శాంతం అన్నమాటలకి నాకు కోపంరావడం నిజమే. చిన్నతనంనుండీ స్నేహితులం. ఇంగ్లండులో నాలుగు సంవత్సరాలూ కలిసేవున్నాం. ఏమిటో అతని దురదృష్టం - ఒక్కపరీక్షేనా పూర్తిచేశాడు కాదు. మళ్ళీ మంచి తెలివితేటలున్నవాడు. ఏవో వ్యాపకాలు పెట్టుకుని ప్రాణాలు యెగవేసేవాడు. విలాసపురుషుడుకూడాను. స్వదేశంవచ్చేశాక మోటారు వ్యాపారంలో దిగేడు. వుల్లాసీదామనిషి ! మాయిద్దరికీ అంత అన్యోన్యమా - అటువంటిది — నా మారిస్ కాలీ కారు అతనిద్వారా నేకొన్నానా — ఆ బేరంలో నన్ను టోపీవేసి ఐదువందలు లోపాయకారీగా తన జేబులోవేసుకున్నాడు. చిన్ననాటినేస్తంకదా అనినేను మనసులో పెట్టుకోలేలేదు. కాని శాంతం కనిపెట్టేసింది ! అప్పటినుంచి గోపాల్రావు అంటే శాంతానికి అరికాలుమంట ! 'ఆమోటారు కులంవాడిని దగ్గిరకు రానివ్వకు' అంటుంది. గుడివాడవాళ్లు ఇచ్చిన ఫీజుమొత్తం ఆరువేలతోనూ పెద్దకారుకొంటే బాగుండునని శాంతమేఅంది. "చిన్నకారుమార్చడంలో ఆ మారుబేరగాడు నిన్ను బోల్తాకొట్టిస్తాడు సుమా - మారీచుడు. జిత్తులమారి - శకుని ! " అంది. దాంతోనాకు కోపంవచ్చి ఆ పాళంగా కారుయెక్కి వొచ్చేశాను. స్వల్పవిషయమే. కాని నా స్నేహితుణ్ణి దొంగకింద నన్నువుత్తవెర్రి వెంగళాయకింద కట్టేసిందే అని నాకుచాలాబాధించింది. ఆబాధతో శాంతాన్ని ముద్దుపెట్టుకోవడం మర్చిపోయాను ... మనదేశంలో చిన్నతనంలోనే -

పెళ్ళిళ్ళయిపోవడంచేత, పెళ్లాంయొక్క పతిభక్తి ప్రేమానురాగం-ఇవి మొగాడికి పరిపాటైపోయి పెళ్లాంయెడల మామూలు ఆనుమాయతలు మర్యాదలూకూడా పాటించడం మర్చిపోతాడనుకుంటాను. అంచేతే మనలో ప్రేమజీవితం అనేది షోడశగృహ్యాకర్మల్లో వక కర్మకిందకి దిగిపోయింది. - నా స్నేహితుల నందరినీ చూస్తున్నానుకదూ! వాళ్ల ఆడవాళ్లని నలుగురిలోకీ తీసుకురారు - శాంతం పరిచయంమాత్రం వాళ్లందరికీ కావాలి! వాళ్లందరూ చెడిపోయిన వాళ్లనికాదు - వాళ్లకి యితరస్త్రీలపరిచయస్నేహాలకి అనకాశం అలవాటు లేకపోవడంచేతనే - అంతే!

అప్పీలువిచారణ పూర్తిచేసి తీర్పురు వాయిదావేశాడు. వెంటనే మోటారు కంపెనీకివెళ్ళి ఆపళంగా సన్‌బీముకారు కొనేసి చెక్కుయిచ్చేసి - కొత్తకారుమీదే యింటికొచ్చేశాను. తోవలో ఆనందభవనంలో రెండుసేర్ల గులాబిజామున్ను మూరు మార్కెట్టులో ఎర్రగులాబీ పువ్వులగుత్తిన్నీ కొని తీసుకెళ్లాను. శాంతాన్ని చూడగానే ఆమెను నా హృదయానికి హత్తుకున్నాను. "యేచెయ్యికావాలినీకు శాంతం?" అన్నా. కుడిచెయ్యివిప్పుతుంది. ఉత్తుత్తి. ఎడంచెయ్యి విప్పమంది. కాగితంవుంది. మడతవిప్పి చదువుకుంది. తనపేరే సన్‌బీముకారుకి రసీదు లైసెన్సున్నూ! "శాస్త్రీ - ఇదేమిటి? అంది. "ఇందాక మర్చిపోయినదానికి క్షమాపణ!" అన్నా. "నామీద నీకు ప్రేమపోయిందని బెంగపెట్టుకున్నాను-శాస్త్రీ! నీయెడల నేనెంతో తప్పు చేశాను. నన్ను క్షమించు!" అంది. అంటూ:-"చెలినే సదాయుంచుకోనయా" అన్న కీర్తనయెంతో రసభరితంగా పాడింది. ఆమె ప్రేమజ్వాలల్లో దగ్ధంఅయిపోతేనే - నా జన్మానికి సార్థకం! ... కొత్తకారుమీద సముద్రపొద్దుకెళ్లాం. పున్నమిరాత్రి పండువెన్నెల. వెన్నెట్లో - మెరీనా పాలపుంతలా కానొచ్చింది - శాన్‌థోము దీపాలు వజ్రాలసరాలల్లే మెరుస్తున్నాయి. ఆ యిసకలో కూచుని వకరిచెవుల్లో వకరం అర్థంలేని యేకాంతాలు చెప్పుకున్నాం. సముద్రపు కెరటాల్లో చెట్టాపట్టాలు వేసుకుని నడుస్తూన్న మా యిద్దరినీ చూసి చందమామ కిన్నెరసాని నవ్వుకుని వుంటారు!

## 3

## ఆమె

"రేపు ఆదివారం - కార్తీకమాసప్రవేశం. వనభోజనానికి వెళదాం, కొత్తకారు కూడావుంది" అన్నాడు శాస్త్రి "చెన్నపట్నంలో ఉసిరికచెట్టెక్కడ - వనమెక్కడ? అన్నా. "శాంతం - నీ నవ్వుల్లోనే నా ఉద్యానవనం! నువ్వే నా కల్పవృక్షం!" అని కాగిలించుకున్నాడు. శాస్త్రికింకా కుర్రచేష్టలు పోలేదు! ఎక్కడికి వెళదాం అంటే ఎక్కడికి అనుకున్నాం. "అడయారు. సెంటుథామస్ మౌంటు, తిరువత్తియూరు, ఎన్నూరు - ఆఁ! మహాబలిపురం వెళదాం - వనభోజనం

సముద్రస్నానం రెండూ కలిసొస్తాయి" అన్నా. "అదెక్కడ ?" అన్నాడు శాస్త్రి. చెప్పా. నామటుకునాకే అనిపించింది: మహాబలిపురం - మామల్లపురం - మహామల్ల పురం - మహాపల్లవపురం - మహాపాండవపురం-అన్న తర్జనభర్జన బి. య్యే. లో హిందూ దేశచరిత్రలో కంఠోపాఠంచేశాం. మహాబలిపురం చెన్నపట్నం పెరట్లోవున్నా ఏ ప్రొఫెసరుకూడా మమ్మలిని అక్కడికి తీసుకువెళ్ళలేదే - ఇలావుంటాయి మనదేశంలో చదువులు !

పొద్దున్నే కాఫీపుచ్చుకుని బైలుదేరాం. చెంగల్పట్టుదాటి సద్రాసువెళ్లాం మొదట. అక్కడ సముద్రస్నానంచేశాం. సరుగుడుతోటలో – ఇంటినుంచి తెచ్చుకున్న కందిగుండ అన్నం, పుల్లిపాపులుసు, పెరుగు - తినేసి హాయిగా సాగోరేం. శాస్త్రి హిందూపత్రిక తీసి వార్తలువుండే భాగం తనువుంచుకుని ప్రకటనలుండే పుటలు నాకిచ్చాడు. మగవాళ్లస్వభావంకదా అని మనసులో నవ్వుకుని, పత్రికలో మార్కెట్టు బేరాలు, గవర్నమెంటుపత్రాలు వాటాలు ధగవరలు చదువుకున్నాను. శాస్త్రి పత్రికను తలకిందపెట్టుకుని చిన్నకునుకు తీస్తున్నాడు. తలకింద పత్రికనితీస్తే అతనికి నిద్రాభంగం అవుతుందని నేనూ కళ్లుమూసుకున్నాను...ఇద్దరం పక్కసారే లేచాం. రెండైంది. కాఫీపెట్టుకుని దాన్ని సేవించి తిరుప్పూరంకుండ్రం వెళ్లాం. పక్షితీర్థం ! మేం వెళ్ళేటప్పటి కప్పుడే గరుడపక్షులు రావడం వెళ్ళడం అయిపోయింది. రామేశ్వరంలో బయలుదేరి అపరాహ్నం తిరిగేసరికి ఇక్కడ నైవేద్యం చేసుకుని కాశీవెళిపోతాయిట ! ... మహాబలిపురం ! వినడమేకాని ఎప్పుడూ చూడలేదు. ఆ రథాలు ఎంతచక్కగాచెక్కారు ! ఏనుగలు ఎంతబలిష్ఠంగా ఎంత బింకంగా వున్నాయి ! నిన్నకాక మొన్న చెక్కినట్టున్నాయి. ఆ ద్వారపాలకుల పొంకం చూసినకొద్దీ తనివి తీరడంలేదు - జాంబవంతుల్లాగున్నారు ! ఆ సింహాలని యెంత ఠీవిగాను యెంత గంభీరంగాను చెక్కేరు ! "అవి ఏజంతువులు ? కుక్కలా భూతపిల్లులా సివంగులా ?" అన్నాడు శాస్త్రి. అతని వేళాకోళం నాకేం నచ్చలేదు. "సింహాలని భయంకరంగానూ కౄరంగానూ చెక్కలేదోయి. ఉగ్రంలోవున్న తేజస్సుని - బలంలోవున్న ప్రశాంతాన్ని చూపిస్తున్నాడోయి శిల్పి !" అన్నాను. ఒకమోస్తరు 'ఎక్సరేశిల్పం'అందూ ! నాకు ఈ శాంతి సింహంవద్దు - బ్రిటిషుసింహంచాలు " అన్నాడు వెటకారంగా... ఆ రాతిరథాల అరుగులమీదకూచుని ఉప్మా కాఫీ పుచ్చుకున్నామేకాని - ఫలహారం చేస్తున్నంతసేపూ నాకేమిటో అఘాయిత్యం అనిపించింది - అక్కడకూచుని నిర్మొగమాటంగా తింటూంటే ... కాస్తదూరం వెళ్ళేక - రాతిఫలకంమీద వరహావతారంకథ ఎంత రసవంతంగా చెక్కేరో ! ఆ జంతువుల ప్రతిమలని చూస్తూంటే నవ్వేవచ్చింది ! నిజంగా ముద్దులు మూటకడుతున్నాయి ... నేనలానిలబడి చూస్తూన్నాను–"శాంతం చూడు ! అక్కడా బ్రహ్మాండమైన రాతిబొండం - ఆ కొండమీద ఎలా నిలబడివుందో దొర్లిపోకుండాను ! దగ్గిరకెళ్ళిచూద్దాంరా !" – అని నన్నీడ్చుకుపోయాడు. "భీముడు

వంటచేస్తూ మర్చిపోయిన వెన్నముద్ద - ఆ రాతిబొండాం! ఆ పాకశాల చూద్దూ!" అంటూ అక్కడ వక గుహవుంటే నన్నక్కడికి లాక్కుపోయాడు. నాజూకు శిల్పంలోవుండే అందాన్ని గ్రహించలేకపోయాడు. కొండమీద రాతిబండ నిలబడివుంటే - ఎంతోవింత అతనికి! ఆ చిత్రాన్ని చూస్తూ - సీమలో - స్టోను హెంజి - డ్రూయిడ్సు - వాళ్లస్మృతచిహ్నాలు - వాటినిగురించి ఉత్సాహంగా వర్ణించడం మొదలెట్టాడు. అయ్యో - కళాసౌందర్యాన్ని యేమాత్రం గ్రహించలేకపోతున్నాడే! అని నొచ్చుకున్నాను.

వెన్నెలరాత్రి. కారు"టాపు" మడిచేశాం. తీక్షణమైన ఆ దీపాల వెల్తురులో జల్తారు మైజారులా మెరుస్తూంది రోడ్డు. నక్షత్రాలు పాలపుంతవెనకాతల దోబూచులు దాగుడుమూతలు ఆడుతున్నాయి. చల్లగాలి ముఖంమీదకొడుతూంది. శాస్త్రి కారు నడుపుతూంటే ఆ నాజూకైన అతనిముఖం చూసి ప్రేమవెల్లువలు కడుపులోనుంచి పొంగివచ్చేశాయి ... ఈరోజు యెంతసరదాగా గడిపేం! కాని - అతని కళానిరసన యీసడింపుమాత్రం నా చెవులకీ మనసుకీ అపశ్రుతిలాగు ధ్వనించింది - రవంత!

## 4

### అతడు

కొత్తకారుమీద షికారు! శాంతం బలేహుషారు! ఆ తెల్లటి చీరెతో ఆ నీలిరంగు కెరటాల్లో ఆమె స్నానంచేస్తూంటే అచ్చంగా మత్స్యకన్యకే అనుకున్నాను. కెరటాలవెండి అంచులో చీరెతెలుపు కలిసిపోయి కోమలమైనముఖం నల్లటి శిరస్సు కనిపించేసేసరికి - మనసు చెదిరిపోయింది. ఆ నీళ్లని దోసిళ్లతో వకరిమీద వకరం తలంబ్రాలు పోసుకుంటూంటే ఆమెనవ్వులు విని నామతి భ్రమించిపోయింది.

హాయిగా భోంచేశాం. జంపఖానపరచి తలగడాలు వేసుకుని నడుంవాల్చాం. "ఈవూరుపేరు ఏమిటి?" అని అడిగా. "సద్రాసు" అంది శాంతం "మనం యేవూరి నుంచివచ్చాం?" అన్నా. "మద్రాసు" అంది. "మద్రాసు తమ్ముడు సద్రాసు!" అన్నా. "ఆ వ్యాఖ్యానంఏమిటి?" అంది. "మద్రాసు మాదిరాజుది. సద్రాసు సదాశివరాజుది!". "నువ్వు నారాజువి!" అని అంటూ నాతలంతా రేపేసింది. "పిక్విక్ పేపర్సులో చరిత్ర పరిశోధకుల్లావున్నామే మనం!" అంది. చిన్ననిద్దరతీసి లేచాం. యెండిపోయిన సరుగుడుకొమ్మలు యేరితెచ్చి పొయ్యిపొక్కిళ్ళకి మూడురాళ్లు అమర్చి అల్యూమినియం గిన్నెలో కాఫీపెట్టుకుతాగేం! అమృతతుల్యంగావుండెను- లేతమామిడాకురంగు చీరెకట్టుకుని ఆ సరుగుడుతోటలో చిదుగులు యేరి తీసుకొస్తూంటే - శాంతంయొక్క సౌందర్యం లావణ్యంచూసి యే వనదేవతో సాలభంజికో అను

కున్నాను. "యీ మహారణ్యంలో నాలాంటి మునీంద్రుడు ఘోరతపస్సు చేస్తూండగా నీలాంటి అప్సరస అతనికంటబడితే తపోభంగంకాక యేమవుతుంది?" అన్నా. "నీలాంటి మునీశ్వరుడిది ఘోరతపస్సుకాదు - బకధ్యానం!" అంటూ నన్ను ముద్దుపెట్టుకుంది.

మహాబలిపురం వెళ్ళాం. ఆ రథాలు ఏనుగులు సింహాలు కోతులు అవిచూశాం. ఆ శిల్పాన్ని చూసి శాంతం కకవికలై ముకురసిపోవడం! "నీకేంనచ్చలేదూ?" అని అడిగింది. "నాకేంనచ్చలేదుసుమా. నేను స్కూలుఫైనలు చదువుతుంటూన్నప్పుడు మా మేనత్తకి సాయంగా భువనేశ్వరం వెళ్ళాను. ఆ త్రిభువనేశ్వరాలయంలోనూ, లింగరాజ మహాదేవుడి కోవెలలోనూ చెక్కిన బొమ్మలని చూసేసరికి సిగ్గుపడిపోయాను!" అన్నాను. "అలాకాదు శాస్త్రీ! నువ్వు వకసారి వోపికపట్టి ఆనందకుమారస్వామి, సోదరినివేదిత, హావెల్లు, గంగూలీ, చదువుతే నీకేతెలుస్తుంది" అంది. "పుణ్యమా పురుషార్థమా? 'లా' పుస్తకమో, క్రాసువర్డుపజిలో, కాంట్రాక్టుబ్రిడ్జో - పరిస్తే కాని డబ్బేనా సంపాదించుకోవచ్చు!" అన్నా. "అలాగనకు. ఈ శిల్పాన్ని మన పల్లవరాజులే చెక్కించుతా!" అని ఉత్సాహంగాఅంది. "ఎవరు?" అని అడిగా "పల్లవరాజులు. మన ఆంధ్రులకి తాతాసహోదరులన్నమాట!" "రివర్సువర్సు దాయాదులూ అంటే నాకు వళ్ళుమంట!" అన్నాను. "నీ వేళాకోళం కట్టిపెట్టోయి! వెయ్యేళ్లకిందటే ఇంతచక్కనికళ మన ఆంధ్రదేశంలో వెలిసిందీఅంటే మనకెంత గర్వంగావుండాలి?" అంది. "యీవేళ పస్తుపడుకుని - నిన్న పంచభక్ష్యపరవాణ్ణాలతో విందారగించాంకదా అని సంతోషపడితే యేంలాభం? కడుపులో జఠరాగ్ని మండుతూన్నా వంట్లో చేవలేకపోయాకన్నూ, పట్టెడన్నంలేకపోయినా పుట్టింటిఐశ్వర్యం చెప్పుకునిన్ని యెన్నాళ్లుబతుకుతాం? ఆ బడాయిలువింటే నాకు తలనొప్పి!" అన్నా.

శాంతానికి కొంచెం కోపంవచ్చివుంటుంది. కాని రెండోమాటు ఉప్మా కాఫీ హడావుడిలో కోపం మర్చిపోయింది. శాంతానికి కోపంవచ్చినా ఆ నిమిషానికే! ... భీముడి పాకశాల - అన్నిటికంటె నాకావెన్న పూస దొర్లకుండా అలానిలబడివుండడం అద్భుతంగా కానొచ్చింది! ...వెన్నెల్లో బయలుదేరాంయింటికి. కొత్తకారు వాయువేగ శరవేగంతో గంటన్నరలో అరవైమైళ్లూ కొట్టిపారేసింది! ...ఆ గాలికి శాంతం తలరేగి నా మెడమీదపడుతుంటే-ఆ చీకట్లో ఆమెకళ్లమెరపులకి నా కళ్లుమూతలుపడ్డాయి శాంతాన్ని మొట్టమొదట నాకారులో యెక్కించుకుని వెళ్ళడం జ్ఞాపకంవొచ్చింది. నాలుగేళ్ళకిందట! అంతకుముందే నన్ను మెరీనామీదచూసి చిరునవ్వు నవ్వింది- నేను జ్ఞాపకంచేసినా వొప్పుకోదు కాని! "పరాయిమొగవాడినిచూసి నేను నవ్వుతానా?" అంది. "నీకు నేను పరాయివాడినేమిటి-శాంతం?" అన్నా. చోదక చక్రంమీదవున్న నా యెడమచేతిని మృదువుగా నిమిరింది! హాయిగాగడిచేం ఈవేళ!

# 5

## ఆమె

పీర్లు గుండాన్నిబడ్డాయి! ఇల్లు ఇల్లులాగుంది బాబూ యీవేళ! బావగారూ దొరసానితోటికోడలుగారూ నిన్నరాత్రి బెంగుళూరువెళిపోయారు. సెసిలీ మంచి మనిషేకాని—నాకావిడ సిగరెట్టుకాల్చడం చూస్తే అసహ్యం! ఇంక ఆవిడ ఆర్భాటం! ఆవిడకోసం నట్టింట్లో మేజాబల్లలు కుర్చీలు—పడకగదిలో స్ప్రింగుమంచాలు—నీళ్ళగదిలో తొట్లు...తల్చుకుంటే వొళ్లుగరపొడుస్తుంది! ఇంగ్లీషుతప్ప తెలుగుమాటాడితే ఆవిడకికోపం! ఇక యిరవైనాలుగుగంటలూ గుమ్మంలో తైనాతీ కారు హాజరువుండవలసిందే! ఆవిడ వుద్దేశంలో పెట్రోలంటే నీళ్లకావళ్లతో పోయించుకోవడమనే! మా ఆడబిడ్డ సావిత్రి—యజ్ఞేశంగారూ పిల్లలూ మెయిలులో కోటిపిల్లి వెళ్ళిపోయారు. సావిత్రిని అన్నదమ్ములు ఇంటర్మీడియేటువరకూ చదివించీ మంచిసంబంధం వచ్చిందని పెళ్ళిచేశారు. యజ్ఞేశంగారు ఎంతసేపూ ఆ గోదావరికాలువలో నీళ్లు కొలవనూ, రాత్రి లాకులు తెరవనూ, రూపాయిలు జేబులోవేసుకోనూ! సావిత్రిఅంటే ఆతనికి అతిఆపేక్ష "నేనా నగలనీ పిల్లలనీ మొయ్యలేనో"అంటుంది సావిత్రి నవ్వుతూనూ! పిల్లలు నలుగురూమాత్రం—రాకాసులూ రాక్షసులూను! ఉన్నది , వారంరోజులేనా—ఇల్లంతీంతారుచేసి పట్టపగలు చుక్కలుపొడిపించేశారు! పిల్లలంటేనాకు పరమచీదర చికాకున్నూ. సావిత్రిమాత్రంనన్ను వక్కనిముషంవదల్లేదు—'వదినా! వదినా!' అంటూను!

శాస్త్రి నీళ్లుపోసుకుని తలదువ్వుకుంటూ: "నీదుమోము బ్రైటుటూ—మూను లైటు నైటుటూ—టూ—టూ!" అని గిరీశం పాటపాడుతున్నాడు. కడప వ్యాజ్యంలో తననిపెట్టారుకదాఅని సంతోషంఅనుకున్నా. దాంతోనాకు కోపంవచ్చింది—తనవకాల్తీ సంగతి నాతో ముందుచెప్పకుండా తన అన్నగారితోను ముద్దుచెల్లెలితోను ముందుగా చెప్పాడేఅని నామనసు కొంచెం చిన్నబోయింది. చెప్పకేం...మేడమీదికెళ్లా. "ఎప్పుడేనా అన్నాచెల్లెలు తరువాతే—కట్టుకున్న పెళ్లాం" అన్నా. "ఓహో—సాధించడానికి వచ్చింది చిట్టిపిల్ల!" అంటూ నాబుగ్గగిల్లేడు. "రైలుదగ్గర ఆక్షణమే గుమాస్తా చెప్పాడు. నీతోచెప్పానేఅనుకుని—నేనువాళ్ళతోచెప్పా—ముందునీతో సువార్తచెప్పి నీదగ్గర దక్షిణపుచ్చుకోకుండా ఇదివరకెన్నడైనా యెవరితోనైనా చెప్పానాచెప్పు?" అనిఅంటూ "సాధించెనె ఓమనసా!"అని త్యాగరాజకృతి మొదలెట్టాడు. "సమయానికితగుమాటలాడెను" అని నేనందుకున్నా. ఇద్దరంకలిసి:"వనితలసదా సొక్కజేయుచును మ్రొక్కజేసే పరమాత్ముడు—అదియుగాక యశోదతనయుడంచు ముదంబునను ముద్దుపెట్టి నవ్వుచుండు"అని పాడుతూ ఆరభి ఆలాపనలో—ఒకరినొకరం కౌగిలించుకున్నాం.

రాత్రి ఇంగ్లీషు నాటకానికెళ్లాం." నాకా ఉచ్చారణ హాస్యం బోధపడదోయ్!" అన్నా. వెళ్ళేవాళ్ళందరికీ బోధపడియేడిసిందీ? మా 'సీనియరు' గారికీ ఆయన భార్యామణి లేడీఅయ్యంగారికీ బోధపడుతుందనే వెళుతున్నారా? అందరూ వెళుతున్నారని మనమున్నూ, లేకపోతే మనకీ దొరల ఇంగ్లీషు తెలియదనుకుంటారు అందరూనూ!" అన్నాడు. నాటకం వకమోస్తరుగావుంది. కొన్నిదృశ్యాలు రంగంమీద చూపించడం విడ్డూరంగాతోచింది. సంగీతం అసలు బోధపడలేదుసరేకదా—వాళ్లుమాట్లాడేది ఇంగ్లీషేనా అనిపించింది! ప్రేక్షకులు బోధపడినట్లే చప్పట్లుకొట్టేరు. నాటకం దగ్గర సర్ రామయ్యంగారు ఆయనభార్య కనిపించారు. అతను తీర్చైనమనిషి. నవ్వుముఖం. ఆజానుబాహుడు. తియ్యనిమాటలు. మంచి మర్యాదా. పాండిత్యంలేకపోయినా గడుసుదనంవల్లే నెగ్గుకొస్తూ లక్షలు గడిస్తున్నాడంటారు—మరి యెంతవరకునిజమో—తోటివారి అసూయ అనుకుంటాను. లేడీఅయ్యంగారు! ఆవిడచక్కదనం—ఆకళ్ళలో సరసం—ఆ దుస్తుల్లోతీరు- ఆ మాటల్లోనీటు—ఆ నడకలోషోకు—చెప్పేదేమిటి! 'అయ్యంగారి ఆడవాళ్లు' అన్నారు—అందులోకీ మైసూరు!

ఆవిడ శాస్త్రితో: "కడపకేసులో మీరు వకాల్తీ ఇచ్చారని ఇందాక మావారు నాతోచెపితే—వారంరోజులక్రిందటే శాస్త్రిగారు నాతోచెప్పారని వారితో అన్నా" నంది. గట్టిగా నాకువినిపించాలనే అందనుకుంటాను. నాకు ఆశ్చర్యంవేసింది. తన 'సీనియరు' గారి భార్యతో మంచిగావుంటే వుండొచ్చుగాక. కాని—వారంరోజులకిందటే తనకి తెలిసిందంటే! ఇందాకశాస్త్రి తనకి నిన్నరాత్రి రైలుదగ్గర తెలిసిందన్నాడే? లేడీ అయ్యంగారు అబద్ధంఆడిందా? లేకపోతే—శాస్త్రి తనకు ముందుగా తెలిసినా —అంతా నిశ్చయం అయ్యాకే నాతోచెబుదాం—తీరా వకవేళ ఆఖరునిముషంలో తల్లకిందులైతే -అనవసరంగా నాకుఆశాభంగం అవుతుందని చివరదాకా చెప్పడంమానేసి వుంటాడేమో? తీరికూచుని వుత్తపుణ్యానికి యెందుకు అబద్ధంఆడుతాడు? అందులోకి నాదగ్గర? శాస్త్రికి తనకి యెంతోస్నేహంవున్నట్టున్నూ అదినాకుతెలిసి నాకు ఈర్ష్యకలగాలని—లేడీఅయ్యంగారే అబద్ధంఆడివుండాలి.

## 6

## అతడు

ఈ వాళబస్సువాళ్ళందరూ హఠాత్తుగా సమ్మె. పట్నంఅంతా నానాగంద్రగోళంఅయిపోయింది. పాపం ఎంతజనం ఇబ్బందిపడ్డారు! బస్సువాళ్లు సమ్మె చేస్తున్నారని నాకుతెలియగానే నావొళ్లుమండింది — తీరికూచుని సమ్మెయేమిటీ అని. నేను ఇంగ్లండులో చదువుకుంటూన్నప్పుడు జరిగిన సంపూర్ణసమ్మె జ్ఞాపకంవచ్చింది. అప్పుడు మేంఅందరం బస్సులనన్నీ స్వచ్ఛందంగానడిపేం. అలాగే ఈవేళకూడా చేద్దాం అనితోచి—రంగనాధాన్ని, వరదన్ని, తంగవేలుని, కేశవరావుని వెంట

కలుసుకుని—మోటార్లు నడపడం తెలిసినవాళ్ళంకాబట్టి బస్సులని స్వచ్ఛందంగా నడప డానికి సిద్ధంగావున్నాం అని కంపెనీలవాళ్ళతోఅన్నాం. మమ్మలినిచూసి మరికొంత మంది క్లబ్బుసభ్యులు ధైర్యంతెచ్చుకుని స్వచ్ఛంద సేవకి తయారై మాతోకూడా నడుం కట్టారు. అద్దెబస్సులు తోలడానికి మాకు అర్హతవుండడానికి అప్పటికప్పుడు పద్ధతులని మార్పించి బస్సులని నడపడం మొదలెట్టాం. ఆ జగన్నాథరథాలని నడపడానికి సారథిస్థానంలో కూచుని చక్రంమీద చెయ్యేసేసరికి చేతులు కాళ్లు గడగడ వడికి వళ్ళు ముచ్చెమటలు కమ్మేశాయి! తమ బస్సులని పెద్దమనుష్యులు మేము నడపడం చూసి సహాంమంది బస్సువాళ్లు మెల్లిమెల్లిగా పనుల్లోకిచేరారు. ఇంకేముంది? మధ్యాహ్నం ఫలహారాలవేళకల్లా బస్సుల రాక పోకలు మళ్ళీ యథాప్రకారం. సమ్మె తుస్సుమని పోయింది! బస్సు యజమానులు, పట్నంలో వర్తకశిఖామణులు, ఘరానామనుష్యులు అందరూ మాకు గొప్ప విందుచేశారు. రాత్రి ఇంటికొచ్చి శాంతతో విశేషాలన్నీ చెప్పా. శాంతం 'ఊ' అనలేదు - 'ఆ' అనలేదు. కాస్సేపయాక: "బస్సు పనివాళ్లు పాపం వాళ్ళతంటాలు వాళ్లుపడుతూంటే - మధ్య మన కెందుకు - శాస్త్రీ?" అంది. "అలా అంటావేమిటి! ఈ పనివాళ్ళ ఆకతాయతనం మరీ మితిమీరిపోతూంది. ఈవేళ వీళ్లేయారు. రేపు మరొకరవుతారు. అడగాలి. ఇచ్చింది పుచ్చుకోవాలి. అంతే కాని బెదిరించి చేతులుముడుచుకొని కూచోడమా. ఇప్పడేమైంది.? పస్యాం పుస్యాం అయింది. మునపటికంటె తక్కువజీతాలకే మాచక్కా పనిచేస్తున్నారు" అన్నాను. బళ్లోబోధించే అర్థశాస్త్రానికి లోకంలో వ్యవహారాలకీ వుండే తేడా శాంతానికేం తెలుసు? ఆవేళ లండనులో ఏంతహుషారుగా ఇంటికొచ్చి మా 'ల్యాడులేడీ' మన్ననలనిపొం దేనో - ఈవేళ అంతకంటె పదిరెట్లు హెచ్చు ఉత్సాహంతో ఇంటికొచ్చేసరికి - శాంతంమాటలు వినగానే ముఖాన్న పేడనీళ్లుకొట్టినట్లైంది!......

బుధవారం: శాంతంనాకోసం ఈవేళ ముందుగానే తన క్లబ్బునుంచి ఇంటికొచ్చే సింది. నేను ముందుగావచ్చినా ఆలస్యంగావచ్చినా తనకెలాతెలుస్తుందోమరి - నే నింటికొచ్చేసరికల్లా సిద్ధంగావుంటుందికదా! వాళ్ళక్లబ్బులో టెన్నీసు పేకాట రెలా వున్నదలా వదిలేసి నేను రాకముందే ఇంటికివచ్చేంస్తుందని శ్రీధరంపెళ్ళభార్య శాంతాన్ని ఎగతాళిచేసిందట. "శాంతంగారూ! మగవాళ్ళని అలా ముళ్లమీద నేవుంచాలి. అంతే కాని అంతలా అడుగులకి మడుగులొత్తుతే మీచెయ్యి కిందచెయ్యి ఆయిపోయి చవక బడిపోతారు! పెద్దదాన్ని చెబుతున్నా వినండి" అందిట. శ్రీధరాన్ని అతనిపెళ్ళాం కాల్చుకుతిటుందని అందరికీతెలుసు. మేం హాయిగావున్నాంఅని ఆవిడకిఎందుకో అంత ఓర్వలేనితనం! శాపనార్థాలుకూడాను. శ్రీధరంపెళ్ళాం అన్నమాటలు నాతో చెప్పి నవ్వుతూను: "ఇవన్నీ మనకు ఆశీర్వచనాలేకదూ శాస్త్రీ? నేనెప్పుడూ నీదాన్నేకదూ?" అందిశాంతం. శాంతం అనుకుంటుంది - నేను గొప్ప తెలివైన వాడననీ - నేను దాఖలుచేసే ప్రతీ 'ప్లయింటు' జడ్జీలకిసహితం బోధపడదనీ - నా

అడ్డుపరీక్షకి ఎర్డ్లీనార్టనుకూడా నిలువలేడనీ- నా వాగ్ధోరణికి భాష్యం అయ్యంగారే మళ్ళీ లేచిరావాలనీ - నేనుపట్టే ప్రతీవ్యాజ్యం గెలిచితీరాల్సిందేఅనీ! నేనంటే అంతనమ్మకం! ఆవిడకి నామీదుండే భరవసాకి ఆవిడకి యెక్కడఆశాభంగం కలుగుతుందో అని నా కొక్కొక్కప్పుడు భయంవేస్తూంటుంది.

శాంతం నన్ను అంత అలా ప్రేమిస్తున్నా - కడపకేసుగురించి తనతో చెప్పక పోవడమేకాకుండా చిన్న అబద్ధంకూడా అడేనని అనుమానించి దనుకుంటాను. ఆడవాళ్లు తెల్లారిలేచి లక్షాతొంభై చిల్లరఅబద్ధాలు ఆడుతారు. దుఖాణంలో హోల్‌గా చీర ఏ పాతికరూపాయలకో కొంటుంది. మొగుడు అడిగితే: "అబ్బే! పదిహేను రూపాయలే అయిందండీ!" అంటుంది. అదే పసుపుకుంకానికివెళ్ళినప్పుడు అమ్మలక్కలు అడుగుతే: "మావారు మొన్న కేసుమీద బెంగుళూరువెళ్లినప్పుడు ఎనభైరూపాయిలకి పురమాయించి నేయించారు" అంటుంది. అసలువాళ్లఆయన వెళ్లిన కమానంతా తెనాలినుంచి గుంటూరికి! మొగవాళ్లు అబద్ధంఆడితే చిల్లరఅబద్ధాలు ఆడరు. పెద్దవేఆడుతారు. వారి జాతులందు వైవాహికములందు ప్రాణవిత్తమాన భంగమందు అని-మునుపు. నాలాంటివారు మొదటి రెండింటిలోను అబద్ధం ఆడక్కరలేదు. మిగతావాట్లలోమాత్రం ఎంతపెద్దఅబద్ధం ఆడితే అంతగౌరవం అంత జయమున్నూ - అంటే దొరికిపోకూడదన్న మాట. అక్కడే చాకచక్యంచూపాలి! అది అందరికీ చేతనవుతుందా?

## 7

## ఆ మె

సాయింకాలం అయింది. శాస్త్రీ నేను ఖబుర్లుచెప్పుకుంటూ టెన్నీసుకోర్టు దగ్గర కూర్చున్నాం. 'మిమ్మల్ని చూడ్డానికి వచ్చారు' అంటూ బంట్రోతు విజిటింగుకార్డు తీసుకొచ్చి యిచ్చాడు. వాటిపై: "ఆచార్య బాలచంద్ర, అర్థశాస్త్ర ప్రధాన అధ్యాపకులు - లాహోరు" - "డాక్టర్ మిసెస్. శీతాబాలచంద్ర, ఎఫ్. ఆర్. సి. ఎస్. ఘోషాస్పత్రి - లాహోర్" అని వుంది. ఎవరో చెప్మా అని - "సరే, ఇల్లాచూపించు" అన్నా. వారిద్దరూవచ్చి కూర్చున్నారు. "హల్లో! శాంతం" అన్నాడాయన. చప్పున జ్ఞాపకంవచ్చింది బాలూ అని. "ఓహో! ఎప్పుడురావడం?" అన్నా. నలుగురం ఒకరి నొకరం పరిచయం చేసుకున్నాం. ఏవో - యీ ఖబుర్లూ- ఆ ఖబుర్లూ, ఫలహారలున్నూ అయాక వాళ్లు వెళ్లిపోయారు.

"క్వీన్‌అనీసులో చదువుకున్నపుడు నీకు మొగస్నేహితులున్నట్టు ఎప్పుడూ చెప్పలేదే నువ్వు?" అన్నాడు శాస్త్రి.

"ఘూసగుచ్చినట్టు అన్ని సంగతులు ఎక్కడ జ్ఞాపకం వుంటాయి, వున్నా ఎక్కడచెప్పగలను?" అన్నా. "ఇవి ఘూసలుకావు - కుత్తిగంటులో పెద్ద పగడాలు"

అన్నాడు శాస్త్రి. "చెప్పకపోతే మించిపోయిందేమీలేదుకాని, నిన్నుగురించిన విశేషా లన్నీ తెలుసుకోవాలని వుంటుంది నాకు. చెపితే విని సంతోషించుతాను. ఇంతకీ మనలో మనకి రహస్యాలేమిటి?"

"అయితే వినుమరి. మధ్యమధ్యమాత్రం కోప్పడకేం!" అని మొదలుపెట్టా.

క్వీన్ మేరీస్ రోజులు జ్ఞాపకంతెచ్చుకున్నా. "అసలు కాపర్సుహోటేలని వుండేది అక్కడ. అది కమిటీవారు కొనేసి కాలేజీ కట్టేరు. కాలేజీ మొదలుపెట్టడం నేను ప్రవేశించడమున్నూ. మమ్మల్నప్పుడు మెరీనామీద స్వేచ్ఛగా షికారువెళ్ళనిచ్చేవారు. ఎదురుగుండా ఇసకలో - లైటుహౌసుదీపం వెలిగించేవరకూ కూర్చుండేవాళ్ళం. ఉపాధ్యాయినులతో ఇటూ అటూ మెరీనామీద తిరిగేవాళ్ళం. అయినా కుర్రవాళ్ళతో స్నేహానికి అవకాశం వుండేదికాదు. ఇంటర్‌కలిజియేటు లెక్చర్లకని మొగవాళ్ల కాలేజీలకి వెళ్ళేవాళ్ళం జట్కాలమీద.

అప్పుడు మా బళ్ళవెంట కుర్రాళ్లు సైకిళ్ళమీద వస్తూ, మమ్మల్ని హాస్యంగా పలుక రించేవాళ్లు. మేమూ వెటకారంగా జవాబుచెబుతూండేవాళ్ళం. పత్యేకాలపుసరదా- తెలిసీ తెలియని ఆనందం— అమాయకపు సరసమున్నూ, ఆ రోజుల్లో! సరదాగా బట్టలు వేసుకుని సింగారించుకోవడం తప్పితే, నా దేహంగురించీ - నా హృదయంగురించీ— నాకే తెలిసేదికాదంటేనమ్ము - శాస్త్రీ! అప్పుడప్పుడు మాలోమేమే మాట్లాడుకుంటూ నవ్వుకుంటూ సిగ్గుపడుతూండేవాళ్ళం. అప్పుడప్పుడు క్లాసుల్లోనూ, సభల్లోనూ తెలిసిన కుర్రాళ్ళతో మాట్లాడినా, కరస్పర్శ చేసినా వొళ్ళంతా గరపాడిచేది. నరాల్లో మెరుపులు ప్రవహించేవి.

శాస్త్రిముఖం గంభీరంగా వుండడంచూసి అన్నాకదా: "పరధ్యాన్నంగా వున్నావుకాంసు! నా కథ విసుగుగావుందేమో?"

"నీ స్వీయచరిత్ర వింటూంటే యీనాటి శాంతంవేనా అనిపిస్తూంది."

"ఈనాటి శాంతంకాదు— ఆనాటిశాంతం. పద్దెనిమిదేళ్ల బాలకుమారి అని జ్ఞాపకం వుంచుకో!" అన్నా.

"సరే- కథకానీ" అన్నాడు.

"ఆనర్సు రెండో సంవత్సరంలో దసరాకి నాలుగురోజులు సెలవలిస్తే మీనాక్షి నన్ను వాళ్లింటికి తీసుకువెళ్లింది మధుర. తనతమ్ముడు బాలచంద్రన్‌తో పరిచయంచేసింది. బాలూకూడా యూనివర్సిటీలో రెండో సంవత్సరం ఆనర్సే...

శాస్త్రి: "అప్పుడే 'బాలూ' వరకూ వచ్చిందీ?"

"నీతో మహాచిక్కొచ్చియి, వారింట్లో అతన్ని బాలూఅని పిలిస్తే, నాకూ అదే అలవాటుఅయింది. అందులో ఏం మహాపరాధం లేదుగా?" అన్నా... "వాళ్ల కారులో మీనాక్షి, నేనూ, బాలూ, వాళ్ళచెల్లెలు సరస్వతీ, అప్పుడప్పుడు

వెన్నెల రాత్రుల్లో షి కా రు వెళ్ళేవాళ్ళం. లెక్చర్లవుతున్నప్పుడు - అప్పు డప్పుడు- అప్రయత్నంగా- అతనివేపుచూస్తూండేదాన్ని. నేను అతనివేపు చూస్తూన్నప్పు డల్లా అతను చప్పున తల వంచేసుకునేవాడు. అప్పుడప్పుడు చూపులు కలిసేవి. దొంగతనంచేస్తూ పట్టుబడ్డట్టు ఇద్దరం సిగ్గుపడి తల వంచేసుకునేవాళ్ళం. తెలిసీ తెలి యని రోజులవి. దూడాదూడా ప్రేమ—ఆగతాయితనం—పడుచుతనపు వలపులు— అంతే - అంతకంటెఏమీలేదు. మీనాక్షికి పెళ్ళయి చదువు మానేసింది. అంతటితో బాలూ పరిచయంకూడా ఆగిపోయింది. ఆ తరువాత పరీక్షసంవత్సరం అవడంచేత నేను అతన్ని పూర్తిగా మర్చిపోయాను. ఓనాడు బయస్కోపుకువెళ్ళాం మా క్వీన్ ఉనీకాలేజి వాళ్ళం అదరం కలిసి. సహం అయ్యైంతరువాత ఎవరో కాలేజీ కుర్రాళ్లు నలుగురైదు గురు వచ్చి నాతరువాత కూర్చున్నారు. ఇంకఆట ఐదునిమిషాల్లో అయిపోతుందనగా నా పెదమలమీదఎవరో నన్ను ముద్దుపెట్టుకున్నట్టు గ్రహించాను ఒళ్ళు ముచ్చమటలు కమ్మేశాయి. సిగ్గు, కోపం పక్కాసారిగా వచ్చేశాయి. దానికితోడు ఎక్కడలేని భయం వేసింది. దీపాలు వెలిగాయి బాలూ అని తెలుసుకున్నా.

శాస్త్రి కథకడ్డొచ్చి "ఇందాకొచ్చిన బాలచంద్రనే? నాకు ముందే తెలిసి వుంటే ఇందాకనే నాలుగు వాయించివుందునే ఎందుకుచెప్పావుకావు శాంతం?" అన్నాడు క్రోధంతో. "నువ్వు పదేళ్ళకిందటే అవతంచివుంటే నన్నుద్ధరించి వుందువు. అతన్ని శిక్షించివుందువు. ఇప్పుడుమాత్రంశాంతించు" అన్నా నేను నవ్వుతూ. "సరేలే! కథకానీ." అన్నాడు శాస్త్రి.

"రాత్రి—ఆమర్నాడు— వళ్ళంతా వణుకు. నా శరీరానికేదో మహా ప్రమాదం జరిగిందేమో అనిపించింది. మాటిమాటికి వళ్లు తడుముకుని చూచుకునేదాన్ని. ఆ రెండ్రోజులూ నిర్గాహారాలు లేవు. మూడోనాడు నా స్నేహితురాలు డాక్టరు సుశీల హాస్టలు కొచ్చి—నన్ను పలుకరించటానికి—నా గదిలోకొచ్చింది. నేను గదితలుపులు గడియ పెట్టేసి జరిగినదంతా చెప్పి—"ఏంప్రమాదం జరుగబోతుంది ఏమిటి? దాచకుండా చెప్పు." "అన్నా. జరిగినదంతా ఇంతేనా?" అంది సుశీల. "ఇంతే" అన్నా. ఒక్క నిమిషంపాటు సుశీల వూరుకుని - అక్కడనుంచి - కడుపుపట్టుకుని పకాలనిఒకటేనవ్వు ఐదునిమిషాలవరకూ! నవ్వుకొస్తూ ఆపుకుని అందికదా:

"ఇంత స్వల్పానికేం ప్రమాదం జరగదు. నువ్వు ఇంత అమాయకురాలవని నాకు తెలీదు. శాంతం!" అని ఒక అరగంటసేపు కాగితం పెన్సిలు పుచ్చుకుని సంగతులన్నీ బోధపర్చింది - సలహా యిచ్చింది. నా మనస్సు కుదుటపడింది. కడుపుచెక్కలయ్యేట్టు నాకు నవ్వొచ్చింది...శాస్త్రి పక్కుననవ్వి: "నీఅమాయకం బంగారంగానూ!" అన్నాడు. "బంగారానికి విలువుంటేవుండొచ్చు. కాని, ఆ వయస్సులో అమాయకం వుంటే అగాధంలో కాలుజారినట్టే. అదోగొప్పకిందఎంచను నేను" అన్నా. "ఆ! నీమాటలు నీకే తెలియడంలేదు శాంతం" అన్నాడు శాస్త్రి.

ప్రపంచకం అంటే ఆరోజున కళ్ళుతెరచాను. పాపం-బాలూ మంచికుర్రాడే. కాని అతడుమాత్రం ఏంచెయ్యగలడు ? ఆ తెలిసీ తెలియని వయస్సులో-కళ్ళు జిగాలు మంటాయి. హృదయానికి మేధస్సుకు లంగరందదు. పరీక్షలు అయింతరవాత కాన్వ కేషనులో బాలూ నన్ను దగ్గరనుంచి చూచినా వచ్చి పలుకరించడానికి సాహసించలేక పోయాడు. మరేం కోంపమునగలేదు అని సూచించడానికి నేనే అతనిదగ్గరకెళ్ళి పలక రించాను. ఆరోజులు తలచుకుని ఇప్పటికీ నవ్వుకుంటాను. నాకంటే పదేళ్ల తక్కువ వయస్సు పిల్లలు - ఒకచెంపపాలు ఒకచెంప నీళ్ళూ వచ్చేబాలికలు-ఇద్దరుముగ్గురు పిల్లలతల్లులై సంసారాలు చేస్తూండడం చూస్తూంటే - ఎక్కడలేనికోపం వస్తుందినాకు. ఇంతమంది సంస్కర్తలున్నారే - సకాలంలో వాళ్లకి సలహాయిచ్చి సహాయం చేసే వాళ్లెవరూ కనిపించరే ! కన్నతల్లులకేనా బుద్ధివుండొద్దా ? "

"ఎవరేంచెయ్యగలరు ? ఎవరికర్మవాళ్ళు అనుభవించాలి" అన్నాడుశాస్త్రి.

నాకు చర్రని కోపంవచ్చి ! "పిచ్చిమాటలాడక స్వీయచరిత్ర పూర్తిగావినుమరి !" అన్నా......

"ఆన్సరు ఆఖరుపరీక్షలు ఇంకా పదిహేనురోజులున్నాయనగా మా అర్థశాస్త్ర సమాజం వీడ్కోలుసభ జరిపాం. ఆ సభకి మాజీదివాను సర్ గౌరీశంకర భరద్వాజం గారిని మా అగ్రాసనాధిపతిగా ఆహ్వానిద్దాం అని, నేను కార్యదర్శిని కాబట్టి మన్నడిలో ఆయనదగ్గరకెళ్ళాను. ఆయన గొప్ప వేదాంతి — ఆహితాగ్ని — రోజూ వైశ్వదేవం. మధ్యాహ్నం సంధ్యావందనం కచేరీలోనే వారుస్తాడని ప్రతీతి. నేనువెళ్ళి ఆహ్వానించగానే ఎంతో మర్యాదతో అంగీకరించాడోయి. నేనువెళ్ళి పోదామని లేచాను. ఆయనకూడాలేచి "నేను ఇప్పుడే వెళుతున్నాను - మైలాపూరు. మీరు కాలేజీకి వెళుతున్నారుకాంసు - కారులో దిగబెట్టుతాను రండి" అన్నాడు. "సరే"అనెక్కాను. కారు బీచంట వెళుతూంది. సెనేటుహౌసుదాటేం. నేను పరధ్యా న్నంగా సముద్రంవేపు చూస్తున్నా. పూరుకున్నట్టేవుండి—తనకాలు నా కాలుమీద పెట్టాడోయి. నేను తుళిక్కిపడి చూశాను. "ఆ తప్పులేదులే-నా కూతురులాంటిదానివి కావూ ?" అంటాడు ! నాకు రౌద్రం వచ్చేసింది. చర్రని ఒక్కలెంపకాయ వేశాను. ఆ చప్పుడువిని డ్రైవరు వెనక్కితిరికి చూశాడు. "చూడు ! ఓయి - కారిక్కడఆపు. నేను దిగిపోతాను." అన్నా. అని దిగిపోయాను. అమసలి సరసంచూస్తే నవ్వొ చ్చిందినాకు. "భరద్వాజంగారూ ! నన్ను మర్చిపోకండేం ! శుక్రవారం సభకి దయ చేయండి" అని నవ్వుతూ అని కాలేజీవేపు వెళ్లిపోయాను.

"ఏమిటి ? లేటు రాజర్షి భరద్వాజంగారే ? నేను ఆయనదగ్గిరకి రెండుమూడు సార్లు సలహాకోసంవెళ్లానుసుమా ! అమ్మో - రుద్రాక్షలపిల్లి ! గుండె ఖాదుకోవలి సొస్తుంటే శాంతం ! " అన్నాడుశాస్త్రి.

"కాలేజీలో లెక్చరరుపని చేస్తుండగా మరో అనుభవం చెప్తావిను. మద్రాస్ సివిక్ వెల్ఫేరుసమాజం వారు వనభోజనంచేశారు. అప్పట్లో నేను మన రాజధాని మధ్య తరగతుల్లో ఋణబాధగురించి పరిశోధనలు చేస్తుండేదాన్ని. అంచేత నాకూ ఆహ్వానం పంపేరు. శిరోమణిగారు ఆ సమితి అధ్యక్షుడు. సంఘ సంస్కర్తల్లో ప్రప్రథముడు. సంస్కృత పాండిత్యంలో అగ్రతాంబూలం. ఆయన రామాయణం పారాణ చేస్తుంటే ట్రిప్లికేనుబీచి కిటకిటలాటిపోయేది- ఏమనుకున్నావో! పెద్దపెద్ద రాజకీయాల్లో గవర్నరుజనరలు సెక్రటరీ ఆఫ్ స్టేటుకూడా ఆయన సలహా అడుగుతూంటారుట. ఆయన సన్యాసాశ్రమం తీసుకుంటానంటే సాక్షాత్తు శంకరాచార్యులవారే బలవంతం చేసి గృహస్థాశ్రమంలో ఉంచేశారంటారు. అందరినీ పలుకరిస్తూ నా దగ్గరకూడా వచ్చి "ఓహో, ప్రొఫెసరుగారా!" అనిఅంటూ, అమాంతంగా తన రెండుచేతుల తోనూ నాబుజాలమీద అనేడ్డోయి శాస్త్రీ! నేను ఆయన రెండుచేతులూ గుంజేసి - గుక్కతిప్పకుండా - మొఖం వాచిపోయేటట్లు చివాట్లుపెట్టా!"...

"ఓరి వీడితస్సా రవలా! నువ్వు చెప్పుతున్నావు కాబట్టి వూరుకున్నాను కాని, మరెవరుచెప్పినా - మాననష్టం దావా వేయించి వుందును - ఆయనమీద వాడికొచ్చిన ఏళ్లు ఎందుకొచ్చాయోయ్! మొన్ననే నాలుగోపెళ్లి కూడా చేసుకున్నాడు! డెబ్బైయేళ్ల పశువు!" అన్నాడు శాస్త్రి.

"ఆబోతనిదిద్దు" అన్నా నేను. "అమ్మా - అమ్మా - చంపేశావు!" అంటూ నవ్వేడు. ఎన్నో సంవత్సరాల క్రిందట జరిగిన సంగతులుకదా— శాస్త్రికి అంతకోపం ఎందుకొస్తుందో? అతనికి నామీద ప్రేమచేత దేముడు తనకోసంవే నన్ను ప్రత్యేక సృష్టిచేశాడనీ - నేను పుట్టిందగ్గరనుంచీ - తన స్వంతఆస్తి అనుకుంటాడు - అంచేతే అంత అసూయ కోపంవున్న - నా అనుభవాలుచెబుతూటూంటే నేనెందుకు మొదలుపెట్టానా అని నాలుక కరుచుకున్నా కాని - సరదాగానే విన్నాడు పాపం!

## 8

## అతడు

ఈ నాల్గురోజులు ఎంతో హాయిగా వెళ్ళిపోయాయి. ఎంతహాయిగా గడిచి పోయాయంటే— దినచర్యపుస్తకం కూడా రాయటం మర్చిపోయానన్నమాట! సింగ వల్లూరు అప్పీల్లో మొన్న తీర్పుచెప్పారు. పూర్తిగా నాపక్షం గెల్చింది. అంచేత యీ మూడురోజులూ శాంతంతో ఆడుతూ పాడుతూ గడిపేశాను. క్లబ్బులకుకూడా వెళ్లలేదు.

సాయంత్రం డాబామీద యిద్దరం కూర్చున్నాం. శాంతం అందికదా— "నిన్న నాకథచెప్పాను. యీవేళ నీకథచెప్పాలినువ్వు - ఏం?" "నాకథ కేముంది?" అన్నా.

"ఐతేవిను. ఇంగ్లండులో అన్నాళ్లున్నావుకదా - నీకెవ్వరితోనూ స్నేహంకాలేదూ?" అని అడిగింది. "ఓహో! దొరసాన్లతో స్నేహం కలగలేదా-అనేనా నీప్రశ్న? అలా అడక్కూడదూ? నీకు కోపంరాదంటే తప్పకుండా చెప్తా" అన్నా. నేను కూడా ఎన్నోసార్లిదివరకు చెప్పాలనుకున్నా ఎంచేతంటే- మనసంసారంలాంటి సంసారంలో పెళ్లికిపూర్వం జీవితవిషయాలు ఒకరితోఒకరు చెప్పుకోవడంమంచిది. ఇది చెప్పొచ్చునా-చెప్పకూడదా- చెపితే ఏం అపోహ వస్తుందో - అని మాత్రం వుండకూడదు. దాపరికం లేకుండా పూర్తిగా చెప్పుకోవడం మంచిది.

"ఆ ఫోటో ఆల్బమ్ ఈలా ఇయ్యి" అన్నా. మొదటిబొమ్మ చూపించా. "ఈ అమ్మాయి వేరాజాన్‌స్టన్. నాకు వేరాకి మా తమాషాగా కుదిరింది పరిచయం. ఓసారి టెన్నీసుబేటు కొత్తది కొందాం అని ఒక షాపులోకెళ్ళాను. వేరా బేట్లు అమ్ముతోంది. నేను అన్నింటికంటె ఖరీదైన బేటు యెంచి, అది కావాలన్నాను. ఈ బేటుతో ఆడే తాహతు మీకుంటేనే అది మీకమ్ముతానంది నవ్వుతూను. ఆవిడ కళ్లూ, మొఖం చూశాను. ఆమాటలు మనస్ఫూర్తిగా అన్నదని నాకుతోచింది. సరే, రేపుసాయింత్రం బెల్‌సైజ్ క్లబ్బుకి రండన్నా. చక్కటి టెన్నీసుదుస్తులు వేసుకువచ్చింది వేరా. నాల్గు జట్లు ఆడేం. రెండు తనవి, రెండు నావి. "మీచేతులో వుండదగిన బేటే అది!" అంది వేరా. సాక్షాత్తు సుజాన్‌లెంగ్లెన్ ఆడినట్టే ఆడింది. ఇలాగే అభినందించేను. ఆరోజునుంచి మాకిద్దరికీ స్నేహం మొదలు - మూడుసంవత్సరాలు పొడుగునా! ఎండాకాలంలో ప్రతిరోజూ ఆడేం. చూడు ఎంతచక్కనికళ్లో! అచేతులుచూడు అరిటిదవ్వల్లా! ఒక్క "బేక్‌హేండుడ్రైవు" కొట్టిందిరా అంటే - మళ్ళీ అందుకోడానికి టిల్డెన్ రావలసిందే! ఆకాళ్లుచూడు. యినుపవూచలంటేనమ్మ! ఎంత నిర్మలమయిన మనస్సు అనుకున్నావు శాంతం! ఆట ఆడింతరువాత కార్నరు హౌసులో టీ తాగుతూ గంటల తరబడి కూరుచుని టెన్నీసు ఖబుర్లు - లేకపోతే లోకాభిరామాయణం. అయినా వక్క నాడేనాసరే పల్లెత్తు తప్పుడుమాట ఆవిడ నోటినుంచి రాలేదు. ఎంతో అంతస్నేహం చూపించేది. మరొక్క ఆరునెల్లు వేరాతోస్నేహం సాగివుంటే—నాపని ఏమై వుండునో అనుకుంటాను.

"ఏముంది? నిన్నెగరేసుకుపోయేది!" అంది శాంతం నవ్వుతూను.

"ఒకనాడు పాపం! నాతో బంతేటకు రాబోతూ, బస్సు దిగేటప్పుడు కాలు జారి పడిపోయింది. ఇంతట్లో వెనుకనుంచి లారీవకటి ఆమెమీదినుంచి వెళ్లిపోయింది. క్షణంలోపోయింది ప్రాణం! తల్చుకుంటే నాకిప్పటికీ కళ్ళంట నీళ్లుతిరుగుతాయి"

"పాపం! ఏం అందమైనముఖం-ఏం సుకుమారమైన కళ్లు-శాస్త్రీ! ఎంతో మంచితనం కనిపిస్తుందోయి ఆ చూపుల్లోను! నేను తప్పకుండా ఆమెతో నేస్తంచేసే దాన్ని" అంది శాంతం స్వచ్ఛమైన సానుభూతితో.

శాంతం రెండో పుట తిరగేసింది. "పిల్లందరూ సామాన్యం పరిచయస్తులు లాంటి లేడీల కూతుళ్లు-స్కూల్ ఆఫ్ ఎకనామిక్సులో కలిసి చదువుతున్న పిల్లలూ- స్నేహితుల అక్కచెల్లెళ్ళూ-ఓహో అంటే, ఓహో అంతే. పుటలు తిరగేసి — ఆ... ఇక్కడ ఆగన్నా నేను. "ఇదెవరూ?" అంది శాంతం. "మేజీ మెకార్మిక్" అన్నా. "ఏమిటోనోయి శాస్త్రీ! ఈ అమ్మాయి ముఖం, పెదిమెలు, కళ్ళూ చూస్తేనే వుత్త పెంకిఘటంలా వుందోయి!" అంది శాంతం. "బాగా పోల్చేవు శాంతం! నువ్వు చెప్పిందంతా అక్షరాలా నిజం. ఆ అమ్మాయిగురించి చెప్తా విను. నువ్వేం గాభరా పడక్కరలేదులే!" అన్నా. "మేజీ తల్లితండ్రులిద్దరూ ఐర్లెండువారు. చిన్నప్పుడే పాపం చచ్చిపోయేరు. అక్కయ్య, బావ దగ్గరుండేది. జాక్ డేవిస్ ఎలెక్ట్రికల్ ఇంజినీరు. నోర్మాకి సంగీతంలో మంచిప్రవేశం. ఆల్బర్టుహాల్ పాటకచ్చేరీల్లో వాళ్ల పరిచయం అయిందినాకు. ఇంచుమించుగా ప్రతీరోజూ వాళ్లింటికి రాత్రిభోజనానికి వెళుతూండేవాణ్ని. కొన్నాళ్లు స్నేహం అయాక- జానున్నూ, నోర్మాన్నూ మేజీ గురించి చెప్పారు నాతో. చెప్పితే వినదూ— చదువుమానేసింది— ఆస్తి కాస్తా ఖర్చుపెట్టేసింది— స్నేహితులు లావైపోయారు— వాళ్లెవరో మాతో చెప్పదూ— ఐదారుసార్లు అక్కడా ఇక్కడా పని చెప్పించేం— పట్టుమని నెల్లాళ్లైనాపనిచెయ్యకుండా మానేసి ఇంటికొచ్చేస్తూంది- ఏంబుద్ధో తెలియకుండావుందోయి- నువ్వు కాస్త ఎక్కడేనా పనిచూసిపెడదూ- నువ్వుచెప్తే వింటుందేమోనూ?" అని పాపం అన్నారు. "మీరు చెపితేనే వినకపోతే, నేను చెపితే వింటుందా? అయినా చూదాం" అన్నా నేను. మేజీతో ముందుగా మాట్లాడి ఒప్పించి మరీ పనికోసం సిఫార్సుచేశా."

"సిఫార్సు చెయ్యడానికి అంత పలుకుబడి ఎల్లా సంపాదించేవోయి శాస్త్రీ ఆ పరాయిదేశంలో!" అంది శాంతం ప్రేమతోనూ, ఆశ్చర్యంతోనూ.

"ఆ తరువాత పుటలోవున్న ఫోటో చూశావా?" అన్నా.

"జీన్ బ్రాడ్ ఫర్డు అని సంతకం వుందోయి. ఓహో! ఏం గంభీరమైన ముఖం ఏం సున్నితమైన కళ్లు! ఎంతో ఉదాత్తం అయిన స్వభావం అయివుండాలోయి. ఈవిడది!" అంది శాంతం. "నీకావిడతో ఎల్లా స్నేహం అయిందోయి?"

"నిజంగా అదో గొప్ప చిత్రమే అంటే నమ్ము! నేను లండను వెళ్ళిన మొదటి సంవత్సరం మహమ్మద్ ఇస్మాయిల్‌తో పరిచయం కలిగింది. పెషావరు అతనిది. యూనివర్సిటీ కాలేజీలో ఆఖరిసంవత్సరం ఇంజనీరింగు చదువుతూండేవాడు. అతనికి జీనుకి స్నేహం. పరీక్షపూర్తికాగానే ఇంపీరియల్ సర్వీసులో ఉద్యోగం నిశ్చయం-అప్పుడు పెళ్లి చేసుకుని పెషావరు వెళిపోదాం అనుకునేవారు. పరీక్షలు ఆరునెలలున్నాయనగా ఇస్మాయిల్‌కి క్షయరోగం ప్రవేశించింది, రోజుకి రోజూ ఉధృతం హెచ్చిపోయింది. ఆట్టే డబ్బున్నవాడు కాడు జీనుకి, లయన్సు రెస్టారెంటులో మేనేజరుపని. పాపం ఆర్జించిన డబ్బంతా ఇస్మాయిల్ జబ్బులో ఖర్చుపెట్టింది. ఆఖరి నాల్గు నెలలు

ప్రత్యేకంగా హార్లీస్ట్రీటు వైద్యుల స్వంత ఆస్పత్రిలో ఉంచి మందిప్పించింది. ఆరోజుల్లో నేను రోజూ ఇస్మాయిల్ ను చూడ్డానికి వెళుతూవుండేవాణ్ణి. అప్పుడు జీను పరీక్ష సం కోసకి ఆరునెలలు తీసుకుని తీసుకుని ఇస్మాయిల్ పోయాడు. అతని స్నేహితుడ్ని అని చెప్పి నన్నెంతో ప్రేమతో చూసేది. నేను లండనులోవున్న ఐదు సంవత్సరాలు ఆమె నాకుచేసిన ఉపకారం-చూపించిన ఆదరణ-ప్రేమ-మితిమేరలేదంటే నమ్మ. నిజంగా నిష్కామకర్మ అంటే జీన్ జీవితమే! నాకు ఇంటినుంచి డబ్బురావడం ఆలస్యం అయినప్పుడు-ఎన్ని సార్లు సాయంచేసిందో-మళ్ళీ నాకు మనస్సు నొప్పించకుండా-మళ్ళీ ఇచ్చేస్తే పుచ్చుకునేదికాదు సుమా. అంతేనా-రెస్టారెంటులో సుష్టుగా భోజనం పెట్టి-నాకుమనస్సు ఎక్కడ చిన్నపోతుందో అని చెప్పి-ఏ ఆరుపెన్సో తొమ్మిది పెన్సో బిల్లుచేసి పంపించేసేది నన్ను. అలాంటిమనిషి జీను ప్రాణస్నేహితురాలు. సరే జీనుతో మాట్లాడితే మాడ్జికి అసిస్టెంటు క్యాషియర్ పని వారానికి ముప్పై షిల్లింగుల మీద-వేయించింది. నాలుగు నెలలు గడిచిపోయాయి. జీను నార్మా ఎంతో సంతో షించారు. మాడ్జి నాతో చమత్కారంగా మాట్లాడ్డం, నన్ను ముద్దుపెట్టుకోడానికని సరసాలాడ్డం మొదలుపెట్టింది. “ఇదేమిటి నన్ను ముద్దుపెట్టుకోవడమేమిటి ?” అని నేను వొదిలించేసుకుంటే: “నువ్వు చేసిన ఉపకారానికి - కృతజ్ఞత చూపించడం - నామోస్తరు” అంది. ఒక్క నిమిషంవుండి- “ఏం- నన్ను ముద్దుపెట్టుకోవడం నీ కిష్టంలేదు ?” అని అడిగింది. “నా కిష్టంలేదు - నువ్వు బుద్ధిగావుండి మీ అక్కయ్య బావని సంతోషపెడితే - అంతేచాలు” అని నేనన్నా. దాంతో నాతో అసలు మాట్లాడ్డం మానేసింది. సరే- ఆ అమ్మాయితో ఏమిటి అనుకున్నా. “అమ్మాయి ఏమిటి ? ఇరవైఏళ్లు ముడ్డికిందేసుకున్నా ముద్దరాలు కాదూ?” అంది శాంతం కోపంతో. “అవును - ఇరవై - ఇరవైరెండవుంటాయి. అతిపెంకి. సరే - ఇలావుండగా ఒకనాడు జీను అందీ! “శాస్త్రీ! పదిరోజులై మాడ్జి వ్యవహారం ఏంబాగుండడంలేదోయి. నువ్వు కాస్త జాగ్రత్తగా కనిపెడుతూ వాళ్ళక్కయ్య బావతో కూడా చెప్పూ-అంది. నా పరీక్ష తొందర్లో వారంరోజులు, డేవిస్ ఇంటికి వెళ్ళలేదు. ఓనాడు రాత్రి వెళ్లేను మాడ్జి వక్కత్తేవుంది ఇంట్లో. మామూలుగా ముందుగదిలో కెళ్లా. మాడ్జి వుత్త వక్క వుల్లి పొరఅంగరఖా వేసుకుంది- ఒంటి తీరంతా స్పష్టంగా కనిపించేటట్టు. నేను తెల్లబోయి వక్క పడ్డా. కుర్చీలో కూచున్న మనిషల్లా నన్ను చూసి పిల్లిలాగు చప్పున నావేపు వక్క పురుకు వురికి - తన రెండు చేతులూ నా మెళ్ళో పెనవేసి పెద్దచప్పుడు అయ్యేటట్టు నన్ను పెదిమెలమీద ముద్దు పెట్టుకుంది. “నన్ను ముద్దుపెట్టుకోవడం ఇష్టంలేదన్నావు కదూ! సరే - ఇప్పుడు వెళ్లు — నీకో నమస్కారం. నీ వుపకారానికో నమస్కారం- నన్ను మళ్ళీ నువ్వు చూడవు”అంది. అంటూ నన్ను గదిలోనుంచి నెట్టేసి — వీధితలుపు వేసేసింది. ఆ అమ్మాయిస్వభావం తెలుసుకున్నా. ఇంటికి వెళిపోయా. పరీక్షలమూలాన్ని నాల్గురోజులు చదువుకుంటూ - ఇంట్లోనే వుండిపోయా. ఐదోరోజు పొద్దున్న వార్తాపత్రిక చూసేటప్పటికి- “లయన్సురెస్టారెంటులో వెయ్యిపౌన్లు వెండిసామాను దొంగ

తనం - అసిస్టెంటు క్యాషియరు మాడ్జిమెకాన్కిక్పై పోలీసుల అనుమానం - కెనడాలో స్టీవర్ల సోనా" అని వుంది. "మాడ్జినికిచ్చిన వీడ్కోలువిలువ వెయ్యి పౌన్లు అన్నమాటోయి శాస్త్రీ! నువ్వు కాస్త జాగ్రత్తగా లేకపోయుంటే అసలు నిన్నే...!" అంది శాంతం నవ్వుతూనూ. "ఏం, నన్నంత చపలుడికింద కట్టేశావే?" అన్నా నేను. "అబ్బా - అది కాదోయి దేవుడా! నువ్వు చెప్పిన కథ ఏ ఆరేళ్ళక్రిందో జరిగి వుంటుంది అప్పటికి నువ్వెవరో - నేనెవర్నో? ఇంతకీ హాస్యానికన్నానోయ్! సరే - కాని, మేడ్జి యేమైంది?" అని అడిగింది. "ఆ అమ్మాయి పత్తా నాటికీ నేటికీ తెలీలేదు. అలాంటివాళ్ళ ఖర్మం అంతే!" అన్నా. "అదుగో - ఖర్మం గిర్మం అంటే నేనొప్పుకోనోయ్! నువ్వు నేను అలా తయారు కాలేదంటే, నీలోనూ నాలోనూ ఏం పెద్ద గొప్పతనం వుందని అనుకోకు. వాళ్ళ తల్లిదండ్రుల స్వభావాలు, వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలు, వాళ్ళ దేహదార్ఢ్యాలు, చిన్నప్పుడు తల్లిదండ్రుల లాలనపాలన, బాల్యంలో చదువు, పరిస్థితులు, కౌమారంలో చిత్తప్రవృత్తులు, ఆటలుపాటలు, సంఘజీవితం, కుటుంబజీవితం, ఆర్థికజీవితం - ఇన్ని విషయాలుంటే - ఒకముక్కతో కొట్టిపారేశావే!" అంది శాంతం. "అమ్మోయ్! వైద్యశాస్త్రం, శరీరశాస్త్రం, కామశాస్త్రం, సంఘశాస్త్రం, రాజకీయశాస్త్రం, అర్థశాస్త్రం, న్యాయశాస్త్రం, ధర్మశాస్త్రం - ఇన్నింటిమీద గుక్కతిప్పకుండా ఒక్కబిగిని లెక్చరుకొట్టేవే! వీటన్నింటికీ 'ఖర్మం' అని నేనొక్కమాటలో భాష్యంచెప్పాను. అంతే నీకు నాకు తేడా!" అన్నా. "అదుగో-అలా తలవెంట్రుకను చీలుస్తే నాకొస్తుందింక" అంది శాంతం. కొంచెం శాంతించి, "సరే-యీ ఖండనమండనం వాయిదా వేద్దాం మరోనాటికి. కాని, నీ ఆల్బమ్‌లో ఇంకా చాలా బొమ్మలున్నాయే" అంది బొమ్మలు తిరగవేస్తూనూ. "ఆ కథలు మరోనాటికి వాయిదా వేద్దాం" అన్నా. "ఏదో దాచిపెడుతున్నావేమిటో? తప్పకుండా చెప్పాలి-లేకపోతే నేనొప్పుకోను సుమా!" అంది వేలు చూపించి - నవ్వుతూనూ.

## ఆమె

ఇలా యెప్పుడు వొచ్చిపడుతుందో అని నేను రోజురోజు భయపడుతునే వున్నాను. శాస్త్రి కోర్టుకి వెళిపోయాక అయ్యరు నా దగ్గరకొచ్చి "నెలాఖరునుంచి మానేస్తున్నాను. మీరు మరెవరినైనా చూసుకోండి" అన్నాడు. "అయ్యరుతోపాటు నేనూ వెళిపోతాను" అంది తాయి. "వాళ్ళిద్దరితోపాటూ నండి నేనున్నూ" అన్నాడు నాయరుకుర్రాడు. ఈ మధ్య సెసిలీవాళ్ళూ రావడం, వాళ్లు వెళిపోయాక యేవో

రెండుమూడు విందులూ అవీ చెయ్యడం - దాన్నించి నేను మొదట వీళ్ళతో ఖరారు చేసేటప్పుడు వీళ్ళకి వారానికి ఒకపూట సెలవియ్యడానికి వీలుపడిందికాదు. ఎంచేత మానేస్తున్నారన్నా. "ఫార్లకీ ధోరసాన్లకీ అడ్డమైనవాళ్ళకీ వంటలు వండీ వడ్డించీ చిప్పలుతోమీ మేంచాకిరీలు చెయ్యలేమండీ" అన్నారు. జీతాలు ఇస్తున్నాంకదా అని వేళాపాళాలేకుండా వీళ్ళని రాసికాపాడిస్తే వీళ్ళుమాత్రం మనుష్యులు కారా అనిపించింది నాకు. కాని యేంచెయ్యనూ? చుట్టాలూ పక్కాలూ - నలుగురు వచ్చేపోయే యిల్లాయె - అందులోకీ శాస్త్రిది దర్జాపద్దు. ఇలాంటివాట్లో మరీ ఝూరుచేస్తాడు. జ్ఞానం వచ్చిందగ్గిరనుంచీ హాస్టల్లో వుండడంచేత నాకు వంటచేతకాదు. - చెయ్యడానికి ఓపికాలేదు. వీళ్ళుమానేస్తే ఎలాగురా భగవంతుడా? మరివకరు కుదురుతారో కుదరరో? రేపు నోట్లో మెతుకులుపడే మాత్రం ఏమిటీ - అని నాకు మనసులో దిగులు పడిపోయి ఆలోచిస్తున్నాను. రాత్రి తొమ్మిదైంది - శాస్త్రి యింకారాలేదు. "అయ్యరు గారూ! వంటమాత్ర పెట్టేసి - అన్నంగిన్నె సిబ్బిమీదమాత్రం నాలుగు నిప్పులుంచి మీరు వెళిపోండి - పాపం చాలా ఆలస్యం అయిపోయిందిమీకు అయ్యగారికి నేను వడ్డిస్తాను లెండి!" అని అంటూన్నాను - ఇంతట్లో నలుగురుస్నేహితులని వెంటేసుకొని శాస్త్రి ప్రత్యక్షం! వాళ్ళనిచూసి నాగుండె బేజారైపోయింది. వాళ్ళందరికి నన్ను పరిచయం చేశాడు - పంగనామాలు వజ్రపుతమ్మెట్లు పెట్టుకున్నదొర బ్యాంకీమేనేజరు-కాణీ అంత అక్షింతలు బొట్టూ కొప్పుముడీవున్న దొర పెద్దవకీలు - తెల్లటినుదిటిమీద సూదిమొనంత కుంకంచుక్క పెట్టుకున్న ధోరన్నూ - నల్లటిముఖంమీద యేగుర్తూలేని మళయాళం ధోరన్నూ - బారిష్టర్లు. వీళ్ళకి బల్లమీద భోజనం! ఏంచెయ్యను? నాపని అడకత్తెరలో పోకచెక్కలాగైంది. వీళ్ళని చూసి అయ్యరు సొంటిపిక్క పెట్టినట్టు పెట్టాడుముఖం. అయినా మాటదక్కించేడు! యడపొయ్యీ పెడపొయ్యీ ఇవప కుంపటీ రాజేశాడు. నాయరు స్టవ్వులు రెండూ వెలిగించేడు. తాయి బంగాళదుంపలు తరిగి, మసాలాఖారం నూరేసి, పాయసంలోకి కొబ్బరికోరు జీడిపప్పు యాలగ్గింజలూ సిద్ధంచేసింది. నా పనిమాత్రం కాలు కాలినపిల్లిలాగు ఇటూఅటూ తిరగడం! ఎలాగైతేనేం-అంతా సరీగ్గానే జరిగిపోయింది!

వాళ్లందరూ వెళ్ళిపోయాక శాస్త్రి నవ్వుతూ వచ్చి: "కోటలో పాగావేశాను-శాంతం!" అంటూ కేసులో ఫీజుగురించి చెప్పడం మొదలెట్టాడు. అంతా చెప్పనిచ్చి-అయ్యరు నౌఖర్లు అన్నమాటలు చెప్పా. "వీరేశలింగంగారి ప్రహసనంలాగుందే!" అని ఫక్కున నవ్వేడు. "పద్ధతిప్రకారం మనకి వ్యవధివుండేటట్టే చెప్పారోయ్!" అన్నా. దానిమీద సివాలెత్తిపోయి: "పోకిరి ఫుండాకోరుజట్టు! వీళ్లు మనకి 'నోటీసు' ఇవ్వడం కూడానా? రేపే 'టెంపొరరీ ఇంజంక్షను' పుచ్చుకొని 'స్పెసిఫిక్కురిలీఫు' కింద మళ్ళీ మనకి మరొకరు కుదిరేవరకూ మనిదగ్గిరే చచ్చిపడి చాకిరీచేసేటట్టు చేస్తా! అమ్మా-వీళ్ళకొగులూ!" అని మండిపోయాడు.

"వాళ్లతో మనకి రవ్వగోష్టు ఎందుకోయ్? ఆకోపంమీద వాళ్లేమంటు పాడు చేస్తారేమో కుడాను" అన్నా. "వంటత లేస్తే నష్టపరిహారంకింద జీతంకోసి 102 సెక్షను ప్రకారం దొమ్మీనేరంకింద పూచీకత్తుకి 'బైండోవరు' చేస్తేసరి! మనమేనా యేమిటి చచ్చు పెద్దమ్మలం?" అన్నాడు. "అలాఅనకు శాస్త్రీ! వాళ్ల కష్టంకూడా మనం కని పెట్టాలి. ఎలాగేనా యీ రెండుమూణ్ణెళ్లాయి మనయింట్లో అతిథులూ విందులూ ఆర్భాటంగానే వుందికూడాను" అన్నా. దాంతోఅందుకుని: "అలాఅయితే - ఇక రేపటినుంచి మనయింటికి వచ్చేవాళ్లందరికీ పూటకూళ్లయిల్లు చూపిస్తానులే - నీకూ నీ నవుకర్లకీ శ్రమలేకుండా" అన్నాడు.

అని వుత్తరక్షణంలో నా చేతులురెండూ పట్టుకుని: శాంతం: "నేనన్న మాటలకి క్షమించు" అని గడ్డంపట్టుకుని బతిమాలుకున్నాడు. "క్షమించానంటేనే చేతులు వదలుతాను" అన్నాడు వినంగా. "సరే - క్షమించానులే!" అన్నా. "అయ్యరుచేతా నౌకర్లచేతా పనిచేయించుకోవడం నీకు చేతకాదు. నీది మరీజాలిగుండె. వాళ్ళని నేను గసిరో గదమో కొట్టో తిట్టో రేపుప్రొద్దున్న సమాధానపరుస్తాగా!" అన్నాడు. "తెలివి మీరినవాళ్లుసుమా! మునపటికాలపు మడ్డిమనుష్యులు - గొర్రెలమంద కాదు. నీ దాష్టీపంతు లాంగపు దబాయింపులు సాగవేమో? మరోనాలుగురూపాయల జీతం హెచ్చుచెయ్యి-పోనీ" అన్నా. "ఆపనిమాత్రం చస్తేచెయ్యను! పంతులమ్మకీ స్నేహితురాలికీ వున్న తేడా వాళ్ళకే తెలుస్తుంది. రౌతుచూసి గుర్రం ఆడుతుంది!" అన్నాడు. "మాటవరసకేనా వంటింట్లో పెత్తనం నామీదనిలబెట్టుం!" అన్నానవ్వుతూనూ... నామెత్తదనంచూసి నన్నునిజంగా ఆడిస్తున్నారేమో అయ్యరూ పనివాళ్లూన్నూ? అయినా వాళ్ళకష్టం మనంవుంచుకో కూడదు. శాస్త్రీతో యీమాటే మరోసారిచెప్పాలి.

## 10

## అతడు

తోటాద్రిఅయ్యంగారు, కపాలేశ్వరయ్యరు, త్రిపురాంతకం, కోటీ - బ్యాంకీ కేసులో కాగితాలు చదవడానికి ఇంటికొచ్చారు. ఇంతమందిని నేను ముందుచెప్పకుండా భోజనానికి తీసుకొచ్చినా పంచభక్ష్యపరమాన్నాలతో భోజనంపెట్టింది శాంతం! భోజనంచేశాక కాఫీన్నీ తాంబూలమున్నూ ఇచ్చి మాతో కాస్సేపుకూర్చుంది. వాజ్య కారణం గురించి ఆవిడతో టూకీగాచెప్పేడు తోటాద్రిఅయ్యంగారు. శాంతం అంది: "బేరరుపత్రాలు కాబట్టి బ్యాంకీకి వాటిని ఎవరుసమర్పించి డబ్బువసూలుచేసుకున్నా బ్యాంకీకి పూచీవుండదు!" -అనివక్క-ముక్క-తో తేల్చేసింది! స్నేహితులందరూ గుమ్మ

అయిపోయారు శాంతంతెలివితేటలకి! మేంకాగితాలు చూసుకోవడం పూర్తిఅయ్యే సరికి రాత్రిపదకొండు అయింది. ఒకవైపు పెద్దబ్యాంకు-రెండవవైపు పేరుమోసినకంపెనీ. పట్టుదలమీద లక్షలూ లక్షలు ఖర్చుపెడుతున్నారు. మంచిఖాతా యెల్లకాలంనిలిచేది. వెయ్యిరూపాయలు అప్పుడేముట్టేయి. వ్యాజ్యంయింకాఆరంభమైనా కాలేదు. ఆసంతోషంలో శెసిలీ యిచ్చిన షాంపేనుతీసి నలుగురికీయిచ్చాను. కోష్టీ త్రిపురాంతకులు షాంపేనంటే దేవాంతకులే! తోటాద్రీ కపాలేశ్వరంమాత్రం కొంచెం వెనక్కి తీశారు. మేంముగ్గురం బలవంతంచేస్తే రుచిచూశారు. "అంతస్తాపోబహిష్కృతలం!" అన్నాడు అయ్యంగారు పుచ్చుకుని. "హాలాహలం అనేత్రాగుతున్నాను సుమండీ-శివోహం!" అన్నాడు కపాలేశ్వరుడు. మొత్తంమీద బాగా రక్తికట్టింది!

వాళ్లూవెళ్లిపోయారు - శాంతంచెప్పింది - అయ్యారు తాయి నాయరు నెలాఖరు నుంచీ మానేస్తున్నాం అన్నారని. తాపీమేస్త్రీకి ఇటికెలందిచ్చే ఆడకూలీలాగు వంటువాడికీ అంట్లుతోమేమనిషికీ జోడా! రాజూ రాణీ జాకీలాగు నాయరుకుర్రాడూ! అసలు శాంతందే తప్పు. వీళ్ళకి నెలజీతాలివ్వడమే కాకుండా - సంవత్సరానికోసారి వాళ్ళవూళ్ళకివెళ్ళడానికి రైలుఖర్చులట - యేటేట నెలజీతం కట్నంట - పండుగకి పంచలచాపూ చీరె ఉత్తరీయంట - ఇవి చాలనట్టు వారానికి వకపూట జీతంమీద సెలవట! ఎక్కడేనావుందీ? ఇలానెత్తిమీద యెక్కించుకోబట్టే వాళ్లూ తందనాలు ఆడుతున్నారు. నాకెవడేనా యిలాగు యిస్తే - యీకవిలికట్టలూ నల్ల అంగరఖాలూ తెల్లపురితాళ్లూ పారేసి-హాయిగా వంటకికుదురుకుంటూ నేనున్నా...నిరుడు ఊటీనుంచి వస్తూ మురుగేశందొరై పాతలండను జట్టునందరినీ జలసాగా వాళ్ళవూరు తీసుకుపోయాడు. మురుగేశం లండనులో సాయిలాభాయిలాగా వుండేవాడా - అటువంటిది జమీ చేతికందేక గడుసుతనంవొచ్చి - నౌఖరీయీనాములు గ్రామకంఠాలు చెరువుగర్భాలు నివేశనాలు సాముదాయకబీళ్లు గయాళీబంజర్లు - అన్నీ స్వంతశేరికింద రెండువేలయకరం మహాబాగా ఆక్రమించుకున్నాడు! 'పోరు' ఆడుతున్నాం. ఊడుపులు ఆపేసి కూలీలు చేతులుముడుచుకుని కూర్చున్నారని- ఖబురు. రాజూ దివానూ యతీశ్వరులూ అందరూ తెల్లబోయారు. నేనే ధైర్యంచేసి అక్కడికి వెళ్ళా. వాళ్ళలో మేస్త్రీని పిలిచి - యేమిటికథ కహాయిషీ అన్నా. 'బుజాలులాగేస్తున్నాయి. జలగలు కాళ్ళనిపట్టుకుని రక్తాలుపీల్చేస్తున్నాయి. చేతులు వొరిసిపోతున్నాయి. వాతపట్లతో మరిమేంపనిచెయ్యలేం' అంటున్నారు కూలీలు-అన్నాడు. అంతావిని నేను "ఇంతేనటోయ్! ఇవిగో యాభైరూపాయలు - వీటితో మీవాళ్ళందరికీ మురుకు ఇడియాపం సుండలు విందుచెయ్యి. దాహంకావలిస్తే - ఇవిగో మరోపది" అన్నా. మేస్త్రీని కన్నుగీటి - ఆపదిరూపాయలూ తన జేబులో వేసుకోమని సంజ్ఞ చేశా! దాంతోమళ్ళీ ఊడుపులు ప్రారంభం! ... ఎకరోనీచులు నేర్పుతారు వీళ్ళకీ పాడుబుద్ధులు. లేకపోతే - పైదేశాల్లో యెలాగున్నా మనదేశంలో యెప్పుడైనాయెరు

గుండమా - ఖావందమీద పాలేరు - యజమానిమీద కూలీవాడు - ప్రభువమీద సేవకుడు - ఎదురుతిరగడం? ఈ అల్లరిచిల్లరివాళ్ళతో సామదానభేదదండం ప్రయోగిస్తూ చాకచక్యంగా పోవాలె! కనికరిస్తే రోజులాయివి? ...

పొద్దున్న కచేరీకి వెళ్ళేముందు ముగ్గురినీ పిలిచి ముఖంవాచిపోయేటట్టు ఛడ చీవాట్లుపెట్టాను. "అమ్మగారి సఖ్యకాలంచూచి నానామాటలు ఆడి నానాచేష్టలూ చేస్తున్నారమీరు. బారిష్టరుఅయ్యగారిదగ్గిర మీ ఆటలు సాగవని - మీ పాచికలు పారవని తెలుసుకోండి. హిరణ్యాక్షవరాలకోరితే లాభంలేదు. ఆమాటకొస్తే యిప్పుడే పొండి!" అన్నా. "కరువుకాలంకదండిస్వామీ!" అన్నాడు అయ్యరు. "అలాగు దారిలోకివచ్చి 'నాయనా బాబూ' అని అడిగితే అందులో సరసంవుంది." అని వాళ్ళజీతాలూ వరో ఐదురూపాయలూ యిచ్చి 'రాత్రి పెంద్రాళే వంటచేసి ముగ్గురూ సినీమాకుపొండి' - అన్నా. నవ్వుకుని పోయారు! యీమాత్రం ఉపాయం శాంతానికి తెలియదు.

తాజా: శాంతం ఇప్పుడే టెలిఫోను చేసింది - అయ్యరు తాయి నాయరు ముగ్గురూ పెట్టేబేడా కట్టుకుని వెళిపోయారట! జీతమూ - పైపెచ్చు నేనిచ్చిన ఐదు రూపాయిలుకూడా కాజేశారు! ఉచ్చం నీచంలేనివాళ్లు! పాపం - శాంతం ఫలహారం చేసుకుంటుందోలేదో? రాత్రి స్పెన్సరుకి తీసుకెళ్లాలి భోజనానికి!

## *II*

## ఆమె

రాత్రి "శశిరేఖ" నాటకానికి వెళ్ళాము యిద్దరమున్నూ. నాటకం మొదటినుంచి కొసవరకు ఒక్కపట్టున అతి ముచ్చటగా వుండెను. శశిరేఖతో నాకుపూర్తిగా సానుభూతి. శశిరేఖలాంటి పరిస్థితుల్లో వుంటే నేనూ ఆవిడలాగే ప్రవర్తిస్తాను. ఏమి గొప్ప స్వభావం!

ఇంటికెళ్ళాక సావడిలో పెద్దకుర్చీలో శాస్త్రి కూచున్నాడు. నేనతని కాళ్ళ దగ్గిర బాలీసువేసుకుని అతని మోకాళ్ళకు జారబడతూ - ఇద్దరంకాఫీ తాగుతున్నాం. కాఫీతాగుతున్నానే కాని, నామనసంతా శశిరేఖతో నిండిపోయింది. ఆవిడెగురించి నా మనసులోదంతా, ఆవిడె పడిన కష్టాలు, సుందర్రావుచేత అన్ని తాపులుతిన్నా అలా వోర్చుకొని అతనిదగ్గిర వుండడం, కొసకి రామారావుకోసం తన వుద్దేశాలకి వ్యతిరేకంగా

వున్నప్పటికీ: అతనిని పెళ్ళి చేసుకోడానికి తను చేసిన త్యాగం - అన్నిటినిగురించి చెప్పాను. నే చెప్పింది విని శాస్త్రి నవ్వాడు. ఆనవ్వు మామూలుగా పెద్దాళ్ళు-నవ్వుతారే - ఒక మోస్తరుగా నూర్పుగా, చంటిపిల్లలు పెంకితనం చేస్తే నవ్వుతారే - అలా నవ్వాడు. దానితో నాకుచాంకోపమువచ్చి అతని వళ్ళోతలపెట్టుకు కూర్చున్నదాన్ని, అతన్ని తగలకుండ కూర్చున్నాను. దూరంగా వెళిపోయిందాన్ని నన్నుదగ్గరగా తన వొళ్ళోకి లాక్కున్నాడు. నవ్వుతూ అన్నాడు: "శశిరేఖలాంటి ఆడవాళ్ళనినువ్వు మెచ్చుకుంటూవుంటే నువ్వు దేనిగురించి మాట్లాడుతున్నావో ఆ విషయం నీకేం తెలీకుండానే మాట్లాడుతున్నావని అనిపిస్తున్నది." నేను మాట్లాడుతున్న సంగతి నాకే తెలీదూ? నాకు మనస్ఫూర్తిగా తోచినమాట - అంతఃకరణలో వున్నమాట - యెంతో సానుభూతితోను, ఉత్సాహంతోను - నీ వుద్దేశమేంవిటి అని నేను అడుగుతూంటే - నేను మాట్లాడేదినాకే తెలీదంటే - ఏమనడం?

అక్కడనుంచి శాస్త్రి ఉపన్యాసధోరణిలో: "అలాంటి ఆడవాళ్ళలో వక్కదమ్మిడీయెత్తైనా మంచివుండదు. అది నేనన్నమాట" అన్నాడు. "ఆడవాళ్ళసంగతి నీకేంతెలుసు? తన దురదృష్టాన్నోద్దన్నీ బ్రతికిచెడినంత మాత్రాన్ని ఆ మనిషిలో ఏమీ మంచిలేదనే నీవుద్దేశం?" అన్నానేను. "వుంటేమాత్రం యేంలాభం? వాళ్లు తిన్నగా నడవగలరా యేమిటి? ఒక బతుకంతా, తనకెలాతోస్తే అలాగు కట్టుబాట్లు పాటించకుండా స్వైరావిహారంగా ప్రవర్తించినతరువాత ఓ పిసరు మంచివున్నమాత్రాన్న యేంకార్యం? వాళ్ళకి మరింత గర్వాన్నిపెంచి, మరింతచెడుపు చేస్తుంది. అయినా ఆవిషయాలగురించి నీకేంతెలుసు?" అన్నాడు.

ఇలాంటి సంగతులగురించి అజ్ఞానం వుండడం తమ పెళ్ళాలలో సుగుణం అని మగాళ్లెందుకనుకుంటారుచెప్మా? "నేను చెప్పినసంగతులు పుస్తకాల్లోవి, నవలల్లోవి, బయస్కోపుల్లోవి వర్ణిస్తూన్నా ననుకుంటున్నావేమో? విను" అని నా దగ్గర చదువుకున్న గిరిజాసంగతి చెప్పాను. దానిమీద శాస్త్రి అన్నాడూ: "ఇలాంటి సంగతులు ప్రపంచంలో జరుగుతున్నాయన్నంతమాత్రాన్ని వాటిగురించి మనం మనసులో పెట్టుకుని ఆలోచించకూడదు. ఏదైనా విషయం అందంగావుండాలి, లేకపోతే దానిలో శాస్త్రవిషయం జ్ఞానవిశేషం యేదేనా వుండాలి. లేదూ మనుష్యకోటికేదేనా విలువ కలిగేదేనా కావాలి - ఈ కారణాలు లేకపోతే ఆ విషయంగురించి తనకు తెలుసును అని అందర ముందరా చాటడానికేమీ అగత్యంలేదు. అయినా తమాషా! ఇలాంటి విషయాలు యెంతమోటుగావుంటే అంత హెచ్చుగా మాట్లాడుతారు- కొందరు. యీ ఆడ-మొగ విషయంలో ఆడవాళ్లు యెంత మాట్లాడకుండావుంటే అంత యిష్టం మొగాళ్లకి. ఇంతకీ నేచెప్తావిను. మొగాడికుండే - కొన్ని సంగతుల గురించి తన పెళ్ళాంఅజ్ఞానంలో వుండడమే యిష్టం." అని అన్నాడు—

ఎన్నో మైళ్ళ దూరం వున్నట్టు అనిపించింది. తన వుద్దేశాలన్నీ నిశ్చితమైనవే ఐనా, తనతో భేదంవున్న నా వుద్దేశాలను సంతోషంగా సహించాడు. అయితే నాకేం. నాటకుతునాడి; నా వుద్దేశాలునావి. నేను లేచా: "సునిద్దరం చాలా సంగతుల్లో వేరైపోతున్నాం." నా కావలింత లొచ్చాయి. "నీకు నిద్రొస్తున్నాది పాపం. ఆ; నిద్ర వేళయిందికూడాను." మనం, చిన్నపిల్లని నిద్దరపోతే జోకొడతాం: అలాగున్న కౌగు లించుకుని అన్నాడు.

నేను లేని నవ్వు తెచ్చుకుని, "అవును నిద్దరొస్తున్నాది" అన్నా. నవ్వుముఖాన్ని వున్నా మనసులోమాత్రం ఒకమోస్తరు అసంతృప్తిన్ని, ఆశాభంగంవున్నూ అనిపించింది. ఒఖ్ఖ ఘడియసేపే. ఆ తరువాత అతని కౌగిలింతలో అంతా మరచిపోయా.

## 12

### అతడు

ఆ హైకోర్టు చీకట్లో, ఆ దుమ్ము, ధూళి, ఆ సందడిగోళంలో, ఆ నల్లకోట్లు, తెల్లపాగాల హడావుడిలో శాంతం ఓ దేవతలా కనుపించింది. ఇద్దరం కలసి "మౌంటు రోడ్డు రెస్టరెంటు"లో భోంచేసి ఆంధ్రనాటకసంఘంవాళ్లు వేస్తున్న 'శశిరేఖ' నాటకం చూడ్డానికి వెళ్లేం.

నేనా కథగురించి యెప్పుడూ విన లేదు. అంచేత మొదటిమాటేమో, చూసేసరికి మహా బాగుంది. చాలా చమత్కారంగా ఆడేరు కూడాను. నాటకం అంతా మంచి తెలివిగాను, మనిషి నైజం మహా స్వభావికంగాను ఉంది కాని, నాటకం ఆడితే చూడ్డానికి మాత్రం అసహ్యంగాను, చూడకూడని విషయం చూస్తున్నాం, అన్నటువంటి బుద్ధిమాత్రం మనస్సుకి పుట్టింది. శాంతం ఉత్సాహం, వీరావేశం మరి చెప్పఖ్ఖర్లేదు! ఇంత శశిరేఖని, అది యెత్తిడం కాదు!

శశిరేఖలో గొప్పతనం ఉంటే యేంలాభం? తనసౌఖ్యం కోసం రామారావుని, తన్ను చేసికొన్న మొగుణ్ణి, తనతో లేచిపోయిన కృష్ణుణ్ణి, తన్ని ఉంచుకున్న సుందర్రావుని అందర్నీ పాడుచేసిందికదా! కొసకి తను చావడమెందుకో?

నా మనసులోమాత్రం కదలిక పుట్టించింది; వ్యాకులపెట్టేసింది. శాంతం మనసు నేం కలత పెట్టేస్తుందో నాకు భయం వేసింది. అందులో శాంతంది మహావేగిరం తిరిగి పోయే మనసు.

నేననుకున్నట్టే అయింది అంత మెత్తటి మనస్సు నేనెక్కడా చూడలేదు. ఈ సంగతి గురించి పూర్తిగా వాదించకపోవడం నాదే తప్పేమో! కాని ముఖం చూస్తే అలసిపోయినట్టుండేను. అందులో ఆఖరు అంకం మరీ పురెక్కించింది కాని, తను వాదన మొదలెట్టాక ఒకంతట వదిలింది కాదు. అవును, తనేం తెలియనిదీ, చదువురానిదీనా యేమిటి? ఇలాంటి సంగతులు గురించి ఆడది తెలియడం మంచిదికాదనే సరికి, రౌద్రం అయిపోయింది. ఇలాంటి సంగతుల్లో మొగాళ్ళకి అసహ్యం, చదువుకున్న ఆడవాళ్ళకి ఆసక్తి యెందుకో! మనస్సు నిర్మలంగా ఉంచకుండా ఇలాంటి విషయాలు తెలుసుకుని యెందుకు మనస్సుని కలంకం చేసుకోడం? మరి చదువుకున్న ఆడవాళ్ళ మనస్సంతే కాంపు! ఇంకా మీదుమిక్కిలి ధైర్యం తెచ్చుకుని వాదిస్తే, నిర్మలత్వం అంటే అజ్ఞానం ఆరోపిస్తున్నాం అనుకుంటారు ఏమో మరి? ఇలాంటివిషయాల్లో నా పెళ్ళానికి అమాయకత్వం, అజ్ఞానం ఉండడమే నాకిష్టం. కొంతమంది ఆడవాళ్ళు ఇలాంటి విషయాల గురించి మహా తెలుసని అరవడం నాకసహ్యం!

ఇంతెందుకు! నాకు తెలిసిన సంగతులు కొన్ని తెలియకపోయిఉంటే బాగుణ్ణనిపిస్తూంటుంది. మనస్సంటే యినప్పెట్టిలాంటిది. ఒకమాటు మనస్సులో దూరంగానే ఉద్దేశాలలా ఉండిపోతాయి. మర్చిపోదాం అంటే మర్చిపోలేంకదా - అవసరం లేనప్పుడల్లా పైకితోసుకొస్తూంటాయి. నా వాదనవిని నన్నొత్తి మూర్ఖుడికిందన్నా, పూర్వకాలపు వాడికిందన్నా కట్టేసిందనుకుంటాను. నామటుకు కూడా పూర్వకాలపువాళ్లు, ముసలికాలపువాళ్లు వాదించే వాదనల్లాగే అనిపించాయి. నా వాదనలు నాకే. కాని తనకి మహా తెలిసినట్టు గిరిజాభాయి గురించి చెప్పగానే, నాకు మాచెడ్డకోపం వచ్చింది.

తతిమ్మా ఆడవాళ్లు వాళ్ళిష్టంవచ్చినట్టు మాట్లాడొచ్చు కావలిస్తే ప్లాటుఫారం మీద కెక్కి అరవవచ్చు. కాని కొన్నిమాటలు మాత్రం శాంతం నోటమ్మట వొచ్చినా, కొన్ని సంగతులు తనకి తెలుసునని అన్నా నాకు పాముకుట్టినట్టుంటుంది.

ఇంతకీ లోకానికంతకీ తెలుసిలాంటి సంగతులు. మంచి విషయాలు తెలుసుకుందామని ఆతృత ఉండేవాళ్ళకన్నా, చెడ్డవిషయాలు తెలుసుకుందామనే వాళ్ళే హెచ్చుమందెప్పుడేనా. అలాంటి సంగతులే వింటామూ అనే కాచుకుంటారుచాలామంది. చదువూ, చట్టూలేని మూర్ఖురాలు తన పెళ్ళాంకావడం యెవరికీ యిష్టం ఉండదు. అలా అని చెప్పి, నడిబజారులో కబురు తన పెళ్ళాంద్వారా వినాలని యెవ్వరికుంటుంది?

మన మనస్సులో నిజంగా ఆలోచించి చూసుకుంటే వాళ్ళ ధర్మమా అంటూ, చాలామంది ఆలోచించుకోరు-చాలామంది పెళ్ళి-అంటే మనదేశంలో పెళ్ళిళ్లుకావు. సీమలో పెళ్ళిళ్లు-శాంతం, నేనూ చేసుకున్నలాంటి పెళ్ళిళ్లు-మొదటికారణం ప్రేమలో పడిపోవడం చేతచేసికోడం. రెండోకారణం యేదో కొత్తమోస్తరు సౌఖ్యం రుచి చూద్దామని చేసుకోడం, కొత్తమోస్తరు సౌఖ్యం అంటే మంచి మోస్తరు సౌఖ్యం అని.

ఏమిట్లో ఇవాళ దీనిగురించి యింత ఆలోచిస్తాం. ఓ సంవత్సరం, ఓ నెల అంతెందుకు ఓవారంపోయాక దీనిమాటే మర్చిపోతాం. అయితేనేం, ఇలా అనుకున్నంత మాత్రాన్ని మనస్సులోంచి యీ సంగతి పోకుండా ఉంది. ప్రతి సంగతిలోను, యిద్దరి ఉద్దేశాలు అచ్చుగుద్దినట్టున్నా చికాకే! అన్నింటికీ ఛెడ్, ఛెడ్ అనుకున్నా తంటావే. మరేదైనా రెండింటికి మధ్యస్థంగా ఉంటే బాగుండును. శాంతం, నేను ఎంతోంత అన్యోన్యాంగా వుంటాం. ఇలాంటి పనికిమాలిన సంగతేదో వస్తుంది. దాంతో వాదానికి దిగ్గానే దూరం అయిపోతూంటాం. మళ్ళీ శాంతం ఎవరితోనైనా వాదనారంభించితే నేను తప్పకుండా శాంతంపక్క వాదిస్తాను. మేం ఇద్దరం వాదించుకున్నప్పుడే వస్తుంది తంటా అంతా.

ఇద్దరం చదువుకున్నవాళ్ళం అవడంచేత కాంసు నీ తంటాలన్నీనీ !

## 13

### ఆ మె

శశిరేఖను నేను పొగిడేని శాస్త్రి చాలా బాధపడుతున్నాడు. నాలుగురోజులైతే నాతో సరిగ్గా మాట్లాడ్డంలేదుకూడాను. అతన్ని మళ్ళీ మామూలు ధోరణిలోకి తీసుకొద్దాం అని - సాయింకాలం ఇంటికొచ్చి ఫలహారం చేశాక — "శాస్త్రీ! నీ ఫోటో ఆల్బంలో మిగతా బొమ్మలు చూపించవు? నీ స్నేహితుల్నిగురించి వినాలనే వుంటుంది నాకు" అన్నా. ఇంగ్లండు వెళ్ళివచ్చిన వ్యక్తులకి వాళ్ళ అనుభవాలు చెప్పమంటే ఎంతో అంతా సరదాగా గంటలతరబడి చెప్తారు. శాస్త్రి వెంటనే; "ఓ తప్పకుండా! నా అనుభవాలు విని నువ్వు లేనిపోని అపోహాలుమాత్రం పడకూడదుసుమా! చేతిలో చెయ్యివెయ్యి!" అని-ఆల్బను తీశాడు...ఒక ఫొటో చూపించాడు...చక్కని ముఖం: కళ్ళలో ఎంతోవిచారం---బాధ కనిపిస్తూంది. ఆ పెదిమలు— ఆ ముకురు—చూస్తే మాత్రం గంభీరత—మనోనిశ్చయం—ఓర్మి—ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయి—అన్నా. అన్నాను కాని—బొమ్మ మరోమారు చూడును - ఆ అమ్మాయికి రెండుకాళ్లు కుంటి! శాస్త్రి ఆమెచరిత్ర చెప్పడం మొదలెట్టాడు: "ఎడ్నాకిప్పుడు పాపం పుట్టుకతోనే కుంటి. దానికితోడు తల్లిదండ్రులు గర్భదరిద్రులు - పదిమంది సంతానం. రాక్షసిబొగ్గు గనుల్లో పనిచేసి యేం సంపాదిస్తారు - పిల్లలనేంపోషిస్తారు ? ఎడ్నా కడసారిపిల్ల. అసలే దరిద్రం - అందులో కుంటిపిల్ల. ఎడ్నాని చూసి తల్లిదండ్రులు - అక్కచెల్లెళ్లు అందరూ విసుక్కుండేవారు. తినడానికి తిండిలేదు, కట్టుగుడ్డలేదు— మీదుమిక్కిలి మాటలుపడ్డం! వయసువస్తూన్నకొద్దీ జీవితం దుర్భరం అయిపోయింది ఆ అమ్మాయికి.

పదహారేళ్లొచ్చాయి. ఇహ ఇంట్లోవుండకూడదు. ఎల్లాగేనా యీ వాతావరణం తప్పించుకు బైటపడితే తరువాత చూచుకుందాం అనుకుంది. ఒకనాడు దినపత్రికలో "వధువు కావలెను." అని వక అడ్వర్ టైజుమెంటు చూసి-రహస్యంగా-తన వృత్తాంతం అంతా దాపరికంలేకుండా వ్రాసి - పోస్టులో వుత్తరంవేసింది. నాల్గురోజులయ్యాక ఒకతను వచ్చాడు. అతన్ని అంతదూరంవుండగానే తెలుసుకుంది - తన భవిష్యత్తే ఎదురుగా వస్తుందని... "సిరిరా మోకాలొడ్డిన" అన్నాను నేను అప్రయత్నంగా. శాస్త్రికి కోపంవచ్చి: "ఎడ్నాకి మోకాళ్లులేవు. అంతా వెటకారమేనీకు" అన్నాడు. "క్షమించు - ఎడ్నా!" అన్నా. శాస్త్రి నవ్వుతూను కధ సాగించేడు. మనిషి యెర్రగా బుర్రగా వున్నాడు. మంచి దుస్తులు వేసుకున్నాడు. మాటలు, చహరా నాజూగ్గా వున్నాయి. కాని యివన్నీ చూసిందా ఎడ్నా? ఈ ఇంట్లోనుంచి ఎలా బయటపడడమా అనే ఆలోచించిందేగాని,ఆసమయంలో ఏకుక్కతోక పట్టుకు నేనాసరే గోదావరిదాటుతే చాలుననుకుంది. ఆ కొత్తగావచ్చినవ్యక్తి తానెవరో చెప్పడానికని ఎడ్నా తనకు వ్రాసినవుత్తరమున్నూ,తనవిజిటింగుకార్డున్నూ ఇచ్చాడు. "విలియమ్ మేరివేల్ బెన్నెట్, ఎం. ఏ. ఆక్సుఫర్డు, లేబరేటరీ ఫోరుమేను, తగరపుగనులు, హెప్పిల్ ఫర్డు డివన్ షైరు" అని వుంది. కార్డుకూడా సరీగా చూసుకోకుండానే: "నేను సిద్ధంగా వున్నాను.-ఎప్పుడు ప్రయాణం?"అనిఅడిగింది."మరొక గంటన్నరలో దక్షిణాదికివెళ్ళే ఎక్స్ప్రెస్ వుంది. మనం వెంటనే బయలుదేరితే-తోవలో రిజస్ట్రారుఆఫీసులో పని పూర్తి చేసుకుని బండికి అందుకోగలం" అన్నాడు బెన్నెట్. ఎలాగేనా వొదిలిపోతే చాలు భగవంతుడా అని అనుకుంటూన్న తల్లిదండ్రులు ఏమీ అభ్యంతరం చెప్పలేదు. ఎడ్నా కొత్తసంసారం మొదలుపెట్టింది. బెన్నెట్టు బాగా చదువుకున్నవాడు. ఎడ్నా సహజంగా తెలివితేటలుగల మనిషి అవడంచేత - ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను, స్పానిషు, సంస్కృతం చక్కగా నేర్చుకుంది. లోకజ్ఞానం సంపాదించింది. మొత్తంమీద నాలు గైదు సంవత్సరాలు స్వర్గతుల్యంగా వెళ్లిపోయాయి ఎడ్నాకి. బెన్నెట్టుని మోహించక పోయినా అతనంటే కృతజ్ఞత హెచ్చయింది. అసలు వికలాంగి అవడంచేత అన్నిటికీ అతని మీదనే పూర్తిగా ఆధారపడింది. అతనంటే ఒకమోస్తరు ఆపేక్షకూడా పుట్టింది. ఇలా ఉంటూండగా రానురాను ఎడ్నా బజారుకువెళితే, ఎడ్నానిచూసి ఆవూళ్లోవాళ్లు గుసగుసలాడడం, హేళనగా మాట్లాడ్డం మొదలైంది. రాత్రిపూట బెన్నెట్టుగదిలో ఆడవాళ్లమాటలు, తెల్లవారకుండానే పెరటిదారిని ఇంటినుంచి ఎవరో రహస్యంగా వెళ్తూండడం జరుగుతూవచ్చింది. మరికొన్నాళ్లకి బెన్నెట్టు బహిరంగంగానే భోగంవాళ్లను ఇంటికి తీసుకురావడం మొదలెట్టాడు. ఒకనాడు ఎడ్నా ఏదోపనిమీద బెన్నెట్టుగదిలోకెళ్లింది. అతని బల్లమీద ఒక కాగితం కట్ట చూసింది. దానిమీద "నా స్వంత వ్యవహారాలు" అని బెన్నెట్టు వ్రాతతో వుంది. చప్పున ఆ కట్ట విప్పి చదివింది. తను యిదివరకే పెళ్ళాడినట్టు ఇతని చేష్టలు చూచి-మొదటిపెళ్ళాం మరొకడితో లేచిపోయినట్టూ-ఆమె ఫలానా వూళ్ళో వున్నట్టు-ఆమె తరువాత బెన్నెట్టువరుసగా

ముగ్గురు స్త్రీలని చట్టవిరుద్ధంగా అబద్ధపు వివాహం చేసుకుని మారుపేర్లతో సంసారం చేసినట్టూ-నెంబరు ఐదు' క్రింద ఎడ్నా పేరు-తను ఎక్కడెక్కడ ఎంతెంతమంది స్త్రీలతోను, భోగపు పడుచులతోను సంబంధం పెట్టుకున్నాడో-అందుకు ఎంతసొమ్ము ఖర్చుపెట్టాడో-కొందరివల్ల తనకి ఎంతరాబడి వచ్చిందో-పూసగుచ్చినట్టుంది. ఎంతపనైంది-అనుకుంది. తీవ్రంగా ఆలోచించింది. "నా అనేవాడు లేకపోబట్టేకదా నేను బెన్నెట్టువద్దిర పడున్నాను. నా కడుపున ఒకకాయ కాస్తే ఆ గుడ్డుని చూచుకుంటూ బ్రతకడానికి ఒక లక్ష్యం-ఒక ఆశ, ఒక బలం వొస్తుంది-లేకపోతే యీ బతుకు గట్టెక్కడం దుర్భరం" అని అనుకుంది. మనస్సులో నిశ్చయం చేసుకుంది. ఆరాత్రి బెన్నెట్టు దగ్గిర కెళ్ళింది. తెలుసుకున్న సంగతులన్నీ చెప్పి-తన కోర్కె-కూడా చెప్పింది... డేవిడ్ పుట్టాడు. ఆరోజునుంచీ-పక్కయింట్లోవున్నా-బెన్నెట్టు జీవితం, ఎడ్నాజీవితం వేరువేరైపోయాయి. మాటలు అసలు లేవు. నెలమొదటి తారీఖు వచ్చేటప్పటికి రెండుపౌన్లు ఎడ్నా బల్లమీదవుండేది. ఆ కుర్రాడిని చూచుకుంటూ-ఆ పుస్తకాలు చదువుకుంటూ-ఆ రెండు పౌన్లతో కాలక్షేపం. అలా ఆరేళ్ళు గడిచిపోయేయి... "గిరీశం బొంకులదిబ్బమీద ప్రవేశం-అన్నట్టు ఆ హెప్పెల్సు ఫర్డులో నువ్వు ప్రత్యక్షం అయావా యేమిటి-శాస్త్రి?" అన్నా నేను. "సరిగ్గా గ్రహించావోయి-మైడియ్యర్ షేక్స్పియ్యర్!" అన్నాడు శాస్త్రి...ఆసంవత్సరం ఎండాకాలం డివన్షైర్లో గడుపుదాం అని నేను హెప్పెల్స ఫర్డులో దిగి-ఎక్కడేనా సముద్రం పక్కన హోటేలుందేమో అని అలా నడుస్తున్నా. ఒక చిన్నయిల్లు కనిపించింది. ఇంటిముందు యేపిల్ చెట్ల నీడని ఇద్దరుస్త్రీలు కూచుని చదువుకుంటున్నారు. ఐదేళ్ళపిల్లడు ఒకడు పక్కగా ఆడుకుంటున్నాడు. వీళ్ళని అడుగుతే తెలుస్తుందేమో అని-దగ్గిరకెళ్ళి అడిగేను. ఒకమ్మాయి బొద్దుగా పొడుగ్గా వుంది-మంచి రూపురేఖలు-చేతిలో 'బాల్జాక్' ఫ్రెంచినవల చదువుతూంది. రెండో అమ్మాయి మరీ సుకుమారంగా లేకపోయినా-ముఖంలో వ్యక్తిత్వం కనిపిస్తుంది. చేతిలో రవీంద్రనాథటాగూరు "సాధన" వుంది. ముప్పైఏళ్ళ లోపువారే ఇద్దరూను. దగ్గర రోమారెండు డోక్ వ్రాసిన గాంధీజీవితం వుంది. నేదంతా చూసి ఆశ్చర్యపడ్డాను. నే అడిగిన ప్రశ్నకు జవాబు చెప్తూతూ సముద్రపొడ్డున హోటేలేదీ లేదు. ఇక్కడికైదు మైళ్ళలో తగరపుగనుల దగ్గిర ఒక హోటేలుంది అని ఆ ఫ్రెంచి పుస్తకం చదువుతూన్న అమ్మాయి అంది. నేను వెక్కి-తిరగబోతున్నా. ఆరెండో అమ్మాయి అడిగేకదా: "క్షమించండి-మీరు హిందువులా?" అని అడిగింది. "అవు"నన్నా. "శాకాహారులా?" అని మళ్ళీ ప్రశ్నించింది. తలవూపా. "మాఇంట్లో ఒక చిన్న గదివుంది. మేం చాలావరకూ అన్నమైపే కాలం గడుపుతాం. మీరుకూడా సరిపుచ్చుకుని వుంటే-మాయింట్లో వుండడానికేం అభ్యంతరం లేద"న్నాది ఆమె. "కృష్ణుణ్ణి-నన్ను శాస్త్రి అని పిలుస్తారు" అన్నా. "నాపేరు ఎడ్నా. ఈమె యెట్టీ-చిన్నప్పటినుంచీ స్నేహితులం. నా అబ్బాయి డేవిడ్." అంది ఆ కంటమ్మాయి. ఆ బీచి-ఆచిన్న యేపిల్ తోట-నాకు చాలా హాయనిపించింది. గదిఅద్దె, భోజనంఖర్చు

యీ డబ్బు ప్రస్తావన ఎలా తీసుకరావడం చెప్మా అని నేను తటపటాయించడం పోల్చి ఎడ్నా అంది. "యీ సముద్రం నేను త్రవ్వించింది కాదు. ఈ గాలి నేను సృష్టించింది కాదు. ఈ యిసుకతిన్నెలు నేను మేటవేయించింది కాదు; ఈ చిన్న ఆపిల్ తోట యీ నాలుగు పూలచెట్లదళ్ళు-యీ బంగాళాదుంప మడి-వీట్లని పెంచడంలో మాకు మీరు సాయంచెయ్యండి-ఫలితం అందరంఅనుభవిద్దాం." అంది ఎడ్నా ఎంతో అప్యాయంగా సాయంకాలం బెన్నెట్టుకనుపించాడు. ఎడ్నా పరిచయంచేసింది. "నా పెనిమిటి-విలియం బెన్నెట్టు: నా స్నేహితుడు శాస్త్రి." రోజులు చాలా సరదాగా వెళ్ళిపోయాయి-కొళాయినుంచి మంచినీళ్లు తీసుకురావడం– చిదుగులు ఏరడం– తేలికగా వంట – పుస్తకాలు చదువుకోడం– తోటపని–సముద్రస్నానం – చీకటిపడకుండా భోజనం– దీపాలు పెట్టకుండా పడక..." "ఇంటలెక్చువల్ జైనమతంలాగుందే" అన్నా నేను. "నీకన్నీ వేళాకోళాలే, శాంతం!"అన్నాడు శాస్త్రి. బెన్నెట్టు ఏ నాలుగైదు రోజులకో కనిపించేవాడు. నమస్కారం చేస్తే అందుకోవడం, ఏదేనా కావలిస్తే ఒక చీటీమీద వ్రాసి డేవీచేత పంపిస్తే దానిమీద జబాబువ్రాసి పంపించడం. అంతే – మాటా మంతీ మరిలేదు."

"మూగనోమా-మౌనస్వామా?" అన్నా నేను. "కథచెప్పనీ మరీ?" అన్నాడు శాస్త్రి.

బెన్నెట్టు నామీద చిరికన్ను వేసి, ఒక కంటితో కనిపెడుతున్నాడా అని మాత్రం నాకు అప్పుడు అనుమానంగానే ఉండేది. నెల్లాళ్లయింది, రెండు నెల్లయింది, మూడు నెలలయింది. ఎండాకాలం– తలుపులుతీసి పడుకోవడం నాకు అలవాటు. ఒక నాడు మామూలుగా ప్రొద్దున్నే ఏడుగంటలకే లేచాను. తలగడామీద ఇల్లుకూచి వాలిందనుకుని తీయబోయా. చూస్తే వుత్తరం మడతపెట్టివుంది. ఏమిట్రా ఈ చిత్రం? అనుకున్నా." "ప్రేమలేఖా, ప్రణయపత్రమా శాస్త్రీ? దాచిపెట్టినట్టున్నావు– నాకియ్యి" అన్నా. శాస్త్రి తన కోటుజేబులోనుంచి గిల్టు నోటుపుస్తకం తీసి అందులోనుంచి వక కాగితంతీసి, ఇదిగో, నువ్వన్న ప్రణయగీతిక చదువు" అన్నాడు.

"శాస్త్రిగారికి— విలియం మేరీవేల్ బెన్నెట్టు వ్రాయునది— ప్రియస్నేహితుడా! నా భార్య ఎడ్నాతో మీరు లేచిపోవాలంటే నాకెట్టి అభ్యంతరం లేదు. మీదుమిక్కిలి మీరల్లా లేచిపోతే మీకు నేను యావజ్జీవం కృతజ్ఞుడను. అసలు ఎడ్నా నేను ఆరేళ్లయి వేరుపడ్డాం. మీ అభీష్టం తెలియజేస్తే– సామానులు సర్దడంలోను, ప్రయాణసన్నాహంలోను నా శక్తివంచనలేక సహాయపడెదను. జబాబుకు ఎదురు చూస్తూన్నాను. చిత్తగించవలెను. భవదీయుడు, విలియం మేరీవేల్ బెన్నెట్టు, ఎం ఏ. ఆక్సుఫర్డు."

"ఇదేమిటి శాస్త్రీ! కథడ్డంగా తిరిగింది?" అన్నా నేను. కొంచం ఖంగారు పడుతూ— "నేనూ అలాగే అనుకున్నాను వుత్తరం చదవగానే— మహా కోపం

వచ్చింది. వెంటనే జవాబు వ్రాద్దాం అని కాగితం కలం తీశా... "నీకు అతి తొందర. ఓ శాస్త్రీ!" 'ఆలస్యం అమృతం విషం' అన్నాడు. ఆలస్యం చేయడంవల్ల విషం అంతా అమృతం అయిపోయిందట! ఆలోచించి నువు నాకు వ్రాసి వుండ కూడదూ?" అన్నా. "మహాపురుషులు ఒక్కలాగే ఆలోచిస్తారట! నేను అంతే చేశాను. ఆ సాయంకాలం జవాబువ్రాసి బెన్నెట్టు గదిలో పడేశా. ఇదిగో- నా జవాబు చదువు" అన్నాడు. నేను అతి ఆతృతతో అందుకుని తడబడుతూ చదివేను..."విలియం మేరివేల్ బెన్నేట్టుగార్కి - వల్లభజోస్యుల చిన్న చిదంబరశాస్త్రి వ్రాయు శుభలే ఖార్థములు: ఆర్యా! మీరు వ్రాయించిన జాబుకు వందనములు. మీ భార్య ఎడ్నాతో లేచిపోవడానికి నాకు ఏమాత్రపు ఉద్దేశము లేదు. ఇంతకీ ఎడ్నా మీ భార్య కాదని నాకు తెలుసు. మీ అర్థాంగి గ్వెండొలైను హాకిన్సు - ఛికాగో, 856 జప్ఫర్సన్ వీధిలో జిమ్ హంఫ్రీసుతో నివసిస్తూంది. మీ మూడో భార్య - డొరథీ ఫిల్కింగుటన్ - తన్ను మోసగించి, అబద్ధపు వివాహం చేసుకున్నందుకు మీ మీద క్రిమినల్ చర్య తీసుకోడాని కని కింగ్సు ప్రోక్టరును కోరింది; మీకీ సంగతి ఇంకా తెలియదనుకుంటాను. చిత్తగించ వలెను. విధేయుడు- వ. చి. చిదంబరశాస్త్రి వ్రాలు"........

"వహవ్వా. శాస్త్రీ! నీకీ మిడతంభొట్లు చేతిలో ఎల్లాచిక్కేడోయి?" అన్నా. "ఎడ్నాకూడా ఆ ప్రశ్నే వేసింది- మన్నాసు వుత్తరాలు చూపించీటప్పటికి" అన్నాడు. "అసలు నీకీ చరిత్రంతా ఎల్లా తెలిసింది? ఇంద్రజాలమా — మహేంద్రజాలమా — మోడివా — కనికట్టా — వీటాంటవేమైనా?" అని అడిగే. "ఏంలేదూ - హస్త లాఘవం! ఆవేళ బెన్నెట్టు పనిలోకి వెళిపోయిం తరువాత - అతని గదిలో కెళ్ళా - అతని బల్లమీద "నా స్వంతవ్యవహారాలు" అని అతని దస్తూరీతో రహస్యపు కాగితాలుంటే - అన్నీ తిరగేశా. అతని కథంతా తెలిసిపోయింది — గ్వెన్ హాకిన్స్ — జింహంఫ్రీస్‌తో లేచిపోయి, అమెరికా వెళిపోయిందని తెలుసుకున్నా. ఇంకేముంది. ఛికాగో పై విలాసమున్ను - డోరథీకేసు దాఖలు చేయబోతూందన్న విషయంవున్ను - వక అల్లికఅల్లే - ఆ పద్మవ్యూహంలో పడ్డాడు - శ్లేష్మంలోపడ్డ ఈగలాగ చిక్కు కున్నాడు" అన్నాడు....

"శాస్త్రీ! రేచుక్కంటే పగటిచుక్క; తిరుచనాపల్లి దొంగంటే తంజావూరు దొంగ; పులీ అంటే పులిమీద పుట్ర! నిన్ను చూస్తే భయంవేస్తూందోయి!" అన్నా.

ఎడ్నా నన్నూ, యెట్టీన్నీ, రెండురోజులు భయపడ్డారు - నేనూ భయపడ్డాను సుమా - చెప్పకేం. సరే మామూలుగా ఆ వారం అంతా గడిచిపోయింది. శనివారాది వారాలు వచ్చాయి. సోమవారం చూదుం? బెన్నెట్టు మాయం అయిపోయాడు! బల్ల మీద ఒక చీటీవుంది "ఎడ్నాకు - ఇవిగో - నూటఏభై పౌనులు - తీసుకో - ఇల్లూ లైబ్రరీ - దేవీపేట దానపత్రంకూడా ఇక్కడుంది ఈ ఉత్తరం నువ్వు చూసుకునే టప్పటికి నేను ఆస్ట్రేలియాకు సగందారిలో వుంటాను. విలియం మేరివెల్ బెన్నెట్టు

"అని వుంది. ఇంకేంవుంది ?" అన్నాడు శాస్త్రి "ఇంకేం వుండడంయేమిటి ? నువ్వు చెట్టుక్రింద ప్లీడరువుకాదూ-ఈ దానపత్రాలు సరిగ్గావున్నాయో లేదో చూశావా లేదా?" చూశానోయి తల్లీ! అవన్నీ అయాక నాలుగురోజులుండి, నేనూ లండను వెళిపోయాను.... "వల్లభజోశ్యుల చిన్న చిదంబర శాస్త్రీ - నువ్వు భలేవాడవోయ్!" అన్నా చేతులో చెయ్యివేసి. శాస్త్రి మహదానందం పొందాడు నామాటకి.

# 14

## అ త డు

శాంతంలో మంచి ఔచిత్యం వుంది. చక్కని ఇంగితజ్ఞానం వుంది. ఎటువంటి సన్నివేశంలోనైనాసరే-హాస్యరసం చటుక్కున ఆమె మనస్సుకి తట్టుతుంది. వూరికినే వేళాకోళం చెయ్యడం అని కాదు. ఒకరిని చులకన చెయ్యడం-ఒకరిమనస్సు నొప్పించేటట్టు హేళనచెయ్యడం-వెకిలితనంగా మాట్లాడ్డం-అది సులువే. ఆమెలో నాకు కనిపించేదేమిటంటే, ఎంత కష్టసమయంలోనైనా-ఎంతటి, ప్రమాదకరమైన పరిస్థితుల్లోనేనా, అన్నిసంగతుల్నీ హాస్యరసంతో పర్యాలోచన చెయ్యడం, నవ్వుతూనే ఎంతటి అపాయాన్నేనా ఎదుర్కోవడం-ఎంత, దుర్భరపరిస్థితులనేనా అవలీలగాను మందహాసంతో కొట్టుకురావడం-అదీ ఆమెలోవున్న విశిష్టత. ఎంతటి కారుమబ్బులకేనా తెల్లని అంచు వుండకమానదు. కాని ఆ స్నిగ్ధాన్ని చూడగలగడం, ఆ తెలుపుని చూసి నవ్వు తెచ్చుకోగలగడం-ఏకొద్దిమంది వ్యక్తులకోగాని వుండదు. నిన్న ఎడ్నాకథ చెప్పుతూంటే, ఆమెతో ఎంతో సానుభూతి కనపర్చింది; మళ్ళీ ఆ పరిస్థితులలో వుండే హాస్యవిశేషం కనిపించగానే దాన్ని తేలికగా తరచడం-నాకు మహా సరదాగా కనిపించింది. ఎడ్నాన్నూ శాంతంవున్నూ ఒకరనొకరు తెలుసుకోవలసిన వ్యక్తులు.

బెన్నెట్టుపోద తనకి ప్రేమలేక పోయాక, అతని చేష్టలు తెలిసికూడ అతన్నే తనపిల్లడి తండ్రిగా ఎందుకు ఎంచింది అని శాంతం ప్రశ్న వేసింది. నేనూ సరిగ్గా సమాధానం చెప్పలేకపోయాను. ఆవిషయం ఎడ్నా నోటంటే తెలుసుకుందాం అని అనేకసార్లు అప్పుడు అనుకున్నాను గాని చివరకి జంకి అడగలేకపోయాను. బెన్నెట్టుది మంచి స్వభావంకాదు, అని తెలిశాక అతనితో పూర్తిగా సంబంధం తెంచుకుని మరెక్కడికేనా వెళిపోయివుంటే-అతనిమీద భ్రమ పోయివుండును అన్నానేను. "ఎడ్నా ఏదో తప్పిదంచేసింట్టున్నా - పాపం ఆ నిమిషానికి ఏభ్రమలోనో, భ్రాంతిలోనో పడిపోయి అట్లా చేసిందీ అని నువ్వున్నూ, నీబోటి మొగాళ్లు అనుకోవచ్చు. నేనే ఆమెస్థానంలో

వుంటే, ఏం అనుకుంటానో తెలుసునా!' పిల్లలు కావాలని ఎలాగా నిశ్చయం చేసుకున్నాను. దారంట పోయేవాడితో నా కోరిక చెల్లించమని అడగలేనుకద! స్త్రీ కేం, పురుషుడికేం, సిగ్గు బిడియా సహజం. ఇంతకీ-'మొగాడి చెడు స్వభావం, పాడలవాట్లు పిల్లల కబ్బుతాయేమో ఏం బుద్ధి?'-అని భయపడడం అసందర్భం. తల్లిదండ్రులు తాత, ముత్తాతల యొక్క- శరీరలోపాలు-అంటే - తల వెండ్రుకల రంగు-గిరజాల జుట్టు - పిల్లి కళ్లు - రేచీకటి - అంటు జబ్బులు - ఈ పోలికలేనా "అచ్చే అవకాశమే" వంశ కపారంపర్యా వుండవచ్చు. ఇక స్వభావాలూ, గుణాలున్నా - పండితులకు శుంఠలు, ఆశ్రమ వాసులకి పోకిరీలు, ఉత్తమ కుటుంబాల్లో రాక్షసులు, దేముళ్ళకి రాకాసులు పుట్టడం అందరికీ తెలుసు. ఇంతకీ నా పిల్లలను పెంచడంలో బెన్నెట్టుకి ఎటువంటి ప్రసక్తి వుండదు. అంచేత వాళ్ళస్వభావంమీద అతడి తాకిడిగాని, వత్తిడిగానిఉండదు. ఆ భారం, ఆ బాధ్యత అంతా నాదే. అంచేత ఎన్ని విధాల ఆలోచించినా బెన్నెట్టుని కోరడమే సబబు, అని అనుకుంటాను" అని అంది. కళ్లు మూసుకుని దీర్ఘంగా ఆలోచిస్తూన్న శాంతాన్ని చూస్తే, ఆ మనస్సులో ఎంతటి నిశ్చలత్వం, ఎంతటి నిశ్చయం ఇమిడి వున్నవో కదా! - అని నా కనిపించింది.

కాని తనుకూడా ఆ పరిస్థితిల్లో వుంటే, ఏమైనాయినా సరే శాంతం మానంలంగల హిందూ స్త్రీ అవడం చేత, మరి అటువంటివాడి దగ్గిరనుంచి ఉత్తరక్షణంలో వచ్చేసి, పుట్టింటికో అన్నదమ్ముల దగ్గిరకో వెళిపోయి తలదాచుకుంటుంది. ఎడ్నా అంటే నాకెంతో గౌరవం. ఇప్పటికీ ఆమెను తల్చుకున్నప్పుడల్లా నాకెంతో సంతోషంగా వుంటుంది. కాని మన దేశం, మన నాగరికత వేరవడంచేత-శాంతం ఎడ్నాలాగు ప్రవర్తిస్తుందని ససేమిరా- నేను మాత్రం నమ్మలేను.-తను ఎన్ని ఖబుర్లు చెప్పినా. నేనేనా ఇంగ్లండులో ఎన్ని సంవత్సరాలు గడిపినా, నేను బెన్నెట్టులా ప్రవర్తించగలనా? మన సమాజం - మన సంస్కృతి - మన సాంప్రదాయం అసలు వేరు. ఆధ్యాత్మికంలోనూ ఆర్థికంలోనూ, లౌక్యంలోనూ - వాళ్ళ ప్రమాణాలు, మన ప్రమాణాలు పూర్తిగా వేరు. ఈ మాటే నేనన్నా. ఒక సంగతి చెప్తే. మా కోనసీమలో ఒక డిప్టీకలెక్టరుగారుండేవారు. బహుయోగ్యుడు. ముక్కుకు సూటిగా పోయేవాడు. కలక్టరు దగ్గిరనుంచి రివెన్యూబోర్డు మెంబరు దాకా కూడా ఆయనంటే గడగడాటూ గౌరవమున్నూ. పిత్రార్జితం నూరెకరాలు-ఇల్లూ - పాడి పంటా. ఐతే, ఆయన భార్య మాత్రం ఆయన్ని కాల్చుకు తినేది. ఇంట్లో సౌఖ్యం సున్న. మేం అంటూరం 'ఏంఖర్మం ఈయనకి - ఆవిడని ఏ కూతురి దగ్గరకో పంపెయ్య కూడదా? పుట్టింటిలోనే వుండమనకూడదా కొన్నాళ్లేనా?' అనుకునేవాళ్ళం. చిన్నతనం మాకేం తెలుస్తుంది? ఆయిన దేముడు కనక అలాగే సరిపెట్టుకు పోయేవాడు. పదిమంది పిల్లలు. అయితేనేం-వేదాంతి అవడంచేత లౌక్యంలోవున్నా, సంసారం అంటే విరక్తే ఆయనకి. గొప్ప కర్మయోగి. ఆయనంటే నా కిప్పటికీ గౌరవం.

"విరక్తి అంటే నేనొప్పుకోనోయ్!" అంది శాంతం. "నిస్సహాయత. అంతేకాదు. లౌక్యంలో సంచరిస్తున్నాడా-పరువు, మర్యాద, గౌరవం, ప్రతిష్ఠ ఆయనకి అవసరం.

తన స్వేచ్ఛ తనవ్యక్తిత్వం నిలబెట్టుకోవాలంటే, ఆవిడగారిని వేరు పెట్టెయ్యాలి. ఫలానావారు భార్యను వదిలేశారు అని అంటే-ఆయనకి అపకీర్తి కాదూ? తల యెత్తుకుని తిరగ్గలడా? ఇంతకీ- తరతరాల్నించీ వస్తున్న భావాలు మన్ని వదలవు. ఆవిడ దాడిని ఎదుర్కొని తనవ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడమా ? లేకపోతే ఆవిడకే లొంగిపోయి మర్యాద, గౌరవం నిలబెట్టుకోవడమూ?— అన్న మీమాంసలో ఆయనకి రెండవ మార్గమే సుళువు అనిపించింది. ఆ వేదాంతం, విరక్తిన్నీ తనకి తెలియకుండానే మేధావులు అవలంభించే ఆత్మవంచన—ఇంగ్లీషులో "ఎస్కేపిజమ్ అంటారు" అంది శాంతం.

"ఎడ్నా—బెన్నెట్టుల సందర్భంలో నాకొక సందేహం వుంది. పురుషుడు ఎంత క్రూరంగా వుంటే- స్త్రీ ప్రేమ అంత హెచ్చు అంటారు. దానికేం అంటావు?" అన్నా.

"నువ్వింవాక సోమయాజులుగారు సోమిదేవమ్మగారి కథ చెప్పావా: నే చెప్తా విను-ఆదెమ్మ - ఆదినారాయణ కథ. మనం ఆళ్వారు పేటలో వున్నప్పుడు - మనింట్లో లక్ష్మి అని పనిమనిషి వుండేది. నీకు జ్ఞాపకం వుందో లేదో. ఆదెమ్మ దాని కూతురు. పిల్ల పద్దెనిమిదేళ్ళది- దబ్బపండు ఛాయ - మంచి యేపరి. మూడో ఫారం వరకూ చదివించింది. ఒక మోటారు మెకానిక్కుకిచ్చి పెళ్ళి చేసింది. నాలుగు నెలలు హాయిగా వున్నారు. అక్కడనుంచి ఆ ఆదినారాయణ రోజూ తాగి ఇంటికి రావడం — రాత్రి ఒంటిగంట రెండు గంటలికి పెళ్ళాన్ని పట్టుకు చావబాదడం, అది మొర్రో అనియేడుస్తూ తల్లి దగ్గిరికి రావడం. తల్లి దాన్ని ఓదార్చి మందూమాకు రాసి తిండి పెట్టడం. మళ్ళా సాయంత్రం అయ్యేసరికి, ఆదెమ్మ వాడిదగ్గిరికి పోవడం, తాపులు తినడం, పుట్టింటికి రావడం. రాత్రిపూట మళ్ళీ ఆదెమ్మ-ఆదినారాయణ దగ్గిరికి-యథాప్రకారం. ఇలా జరుగుతూంది. లక్ష్మి రోజూ నా దగ్గిరకొచ్చి సొద, "ఎంతచెప్పినా వినదమ్మ. వాడిదగ్గిరికి వెళ్ళడం ఎందుకు? దెబ్బలు తినడం ఎందుకు? ఏ కలో గంజో-మాతోకూడా తిందువు గాని, వచ్చి వుండిపో అంటే; 'సరే' అంటుంది. మళ్ళీ ఆ సాయంత్రం అయేసరికి, వాడేం మందు జల్లేడో, మళ్ళీ వాడి దగ్గిరికే తయారు. ప్రాణం విసిగి పోతూందమ్మా- వాణ్ణి వొదిలేయదు; మా దగ్గిర వుండదూ. దానికేదేనా బుద్ధి చెబుదురూ అమ్మా". అంటూ నాదగ్గిర మొర్ర. "అయ్యగారి దగ్గిరకివెళ్ళి చెప్పవే - ఆయన సలహా ఇస్తారూ" అన్నా. "అయ్యగారి దగ్గిర కెందుకమ్మా! ఒతురు తెరవు పుస్తకంలో వుంటుందమ్మా!? శాస్త్రులుగారు పుస్తకాలు తిరగేసి సలహాయిస్తారు. మీకైతే ఆడంగులు. కష్టం సుఖం మీరు తెలిసినవారు కనక మనసిచ్చి మాట్లాడుతారని నా ఆశ—అమ్మా" అంది... 'ఇలా వుంది ట్రోయి నా గురించి నిజంగాను? దీనిల్లు బంగారంగానూ?' అన్నా నేనుఆశ్చర్యపడి. "సరే అని ఆదెమ్మని రమ్మని ఖబురుచేస్తే ఒకనాడు వచ్చింది. 'రా-కుచో' అన్నాను. కాఫీ, ఫలహారం ఆమెతో నేను కూడా తీసుకున్నా. నింపాదిగా అడిగా: 'పోనీ-మీ అమ్మదగ్గిర కొచ్చేకూడదా? లేదూ మాయింటికి వచ్చేయి. అతను నిన్నింత అనాదరణ చేస్తూంటేనూ,' అన్నా. ఏమంది తెలుసునా శాస్త్రీ? "శాంతమ్మగారూ - చాలా వందనాలమ్మా మీ ఫలహారానికీ! మన పెరటి వీధిలో పంతులుగారున్నారు. ఆయన భార్యా సాక్షాత్తూ గౌరీదేవి. అటువంటామెను ఆయన రోజూ పటకొట్టడమా, తిట్టడమా, చివరకి వాతలు

పెట్టడంకూడాను. నేను నా కళ్ళారా చూచాను. ఆమెకుకూడా మీరీ సలహాలివే యిద్దరూ!" అంది. నేను నిర్ఘాంత పడిపోయాను. ఆదెమ్మ అంది: "క్షమించండమ్మా! కొడుతూ తిడుతూంటే, ప్రేమ, మోహం ఒక్కనాటికి నిలవ్వు అమ్మా! అయితే – ఆడపీనుగులం ఎక్కడికి పోగలమమ్మా డబ్బులేక ఒకరిమీద ఆధారపడిం తరవాత? తల్లి తండ్రులకి, తోబుట్టువులకి – మీలాంటి స్నేహితులకీ కూడా బరువై పోతాం! స్త్రీజాతి బతుకే అంతయి పోయిందమ్మా! అతని దగ్గిరపడి అతనికి వుపచారం చేస్తూ వుంటే, ఎంత కొట్టినా, బతుక్కి ఒక నీడ వుంటుంది. లేకపోతే అందరూ ఆడదాన్ని చులకనచేస్తారు. అందులోకీ – వీధిలో పెట్టేది మన ఆడవాళ్ళేనమ్మా! డబ్బుకోసం ఒకరిమీద ఆధారపడకుండా వున్నామా – మన బతుకు మనం బతుకొచ్చు!" అంది. "అమ్మా, అమ్మా! అంత తెలివి తేటల్లా వచ్చాయేమోయ్ – పని మనిషి కూతురికి?" అన్నా నేను. శాంతం అంది: "మీరందరూ చేసేతప్పు అదే. ఈ నాడు స్త్రీ అన్న దానికల్లా ఇదే సమస్య. కోటీశ్వరుడి భార్యే కానీ, కూలిచేసుకుని బతికే ఆడది కానీ, నాలాంటి ప్రొఫెసరు కానీ- స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోయేకంటె వురిపోసుకుంటే మేలు!" అంది. "అయితే, మనుధర్మ శాస్త్రం, మితాక్షరం, భారత చరిత్ర, ఆర్యసాంప్రదాయం అంతా మార్చేయమంటావమూ! ఆడవాళ్ళకి కూడా పిత్రార్జితం రావాలంటావు?" అన్నా నేను నవ్వుతూ. "దానంతట అదే వస్తుందిలే!" అంది శాంతం. "ఈ జగన్నాథరథం – దానంతట అదే కదుల్తుందంటావా! అయినా – "లా" మార్చడం, చాలా కష్టం. ఎన్నో చిక్కులున్నాయి. ఎంతో ఆలోచించి చెయ్యాలి అన్నా. "లా" ఒక గాడిద అన్నాడు ముసలితాత సాక్‌వెల్లను. బారిష్టరుగారూ, జ్ఞాపకం వుంచుకోండి" అంది శాంతం-నవ్వుతూను నన్నో వెట్టునెట్టి! ..ఆమె నవ్వు మాయం అయిపోయింది. కళ్ళలో గొప్ప తేజస్సు. గొంతుకలో తీక్షణం. మాటల్లో ఉత్సాహం "ఈ మహా రథాన్ని నడిపిస్తూన్నది క్రూరమైన ఆదిశక్తి. రథం కదిల్తే భూమి చలించిపోతుంది చక్రాల కింద కోటానుకోట్ల కళేబరాలు. రథ చారలు రక్తధారలు. ధనం ధర్మం ధ్వంసం! కొత్త దేముళ్ళు, కొత్త ధర్మాలు, కొత్త సత్యాలు! నూతన మానవుడు నూతన ప్రపంచం నూతన ధనం! రామరాజ్యం, సర్వం శ్రీ జగన్నాథుం!" అంది... నేను యెరగని శాంతం! ఆమె మాటలు విని నాకు భయం వేసింది...

## 15

### ఆమె

శాస్త్రి ఎవరినేనా సులభంగా నమ్మేస్తాడు. అంత మడుసుదనం మరేమైపోతుందో! వారం రోజులై చూస్తునేవున్నాను. మనిషి బెంబేలెత్తిపోయున్నాడు – బేల చూపులు – ముఖంలో రక్తంలేదు – అన్నం సాయించకపోవడం – మాట చెబితే పరధ్యాన్నం – చిన్న చప్పుడికే తుళుక్కుపడడం – అన్నిటిమీద విరక్తి. రోజూ అడుగుదాం అనుకుంటూనే రోజ్రోజు కారోజే మర్చిపోతూ వచ్చాను. ఈవేళ మరి

కడుపులో దాచుకోలేక చెప్పేడు పాపం! చెప్పుతూన్నంతసేపూ కళ్ళంట ఏకధారే - గొంతుకంట మాటలు తడబడడం! జవిళి వ్యాపారస్థుకు రంగయ్య శెట్టికీ శాస్త్రికీ చాలా స్నేహం అని నాకిదివరకే తెలుసు. రంగయ్య చెట్టి బ్యాంకిలో పదివేల రూపాయిలు అప్పు తెస్తే అందుకు తను జామీను వున్నాడుట. రంగయ్య వాయిదాలు కట్టకపోతే బాంక్కీవాళ్లు శాస్త్రి ఖాతాలో జమవున్న పన్నెండు వేలూ అసలు వడ్డీల కింద వసూలు చేసేసుకున్నారుట. గోరుచుట్టుమీద రోకలిపోటులాగు వాటాలదళారీ గిరిధారీదగ్గిర శాస్త్రి పదివేలు దాచుకున్నాడుట. అతను కాస్తా శాస్త్రి తాలూకు సొమ్ము వాడుకుని కిందటి నెల దివాళా తీశాడుట. "నేనింక యే నుయ్యో గొయ్యో చూసుకోవాలి - శాంతం!" అంటూ యేడవడం మొదలెట్టాడు. శాస్త్రి మాటలువిని నాగుండె ఒద్దలైపోయింది. నేను కాస్త ధైర్యం తెచ్చుకుని: "ఇంతేనా? ఇంకా యేం ప్రమాదం జరిగిందో అనుకున్నాను. దీనికే నువ్వింత అధైర్యపడిపోతే యెలాగు? నా ప్రావిడెంటు ఫండు ఐదువేలూ - అమ్మనాకు పెళ్లినాడిచ్చిన పదివేలూ బ్యాంకిలో నాపేర అలాగేవున్నాయికదా. ప్రధానంనాడు నువ్వు నాకిచ్చిన వజ్రాల దుద్దులూ ముక్కుపుడక కెంపులగాజులూ ప్లాటినం వుంగరం - పెళ్లికి నువ్వు చేయించిన నగలు - అవి అన్నీ మొత్తం యెంతలేదన్నా మరో పదివేలుంటాయికదా. ఇంత డబ్బూ మనం యేంచేసుకుంటాం? దీనిలో పదోవంతు లేనివాళ్లు ఎంతమం దున్నారుకారు? వాళ్ళం దరి ముందూ మనం కోటీశ్వరులమే!" అన్నా. "అసలు మనకీ పెద్దకారు అనవసరం. ఇప్పుడు దాన్ని అమ్మేసి - నెమ్మదిమీద 'బేబీ ఆస్టిను' కొనుక్కోవచ్చు. నాలుగు రోజులు కష్టంగా గడుపుకుంటే - ఆ తరవాత రెండు పెద్దకేసుల్లో నువ్వు సంపాదించి పారేస్తావు!" అన్నా. "యీ బంగాళా -" అని తడబడుతూ అన్నాడు. "లింగు లింగుమని మనం ఇద్దరం - యింత పెద్ద బంగాళా మనకి ఎందుకని నేను రెండు మూడు నెలలై అనుకుంటూనే వున్నాను. చిన్న యిల్లే మకి యిమ్ముగానూ సదుపాయంగానూ వుంటుంది. మొన్న నెవరో సినీమావాళ్లు బంగళా అద్దెకిస్తారా అంటూ వచ్చారు" అన్నాను. "నిన్ను చాలా అన్యాయం చేశాను. నన్నెప్పటికేనా క్షమించగలవా - శాంతం?" అంటూ నా రెండు చేతులూ పట్టుకుని తన కళ్ళకద్దుకున్నాడు. "అదేమిటా పిచ్చి మాటలు - శాస్త్రీ? నువ్వు నాకూ - నేను నీకూ వుండగా - మనకేం లోపమోయ్!" అన్నా ... రాత్రి యేమీ తినకుండానే పడుకుంటానన్నాడు. సముదాయించి వెండి గిన్నెలో యింతచారూ అన్నం మజ్జిగా అన్నం పిసికి బలవంతం చేసి పట్టేను...

పొద్దున్న శాస్త్రిని కచేరీకి పంపించేసి-చేతినిండా పని కలుగజేసుకుంటేనే గాని ధైర్యం నిలబడదని ఆ సినీమా వాళ్ళకి టెలిఫోనుచేసి వెంటనే యిల్లు చూడడానికి రమ్మన మన్నాను. నాలుగు కార్లమీద వచ్చారు. ఇద్దరు తారలు. తారల వెంట తోక చుక్కల్లాగు - డైరెక్టరూ స్టూడియో ప్రొప్రయిటరు! వారితోకూడ వందిమాగధులు భట్రాజులూ, పరివారమున్నూ. బంగాళా అంతా మూలమూలలా చూసేశారు. ఇంట్లో అమర్చిన కుర్చీలు సోఫాలూ మేజాలూ తివాచీలూ దీపాలూ-అన్నిటినీ తనిఖీచేసేశారు.

తారలూ సూర్యచంద్రులూ నిలువుటద్దాల్లో ఒకరి నొకరు చూసుకుని అదే మురిసి పోవడం - నన్ను ప్రేక్షకజనం కింద కట్టేశారు! తన్మయంగల గ్రహాలందరూ మంచాలూ సోఫాలూ 'స్ప్రింగులు' పచ్చుచూడడానికి వాటిమీద గభీగుభీమని గంతులేశారు. అయ్యో! యీ నాజూకు వస్తువులని కష్టపడి చేయించుకున్నామే. యీ మోటు మొగాళ్ళకి అద్దెకివ్వడమా - అని నాకు యేడుపు వచ్చింది. వస్తువులమీద ఇంత వ్యామోహముండకూడదని పించింది. సామానులతో సహా అద్దె రెండువందలరూపాయిలకినిర్ణయించి రేపే దిగేటట్టు యేర్పాటుచేసి ముందుగానే నెల అద్దె రొఖ్ఖం వసూలు చేసేశాను. నౌకర్లందరికీ నెలరోజుల వ్యవధి యివ్వకుండా పని-మానిపించేస్తున్నందుకు నెలజీతం అదనంగా యిచ్చేశాను. తాజా: కారుకూడా అమ్మేశాం. తిరువళిక్కేణిలో మేడ భాగం అద్దెకు తీసుకున్నాం - నలభైరూపాయిలకి. శాస్త్రి కోర్టునుంచి మధ్యాహ్నం కొత్తయిల్లు చూడడానికి వచ్చాడు టాక్సీమీద - టాక్సీవాడికి రూపాయి యినాం ఇచ్చాడు! భారీతనం అలవాటైపోయాక మానుకోవడం మహాకష్టం! మేడభాగంబాగానే వుంది. ఎలెక్ట్రిక్కు దీపాలు లేకపోయినా మేడమీద కుళాయివుంది - అదే పదివేలు. క్రింది భాగంలో ఇంటివాళ్లున్నారు. చేపాకులో గుమస్తా. బ్రాహ్మణకొంప - అంతేచాలు!...

సాయంకాలం ఆంతా యిల్లు సర్దుకోవడంతో సరిపోయింది. పాపం శాస్త్రి క్లబ్బుకి వెళ్లలేదు - కాఫీపెట్టుకు తాగాం. శాస్త్రి చకగాజుగిన్నె పళ్లెం యెత్తేశాడు. నేను ఉప్మా తిరగ బెట్టేశాను. రాత్రి మరి వంటచేసుకోలేదు. శాస్త్రి బాపట్లహోటలు నుంచి భోజనం తెచ్చాడు. "శాస్త్రీ! అజ్ఞాతవాసంలో వుండి కందమూల ఫలాలుతిని గాలిమీద బతకొచ్చుకాని-యీ ఖారం తినిబతకలేంవోయ్!" అన్నా. అప్పుడు జ్ఞాపకం వచ్చింది - అమ్మయిచ్చిన అలమంత అంటుమాడి తాండ్రమాట. కావిడిపెట్టెతీసి సీసాలోనుంచి రెండు తాండ్ర అచ్చులు చప్పరించాం. "అజ్ఞాతవాసం ఇప్పుడు బాగుం దోయ్- శాస్త్రీ! సీతారాములు - ద్రౌపదీ పాండవులు - నలదమయంతులు — ఏం. యే వ్యాసైన స్త్రీ.." అంటున్నాను "..దమ్మిడీలేని బారిష్టరు!"అని పూర్తిచేశాడు శాస్త్రి. ఇద్దరు నవ్వుకున్నాం... "చల్ మోహనరంగా-నీకు యెవ్వారులేరు-నాకూ యెవ్వారు లేరు" అని కలిసి నవ్వుతూ పాడుకున్నాం. నవ్వడానికి శక్తివుంటే ఎంతటి కష్టాల నైనా ఆడుతూ పాడుతూ ఎదుర్కోగల మనకున్నాం.

## 16

## అతడు

నేను సీమలో వున్నప్పుడు మాతో యూనివర్సిటీలో చదువుకుంటూన్న ఆడ పిల్లలనీ, కచ్చేరీలలోనూ అంగళ్లలోను పనిచేస్తూన్న స్త్రీలనీ చూసి: "వీళ్లెప్పుడేనా పెళ్లిళ్లు చేసుకుంటారా? చేసుకుంటే సంసారాలు చేసుకోగలరా?" అని అనుకూనే

వాడిని. వాళ్ళతో మాటాడినప్పుడుకూడా: "మీరు స్వతంత్రం మరిగినవాళ్ళు. మగవాడికి సేవచెయ్యడం - పతిని దైవంగా పూజించడం - పిల్లలని పెంచడం - కాపురాలు చక్కబెట్టుకోవడం - మీకెక్కడ చేతనవుతుంది?" అని అంటూండే వాడిని.

ఆ అభిప్రాయం మార్చుకోవలిసొస్తోంది. పరీక్షలు ప్యాసవడంలో నాకేం తీసిపోలేదు శాంతం. అయినా - ఆ కూడిక చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. వెంటనే ఒంగాళా అద్దెకిచ్చేసింది. నౌకర్లకి జీతాలిచ్చేసింది. కారు అమ్మకం కోసం పత్రికలో ప్రకటన వేయించింది. ఏమి చకచక! ఒక్క చకచకేనా? ఆ ధైర్యం - ఆ ఔదార్యం - ఆ శాంత చిత్తం - ఆ గడుపుకోవడం - అన్నిటికంటే విశేషం ఆ సంతోషం - అంతకంటే ఎన్నదగింది ఆ హాస్యరసం! నిజంగా నా అంతటి అదృష్టవంతుడు మరి యీ ప్రపంచంలో వుండడు!

రోజూ శాంతంతో చెబుదాం అనుకోవడం - తీరా నోటివాకూ వచ్చేసరికి - ఆవిడ నవ్వు ముఖం - కొంటె చూపులు చూసేసరికి - ధైర్యం చాలక - నోరు రాక - రేపు చెబుదాం అని వాయిదా వేసేవాడిని. ఇంకెన్నాళ్ళు దాపరికం? - ఆలస్యం చేస్తూ స్నొద్దీ వెనక వేసుకున్న ఆ కాస్త డబ్బూ అయిపోతే ఇకనేందారి? - అని నిన్న చెప్పేశా. ఆవిడతో చెప్పగానే సగం బెంగ తీరిపోయింది. కాని, నన్నేం తిడుతుందో - యేం నిష్ఠూరాలాడుతుందో అని వుత్తరక్షణంలో భయంవేసింది. నేను చెప్పింది విన్న మీదట - ఒక్క పల్లెత్తు మాటకాని - వక సాధింపు కాని - వక దెప్పడం కాని - వక ముఖం చిట్లించుకోవడంకాని లేదు - రామ రామ! మీదు మిక్కిలి - నా మనస్సేం చిన్నబోతుందో అని - అరమరిక లేకుండా నాకు ఉపచారం! నేనెప్పటికేనా యెన్ని జన్మాలకేనా శాంతం రుణం తీర్చుకోగలనా అనిపిస్తూంది. ఆమె ప్రేమ తల్చుకుని ముగ్ధుడనై పోతున్నాను!

కారు అమ్మకం నిశ్చయం అయిపోయింది. నిన్న సాయంకాలం ఆఖరుసారి కారులో కాసీమోడునుంచి - రాయపురం - మెరీనా - మైలాపూరు - శాంథోము - అడయారు షికారెళ్ళాం. అన్నిటికంటె - కారు వదిలిపెట్టడం అంటే - కడుపు తరుగుపోయి - కళ్ళంట నీళ్ళొస్తున్నాయి. గుర్రంమీద రౌతుకుండే ప్రేమ - ఏనుగమీద మావటీకుండే అపేక్ష - స్వంతంగా నడుపుకునేవాడికి తనకారుమీదవుండే వ్యామోహం - పెళ్ళాంపిల్లలమీదకూడా వుండదేమో అనిపిస్తుంది! కారు నడుపుతూవుంటే - నా చిత్తం కనిపెట్టి - నన్ను మెప్పించడానికి యెలా పరిగెడుతూందో - ఇదికూడా ప్రాణం ఆత్మల వ్యక్తేకాను! - "శభాష్ - బాగా పరుగెత్తావ్ - మిగతా కార్లతో పందెం గెలిచి - నీ యజమాని పరువు నిలబెట్టేవు!" అని దువ్వాలనిపిస్తుంది! కారుమీద వ్యామోహమా - లేకపోతే కారుమీద యెక్కితే వచ్చే దర్జామీద మోహమా? ఏదైతేనేం - నేను కష్టపడి సంపాదించిన సొమ్ముతో - చచ్చువాయిదాలమీద కాకుండా రొక్కంపోసి కొనుక్కున్నాను. నాలుగైదేళ్ళ 'ప్రాక్టీసు' వున్నవాడు ఎవడు కొనుక్కోగలిగాడు? రేపటినుంచీ కారులేకపోతే కాళ్ళుకొట్టేసినట్టుంటుంది!

రెండు పెద్దతోలు పెట్టెలూ – కోర్టు కాగితాల మూటలు మూడూ – బంగాళాలో వుండిపోయాయని – వాటిని తెచ్చుకోవడానికి వెళ్లేం. గుండేసినా టాక్సీ దొరకలేదు. కారు వున్నప్పుడే తెచ్చుకునివుంటే తీరిపోను – ఇప్పుడు జట్కాలో వెళితే నామోషి. మౌంటురోడ్డువెళ్లి టాక్సీ తీసుకొస్తానన్నా – శాంతంతో. "టాక్సీ మీద వెళ్ళకపోతే మనకా సినిమా తారలముందు చిన్నతనమా యేమిటి? జట్కామీద పోదాం!" అంది. ఈ చినుకుల్లో అట్టు చీరతో జట్కా యెక్కితే – మళ్లీ శాంతం ఆచీర కట్టుకో అక్కర్లేదు! రోడ్డు చితచితలాడుతూంది. అందుకు సాయం – అప్పుడే బడినుంచి పిల్లలు వెళ్లిపోతూ ఆ బురదనీళ్ళల్లో ఆడుకున్నారు. ఆ సమయానికే ఎవరిదో చావుబాజా జేగంట. పేలాలు దమ్మిడీలు జల్లుతున్నారు. వాటిని యేరుకోవడానికి అనంతశయనం వెంట పిల్లలు' కాళ్లలోపడుతూన్న పిల్లలిని తప్పించుకుంటూ జట్కా యెక్కుతూండగా – పక్కనుంచి బర్రుమని పెద్దకారు – రోడ్డు బురదంతా నా తెల్ల పంట్లాంమీద విరజిమ్మింది. యీ కార్లవాళ్ల అట్టహాసం మహాంభావమున్నా! రహదారీ అంతా వాళ్లే స్వంతం అనుకుంటారు. వాళ్లకంటికి సామాన్య ప్రజ కానరారు కాబోలు! యీ బురద గుడ్డలతో వేషం వేసినట్టున్నాను. గలీజు నేరంమీద వీళ్లని సమ్మరీగా శిక్షించి అరదండాలు వేసినా పాపంలేదు. శకున మేమీ బాగులేదు...

సంపన్న బ్రాహ్మణ్ని జోలకట్టి వూపడానికైనా జాగాలేదు యీయింట్లో. పైవూళ్లనుంచి 'పార్టీ' లెవరేనావస్తే వుండమనడానికి గాని – స్నేహితులని పిలిచి యింత ఫలహారం పెట్టడానికి గాని – అన్నిటికీ వక్క నాకపేరీగదే! "ఈమేడ భాగంమీద – వక్క దీపంతో – న్ని గదులకీ వెల్తురొస్తుంది – ఎంత సదుపాయంగా కట్టించానో చూడండి!" – న్నాడు యింటి యజమాను. అవును – నిన్నరాత్రి ఆవక్క దీపం వెలిగించేసరికి శాంతం చేతులమీదా చీరమీదా కిరసనూనే! శాంతం చీవాట్లు పెడుతూంది– వూరికే దీపం వెలిగించి కిరసనూనె దండుగ పెడుతున్నానని! కొత్తగా ఆడపిల్లలకీ మొగపిల్లలకీ కలిసిపెట్టిన కాలేజీలో ప్రొఫెసరుపనికి దరఖాస్తు పెడతానంటూంది – కాలేజీ కుర్రాళ్ల కళ్లూ తోడి ఉపాధ్యాయుల చూపులూ శాంతంమీద పడటం అంటే నాకేమిటో అఘాయిత్యంగా వుంటుంది. పెళ్లి 'సుమోక ముందెలాగున్నా – పెళ్లయాక మాత్రం నాకేమిటో సుతరాం మనస్కరించడం లేదు. మేం లండనులో చదువుకుంటూన్నప్పుడు – మిసెస్ వైటు "రికార్డో శిస్తువాదం" గురించి పాఠాలు చెప్పేది. మంచి సౌందర్యవంతురాలేమో – ఆవిడని చూస్తూంటేనే మాకు సరిపోయేది – ఆవిడ చెప్పేది మా చెవుల్లోకి వెళితేగద! పాఠం అయిపోగానే యేదో వక మిష పెట్టుకుని మగపిల్లలందరం ఆవిడే చుట్టూ చేరేవాళ్లం!......

శాంతం అంటూంది: "నేనంతటి అప్సరసని కానోయ్ నాయనా!". "ఊర్వశి – మేనక – తిలోత్తమ – గజ కన్యకలని కలిపి కరగబోసి అచ్చువేసిన పసిడి బొమ్మవి – నువ్వు!" అన్నా. శాంతం నవ్వుకుంది "ను-వ్వు-ఊ-ద్యో-గం-చె-య్య-డం-నా కి-ష్ట-ం-లే-దు!" అన్నా.

"ప్రాణనాథా! నీ ఆజ్ఞనే సిరసా వహించెద!" అంది...పాపం! నామాట తీసెయ్యేదు. నిజంగా హిందూ స్త్రీకి పతి అంటే దైవమే కదా!

## 17

### ఆ మె

రోహిణీకార్తి. నిప్పులు రాలుతున్నాయి. యీ ఎండలకి తోడు - యీ అద్దె కొంపల్లో ఆవకాయ పెట్టడం వకటి. నాకీ-చీదర-చికాకు-నీరసం-నిస్త్రాణ-ఈ యెండల నుంచే. వీధిలో గొల్లు చెవిని పడితే అసహ్యం. కిందవున్న పిల్లల యేడుపు వింటే అసహ్యం. కంటి మెడ రవికెలు - పెసరకాయ కట్టు అంటే అసహ్యం. ఎదుటింట్లో పాడుతూన్న సంగీతపు పెట్టె వినడానికి అసహ్యం. శాస్త్రికి మేజోళ్లు 'నెక్టయిలు' అల్లడం అంటే అసహ్యం. మాసిన బట్టలు మూటకట్టడం అంటే అసహ్యం. వంటంటే అసహ్యం. వడ్డించడం అంటే అసహ్యం తిండి తిన్నాక ఎంగిళ్లు పెట్టడం అంటే పరమ అసహ్యం. చాకిరీ చేసుకుని చేసుకుని యేడుపోస్తూంది. ఆడ జన్మ ఆయాక తప్పుతుందా మరి?...ఎందుకు తప్పదూ?...ఎలా తప్పుతుంది?...ప్రపంచం తల్లకిందులై తప్పుతుంది!...ఆ ప్రయత్నంలో మనమే తల్లకిందు లవుతామేమో?....అవుతే అవుతాం... అబ్బ! కడుపులో వున్న మాట కాగితం మీద పడగానే కాస్త నయంగా వుంది!

...సామాను తెచ్చుకోవడానికి మొన్న బంగాళాకి వెళ్లినప్పుడు నా తోలు పెట్టెమాట జ్ఞాపకం లేకపోయింది. ఆవేళ ముసురు వకటి. చీకటికూడా పడిపోయింది. జట్కా- అబ్బి బండికి దీపం లేదని వచ్చే సేవరకు నిలవనిచ్చాడుకాదు. మా సామానంతా కొట్టు గదిలో పడేసుకుని తాళం వేసుకున్నాం. తోలుపెట్టెలో వున్న చీరలని పురుగులో కొట్టేస్తాయో - పెట్టెకి చెదేపట్టునో - యెలకలే కొరికేస్తాయో అని భయపడి - తెచ్చుకొంటే మంచిదని - పొద్దున్న భోంచేసి ట్రాములో బంగాళాకి వెళ్లాను. పెట్టెతెచ్చుకుని ఇంటికొచ్చేటప్పుడు జట్కా-లో వద్దామా అనుకున్నాను. కాని రెండు రూపాయలు వృధాగా ఖర్చు ఎందుకు అనుకుని-వీధి చివరవరకు నడచివెళ్లి అక్కడ ట్రాము కోసం నిలబడ్డాను. అగ్నికత్తెలు-నిప్పులు చెరగేస్తూంది యెండ. బంగాళా వదిలి పెట్టేసి!రావడం అన్నది వకటి మనసులో బాధిస్తూండెను. దానికితోడు పెట్టె బరువు- పెట్టె నిండా రాళ్లున్నట్టు - జబ్బలాగేస్తుంది. నిలబడి నిలబడి కాళ్లకి రక్తాలు దిగిపోతున్నాయి. పన్నెండు కొట్టేశారు. ట్రాము యెంతకీ రాదు. నాకు తలనొప్పి భరింప శక్యం కాకుండా వుండెను. ట్రాములు ఆగిపోయాయి - ఇక రావు కాబోలు అని అనుకుంటూంటే వచ్చింది. జనంతో కిక్కిరిసివున్న ఆ ట్రాములో ఎలా ఎక్కానో - వెస్లీకాలేజీ దగ్గర ఎలాదిగానో మరి! నావెంటే - "కూడసాపాడు" పూటకూళ్లమ్మ వకామెదిగింది. ఆమె గంపనిండా - గంపెడు అన్నంగిన్నెల దొంతర్లు - భోజనం పొట్లాలు - నీళ్ళ సీసాలు - అరిటాకులు కట్టలు! ట్రాములోనుంచి ఎలా దింపుకుందో

గంపని - మరి నెత్తిమీద యెత్తుకోలేకుండా వుండేను. వచ్చే జనం పోయేజనం - యెవరిమాన వాళ్లు చూస్తూ వెళిపోతున్నారు కాని - ఆమె కెవ్వరూ సాయం చెయ్యడంలేదు. నాకు తల వేమూల బద్దలైపోతూంది. ముడుతలు పడ్డ ముఖం చమట పోడుతూన్న చింపిరిజుత్తు - బక్కపోయిన శరీరం-దొడ్డిపోయిన కాళ్లు-వంకర పోయిన వేళ్లు - "ఆలస్యం అయిపోయిందే - భగవంతుడా!" అని గాభరాపడుతూన్న కళ్లు - చూసి నాకు జాలివేసింది. నా పెట్టె నేలమీద వుంచి ఆగంపని ఆమె నెత్తిమీదికి సాయంచేసి - ఒక చేత గిన్నెల దొంతర పుచ్చుకుని రెండోచేత పెట్టె పట్టుకుని అమెతో నడిచాను. జాంబజారులో ఒకసందు మొగిని ఆమె ఆగితే అక్కడ మళ్లీ ఆమె గంపదు దింపి - వైక్రాప్టు రోడ్డునే ఇంటికి చేరుకున్నాను. పాపం నేను వెళ్లిపోతూంటే ఆమె నాపాదాలు ముట్టుకుని తన కళ్ల కద్దుకుంది! బరువులు మోసే వాళ్లు - రిక్షా లాగేవాళ్లు - రాళ్లు కొట్టేవాళ్లు - యేమి పేదరికం — యేమి బతుకు-పశువులకంటే కనా కష్టంగా వుండే!

...తిన్నగా మేడమీదికి వెళిపోయాను. కాళ్లూ చేతులూ కడుక్కోడానికి కూడా ప్రాణం లేకపోయింది. ఆ పెట్టె ఒకమూల గిరవాటేసి మంచం మీద పడిపోయాను. ఎండలోనించి వచ్చానేమో - ఇంట్లో కొచ్చేసరికి కళ్లు చీకట్లు కమ్మే శాయి. శాస్త్రి బల్లదగ్గిర కూచుని యేవో రాసుకుంటున్నాడు. నాకు అతనూ కనిపించలేదు. మంచంమీద తమలపాకుల పళ్లెం వున్నం బుద్ధి కనిపించలేదు. నేను మంచంమీద వాలేసరికి ఆ పళ్లెం ఫెళ్లని కింద పడింది. "అబ్బా! నేను రాసుకుంటూన్నప్పుడే ఇల్లు చక్కబెట్టాలీ?" అంటూ విసుక్కున్నాడు. కోపం తెచ్చుకోవడానికి కూడా నాకు ఓపిక లేకపోయింది.

మంచి నిద్ర తీశాను. నాలుగు గంటలకి తెలివి వచ్చింది. తలనొప్పి తగ్గిపోయింది. ఫలహారం కాఫీ తయారు చేశాను. శాస్త్రి కాఫీ పుచ్చుకుంటూ "అమృతాంజనం రాసుకున్నట్టున్నావు - తల నొప్పిగా వుందా యేమిటి—శాంతం? అన్నట్టు బంగాళా క్లాపు కాంసు - విశేషా లేమిటి? తారలూ చందమామలూ జాబిల్లులూ ఎల్లా వున్నారు?" అన్నాడు. నేను జరిగినది చెప్పా "నీ కక్కర లేని పనులు కెందుకు వెళ్తావు? ఎందు కొచ్చిందీ లోకం మరామ్మత్తూ - వళ్లు పాడుచేసుకోవడమున్నూ? ఈ వేళంటే ఆపూటకూళ్లదానికి నువ్వు సాయం చేశావు. రేపెవరు చేస్తారు? ఆ మనిషికి ఇదే అలవాటైందంటే - మరునాటినుంచి నీవెంటపడి నీ నెత్తిమీదే గంప పెడుతుంది. ఇక రేపటినుంచీ కనపడిన రిక్షావాడి కల్లా సాయంచేస్తూంటే సరిపోతుంది ఎవరి ప్రారబ్ధం వాళ్లు అనుభవించాలి - మనం మధ్య కలుగజేసుకుంటే పాపం కూడాను!" అని చీవాట్లు పెట్టాడు. కాస్సేపయాక "శాంతం! నువ్వు మీ అమ్మని చూసి చాలా రోజులైంది. ఓమాటు వెళితే నీకు సరదాగానూ వుంటుంది. ఆవిడా సంతోషిస్తుంది. వెళ్లొస్తావా యేమిటి?" అన్నాడు శాస్త్రి!

## 10

## అతడు

స్మిత్తుమీద అతని పెళ్లాం - మొగుడు క్రూరంగా కొట్టి హింస పెడుతున్నాడని విడాకులకు దావా వేసింది నన్ను తనపక్షాన్ని దావాపట్టి- 'ఈ మధ్య మూడు నాలుగు సార్లు గౌనులు నగలూ కొనుక్కుంటానని పదివేలిమ్మని మేరీ అడిగినప్పుడు - తను ఇవ్వనంటే మాటామాటా వచ్చి - తను రెండు దెబ్బలు వేస్తూ వచ్చినమాట నిజమే కాని అదేనా అవయవ ప్రమాదంకాని ప్రాణభయం కాని కలిగించే దెబ్బలు కావు. అదేనా మూడు నాలుగుసార్లు జరిగింది కాని రోజూ కొట్టి బాధ పెట్టడంలేదు. ఇంతకీ హైకోర్టుకి " ఒరిజినల్ సైడు జ్యూరిస్డిక్షను లేదు" - అని వాదించ మంటాడు. తోడి బారిష్టరు. నా కాక్షీ పట్టువని యేలాగనగలను? అంతటితో పూరుకోక -'ఈవిడె ప్రవర్తన తిన్నైనదికాదు. పెళ్లికాకముందు కూడా ఇంతేను - తెలియక పెళ్లి చేసుకున్నాను. ఇప్పుడు పెళ్లిరద్దు చెయ్యాలసింది, అని 'మెట్రిమోనియల్ సైడులోగాని హైకోర్టులో అర్జీ పడేసి - ఇదికూడా నన్నే చూడమన్నాడు. నడి వీధిలో యీ కుళ్లు చంఢాలం అంతా చాకిరేవు! ఇంతకీ నాది వెట్టి చాకిరీ అయె!... అయినా దేముడు మేలుచేసి రేపు పొద్దున్న మనలో విడాకుల పట్టమే కనక వస్తే - యీ వ్యాజ్యంలో తర్ఫీదు మన కప్పుడు బాగా ఉపకరిస్తుంది!

ఆశ్చర్యం - జానుమేరీన్నీ రోమియో జూలియెట్టుల్లాగున్నారనుకున్నా! నేను రెండు మూడుసార్లు మేరీ స్మిత్తుతో వాళ్లింట్లో డ్యాన్సు చేశాను కూడాను. చిత్రం! ఆలోచిస్తుంటే - ఆలోచిస్తూంటే- శాంతం నేనూ హాయిగా వున్నామా అనిపిస్తూంది... లేకపోవడమేమిటి? 'హాయి' 'సౌఖ్యం' అన్నదానికి నిర్వచనం ఏమిటి? నేనూ శాంతం కొట్టుకోవడం లేదు. తిట్టుకోవడంలేదు. రెండుపూట్లా వేళకి వండి పెడుతూంది. నేను సంపాదించిన దానిలో నెలకి నూరు రూపాయలు ఇంటి ఖర్చుకోసం శాంతం చేతిలో నే పోసేస్తున్నాను. ఇద్దరం కలిసి పత్రిక చదువుకుంటాం కలిసి ఖబుర్లు చెప్పుకుంటాం. నెలకోసారి పాటకచేరీకో సినీమాకో వెళుతాం. దానం ధర్మమూనా? తన చిరిగిపోయిన చీరె పాత రవికె ఇంట్లో పనిమనిషికిచ్చినా నేనేమీ అనను. నేను వారానికి బేడమార్చి దమ్మిడీలు ముష్టివాళ్లకి పారేసినా శాంతం కలుగజేసుకోదు. "నీ లోకం మరామత్తు కాస్తకట్టి పెడుదూ" అని నేనూ-"నీ వకీలు జిత్తులు నీ ప్లీడరు వాదనలు నా దగ్గిర సాగవోయ్" అని ఆవిడా — ఇలాగు దేని గురించేనా కాస్త మీమాంస పడినా - నేనూ ధూమ్‌ధామ్ చెయ్యను. తనూ తలకి వాసిని చుట్టుకుని మూలనున్న నులక మంచం మీద ముసుకుతన్ని మూలుగుతూ పడుకోదూ. ప్రస్తుతం కొంచెం ఇబ్బంది పడుతున్నా - శాంతం పొదుపు కూడిక వల్లనైతేనేం - నా ముందు జాగ్రత దూరాలోచన వల్లనైతే నేం - కాసింతడబ్బు వెనక వేసుకుంటున్నాం. ఎవరి పనిపాటలు వాళ్లం చేసుకుంటున్నాం - తింటున్నాం - పడుకుంటున్నాం - లేస్తున్నాం — కాలం గడిచిపోతూంది!

సంసారం జరిగి పోతూంది. ఇక కావలసిన దేముంది? రోజూ శృంగార నైషధం తారాశశాంక విజయం పఠించాలా యేమిటి! ఇదే - సౌఖ్యం - ఆనందం - ఖులాసాన్నూ. ఆఁ! శాంతం నేను హా-యి-గా-నే వున్నాం!

పాపం—శాంతం పుట్టింటి కెళ్లి చాలారోజులైంది. నలుగురిలోనూ తిరిగే మనిషి— యీ ట్రిప్లికేనులో పడివుండడం అంటే - కూపస్థ మండూకం లాగుంది - శాంతం! రాజమండ్రి వెళుతావా - శాంతం? అంటే - "ఊఁ — ఆఁ" అనలేదు. కాని ముఖంలో మాత్రం వెళ్లాలని వున్నట్టే కనిపించింది. తోసికట్టేనా పంపిచాలి!...అన్నట్టు అట్లతదియ నాడు నాపుట్టిన రోజుమాటే మర్చిపోయాను! శంకర జయంతి వెళ్లిపోయి - ఈవేళ నృసింహ జయంతి! ఇంగ్లీషు తారీఖునాడు తలంటిపోస్తానని శాంతం అంటే - అమ్మ యెప్పుడూ తెలుగు తిథినాడే తలంటిపోసి పుట్టినరోజు జరిపేది - తదియనాడే పుట్టినరోజు చెయ్యి - అన్నా. తీరా తదియనాడు కుళాయిలు కట్టేశారు. ఆరోజే యీ పగనాలికే సొకటి - దాంతో అన్నీ పరాకడుపైపోయాయి!

శాంతం పుట్టింటి కెళితే-సెలవలు నేనెలా గడపడం? సెసిలీ వదినె అన్నయ్య రా-చీరమ్మగారని నిన్ననే రాశారు. రంగయ్యచెట్టి గిర్థారీ నా సొమ్ము కైంకర్యం చేసుకోవడంలో నా తెలివితక్కువకి అన్నయ్యకి నామీద చాలాకోపం వచ్చి చీవాట్లు పెడుతూ వుత్తరం రాశాడు అప్పుడు. అంచేత వాళ్లదగ్గరకి వెళ్లడం అంటే నాదర్జాకి లోపం అనిపిస్తూంది. పోతే - రాజమండ్రే వెళితేనో? అత్తగారు రమ్మనమని రాయకుండానే నేను పరిగెడితే బాగుంటుందా - కాస్తేనా బెట్టుసరి వుండొద్దూ? అసలు ఇప్పటి సంగతి సందర్భాల్లో అక్కడకి వెళ్లడం మంచిది కాదు. శాంతం నన్ను పెళ్లి చేసుకోవడం అత్తగారికి యేమీ ఇష్టం లేదుట. "డిప్టీకలక్టరంత జీతం - మునసబంత జీతం తెమ్మనుకుంటున్నావు - ఏ కలక్టరునో జడ్జీనో చేసుకోకుండా - యెంచియెంచి శాస్త్రీలులేని బారిష్టరుని చేసుకోవడం ఖర్మం యేమిటే నీకు?" అని అంటూందని అమ్మ- అని మొదటి రోజుల్లో శాంతం నాతో నవ్వుతూ చెప్పేది. ఇప్పుడు ఆవిడ మాటే నిజం అయింది. అంచేత అత్తగారు నన్ను తప్పకుండా దెప్పి పొడుస్తుంది - నేను తోక ముడుచుకోవలసి వస్తుంది. విశాఖపట్నం వెళతాను. అక్కడ తెలిసినవాళ్లు చాలా మందివున్నారు. యీ పోటీ రోజుల్లో వాళ్ళ దరినీ వకసారి చూసి కుశల ప్రశ్న చేయడం మంచిది - లేకపోతే కట్టలు మరొకరికి పంపించేస్తారు.

గాజులపల్లె బందిపోటు కేసులో ప్రత్యేకపు వకాల్తీ రంగాచారిగారికి ఇచ్చారుట. మరి అతనిలో యేమివుందని ఇచ్చారో నాకు తెలియదు. నియోగి ప్రపంచంలో వైష్ణవమాయ! సరి-ఇదిక్కడికో మతాబా!... శ్రీపెరంబూరు రాజుగారి అప్పీల్లో - ఆయనకీ నాకూ పరిచయం లేకపోయినా పిల్చి తనపక్షం వుండమని ప్రాధేయపడ్డాడు. ముందుగా బయానా ఐదువందలు పారేశాడు. పాలని ఆరగించి నీళ్లని వెనుక వుంచేయడం హంసలకి తెలుసును కాని కాకుల కేం తెలుస్తుంది?... వేళకి వచ్చింది చేతికి డబ్బు, శాంతాన్ని రెండవ క్లాసులో ప్రయాణం చేయించొచ్చు. రైలుదగ్గిర స్నేహితులు యెవరు కనిపించినా నా అభోరు దక్కుతుంది!

## 19

### ఆమె

రేపు రాజమహేంద్రవరం ప్రయాణం - అమ్మదగ్గరకి! "కోర్టునుంచి నాలుగు గంటలకే వచ్చేసి నీ సామాను సర్దిపెడతాను" అన్నాడు శాస్త్రి. ఆరుగంటలు దగ్గరవుతూంది - ఇంకా శాస్త్రి రాలేదేమీ - అని నేను రెండు మూడు సార్లు వీధిలో కొచ్చి చూసి మళ్లీ ఇంట్లోకి వెళిపోతూవచ్చాను. సాధారణంగా అన్న వేళకే వస్తాడే. మరేం ప్రమాదం జరగలేదు కద - అనిగాభరాపడుతూ రుద్రాక్షుంచు క్షీరాబ్ధిపట్టు చీరె మడతపెట్టి పెట్టెలో పెడుతున్నాను - వీధిలో పది పదిహేను మంది మాట్లాడుతూన్నట్టు వినిపించింది. గుండెల్లో దడ ప్రారంభం అయింది. కాళ్లు గడ గడ వణకడం మొదలెట్టాయి. అలాగే మేడ మెట్లుదిగి వీధి గుమ్మంలో కెళ్లాను.

గుమ్మంలో జనం. ఇంటి ముందు జోడుగుర్రాలబగ్గీ - బగ్గీలో నుంచి దిగుతున్నాడు ఒకాయన - ముఖాన్న పెద్దఅంగారు బొట్టు - వజ్రాల తమ్మెట్లు - ముడుగులూ వుంగరాలు - చెంగావి పంచె - పట్టు అంగరఖాకోటు - జల్తారుపాణీ - ముఖమల్ టోపీ మెళ్లో వజ్రాలు కెంపులతోను తాపించిన బంగారపు రుద్రాక్ష పూస. సెట్టిగారివెంట దిగింది ఆయన భార్య - బనారసు చీరె - ముఖాన్న అర్ధణా కాసంత కుంకుంబొట్టు. అంతే కనిపించింది. మిగిలినదంతా - వజ్రాలు కెంపులు ముత్యాలు బంగారమున్నూ. ఆవిడె చంకని ఆరేళ్ల కుర్రాడు - వొంటిమీద గులాబీ రంగు శాలువ - తలమీద పసుప్పచ్చ జల్తారు తురాయి టోపీ - కాళ్లకి పూలు మేజోళ్ళు నల్లటి తోలు జోళ్ళు. వాళ్ల వెంట శాస్త్రి! నేనతన్ని మొదట పోల్చుకోలేక పోయాను. చలికాలంలో గుర్రాలమీద వేసే కంబళీతో వొళ్లంతా కప్పేసుకున్నాడు-తలంతా తడిసిపోయింది - పంట్లాంకొసల నుంచి నీళ్లు కారుతున్నాయి - జోళ్లనిండా తడి యిసక...

ఈ దృశ్యం చూసి యేదో గొప్ప ప్రమాదం జరిగిందని తోచి శాస్త్రిని కౌగలించుకున్నాను. "ప్రమాదం యేం జరగలేదు - శాంతం! నేను క్షేమంగానే వున్నాను" అన్నాడు శాస్త్రి. అతని గొంతుక చెవిని పడింది - అప్పుడు నాగుండె దడ ఆగింది. అప్పుడా సెట్టిగారు చెప్పాడు: ఆయన, ఆయన భార్య, పిల్లాడు తిరునాళ్ళకెళ్ళి సముద్ర పొడ్డుకెళ్లారుట - వీరు రేడియో సంగీతం వింటూంటే పిల్లాడు ఆడుకుంటూ నీళ్లలో కెళ్లేసరికి కెరటాలు లోపలికి లాగేశాయిట, పిల్లా డెక్కడికి వెళిపోయాడో - అని వెతుక్కుంటూ వీళ్లు నీటిదగ్గిర కొచ్చేసరికి - యేముంది? కుర్రాడు నడి సముద్రంలో మునిగిపోతున్నాడు. తలమాత్రం కనిపిస్తూందిట. జనం అంతా మూగేరట - తల్లితండ్రులు యేడుపు విని. ఇంతట్లో ఆమూకలోనుంచి శాస్త్రి తోసుకుంటూవచ్చి -

కోటు జోళ్లు విప్పి పారేసి - అమాంతంగా కెరటాల్లోకి దూకేడుట. పది నిమిషాల వరకూ పిల్లాడూ శాస్త్రీ యిద్దరూ సముద్రంలో మాయం అయిపోయారుట. సరి ఇంకేముంది - సముద్ర దేవత ఇద్దరినీ తన కడుపున పెట్టుకుందని జనం అంతా - భోరుమని యేడుపులు ఆరంభించారుట. అంతట్లో పిల్లడిని వక చేతితో పైకి పట్టుకుని రెండో చేతితో బారువేసుకుంటూ రొజుతూ శాస్త్రి వొడ్డుచేరుకున్నాడుట!

జరిగిన సంగతులు చెబుతూన్నంత సేపూ భార్యా భర్త లిద్దరూ శాస్త్రి పాదాలు నాపాదాలు పట్టుకుని వక్కటే నమస్కారాలు చెయ్యడం. "లేకలేక వక్కడే పిల్లకాయ అమ్మా మాకు! అయ్యగారు పిల్లకాయని రక్షించి మా కుటుంబాన్ని నిలబెట్టారమ్మా! వచ్చే జన్మంలో మీ కడుపున పుడతాం అమ్మా! మా చర్మాలతో మీ ఇద్దరికీ చెప్పులు కుట్టించి ఇచ్చినా మీ రుణం తీర్చుకోలేమమ్మా!" అని వకటే దణ్ణాలు పెట్టడం! అబ్బాయిని మా కాళ్లముందు సాష్టాంగ పడమన్నారు. శాస్త్రిని పేరు అడిగి చిదంబర నటరాజస్వామివారికి బంగారు కిరీటం చేయిస్తామని పిల్లాడి తలమీద వొట్టేసుకున్నారు. సెట్టిగారు తన జేబులోనుంచి నోట్లకట్ట తీసి నాచేతిల్లో పెట్టాడు. "ఇదేమిటండీ?" అన్నా. "పార్వతీ పరమేశ్వరులకి పాదపూజ" అన్నాడాయన. 'ఛ్ఛీ! మేము పుచ్చుకోం'అన్నా-అని ఆయన చేతికిస్తే-ఆయన ఆ నోట్ల కట్టని పసుపు పారాయణ పెట్టిన ఆగుమ్మంమీద వుంచేసి - పెళ్లాం కొడుకుతోను బగ్గీయెక్కి వెళ్లిపోయాడు.

శాస్త్రిని వెంటనే మేడమీదకి తీసుకువెళ్లి - తడిబట్టలు విప్పించి పొడిబట్టలు కట్టించి - వొంటికీ చెరికాళ్ళకీ కర్పూరతైలం రాసి - వొళ్లుపట్టి - శాలువ కప్పేశాను కాస్సేపయాక చెమట తుడిచేసి - వేడినీళ్ళలో గావంచా తడిపి వొళ్లురాసి - పొడి తువాలతో తుడిచేశాను! తరువాత - వేడికోకో పెట్టి ఇచ్చి - మంచమీద పడుకోపెట్టి. తలకీ కంటికీ సాంబ్రాణిపొగ వేశా. అప్పుడు శాస్త్రీ "శాంతం! యెందుమిరప కాయలు దిగదుడ్చి పొగవెయ్యడం తరువాయి - దిష్టి తియ్యడానికి. చాలుచాలు - ఈమడోపచారాలూ!" అంటూ నవ్వుతూ లేచాడు. అప్రయత్నంగా "ఉపచారము చేసేవారున్నారని మరవకురా" అని కృతిపాడేను. పాడుతున్నంతసేపు శాస్త్రిని చూసి అతని ధైర్య సాహసాలకి స్వార్థరాహిత్యానికి అమిత గర్వపడ్డాను..."ఈ ఐదువేలూ యేమిటి చెయ్యడం శాస్త్రీ?" అన్నా. "సెట్టిగారు నీచేతిలో పెట్టాడు. కనుక నీ ఇష్టం" అన్నాడు. "పిల్లాడిని రక్షించినవాడివి నువ్వు. ఆ కానుక నీది. అందుచేత నీ ఇష్టం!" అన్నా. "సొమ్ము నాదైతే - అసలు నేనే నీవాడిని!" అన్నాడు. "అయితే - వివేకానందా మిషను..." అని నే ననబోతూంటే-శాస్త్రి "ఈ ఐదువేలు బ్లూక్రాసుకి ఇచ్చేస్తా. దొరతనంవారు సంతోషించి నాకేదేనా కితాబు పారేస్తారు. ప్రభువుల కృప మనకొక రక్షరేఖ!" అన్నాడు.

భైరవి రాగం ఆలాపనచేస్తూ నా పెట్టెలు సర్ది పరుపుకట్టేసి ప్రయాణానికంతా సిద్ధంచేశాడు.

## 20

### అతడు

శాంతం ఆదివారం నాడు వెళిపోయింది. సోమవారం కోర్టుకి వెళ్ళేప్పటికి- తెలిసిన వాళ్లూ తెలియని వాళ్లూ అందరూ అభినందించడమే నన్ను. ఏమి ధైర్యసాహసాలండీ, అని వకరు - ఆ పరోపకార చింతకే మిమ్మల్ని మెచ్చుకోవాలండీ! అని వకరూ - ఆ పిల్లాడి ప్రాణానికి మీ ప్రాణం అడ్డు వేశారు — ఓహోహో! అని మరొకరూ - పిల్లకాయని ఒక పంజాతో యెత్తిపెట్టి రెండవ చేతితో యేమి గజయీత శాస్త్రీ!- అని వకరూ. ఇలా అపోగడ్తలు వింటూంటే నా చెవికి ఎంతో ఇంపుగా వుండేను. ఆపిల్లాడిని నీళ్లలో మునిగి పోవడం చూసి కెరటాల్లో ఉరికేటప్పుడు — పరోపకారం-పరాక్రమం పరమార్థం — ఇవేవీ మనసులో లేనే లేవు. ఒకప్రాణికి ప్రమాదం సంభవించబోతూంది. దాన్ని మనం తప్పించాలి. అంతే తోచి నీళ్లలోకి గెంతేను. ఆ తరవాత కెరటాలకీ నాకు వక పోటీ ఆట. పిల్లాడి తల కనిపించి పట్టుకుందాం అనుకుంటే కెరటం దెబ్బతో పట్టు విడిపోయేది. టెన్నిసు క్రికెట్టు ఆటల్లోలాగు యీ పోటీలో గెల్చి తీరాలన్న పట్టుదల నన్నావరించేసింది. కెరటాలు విరిగి నా ముఖంమీద కొడుతూంటే - వేరాజాన్స్టనుతో మార్గేటు సముద్రంలో జలక్రీడ - శాంతంతో మహాబలిపురంలో సముద్రస్నానం- మేరీ స్మిత్‌తో అడయారులో ఈత-ఇవి జ్ఞాపకంవచ్చాయి! ఈవేళ పత్రికల్లో నా బొమ్మ - కోర్టులో అభినందనాలు - ఆ వేళ శాంతం "ఉపచారము చేసే" అన్న కీర్తన — వీటిని తల్చుకుంటే - హాయి!

శాంతం వెళ్లిపోయిందగ్గరనుంచీ నాకు ఉప్పు అన్నం-చారు అన్నమే గతిపట్టింది. యీవారం రోజులాయి హోటేలు భోజనంతో నోరు చచ్చిపోయింది. చిత్రం! తాతల నాటినుండీ అలవాటుపడ్డ ముద్ద కూరలూ — ఇంగువ చారూ — ఉప్పుడు పిండి-వాసినపోళీ- వీటి రుచులే మర్చి పోతున్నాం మనం. భాషే మర్చి పోతున్నాం. తెనుగు పుస్తకాలు చదవడమే మానేశాను. నేను శాంతానికి ఇంగ్లీషునే వుత్తరాలు రాస్తున్నాను. ఈ దినచర్య రాయడంకూడా ఇంగ్లీషులోనే ఆలోచించుకుని తెనుగున తర్జుమా చెయ్యడమే. చివరికి గుణింతం కూడా మర్చిపోయి -'ఝు' అన్న అక్షరానికి వక కొమ్మా రెండు కొమ్ములా - వొత్తు ఎక్కడ పెట్టడం అని అనుమానం వేసింది! వేష భాషల్లోను భోజనంలోనువుండా యేమిటి నా ఆంధ్రత్వం? నావంట్లో ప్రవహించేది ఆంధ్ర రక్తం— నేను పదహారణాల ఆంధ్రుణ్ణి!

క్లబ్బులో గంగాధరం కనిపించాడు - చాలా రోజులకి. అతనికి వ్యాపారంతోనే సరిపోతుంది. టంకశాల వీధిలో తన గద్దెమీద కూచుంటాడు. సభవారికి చాప అంటుకున్నట్టుగా - అతని చేతికి చెవికి ఆ టెలిఫోను ఇరవై నాలుగు గంటలూ అంటుకునే వుంటుంది. నేనూ అతనూ యూరపునుంచి కలిసే వచ్చాం. వంశపారంపర్యా వజ్రాల వర్తకం. దివాళా జమీందార్ల వజ్రాలూ రత్నాలూ చచ్చు ధరలకి కొననూ - ఆంట్వె

ర్స్వాలో వాటిని చెరిపించనూ – లండనులో పదింతలకి అమ్మనూ! అందులోకీ ఆ మధ్య పల్లెటూళ్ళనుంచి బంగారం వచ్చి పడిపోయినప్పుడు – అదను చూచుకుని గంగాధరం పీసెలమీద బంగారం చవకగా కొనేయనూ – సీమకి యెగుమతి చేయనూ – లక్షలు లక్షలు అవలీలగా గడించి పారేశాడు! అతని దగ్గర నేర్చుకోవాలి గడుసుదనం నేను. యీ ప్లీడరీ మానేసి గంగాధరం దగ్గర గుమస్తాగా చేరితే నాలుగేళ్లలో నాలుగురాళ్లు జేబులో వేసుకుంటే నాలుగు లకారాలు సంపాయించొచ్చు అనిపిస్తుంది – అతన్ని చూసినప్పుడల్లా! అతని కూతురు శాంతం శిష్యురాలు. శాంతం అంటే అతనికి అతి గౌరవం. "ప్రాణ రక్షకా స్వాగతం – సుస్వాగతం!'' అన్నాడు చెయ్యిచాచి నవ్వుతూను. "ప్రొఫెసరుగారు క్షేమమా?'' అని అడిగేడు. మేము తెనాంపేట వదిలేసి ట్రిప్లికేను వచ్చేసినట్టు చెప్పా. "ఏమిటీ? ఇంటిపనంతా ప్రొఫెసరుగారు వక్కరే చేసుకుంటున్నారటోయి – పాపం!", అని శాంతాన్ని పకటే పొగిడాడు "ప్రొఫెసరుగారు పుట్టింటి కెళ్లారన్నావు. పుత్రోత్సవం ఇక్కడ మాకే దక్కనిస్తారా–అంతా అక్కడే పంచి పెట్టేస్తారా?'' అన్నాడు. కన్నుగీటుతూ: "పార్వతీ పరమేశ్వరులకి విఘ్నేశ్వరుడు లేకపోతే కైలాసం వెలవెల బోతుంది. ఆ లోపం కాస్తా తీరిపోతే ప్రపంచానికి మీరు ఆదర్శ దంపతులు!" అన్నాడు. "అబ్బే! పుట్టింటికి వెళ్లిందోయ్ – వాళ్ళమ్మను చూడడానికి!" అన్నా.

వ్యాజం గురించి మాట్లాడుదాం – రాత్రి బాసోటోకి భోజనానికి రమ్మనమని స్పాటు గుమాస్తాచేత చీటీ పంపించాడు. అన్నయ్యా సెసిలీ వదిన వెళిపోయాక నాకు నామా నీచూ పిట్టా గుడ్డూ తగల్లేదు-అందులోకీ ఈ పది రోజులూ మలబారు చప్పిడి తిన్నాక ఈ 'డిన్నరు' జిహ్వాకి మహారుచిగా వుండేది! అతను పెద్ద పెగ్గు చిన్న సోడా పుచ్చుకున్నాడు-నేను చిన్న పెగ్గు పెద్ద సోడా పుచ్చుకున్నాను "మీ ఆవిడె తనూ క్లబ్బులో టెన్నీసు ఆడేవారం అని మేరే చెప్పేరు. మేంకూడా మిసెస్సు శాస్త్రి లాంటి మణిపూసే అనుకున్నాను సుమా! నా ఖర్మం – మణిపూసల్లా మట్టి వుండ అయిపోయింది!'' అన్నాడు పాపం. అతను అన్నట్టే-శాంతం సాక్షాత్తూ సుబ్రమణ్య స్వామివారి పడగమీద ప్రకాశిస్తూన్న మణిపూసే! అందరికీ దొరుకుతుందా మరి!

భాష్యానికి నెపన్ను కేసువుంటే తన తరఫున 'ఇంటరుగలా క్యూటరీ' వంటి పడేయమని చెప్పి సాయంత్రం తన యింటికి తీసుకుపోయాడు. అతనిది శ్రీవిల్లిపుదూరు దగ్గిర పిల్లజమీ. సాలీనా పాతిక వేలొస్తాయి. బ్రహ్మచారి. రాజకీయంలో మితవాది అయినా – ఆదిగురువులని వదిలేసి కొత్త మతం పుచ్చుకున్నాడు. అతనికి గూడాకు లక్నో జర్దావాలా దగ్గిరనుంచే రావాలి! సీమనుంచి ప్రత్యేకంగా సిగరెట్లు తెప్పించుకుంటాడు. 'సీది స్వదేశీ వ్రతం కదా – ఇదేమిటి భావ్యం?' అంటే –'యీ నాటు కాగడాలు వూదితే గొంతుక పట్టేస్తుందోయ్!' అంటాడు. 'ఖద్దరు నియమం కదా-యీ వేషం యీ మ్లేచ్ఛ భాషా యేమిటి?' అని అడిగితే –"అమ్మన్నా! 'ఓల్డు స్కూలు టై – అక్సుఫర్డు ఏక్సెంటు' లేక పోతే 'డెమోక్రసీ' సంపాదించడం ఎలాగు?" అంటాడు. "మీది అహింసా శపథం మద్య నిషేధం కదా-యీ బీరు బీఫుస్టీకు' యేమిటి?" అని

అడిగితే -:"స్వరాజ్ 'ప్లసు' బ్రిటిష్ సోషలిజం!" అంటాడు మునస్ఫూర్తిగానే! మంచి వాడు. అందగాడు. రాజకీవి. సరసుడు. రసికుడు. ఇంతకీ - డబ్బుంటే యెన్ని వేషా లేనా వెయ్యొచ్చు... "శాంతంగారు రాజమండ్రీ క్షేమంగా చేరేరా?" అన్నాడు. "ఆ! మొన్నాడే టెలిగ్రాం వేసింది" అన్నా. "మన జట్టు అందర్లోకీ నువ్వే అదృష్ట వంతుడ వోయ్! ఎన్ని కష్టాలొచ్చినా - చిలకా గోరింకాలాగు-ఆడుతూ పాడుతూనే మీరు సంసారం చేసుకుంటున్నారు" అన్నాడు. శాంతాన్ని అందరూ మెచ్చుకుం టూంటే నాకు కొండ అందు కున్నట్టుంటుంది.

తాజా: భామ్యం దగ్గిరనుంచి యింటికి వెళ్లేసరికి - శాంతం వుత్తరం కిటికీలో నుంచి కింద పడేసివుంది. పోస్టు బంట్రోతుల నిర్లక్ష్యం! వుత్తరాన్ని వున్న దుమ్ము తుడిచేసి ముద్దు పెట్టుకున్నా. "...క్షేమం. నువ్వు వక్కడివీ ఎలా గుంటున్నావో? నీ దగ్గిర కొచ్చేసేదాకా నాకు తోచడం లేదు. నాలుగు రోజులకి నువ్విక్కడికి వస్తే మనం కలిసి వెళిపోదాం" అని రాసింది... రేపు మెయిలుకే వెళతాను, అత్తగారుంటే నాకేం? ఆవిడ కోసమా నేవెళ్లేది - శాంతం కోసం కాని!

## 21

### ఆ మె

శాస్త్రి రావడం వెళ్లడంకూడా అయిపోయింది! గోదావరిమీద భద్రాచలం వెళదాం - మన్యంవెళ్ళి సీతారామరాజు పితూరీస్థలాలు చూదాం - అని యెన్నెన్నో అనుకున్నాను. అదేమిటో - అమ్మ నాతో యేమీ అనలేదు - "అల్లుడిగారిని రమ్మన మని వ్రాసేదా అమ్మా?" అని నే నడిగితే - "నన్నడిగే దేమిటి - అమ్మాయి? తప్ప కుండా వ్రాయి!" అ ది - అటూ: "అంత తెలివైన బారిష్టరున్నూ అంత సుళువుగా టోపీ పడిపోయాడే!" అంది. "మీ అల్లుడుగారు అందరినీ సుళువుగా నమ్మేస్తారు. చాలా జాలిగుండె ఆయనది. మొన్న ఆ కోమటి కుర్రాడిని చూడు యెలా రక్షిం చారో!" అని జరిగిందంతా చెప్పా. "సాహసం వున్నా - గడుసుదనం వుండాలి- అమ్మాయి!" అంది అమ్మ.

...పాపం ఇంటరు బండీలో వచ్చాడు శాస్త్రి! సముద్రం మూలాన్న రాత్రంతా జాగర మేనట. అంచేత భోజనం చేస్తూనే నిద్రపోయాడు. ఫలహారానికి అమ్మ-పులుసు ఉప్పిడిపిండి నూగింజవేసి చేసి - పొంగరాలు పోసి - పూరీలు వొత్తి - కాఫీపెట్టి యిచ్చింది. సాయంకాలం బొమ్మూరు మెట్టకి వెళ్ళి - మొండి సారంగధరుడిని చూసి- రాజరాజనరేంద్రుణ్ణి-కవిత్రయాన్ని స్మరించుకుని - గోదావరి వొడ్డునే యింటికొచ్చేశాం. లక్ష్మీవారం అయినా - శాస్త్రికి యిష్టం అని వెల్లుల్లిపాయి వేసి తెలగపిండి కూర - అందులోకి యెండు మిరపకాయతో కాచిన ఇంగువనూనె - వుల్లిపాయ పప్పులుసు -

చేసింది అమ్మ. మే మిద్దరం భోజనానికి కూచున్నాం అమ్మ వడ్డిస్తోంది. "మీ అమ్మాయికి గోదావరి నీళ్లు బాగా పడ్డాయండీ!" అన్నాడు శాస్త్రి నవ్వుతూను. "ఇంకా నయం! ఇక్కడి కొచ్చినప్పుడు వుత్త యెముకల బొంతే!" అంది అమ్మ. "మహారాణిగారికి మహారాజుగారి అంతఃపురంలో వున్నా పుట్టింటి సౌఖ్యం వస్తుందా?" అన్నాడు శాస్త్రి. "యేమి అంతఃపురమో? వేళ్ళన్నీ బొబ్బలు. చేతులన్నీ కాయలు. గోళ్లన్నీ పుప్పులు తుమ్మెదగంగు జుట్టంతా జడలు కట్టిపోయింది. సెట్టెనిండా అలుగ్గుడ్డలు. మెళ్లో నల్లపూసల కుత్తిగంటు. వేళ్లని కొబ్బరి పెంకు వుంగరం. చేతిని లక్కగాజులు" అంది అమ్మ నిష్ఠూరంగాను. "మీరన్న మాటలు నాకేం అర్థం కావడంలేదు" అన్నాడు శాస్త్రి. "కన్న కూతురిని ఇచ్చారు కాబట్టి దాపరికం లేకుండా స్పష్టంగానే అడుగుతా. వేలకి వేలూ గడించుకునే నా కూతురికి మిమ్మల్ని చేసుకుని యీ అరవ చాకిరీ చేయవలసిన గతి యెందుకు పట్టిందీ?" అని గద్దించి అడిగింది అమ్మ. "నా సీనియరు రామయ్యంగారు పోయాక నాకు వకాల్తీలు కొంచెం తగ్గేయి. రంగయ్యసెట్టి దివాలా తీయడంచేత నాకు కొంచెం నష్టం వొచ్చింది. గిర్ధారిదగ్గిర నేను కొంత సొమ్ము దాచుకుంటే అతడది వాడేసుకొన్నాడు" అన్నాడు. "వీళ్లు ముగ్గురూ మీపాలిటి త్రిమూర్తులులా వున్నారు!" అంది అమ్మ. శాస్త్రికి కోపంవచ్చింది ఇంకక్కడనుంచి యేముంది? తుపానుగాలి - వడగళ్ళవాన - పిడుగులు - ఉరుములు. సాధింపుమీద సాధింపు - యెత్తిపొడుపుకు బదులు యెత్తిపొడుపు. దెప్పకు మీదదెప్పడు. కాళీమర్దనం - శివతాండవం! "మీకథయింత చెడ్డాక మీరు దాన్ని పోషించలేకపోతే - నాకడుపులో పెట్టుకుని నాతోపాటు యేదారు నీళ్లో మజ్జిగ చేటో తాగుతుంది! పుంసులో వుల్లిపాయలు వడ్డిస్తున్నా?" అంది అమ్మ "వుల్లిపాయ శ్రార్ధమూ వద్దు - సాలిగ్రామ తీర్థమూ వద్దు. కథ అడ్డంగా తిరిగింది. డామిట్!" అని విస్తరి ముందునుంచి గభాలున లేచిపోయి చెయ్యికడిగేసుకున్నాడు. నేనూ లేచిపోయాను. అమ్మ మరి మాట మంచీ లేకుండా అన్నగా నూతి దగ్గిర కెళిపోయింది. మేం ఇద్దరం నాదిలో కెళిపోయాం. శాస్త్రి ముఖం యెర్రగా వుండెను. కళ్లు చింతనిప్పులే.

"సరే-ఇక్కడకి కథ పూర్తి అయింది. ఇంత రాద్ధాంత సిద్ధాంతం అయాక మరి నేనిక్కడ వుంటే పరువుపోతుంది తెల్లవారుఝాము బండిలో చెన్నపట్నం వెళిపోతా. లేదూ-ఇప్పుడు అర్ధరాత్రి పన్నెండు గంటల 'కోచీ'కే వెళ్లిపోవడం మంచిదీ అనిన్నంటే - ఈ తక్షణమే వెళిపోతా" అన్నాడు. "అయ్యో! నువ్వెళిపోతే నాకెలాగు శాస్త్రీ?" అని యేడుస్తూ అన్నాను. అతని గుండెమీద నాతల పెట్టుకుని - వకటే కన్నీటిధార నాకు. "నీతో నేనుకూడా మా ఇంటికి వెళిపోస్తాను. ఇద్దరం కలిసి అర్ధరాత్రి బండికే వెళిపోదాం" అని నేననవలసింది. మరి నేనెందు కనలేదో నాకే తెలియడం లేదు. అంతట్లో అమ్మ "శాంతం!" అని పిలిచింది. "అమ్మ ఎందుకో పిలుస్తోంది-వెళ్లొస్తాను" అని నేను శాస్త్రి వొళ్లోనుంచి లేచాను. అమ్మ పిలిస్తే పిలిచిందని నేను శాస్త్రి దగ్గిరే వుండిపోవలసింది. నేను లేస్తూన్నప్పుడు స్పర్శల్లే తెలిసిపోయింది- నన్ను వదిలి వెళ్లవలసి వచ్చినందుకు భరించరాని ఆవేదనపడుతున్నాడని - ఆ ఆవేద

వంతా ఆశాభంగం కిందా కోపంకిందా మారిపోయిందని. నేను అతని వొళ్లోనుంచి లేచానో లేదో - శాస్త్రి లేచాడు. "నే నీబండికే వెళుతున్నా - నువ్వు మీ అమ్మ దగ్గిరేవుండు!" అంటూ గిర్రని మరివెనక్కి తిరిగి చూడకుండా ఆచీకటి అంధకారంలోనే వెళిపోయాడు. నేనలా గుమ్మాని కంటుకుపోయి నిలబడిపోయాను...

## 22

### అతడు

మళ్లీ చెన్నపట్నంలో వచ్చిపడ్డాను భగవంతుడా! చెన్నపట్నం అంటే నేనేం అంతపడి చెవి కోసుకోకపోయినా, రాజమండ్రితో పోలుస్తే స్వర్గమే. అత్తగారు అదేం మనిషో కాని - అంతా మంచి తనమే అంతా-విషమే- అంతా తేనే అంతా వసనాభే. అచ్చంగా కైకేయే! వీధిలో రాజు-ఇంట్లో రాక్షసి! లోకంమీద తల్లితండ్రులు అందరిలోనూ ఈరెండు గుణాలూ కలిసే వుంటాయి అందులోకీ- వెర్రి అపేక్షవుండే తల్లితండ్రుల్లో యీ ద్వంద్వం మరింత పైకి స్పష్టం అవుతుంది. నేనెందుకూ పనికిరాని వుత్త అభాజకుణ్ణి అని అత్తగారి అభిప్రాయం. సౌఖ్యంగా స్వతంత్రంగా గౌరవంగా జరిగిపోతూన్నది మానుకుని కాంతం వుత్తబద్ధాయిని చేసుకుందన్న మాట నిజమే అని నేనే ఒప్పుకోవాలి. అత్తగారు దెప్పి పొడిచిందంటే ఆవిషయం తప్పులేదు. కొద్దో గొప్పో ఆస్తి వున్నవాడు - సీమ వెళ్లొచ్చిన బారిష్టరు - వృద్ధిస్తాడు - కూతురు సుఖపడుతుంది-అనుకుందావిడ. పుల్లయ్య వేమవరం చేస్తే నామీద ఆవిడ కేం గౌరవం వుంటుంది? మంచి వ్యవహర్త కూడాను ఆవిడ...మంచికో చెడ్డకో కలిసింది సంబంధం. కాంతం మంచికే అనుకుంది. నేనూ మంచికే అనుకున్నాను అందరికి కష్టాలొస్తాయని నాకేమాత్రం - చూచాయగా నేనా పకే- తెలిసుంటే నేనుమాత్రం చేసుకొని వుందునా? "తొందర పడకే సుందరదేవీ - ముందిది ముసుళ్ళపండగ" అని అనుకుంటే - అసలు పెళ్లిళ్లే జరగవు - సంసారాలే వుండవు - సంతానాలే వృద్ధికావు - ప్రపంచమే అంతరించిపోతుంది. అరవైయేళ్ల వృద్ధుకి పదేళ్ల గుంటని కట్టిపెట్టి వాడు నూరేళ్లు బతికి యిది నలుగురి కొడుకుల్ని కని మొగుడితో సుఖపడుతుందని మనవాళ్లు దాని మంచికోసమే పెళ్లి చేస్తారు. లేకపోతే మన దేశంలో ఇన్ని పెళ్లిళ్లిలా జరుగుతున్నాయి!...ఆ తైనాంపేట బంగళా ఎంత స్వర్గతుల్యంగా వుండేనో - ఈ ట్రిప్లికేనులో మేడ భాగం అంత నరక కూపంలాగుంది. పాపం - యీ యింటి కొచ్చిందగ్గిరనుంచీ కాంతంది అరవ చాకిరీయే!...నాకు దుఃఖం వస్తోంది. మనసులో మాడిపోతూన్నాను. కడుపులో కాల్తోంది. ఇంటి కొచ్చి చూసుకుందును - పాలు విరిగిపోయాయి. పంచదార డబ్బా ఖాళీ. జాడీలో బియ్యం నిండుకున్నాయి. ఓవాల్టీ నేనా కొనుక్కోవడం మర్చిపోయాను. బాపట్లవాడు హోటేలు ఎత్తేశాడు. ఇంక మలబారు హోటేలే గతి - కాఖర్మం!...

తా॥జా: మలబారు హోటేలుకి వెళుతూంటే రథం వీధిలో శివరావు యెదురు పడి బలవంతంపెట్టి తనింటికి భోజనానికి తీసుకుపోయాడు. అట్టే బలవంతంకూడా అవుసరం లేకపోయింది! ఆ కొరివి కారం గోంగూర పచ్చడి నక్క దోసావకాయ నాలిక్కి తగిలేసరికి ప్రాణం లేచొచ్చింది. కడుపునిండా భోంచేసి 'వాతాపి జీర్ణం వాతాపి జీర్ణం' అనుకున్న తరవాత ఎంతటి కోపమేనా ఎంతటి దుఃఖమేనా ఇట్టే ఎగిరి పోతుంది. భోజనం యొక్క మజా!... నే నెప్పుడైతే అత్తగారితో దెబ్బలాడి వచ్చే శానో - శాంతకూడా వున్నపాటుగా నాతో వెళిపోరావలిసింది. నేను గుమ్మం దాటిన తరువాతకూడా నావెంట తను వస్తూందనే అనుకున్నాను. వీధి మలుపు తిరిగి నప్పుడు చూదును - శాంతం వెంటలేదు! వాళ్ళమ్మని వదిలిపెట్టి నిలుచున్నపాటుగా బయలుదేరి వచ్చేయడం అంటే తనకి కష్టమే. కాని - నేనంటూ వకడిని వున్నానుగా! నేను రమ్మనివుంటే మాటుమాటాడకుండా వచ్చేసివుండును. అయినా - వెళ్లాన్ని 'నా వెంటరా' అని పిలవాలా యేమిటి? పోనీ రాకపోతే .. తెగేవరకూ బిగించకూడదు. ప్రేమని పరీక్ష చెయ్యకూడదను. ఇప్పుడు నకుని యేడిస్తే యేం ప్రయోజనం! వాళ్ళమ్మ నన్నలా తిడుతూంటే - శాంతానికి నామీద గౌరవం యెలావుంటుంది? గౌరవం యెప్పుడైతే పోయిందో ప్రేమకూడా అప్పుడే పోయిందనమాటే! తన మొగుడు పుత్ర అభాజకుడు, చవటిపెద్దమ్మ, అప్రయోజకుడు, పరమానంద య్య శిష్యుడు, సత్యకాలపు నాగమ్మ, జడ్డిమనిషి - అని తెలుసుకున్న తరవాత - వెళ్లానికి కనికరం వుండొచ్చు - మొలని మొలతాగు వున్నవాడుకదా - వీడిని పట్టుకుని దేవుళ్లాడితే కారో పండో కాస్తే యీ జన్మయిలా వెళ్లిపోతుంది - అని వాడిగ్గిర పడుండొచ్చు. చల్లారిపోతూన్న నుసిలాగు యేదో ఆపేక్ష, జాలి, తటస్థం, స్తబ్దుగా అంగీకారం వుండొచ్చు, కాని - కార్చిచ్చులాగు దహించుకుపోతూ, హృదయాన్ని దేహాన్ని ఆవరించుకుపోతూన్న ప్రేమమాత్రం సున్న!...భాష్యం కోర్టులో కనిపించాడు. ఈవేళనుంచి తనయింటికి వచ్చేసి తన అతిథిగా వుండమని అతి మోహామాట పెట్టాడు. యేమో-వెళ్తానని తోచడంలేదు. నాకిక్కడే - యీ నరక కూపంలో నే వుండాలనిపిస్తుంది ఎంతేనా మా యిల్లుకదా! శాంతం వుత్తరం రాస్తే ఇక్కడికే రాస్తుంది. ఆమె దగ్గిరనుంచి వుత్తరం వచ్చేవరకూ తోచడం లేదు. రాస్తుందో రాయదో?

రేపు కాలదోషం అప్పీలు లోకటుంది. వ్యవధి వుండగానే డిక్రీని అమలు చేసు కోకపోవడం - నా ప్రాణంమీదికి తీసుకురావడం - యీ డొంకవలసవా డెప్పుడూ యింతే - ప్రాణం విసికిస్తున్నాడు "జడ్జిమెంటు డిక్రీదారుడు - డిక్రీని ఖాయపరచమని కోర్టులో దరఖాస్తు దాఖలు చేసుకుంటే - ఆచర్యకూడా 'స్టెప్-ఇన్-ఎయిడ్-ఆఫ్-డిక్రీని అమలుపరచడమే" అని వజ్రాయుధం విసరాలి!...సర్ రామయ్యగారి స్థానం సంవత్సరమై అలాగే ఖాళీగానే వుండిపోయింది. అలంకలో నా కేదేనా దొరికితే బాగుండును! అల్లుడెంతటి ప్రయోజకుడో అప్పుడు తెలుస్తుంది అత్తగారికి!

# 23

## ఆమె

శాస్త్రి వెళ్ళిపోయి పదిరోజులైంది. ఏం తోచటంలేదు. నా కిక్కడ పనిపాటలు లేక బద్ధకం కూడా బలిసిపోతూంది. బ్యాంకింగు విచారణ సంఘంవారి నివేదిక తీశా చదువుదాం అని. బుర్ర కెక్కందే! కిందన్న "మోనిటరీ రిఫారం" సమీక్ష చెయ్యడాని ని విప్పా. కళ్లు అక్షరాలని చదివేయి. నోటితో మాటలని పలికేను. అంతేకాని ఒక్క ముక్కా నా కొరక బడలేదు. పాతపుస్తకాల్లో "మేఘ సందేశం" కనిపిస్తే చదువుదాం అని తీశా... రత్నగిరిమీద కూచుని యక్షుడు విలపిస్తున్నాడు. ఎడబాటుకి తాళలేక రాజకుమార్తె అతనికోసం బెంగపెట్టుకుని కృశించి పోతూంది. యక్షుడు తన ప్రియురాలికి వుత్తరం తీసుకు వెళ్ళమని మేఘుడిని ప్రార్థిస్తాడు... శాస్త్రి చెన్నపట్నంలో-నేనిక్కడ. శాస్త్రిని విడిచి నే నుండలేను. వారం రోజుల్లో వెళ్ళిపోతానని మొన్న చెప్పాను అమ్మతో. శాస్త్రి వేరకూడా రాశాను. నిన్న జవాబు రాశాడు - తను క్షేమంగా వున్నాడుట - నా కిక్కడ ఎన్నాళ్లుండాలని వుంటే అన్నాళ్లు వుండి మరీ రమ్మన్నాడు - డబ్బుగురించి ఆలోచించొద్దన్నాడు - సరదాగా వుండ మన్నాడు - అని రెండు వందలు మనీఆర్డరు చేసి పంపించాడు. వైధవ్యం సంప్రాప్తం అయాక లేడి అయ్యంగారు యూరపుయాత్ర చేసుకుని వారం రోజుల క్రిందట చెన్నపట్నం వచ్చిందిట-ఆవిడని మొదటిసారి| మొన్న క్లబ్బు గార్డెను పార్టీలో చూశాడుట. శాస్త్రిని తన ఇంటికి భోజనానికి రమ్మనమందిట. మొగుడుపోయి సంవత్సరీకాలే నా పెట్టలేదు-అప్పుడే సరదాలు! సహం సీదు దొరసానే-రెండోపెళ్లి పెళ్లాం. డబ్బుంటే ఈ కాలంలో అడిగే వాడెవడు? ఆవిడనని యేం ప్రయోజనం - మొగాళ్లననాలి కాని!...ఛా! చదువుకున్న దాన్ని- నేనే యిలా అనుకుంటున్నా నేమిటి? నే నీవాళే వెళ్ళిపోతాను శాస్త్రి దగ్గరికి అతను అక్కడూ యెలా వుంటున్నాడో! ....నన్ను శాస్త్రి దగ్గిరికి యీడ్చుకు పోతున్నది - అతని మీద నా కుండే ప్రేమా - లేకపోతే - లేడీ అయ్యంగారిమీద ఈర్ష్యా? ఏదైతేనేం? కోరి చేసు కున్నాను - నేను అతని దగ్గిరే వుండాలి. ప్రేమగీతం మందర స్థాయిలో నడుస్తే ప్రమాదం! తెల్లవారు బండికి బయలు దేరుతే రాత్రి ఏడెనిమిది కల్లా ఇంటికి చేరుకో వచ్చు. టెలిగ్రాం వెయ్యడం ఎందుకు? ఇంటి తాళం చెవుల జతలన్నీ నా దగ్గిర వున్నాయి అనుకోకుండా కలుసుకుంటే పరమానంద భరితుడవుతాడు!... అమ్మతో చెప్పా. "ఎల్లుండి దశమీ సోమవారం మంచిది యీ వేళలా వెళతావు-చక్కాదురు?" అంది. "చందమామ పిలుస్తూంటే నాకు చక్కాదు రేమిటమ్మా?" అన్నాను. "అలా కాదమ్మాయ్-నీకు తెలీదు. మంచి రోజు చూసుకుని మరీ వెళ్లు" అంది... నేను తెల్లవారు బండికే బయలుదేరుతాను.

రైల్లో: బిట్రగుంట. ఇంక నాలుగు గంటలసేపు ఓపిక పట్టాలి! కాలేజీలో చదువుతున్నన్నాళ్లూ పనిచేసి నన్నాళ్లూ - స్వతంత్రంగా వుండేదాన్ని. నా చిత్తం వచ్చినట్టూ ఖర్చు పెట్టుకునేదాన్ని. వాఁ!-అని అడిగేవాళ్లెవ్వరూ వుండేవారు కారు. [illegible]

అమ్మ దగ్గరకి వెళితే - అమ్మ దగ్గర నాకు స్వతంత్రం లేనట్టే అనిపించేది. ఇప్పుడు చెన్నపట్నంలో - నా యిల్లు నా స్వతంత్రం. నా పెత్తనం. రాజమహేంద్రవరంలో అమ్మది పెత్తనం. నేనంటే అమ్మకి వెర్రి అపేక్ష - నా కోసం ఎంతేనా తను ఇబ్బంది పడుతుంది. తన కంటికి నే నింకా చిన్నదాన్నే! అంచేత అమ్మ ఇంట్లో అమ్మ చెప్పినట్టే జరగాలనుంటుంది ఆమెకి. యీ వేళ యీ చీర కట్టుకో - యీవేళ యీ నగ పెట్టుకో - అని చెపుతుంది పుట్టింట్లో ఎంత సుఖపడ్డా స్వతంత్రం వుండదు. చెన్నపట్నంలో - నా యింట్లో - శాస్త్రి నా మాటమీదే పోతూంటాడు. సంసారసౌఖ్యం అంటే అదే!...

తాజా: చెన్నపట్నం - మా యిల్లు! ఎన్నాళ్లో అయినట్టుంది! నేనింటికి రావడం శాస్త్రి ఇంట్లోలేకపోవడం. ఇది వరకు రెండు వుత్తరాల్లోనూ టెలిగ్రాం వేసి మరీ బయలు దేరతాను - యేదైనా ఆదివారమో సోమవారమో తప్పదు అని రాశాను కదా- టెలిగ్రాం వెయ్యకపోతే మాత్రం రెండు రోజులూ నా కోసం రైలుకు వచ్చి చూడ కూడమా - వక్కర్తినే వస్తున్నాను కదా?...అబ్బబ్బ - ఇల్లు పుట్టలు పోసిపోయింది! యెక్కడ చూసినా మాసిన గుడ్డలే! మంచం మీద బూట్సు జోళ్లు! మంచం క్రింద కాలర్లూ గుండీలూ! అద్దబల్లమీద వాసనూనెతో పాటు మేజోళ్లూ - జోళ్లరంగు - రంగు పూసె కుంచె! మొగాళ్లకి శుభ్రం లేకపోతే అట్టేపోయె - యీ యాభ్రాసితనం ఎందుకో?... ఓహో - బల్లమీద లేడీ అయ్యంగారి చీటీ-యీ రాత్రి తన యింటికి భోజనానికి రమ్మనమని! సరి - మిడతంభొట్లు చేతిలో చిక్కాడు! నా చేతిలోనా - ఆవిడ చేతిలోనా?... టెలిఫోను గంట వాగుతూందే! టెలిఫోను పెట్టించినట్టే నా పేర రాయ లేదే? ఎవరు పిలుస్తున్నారో - శాస్త్రిని?... భావ్యం! ఇదివరకు తైనాంపేటలో మేం వున్నప్పుడు శాస్త్రి ఇతన్ని నాలుగైదుసార్లు భోజనానికి తీసుకువచ్చాడు. చాలా యోగ్యుడిలా కనిపించాడు. "నే నిప్పుడే వచ్చాను వూరినుంచి-శాస్త్రి ఇంట్లో లేరు-" అని నేను చెప్పేసరికి - అతను ఎలాగ్రహించాడో మరి -"శాస్త్రి లేడీ అయ్యంగారింటికి భోజనానికి వెళతానన్నాడు. నేను మా యింటినుంచి భోజనం తీసుకొస్తాను. మీరు భోజనం చేసే వేళకి అతనూ వస్తాడు" అన్నాడు. నాకు బాగా ఆకలవుతూంది - రైల్లో అమ్మ మూట కట్టిచ్చిన మినపరొట్టె తిని మర చెంబుతో యిచ్చిన కాఫీ తాగేను. అంతే అంచేత 'సరే' అన్నా. ఇంట్లో యేం వస్తువూ లేదు - రామ రామ! మరేలా కాలక్షేప! చేస్తున్నాడో? ఈ నిర్బంధ వైధవ్యంలో రోజూ లేడీ అయ్యంగారింటికి భోజనానికి వెళ్లడం లేదు కద?... ఛీ! ఛీ! శాస్త్రి గురించేమిటి - నేనే ఇలా అనుమానం పడడం యేమిటి? శాస్త్రికి తెలిస్తే ఎంత బాధ పడుతాడో? నేను లెంపలేసుకుంటున్నా!... కాదు చప్పుడు... భావ్యం కాబోలు?

## 24

### అతడు

మంగళవారం: శాంతం నిన్న రాసింది వారం రోజుల్లో బయలుదేరి వస్తున్నానని. నిన్న యీవేళ భాష్యం యింట్లోనే వుండిపోయాను. ఐనవరం యినాం అప్పీళ్లు చదువుతున్నాం యిద్దరమున్నూ. భాష్యం వక్కడూ అంత యింట్లో యెలా వుంటున్నాడో! పెళ్లిచేసుకోకుండా వుండిపోయాడు యెంచేతో? మొన్న తనయింట్లో పెద్ద విందు చేశాడు. ఏర్పాట్లన్నీ నామీదే వదిలిపెట్టేశాడు. ఎడ్వకేటుజనరలుగిరీ జేమ్సుకి యిస్తారనుకుంటున్నారు విందుకు అతన్ని అతనిభార్యని, మొన్న లండనునుంచి వచ్చిన జడ్జీలనీ వారి భార్యలనీ - శీతానఘ — భాష్టస్స - గ్రిఫిత్సునీ, గుండప్ప దంపతులనీ, గౌడు దంపతులనీ, లేడీ అయ్యంగారినీ పిలిచేడు. ఆవిడకి మునుపటికంటె హెచ్చు అందం వచ్చింది — మగా మొహంలోనూ కళ్లలోనూ నూరురెట్లు సరసం వొయ్యారమున్నూ! కొంతమంది స్త్రీలకి మొగుడు పోవడమే అదృష్టం! నన్ను గురువారం భోజనానికి రమ్మనమని మరీమరీ చెప్పింది ఆవిడ పదేపదే చెప్పడమెందుకో? కాకితో ఖబురంపిస్తే రెక్కలు కట్టుకుని వెళతాను! ఆ నవ్వులో సుకుమారం - ఆ మాటల్లో మాధుర్యం!

గురువారం: లేడీఅయ్యంగారి టినుంచి ట్రిప్లికేనువచ్చేటప్పటికి దగ్గిరదగ్గిర పన్నెండైంది. గుమ్మంలో భాష్యం కారు. తలుపులు తీసున్నాయి. ఇంట్లో దీపాలు వెలుగుతున్నాయి. నాకేం అర్థం కాలేదు. గుమ్మంలో కాలుపెట్టాను - కాశ్మీరపు గులాబీ అత్తరు ఘుమఘుమ! ఆ సువాసనవల్ల తెలిసిపోయింది - రాజమహేంద్రవరంనుంచి శాంతం వచ్చేసిందని — గబగబ మేడ మెట్లెక్కా ..పాపం - భాష్యం టెలిఫోను చేసుబట్టి అతను భోజనం యేర్పాటు చేశాడు. లేకపోతే శాంతానికి పస్తే. టెలిగ్రామం వెయ్యకుండా వచ్చిందెందుకు! అవును మరి - టెలిగ్రామం వెయ్యకుండా యెందుకు రావాలి - యేపంత పుట్టి ములిగిపోయింది?... భాష్యం కాసేపుండి వెళిపోయాడు. తరవాత నాకళ్లో కూచుని వకటే యేడుపు శాంతం! వకరినొకరం వదిలి యిన్నాళ్లెప్పుడూ వుండలేదు. ఆ సంతోషం పట్టలేక శాంతానికి కళ్లంట యేకధారే! ఆ గులాబీ పరిమళం - ఆమె తలలోవున్న బగడ పువ్వుల సువాసన - మలయమారుతం లాంటి ఆమె నవ్వు - కోమలమైన ముఖం - స్నిగ్ధమైన ఆమె స్పర్శ - మాయలోనుంచి బైటపడ్డట్టుండెను - శాంతాన్ని చూసేసరికి నాకు! శాంతం అచ్చు మన్మథ రాణే!

ఆదివారం: శాంతం రెండు రోజులా యేమంత ఉత్సాహంగా లేదు. ఎంచేతో మరి? అతి సంతోషం పొందేక కొంచెం నందకొడిగా వుంటుందిమరి! అందులోకీ - యీ వేళంతా ఇల్లు చక్కబెట్టుటతో సరిపోయింది. వున్న రెండు గదులూ వూడ్చేసరికి - తట్టెడుమన్ను - అందులో మూడు ఐదురూపాయల నోట్ల మడతలు - రెండు బంగారపు గుండీలు - నాలుగు సేఫ్టీపిన్నులు - మూడు చెమ్చాలు - నాలుగు స్టౌవ్వు సూదులు - కొత్త మడత జేబు రుమాలు - అన్నీ చూపించింది! [illegible] —

బ్రహ్మచారి సంసారం!...శాంతాన్ని ఉత్సాహపరుద్దాం అని వివరం వ్యాజ్యంగురించి చెప్పా. "కుడివరం హక్కు రైతుది కదా - మీ యినాందారు గారు నీటి పారుదలకి ఎందుకు అడ్డుపెడుతున్నారు?" అంది. "సాగుబడి వాళ్లే చేస్తే జలాధారం మాది!" అన్నా. "సాగుబడి వీలులేకుండా చేస్తే కుడివరం మీరు అమ్మకం చెయ్యక యేం చేస్తారనా మీయెత్తు? ఏం న్యాయం?" అంది. "నిలువుగా కొలవడానికి గింజలు లేకపోతే అడ్డుగా తలగీసి కొలవమన్నాడు - గిరీశం! ఈ వివరం వ్యాజ్యంతో సివిలు క్రిమినలు బాపతులు మనకి మూడు సంవత్సరాల గ్రాసం కిటుతుంది!" అన్నా. శాంతానికి భలే కోపం వచ్చింది. లేడీ అయ్యంగా రిట్లో భోజనం గురించి చెప్పి నవ్వించాలని చూశా. "ఆవిడ యేం చీరె కట్టుకుంది?" అని అడిగింది. "నాకు బాగా జ్ఞాపకం లేదు - యేదో పచ్చ రంగుదో ఎర్ర రంగుదో కట్టుకుంది కాబోలు" - అన్నాను "మెళ్లో ముత్యాలహారం వేసుకుందా - కెంపుల దొరగల్లీ పెట్టుకుందా?" అని అడిగింది. ఏం వేసుకుందో నేను చెప్పలేను కాని మంచి అందంగా మాత్రం వుండే దన్నాను. దాంతో ఛర్రుమంది. "తిని కూచుని సంవత్సరానికి ఇరవైవేలు వాళ్లో పడుతూంటే - ఒంట్లతో మే ఆదెమ్మ చాకలి చంద్రమ్మకూడా అందంగా వుంటారు" అంది శాంతం. ఎంత కోపావేశంలో వున్నా సంగీతం అంటే చెవి కోసుకుంటుంది శాంతం. ఒంచేతః సంగీతం విని చాలా రోజులైంది శాంతం. కీర్తన ఒక్కటి పాడవూ?" అన్నా. "ఇద్దరం కలసి పాడదాం!" అంది. అని "బుడుబుడుకల నక్కని దొరకొడుకు బ్రోచురా" అని గొంతెత్తుకుని. అఖరు రాగాలు పాడేం: "తెలియనినటువిటు శూద్రుల వనితలు-స్వవశమాట కుపదేశించి-సంకీర్తించి-సర్వలక్షణంబు వెరుంగకను - శిలాత్ములను సుభక్తునుచు॥ సతులకై కొన్నాళ్లాస్తికై సుతులకై కొన్నాళ్లు ధనతతులకై - తిరిగితినయ్యా". "శాస్త్రీ! నీ స్వీయ చరిత్రేనోయ్!" అని నవ్వింది. నవ్వులో మధ్య ఛప్పున ఆగి: "నేనలా అన్నానని కోపం వొచ్చిందా? వోయివిటే? నిన్నెవరన్నారే? ఏదీ చెయ్యి? ఇల్లలికి - ముగ్గుపెట్టి - విస్తరేసి— అత్తారింటికి రారే?" అంటూ చక్కిలిగిలి పెట్టింది, అసలు నాకు కోపమే రాలేదు. తన బుజ్జగింపు కోసం కోపం నటించాను! తను నిజమే అనుకుంది. "నేను ఒక్కర్తినే పాడతాను విను. అని: "తులసీదళములచే సంతోషముగా పూజింతు పలుమారు చిరకాలము పరమాత్ముని పాదములను!" అని పాడుతూ నా పాదాలని తన కళ్ళకద్దుకుంది! రాత్రి చాలసేపు వరకూ ఖబుర్లు చెప్పుకున్నాం.

## 25

### ఆమె

నా మనస్సులో చల్లని ఆనందం - తియ్యని వెన్నెల హృదయంలో పనిపాపల నవ్వులు చెవిలో చంటి పిల్లల ముద్దుమాటలు! ఒక్కో రెండో నిముషానికి గుండె ఝల్లు మంటుంది - గాభరా - బెంగ - దిగులు! మూడో నిముషాని కల్లా - మనసులో చంద

మామ చలువ - పాలపుంతలో నక్షత్రాలు - కాశ్మీర సరస్సుల్లో కలువలు - దేవదారుల దివ్య గానామృతం-ప్రశాంతం! రెక్కలుకట్టుకుని శాస్త్రి నాదగ్గిరకిరావాలి! అతనిచెవిలో నారహస్యం చెప్పేదాకా ఓపిక పట్టలేకుండా వున్నాను. అమ్మని చూసేదాకా తొందరగావుంది. కాని - అమ్మవస్తే శాస్త్రి ఆనందానికి అడ్డేమో? ఇప్పట్లో అమ్మ పేర రాయను. నవలల్లోను - నాటకాల్లోనూ - తెలియగానే ఉద్రేకం రేగిపొంగి పొరలిపోతుం దంటారు. నాకిలాగా లేదు - అలాగా లేదు. తల్చుకుంటేమాత్రం వొళ్లు పులకరించుకు పోతూంది. మనస్సంతా చంచలంగావుంటూంది. ఒకపనిచేద్దాం అని కాని, వక వంటో, వక కుట్టో, పోనీ కాసేపు పుస్తకం తీసి చదువుకుందాం అని కాని - ఎందుకు ఉత్సాహం లేకుండా వుంది.

ఒకక్కప్పుడు తల్చుకుంటే - నెత్తిమీద పెద్దపూచీ వకటి తెచ్చిపెట్టుకున్నానేమో అని భయం. యీ పూచీ సరిగా నెరవేర్చగలమో లేదో అని జడుపు. ఉత్తర క్షణంలో -"అమ్మా! అమ్మా!" అని చంటిపిల్లల ముద్దుమాటలు హృదయంలో ప్రతిధ్వనించి, చంటి పిల్లల నవ్వులు చెవుల్లో వినిపించే సరికి - ఇప్పుడున్న విసుగు, నీరసం, నిరుత్సాహం మాయం అయిపోయి కొత్త స్వర్గం కళ్లముందు ప్రత్యక్షం! శాస్త్రితో చెప్పాలని వుంది కాని యీ కబురు టెలిఫోనులో ఎలా చెప్పను - ఏమని చెప్పను? ఖబురు తెలియడంతోనే పరుగెత్తు కొస్తాడు! ఎండచూస్తే నిప్పులు కురుస్తూంది. శాస్త్రి వచ్చే వరకూ నా రహస్యం నా కడుపులోనే దాచుకుని వుంచు కోవాలి అదేమిటో తమాషా! శాస్త్రి నేనూ ప్రపంచంమీద వున్న సంగతులన్నీ మాట్లాడు కున్నాంగాని - "మనకి పిల్లలు పుడితేనో-" అని మాట వరసకేనా యెప్పుడు అనుకోలేదు! భార్యాభర్తల్లోనే ఇంత సిగ్గెందుకో? అంచేతే ఏమీ జాగ్రత్త పెట్టుకోలేదు. బ్యాంకులో డబ్బుందో లేదో? ఇల్లు చూస్తే బొమ్మరిల్లులాగుంది. పురిటికి బోలెడు ఖర్చవుతుంది. తోపుడు బండి వకటి కొనాలి....శాస్త్రికి కొడుకు పుడితే బాగుణ్ణనిపుస్తుంది. నాకు కొడుకైనా కూతురైనా వకటే. శాస్త్రి పోలిక వుంటేచాలు - అతని కళ్లు అతని ముక్కు అతని నుదురు! నేను ఎంత అదృష్టవంతురాలిని! మొగపిల్లాడు పుడితే శివశంకరం అని పేరు పెడతాను - మా నాన్న పేరు శాస్త్రి పేరు కలిపి ఆడపిల్లే అవుతే సీతాలక్ష్మి అని అమ్మపేరు పెడతాను. అమ్మ సంతోషిస్తుంది. "చుక్క ఎదురే మంచి రోజు చూసుకుని వెళ్లవే" అంది అమ్మ! అమ్మ అన్నట్టేఅయింది!....నా కిప్పుడు ఇరవైఐదు. నా కొడుక్కి కూతిరికీ ఇరవై యేళ్లొచ్చేసరికి నా కింకా చిన్నతనమే! యేళ్లలో ఏముంది? యవ్వనం మనసులో వుండాలికాని! కొంతమంది తల్లులు ముప్ఫై యేళ్లకే ముసిలి ముద్దలై పోతున్నారు, నా పిల్లలకి నా మీద భయం భక్తి గడగడాటు వుండలు. వుండొద్దు స్నేహం ప్రేమ గౌరవం వుండాలి నా కోరిక అదే!

శాస్త్రి ఇప్పుడురావాలిటు! అతనురాగానేఅంటానూ? శాస్త్రి! నువ్వుతెలివైనవాడి

అవుతే ఒకరహస్యం పోల్చుకోగలవూ చూస్తాం ?" యేమిటో అనుకుంటాడు - పాలవాడు ఈ వేళ ఒక అళాకు పాలు హెచ్చుకొలిచాడనో - లేకపోతే చాకలి అనుకోకుండా నాలుగు రోజులు ముందుగానే చలవబట్టలు తెచ్చాడనో - ఏదో ఇలాంటివే అనుకుంటాడు. నా దగ్గిర కూర్చోమంటాను. కళ్లుమూసుకోమంటాను. మెల్లిగా చెవిలో రహస్యం చెపుతాను. మొదటి బోధపర్చుకోలేక పోతాడు. తరవాత - సంతోషం పట్టలేక పోతాడు - నన్ను నెత్తిమీద పెట్టుకుని - పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నాడు. సూర్యకిరణంలో నృత్యంచేస్తున్న రేణువులలాగు సముద్ర కెరటాలమీద తేలిపోతూన్న నురగలాగు - ఉంది నా మనస్సు! సంతోషం భరించలేనేమో ననిపిస్తూంది! ...ఉండి వుండి - ఒక్క భయం వేస్తూంది. మాతృత్వం - పితృత్వం - యీ బాధ్యత నెరవేర్చగలమా - నేను శాస్త్రిన్ని? మానవుడి బాధ్యతలన్నింటి కంటే అతి ప్రాముఖ్యమైనదే - మేం ఏతర్ఫీదు లేకుండానే ఇందుకు పూనుకున్నామే? ఈ విషయంలో - మా పనిమనిషి తాయారు ఆమె మొగుడు కన్నయకంటె మేము ఏమి మెరుగు? వాళ్లకంటె మాకు కాస్త డబ్బు, కాస్త చదువు, కాస్త జ్ఞానంవుంది. అది చాలుతుందా - పిల్లలను పెంచి, చదువుచెప్పించి, దేశానికి సమాజానికి పనికివచ్చే లాగ చెయ్యడానికి? నేను పిరికితనం పడకూడదు. సంతోషంగా వుండాలి ..శాస్త్రి అనుకోకుండా అరగంట ముందుగా వచ్చాడు. నేను - రావాలి - రావాలి - అని మనస్సులో కోరబట్టే! లేకపోతే - యీ కొత్తప్రాణి పిలుపు అతని హృదయానికి అప్పుడే వినిపించిందా? శాస్త్రీ! నా పంచప్రాణాలు నీవే! యీ నూతన ప్రాణికూడా నీదే! కాశ్మీరులో ఆ తేనెవెన్నెల రోజులు జ్ఞాపకం వచ్చాయి. జ్ఞాపకం తెచ్చుకుని మహదానందం పొందేం! భాష్యం వచ్చాడు. అతనితో చెప్పాం. మమ్మలిని అభినందించాడు

## 26

### అతడు

బాబిగాడొకడొస్తున్నాడని నిన్న శాంతం చెప్పింది. ఆ నిమిషంనుంచీ ప్రపంచకం అంతా ఒక్కసారి మారిపోయింది! ట్రాముమీద కోర్టుకెళుతూంటే - అంతా పచ్చగా కన్నులపండుగలాగుండెను. బండిలో జనం తోసుకుంటున్నా - నన్ను చూసి వెంటనే స్థలం ఇచ్చారేమో అనిపించింది. కండక్టరు రోజూ "టిక్కట్టు - టిక్కట్టు" అంటూ చెవులో గర్జించేవాడా - అటువంటిది - ఈ వేళ దగ్గిరకొచ్చి ఎంతో మర్యాద

దగా టిక్కెట్టు ఇచ్చాడు. రిక్ షావాడు రోజూ ధుమ దుమలాడుతూండేవాడు-ఈ వేళ “దయచేయండి - స్వామీ !” అని నవ్వుతూ ఆహ్వానించాడు ! కొసకి - కూమ్నదికూడా కొత్తపేట దగ్గిర గోదావరిలాగు అనిపించింది. నా మనసులో సంతోషం ప్రకృతి అంతటికి ఎలా తెలిసిందో!

ఇదంతా శాంతం మహిమ. ఆవిడ చల్లదనం. తన సర్వస్వం నాకు అర్పణచేసే సింది. నేనేం బదులు ఇవ్వగలను ఆమెకు ? సరిగ్గా ఇప్పుడే యీదరిద్రం వచ్చిపడాలా? ఈ పేదరికం - దమ్మిడీదగ్గరనుంచి జాగ్రత్తపడవలసిన అవసరం - లేకుండా - ఆ ఘడి వేలూ ఇప్పుడుండివుంటే యీ బజార్లలోవుండే చీనీ చీనాంబరాలు - ముత్యాలు నగలు వజ్రాలు - కస్తూరిపునుగు జవ్వాది సువాసన ద్రవ్యాలు - గులాబి చేమంతి కనకాంబ రాలు - సమస్తం ఆవిడకాళ్ళ ముందర పడేసివుందును ! ఎల్లకాలం యీ బీదతనం లోనే వుండిపోతామా ? నేను లక్షలార్జించి తీరుతాను. శాంతానికి - లేమి అంటే యేమిటో మర్చిపోయేటట్టు చేస్తాను. న్యాయంగానే డబ్బుఆర్జించొచ్చు. బాబిగాడికి చిన్నప్పటినుంచి నర్సునుపెట్టి - ఉగ్గుపాలతోనే ఇంగ్లీషు నేర్పిస్తా. పదేళ్ళువచ్చేటప్పటికే వాడిని సీమ పంపించేస్తా. రెండేసి సంవత్సరాలకోసారి శాంతం నేను వాడిని చూడడానికి సీమ వెళుతూంటాం. గొట్టికాయలు గోణీబిళ్ల ఆడే వయస్సు వచ్చేటప్పటికల్లా - వాడికి క్రికెట్టు బోలింగు నేర్పేసేస్తా. సాయంత్రం పొద్దున్న ప్రయివేటు మేష్టర్లని పెట్టి అన్ని పరీక్షల్లోనూ మొదటి వాడుగా ఉత్తీర్ణుడయేటట్టు చేస్తా. ఎవరీ అబ్బాయి - అని అందరూ అడగాలి. అప్పుడు: “ఫలానా బారిష్టరు శాస్త్రీగారి మొగచిన్నవాడండీ!” - అని దగ్గిరవుండే వాళ్ళుఅనాలి ! చులాగ్గా ఐ. సి. యస్ ప్యాసై కలక్టరుగా చక్కా వస్తాడు. తనకొడుకు జిల్లాకలక్టరుహోదాలో వున్నాడంటే శాంతానికి ఎంతసంతోషం గాను - గర్వంగానూ వుంటుందో చెప్పేదేముంది ! మాచుట్టరికం కావలసి - ఎంతమందో శాంతాన్ని ఆశ్రయిస్తారు. వియ్యంకుడు బారిష్టరు. అల్లుడు జిల్లాకలక్టరు ! శాంతానికి కోడలిని ఎంచుకోవడంతో సరిపోతుంది ! ...ఇంతకీ శాంతం ఏమంటుందో ? అనేదే మిటి ? ఆడపిల్లల కాలేజీలో ప్రొఫెసరుగిరీ చేసినంతమాత్రాన లోకానుభవం ఎక్క డిదీ ? బాబిగాడి పూచీ అంతా నామీదే వదిలి పెట్టేస్తుంది - నాకు తెలుసు శాంతం మోస్తరు.

ఈ ఖబురువిని మా అత్తగారు చాలాసంతోషిస్తుంది. దీంతో ఆవిడకి నాకు రాజీకుదిరిపోతుంది. శాంతం ఆవిడపేర వుత్తరం వ్రాస్తే అందులో నేనూ వకముక్క పెట్టాను - శాంతానికి సాయంగా వుండడానికి మీరు రావాలీ - అని. మామయ్యగారి పేరు పెడితే మరీసంతోషిస్తుంది. ఆవిడస్వంతం ఇరవైఎకరాల పొలంవుంది. ఆవిడకి మరెవరున్నారు ? అనవసరంగా ఆ ధర్మానందస్వామి పీఠానికి వ్రాసేస్తుంది - బాబి గాడు మీఅభిమానపుత్రుడండీ అని మనమే అంటూంటే తీరిపోతుంది. నాన్న పేరు పెట్టను. ఆయన నాకు జ్ఞాపకమేలేదు. ఒక్కటి మాత్రం జ్ఞాపకంవుంది నాకు అప్పుడు

ఆరోయేడు. భోంచేస్తూన్నాం. అమ్మ అరటికాయముక్కలు వడ్డిస్తూంది నాన్న విస్తట్లో ముక్కలు కొంచెం మాడిపోయాయని నాన్నకికోపంవచ్చి - అమ్మని చెళ్ళని వక్కలెంపకాయ కొట్టాడు. అమ్మయేమీ అనలేదు. నేను ఏడవడం మొదలెట్టాను. ఇప్పటికీ కళ్ళకి కట్టినట్టుంది. ఆ రోజునుంచి నాన్నమీద గౌరవం పోయింది. చనువుపోయింది. మరిరెండేళ్ళకి ఆయన పోయాడు. ఆరునెలలకి అమ్మ పోయింది. నా కచేరీ గదిలో నాన్న అమ్మ ఫోటోలు పెద్దవి చేయించి గిల్టుచట్రాలు కట్టించి పెట్టించాను. పదెక రాలు మాగాణి ఇరవైవేలు రొఖ్ఖం మాకు అట్టే పెట్టే పోయాడు నాన్న. కాని చిన్ననాటి ఆ దృశ్యం ఇప్పటికింకా కళ్ళకి కట్టినట్టుంది. ఇందులో విడ్డూరం ఏమీలేదు. పెనిమిటికి పెళ్ళాన్ని కొట్టడం లోకరివాజు. పద్ధతికి అంగీకారమే. పెళ్ళాం పెనిమిటిని కొట్టిందంటే సహించండి మొగాణ్ణి చూసి అసహ్యించుకుంటారు- మిగతా సగంమంది తట్టా బాజా కడతారు.- అంతేవ్యత్యాసం. శాంతం నన్ను కొట్టడమే? తల్చుకుంటేనే నవ్వొస్తూంది ! శాంతంతో చెప్పాలి !

చింతాద్రిపేటలోనుంచి ట్రాము వెళుతూంటే కనబడ్డారు పిల్లలు - వంటిమీద నూలు పోగులేదు. నడుముని మొలతాడులేదు. మట్టి కాలువలో ఆడుతున్నారు. దేముడు మేలుచేస్తే - బాబికి బిడియకం అంటే ఏమిటో తెలియకుండా వుండాలి ! కూలినాలి చేసుకునేవాళ్లకి మన్నన పరిశాణం అలవాటే అయిపోతుంది. శుభ్రంగా వుండడం అంటేనే వాళ్లకి కిట్టదనుకుంటాను. ఎంత చేసుకుంటే అంత అనుభవించి తీరాలి. ఎన్ని శాస్త్రాలు చదువుకున్నా చివరకి అంతే ! ఎవరేంచేస్తాం ?

...అబ్బ ! ఎంతవేగిరం ఇంటికి వెళిపోదాం అంటే అంత ఆలస్యం చేస్తున్నా డేమిటి - యీవేళ ? తీరావెళ్లిపోయాక అప్పుడు పిలుస్తాడో ఏమిటో ? అత్తావకరింట కోడలే అన్నసామిత జూనియరుగా వున్నప్పుడు పడ్డబాధలు నేనైతే మర్చిపోను! అన్నట్టు – మర్చిపోకుండా రేపో ఎల్లుండో గులాబీపువ్వులు స్పెన్సరులోకొని పంపించాలి శాంతానికి. ఎర్రగులాబీలుఅంటే ప్రాణం ఆమెకి. పదిరూపాయలవుతే అవుతుంది.

## 27

### ఆమె

"చూడిదే-చూడిదె ! " అంటూ కెంపుసేన్ల గులబీజాంమిఠాయిపొట్లం తీసుకొచ్చి చేతిలో పెట్టాడు. శాస్త్రికి ఇంకా చిన్నతనం పోలేదు ! రాత్రి ఇద్దరం కలసి

మిఠాయితిన్నాం. శాస్త్రి కోర్టుకు వెళ్ళిపోయాక – నేను మరో రెండు రుచిచూద్దాం అనిపొట్లంతీశాను. ఇంతట్లో దయామణివచ్చింది. దయామణి నాదగ్గిర క్వీనుమేరీసులో ఇంటర్మీడియేటు చదువుతుంది. ఆ అమ్మాయి అంటే నాకెంతో ఇష్టం. ఇంటరు ప్యాసయాక ట్రెయినింగై – వాళ్ళవూళ్లో ఆడపిల్లల బడిలో మూడవఫారం మేష్టరుగా వుందిట. ఆ అమ్మాయి కాలేజీ వదలిపెట్టాక నేనిదేచూడడం. ఈ వూళ్ళో ఎవరో బంధువులుంటే చూడడానికి వచ్చిందిట. నాలుగురోజుల క్రింద తను వాళ్లవాళ్లతో యీ వీధిలోనుంచి వెళుతూండగా నేనిక్కడ రిక్షా నుంచి దిగడంచూసి, అప్పటినుంచీ రావాలని ప్రయత్నం అంది.

ఇద్దరం బాతాఖానీకొడుతూ మిఠాయిఫలహారం చేశాం. "మేష్టరు ఉద్యోగం అంటేనీకు మొదటి దగ్గిరనుంచీ సరదావేగా – ఎలావుంది?" అని అడిగే. "మొదటి ఉత్సాహం క్యాతా ఇప్పుడు పోయిందండీ, శాంతంగారూ! ఇనస్పెక్టర్లూ, ఇనస్పెక్ట్రెస్సులూ పద్ధతుల ప్రకారం పోవాలి – తు – చ – దాటకూడదంటారు. మేం చెప్పేది పిల్లలకి అర్థంకాదు. అసలు నిరర్థకం. ఆడపిల్లలలో ముప్పాతిక మూడువంతులు మూడోఫారం తరువాత చదువే మానేస్తారు. అటువంటి వాళ్ళకి ఎందుకండీ మేం చెప్పడం – పుష్యమిత్రుడు – వాడికొడుకు అగ్నిమిత్రుడు – అగ్నిమిత్రుడుకొడుకు వసుమిత్రుడు – వాడితరువాత సుజ్యేష్టుడు – వాడికొడుకు భద్రకుడు – వాడికొడుకు పుళిందకుడు – అని? సియర్రాలియోను ఆఫ్రికాలో వుంటే వాళ్ళకేం కావాలి – అమెరికాలో వుంటే వాళ్ళకేం కావాలి – నాకేం కావాలి – చెప్పుదురూ? వాళ్ళకింతా ఎందుకు నూరిపొయ్యడం? వెనకటికి మనవాళ్లు చిత్రవధ చేసేవాళ్ళుట – నీళ్ళు తాగించేయడం – పొట్టపేలిపోయే వరకూ. అలాగ్గా వుందినేం చెప్పేచదువు!" అని చెప్పుకుంటూ వచ్చింది ... నేనూ నాలుగేళ్ళు బి. ఏ. పిల్లలకి అర్థశాస్త్రం చెప్పేను – ఎంతో సరదాగా చెప్పేను. కాని చిన్నపిల్లల చదువులు గురించి ఎప్పుడూ కించిత్తుకూడా ఆలోచించలేదు. దయామణి చెప్పిన విషయాలు గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాను. రేపు పొద్దున్న నాపిల్లలకి చదువు చెప్పించడంలో ఏ విధానం అవలంబించాలి? శాంతినికేతనం – గురుకులం – అడయార్ – ఇంద్రప్రస్థం? నాకేం తోచడంలేదు. కొత్తచదువులు చెప్పిస్తే పిల్లలకి – స్వయం ప్రాముఖ్యత – అహంభావం – గొప్పఘోటు – అలవాటైపోతుందేమో? మొదటితరగతి రైలు ప్రయాణీకులు మూడోతరగతి రైలు ప్రయాణీకులని చూసినట్టు? నలుగురితో నారాయణ అంటేనే మంచిది. శాస్త్రి ఏమంటాడో? జాగ్రత్తగా ఆలోచించాలి.

సాయంత్రం నాదబ్రహ్మ సభవారి పాటకచేరీకి వెళ్ళాం. ఎవరో దక్షిణాది ఆయన గాత్రం. మొదట స్వాతి తిరుణాల్ కృతులు – "పాహిజగజ్జనని" హంసానందిలోనున్న "కృపయపాలయ" చారుకేసిలోనున్న పాడాడు. తరువాత – "నీదుసరణములే" అని త్యాగరాజు కృతి సింహేంద్ర మధ్యమంలో అందుకున్నాడు. అక్కడ నుంచి శాస్త్రి: "సరణములేమిటి? వీడి శ్రార్ధం!" అని చీదరించుకున్నాడు. "తెలుగు

రానివాళ్లు తెలుగుకీర్తన లెందుకుపాడాలి?" అని వకటేసణుగుడుతో చంపేశాడు. మధ్యమావతిలో శుద్ధానందభారతి కృతి "ఆనందనటనం" పాడేక మళ్ళీ త్యాగరాజుది ఆరభిలో "సాలకల్లలాడు" అని. దాంతో మండిపోయాడు. ధేనుకలో "తెలియలేరురామ" అని ప్రారంభించేసరికి కోపంపట్టలేక కూచున్నవాడల్లాలేచి పోయాడు. కొసకి "తెలినే నేసినగూజాబలమూ" అని మొదలుపెట్టేసరికల్లా అగ్నిహోత్రం అయిపోయి: "శాంతా! ఇహ నేనిక్కడ వుంటే ఖూనీలు అయిపోతాయి. నేను బైటగుమ్మంలో నీకోసం వుంటాను. యీ ఘోరాతిఘోరం అయాక నన్నక్కడకలుసుకో" అంటూ చక్కాపోయాడు! మరో నాలుగు కీర్తనలు శ్యామ శాస్త్రిలవారివి, దీక్షితులవారివి అయాక సభ అయిపోయింది. నేను గుమ్మందగ్గరకివెళ్లి చూదును — శాస్త్రి లేడు. పావుగంట చూశాను రాలేదు. నాదగ్గిర కానీ లేదు సరేకదా ఇంటితాళాలు శాస్త్రిదగ్గిర వుండిపోయాయి. యేం చేయను — ట్రిప్లికేను నడిచిపోవాలి — ఎలాగా అని అనుకుంటూ నాలుగు అడుగులు వేశాను ఇంతట్లో భాష్యంకారు నాప్రక్కకి వచ్చినిలబడింది. డ్రైవరు వెళ్ళొచ్చి: "అయ్యగారు మీరు ఒంటరిగా నడవడం చూసి ఆయన మరొకరి బండిలో వెళ్ళిపోయి మిమ్మల్నిన్ని ఇంటికి దిగబెట్టమని కారు పంపించారు" అన్నాడు. సరే అని ఎక్కాను. రాండుతానాదగ్గిరకి వెళ్ళేవరకు నాకు — ఎవరేనా చూస్తే ఏమనుకుంటారో అనిపించి — దిగిపోయి — కారుని వెళిపొమ్మన్నాను. అక్కడనుంచి ఆ రవంత దూరం — పైడోజీవీధిలో ఇంటికి చేరుకునేవరకు నిమిషం — వకయుగం అనిపించింది. కాళ్లకి రాళ్లుకట్టినట్టు ముందుకు అడుగు పెట్టలేను. చీకటిఅంధకారం — నిర్జనం — నిశ్శబ్దం. గుమ్మంలో శాస్త్రి నా కోసం కాసుకునివున్నాడు — అతనిచేతుల్లో వ్రాలిపడ్డాను. పాపం! శాస్త్రి నన్ను మేడమీదికెక్కించి, వేడి వేడి కాఫీ పెట్టిఇచ్చి — అరికాళ్ళకి నూనెరాసి — వొళ్ళంతా పట్టాడు. "నానించే వక్కర్తవీ యింతదూరం నడుచుకొచ్చావు — నావల్ల ఎంతపొరపాటై పోయింది — క్షమించు!" అంటూ వకటే బతిమాలుకోవడం. "భాష్యంకారు మీద" — అనబోయి, ఎందుకని వూరుకున్నా. నిద్రపట్టిపోయిందినాకు.

## 28

### అతడు

నిన్న పాటకచ్చేరికి వెళ్ళడమే పెద్దపొరపాటూ — బుద్ధితక్కువ. నేనురాను మొర్రో అంటే నన్నీడ్చుకుపోయింది. రసాభాస — శాంతంచేత — అర్థరాత్రి చీకటిలో —

ఒక్కర్తీనే – నాలుగుమైళ్లు నడిపించానని – మా అత్తగారికి తెలిసిందో – మరి నాకు పుట్టుగతులుండవు.

"తెలిసే సేసిన గూజాబలమా" అని తెలుగు తల్లిని వాడు నరికేస్తుంటే నేవింటూ ఎలాకూచోను? అమాంతంగా వాడి గొంతుక నొక్కెయ్యాలనిపించింది. "ఏమిటా పణుగు – వినేవాళ్ళని విననియ్యకుండాను? నీకంత కర్ణకఠోరంగా వుంటే – చెవులు మూసికునేది – లేకపోతే బైటకి వెళ్లిపోయేది" అని కాంతం అనేసరికి నాకు మరింత కోపం వచ్చేసి – పైకి వచ్చేశాను. గుమ్మం దగ్గిర సిగరెట్టు కాలుస్తూ కాలక్షేపం చేద్దాం అనుకునేసరికి – జేబులో సిగరెట్లు అయిపోయాయి. సిగరెట్లకొట్టు కోసం అలాగు వెళ్ళి చుర్కి అన్నీ మూసేసివున్నాయి. ఒకదుఖాణంలో మాత్రం బీడీలుండేను. బారిష్టరుని – బొత్తిగా బీడీలు ఎట్లా కాలుస్తాను – దేముడా రాముడా అంటూ ఇంకా వెతుక్కుంటూ వెళ్లా. శాపం పెట్టినట్టు ఒక్కకొట్టూ తీసిలేదు. అప్పుడనిపించింది – ఛీ! మరి సిగరెట్టన్నది ముట్టుకోకూడదు – ఎంతడబ్బు తగలేస్తున్నాను – అని. బాబిగాడిని ఈటన్నుకి కేంబ్రిడ్జికి ఐ.సి.యస్ కి పంపించాలంటే దమ్మిడీ దగ్గిరనుంచీ కూడిక చెయ్యాలి. వాడు సీమవెళ్ళాడంటే తప్పకుండా సిగరెట్టు అలవాటు చేసుకుంటాడు. జిల్లాకలెక్టరు చేస్తూంటే ఏ అలవాటుచేసుకున్నా రాణిస్తుంది. రాజ్యభారం నెత్తిమీద వేసుకునేవాడు – రేపు గవర్నర్లకీ – వైస్రాయలకీ ఆతిథ్యం ఇవ్వవలసినవాడు – సిగరెట్టు కాల్చను – షాంపేను ముట్టను – అనడానికి వల్లా?... నేనివన్నీ అనుకుంటున్నాను కాని – తీరా ఆడపిల్లపుడితే? ఆడపిల్లనగానే భయం వేస్తూంది. – పెంచి పెద్దవాళ్లని చెయ్యడం – పెద్దపూచీ. వాళ్ళకి ఏం చదువు చెప్పిస్తాం? కాంతంలాగు అందరూ ప్రొఫెసరుగిరీ చెయ్యగలరా – సీమలో ఆడపిల్లలులాగు – మన పిల్లలుకూడా టైపు గుమాస్తాలగానో, హోటేళ్ళలోనో, షాపుల్లోనో చాకిరీ చెయ్యాలి. ఇంగ్లండులో వేరు – అలాగ మనపిల్లలు తయారవుతే మనసు వొప్పుతుందా? కాంతం వాళ్ళబామ్మ అనేదట: "పల్లెటూరి ఆడపీనుగ దీనికెందుకే చదువు – ఎవరితో నేనా లేచిపోవడానికి?" అని. నేను సీమవెళ్లొచ్చిన వాడిని అలా అనను కాని – కూతురంటే బెంగగానేవుంది. తప్పకుండా బాబిగాడే నిశ్చయం.

ఇలాగనుకుంటూనే సెంట్రలుస్టేషనుకు వచ్చేశాను – అక్కడ స్పెన్సరులో దొరికేయి బాబూ! త్రీకాసిల్సు డబ్బాకొని – సిగరెట్టు ముట్టించి – నాలుగుపీల్పులు పీల్చి – అప్పుడు గడియారం చూసేటప్పటికి కల్లా – పద్దకొండు అయింది. ఏంబుద్ధి – యీ పాటి కల్లా పాటకచేరీ అయిపోవుంటుందే – కాంతం నాకోసం కనిపెట్టుకుంటుందే – అని గాభరాపడుతున్నాను ఇంతలో వెనుకనుంచి "ఏం– శాస్త్రిగారూ! నాకు స్వాగతం ఇవ్వడానికి వచ్చారాయేమిటి బెంగుళూరు రైలుకు?" అంటూ లేడీ అయ్యంగారు ప్రత్యక్షం!– నన్ను తోసుకుంటూ తనకారులో కూర్చోమంది–జవాబు చెప్పనిచ్చిందా? ఎలాగా కాంతం యింతసేపు కనిపెట్టుకుని వుండదు – ఎవరికారులోనో యింటికి వెళ్లిపోయే వుంటుందనుకుని మనసు సమాధాన పెట్టుకున్నా. ఏముంది – ఆవిడ చమత్కార

సంభాషణతో - యిట్టే వచ్చేసింది - సైడోజీవీధి! నేనింటి గుమ్మంలో దిగిపోయాను ఆవిడా వెళిపోయింది. అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాకు - అన్నా! యింటి తాళంచెవులు శాంతం చేతిసంచీ నాదగ్గిరేవుండిపోయాయని. అసలు శాంతమే లేదక్కడ! ఏం చేయను- ఎక్కడని వెతకను - వీధి తాళంతీసి అక్కడే కూచున్నాను. మరెంతసేపు జాగారం చేశానో - చిన్న కునుకు కుడాపట్టింది. లేచిచూదును? శాంతం నాచేతుల్లో తూలుకుంటూ వచ్చిపడింది. మేడమీదకి తీసుకెళ్లి కాఫీ యిచ్చి ఉపచారం చేసేసరికి కాస్త తెప్పరిల్లింది.

"శాస్త్రీ! పాపం! నాకోసం వూరంతా గాలించేసినట్టున్నావు. నీతోకూడా నేనూ వచ్చేసివుంటే తీరిపొయ్యేది!" అంది శాంతం. "కారువేసుకుని నీకోసం పట్నం అంతా వెతికే - బెంగపెట్టుకుని నేనూ యిప్పుడే గుమ్మంలో కాలుపెట్టా. పాపం - నాలుగుమైళ్ళు ఎలానడిచేవో? నన్ను క్షమించు శాంతం!" అన్నా. టాక్సీఅనుకుంది. "బోలెడుడబ్బు నానించి నిష్కారణంగా ఖర్చు!" అంది. "దానికేం! నువ్వు క్షేమంగా యింటికి చేరుకున్నావు. అంతేచాలు - దేవుడిదయవల్ల!" అనేసి వూరుకున్నా. శాంతానికి నిద్రపట్టిపోయింది.

## 29

## ఆమె

వంట్లో ఆరోగ్యంగావుంది. యింట్లో హాయిగావుంది. పరిస్థితులు సౌఖ్యంగా వున్నాయి. మనసుకు ఖుంసాగావుంది. అడుగులకి మడుగులొత్తి యేలుకునే పెనిమిటున్నాడు. నాకు కావలసిందేముంది? నాకేం కొరత? నాకడుపులోవున్న యీ మాంసపు తునక - యీ చిన్నజలగముద్ద - నామీద అప్పుడే అధికారం చెలాయిస్తోంది. ఆ క్రిమికోసం నేను పుష్టికల ఆహారం తినాలి. వేళపట్టున కసరత్తు చెయ్యాలి. నాదేహం నా హృదయం - నా ఆత్మ - అన్నీ పరిశుభ్రంగా వుంచుకోవాలి! జీవంలేదు - రూపం లేదు - వ్యక్తిత్వంలేదు - యీ అణువుకి. నా కాలు నా చెయ్యి అంటే నాకు ఎంత ప్రేమో - యిప్పట్లో యీ అణువుమీద నాకు అంతే ప్రేమ. మరికొద్ది నెలల్లో యీ మాంసపు కండరమే అనంతకోటి మానవశక్తులతో వ్యక్తిత్వం పొందుతుంది - నా ప్రేమ కూడా చిత్రంగా అలాగే ప్రతిబింబిస్తుంది. తల్లితండ్రుల ప్రేమతో పెంచితే ఆ శక్తులన్నీ - అన్నీ కాకపోతే కొన్నైనా - ప్రతిస్ఫుటం అవుతాయి...అవుతాయా? అందుకు పరి

స్థితులు అనుకూలంగా వుండొద్దా ? - ఇప్పటి రాజకీయంలోనూ, ఆర్థికంలోనూ, మానవ సమాజంలోనూ - ధర్మం, న్యాయం, సమత్వం - వీటికి తావెక్కడ ?

నిన్న వక స్త్రీ - పాపం కడుపుతో వుంది - తిండిలేక వీధిలో పుల్లిస్తరాకులకుప్ప కెలుకుతూంది. నాకు జాలేసింది. గూడూరు అభ్రకపుగనులలో పనిచేస్తూండేదిట. రోజుకి కూలిడబ్బులక్రింద పావలా ముట్టచెప్పేవారుట. దురదృష్టంవల్ల గర్భిణీ అయిందిట. కడుపుతో వున్న మనిషివి- సరిగా పనిచెయ్యలేవు- మాకుగిట్టుబాటు కాదు - అని చెప్పి యజమానులు పనిలోనుంచి బర్తరఫు చేశారుట. పట్నంలో కూలి దొరుకుతుందేమో అని ఆశపడి వస్తే - యిక్కడ కూలిమేస్త్రీలు - నడిమి వయస్సుదాటిన స్త్రీలనీ, యుక్తవయస్సురాని ఆడ పిల్లలనీ మస్తరులోకి తీసుకుంటారుట కాని, వయస్సులోవున్న ఆడవాళ్ళనీ, సంసారం చేస్తున్న ఆడంగులనీ అసలుతీసుకోరు - అన్నారుట. "నా గతి ఏం కాను - అమ్మా" అని భోళ్ళుని యేడ్చింది. ఆమె - నేను, ఎవరికడుపులో ఎవరు దాగి వున్నారో ? ఆమెకడుపునయే రంగూనురౌడీయో ? నా కడుపున యేశంకరాచార్యులో ? ఇటించిఅటూ ? అనుకూల పరిస్థితులు - సమాన అవకాశాలువుంటే ఆమెకు ఒక శంకరుడు నాకొక యాజ్ఞవల్క్యుడు పుట్టకూడదా? ...ఆస్త్రీకి వకరూపాయ ఇచ్చి పంపించేశాను. సిగ్గుతో తలవంచుకున్నాను......

మధ్యాహ్నం ఓవాల్టీను పుచ్చుకుని పడకకుర్చీలో కూచున్నానో లేదో-తలుపెవరో కొడితే వెళ్ళాను. స్పెన్సరుబంట్రోతు అట్టపెట్టెవకటిచ్చి వెళిపోయాడు. విప్పి చూదును-అద్భుతమైన ఎర్రగులాబీలగుత్తి! సగం సగం విడుతూన్న మొగ్గలు-ఆ వొంగిన రేకలు ఏదోరహస్యం చెప్తున్నాయేమో అనిపించింది. పట్టుకుచ్చులు ఆమొగ్గలు. కాశ్మీరు తేనెవెన్నెల-ఆ పరిమళం. శాస్త్రి కానుక ! ఎంతసునిసితమైనప్రేమ ! ఆ వేళ పాటకచేరీనాడు నాకోసం ఎంత బెంగపెట్టుకున్నాడో కదా. నన్ను వెదకడానికని టాక్సీకోసం పాతికరూపాయలేనా ఖర్చుపెట్టి వుంటాడు. ఈ వేళ యీగులాబీలు-అథమం పది పదిహేను రూపాయిలుంటాయి. యింతసొమ్ము అతనిదగ్గిరలేదే...? బాష్యాం పంపించాడేమో ? పువ్వులవేపు చూశాను-పువ్వులా ప్రణయగీతికలా - ఎర్రగులాబీలా-కెంపులతళుకా ? సువాసనా-మత్తుమందా ? మీ సందేశమేమిటి - నేతీర్చలేని కోర్కెలా ? పాపం-అతని కంటికి అవి ఎర్రగులాబీలు కావు-ప్రేమజ్వాలలు...... ఒకవేళ-శాస్త్రికోసం లేడీ అయ్యంగారు పంపించిందేమో ? గులాబీల వేపుచూశాను, ఎర్రగులాబీలా-రక్తపుచుక్కలా ? గులాబీకాదు-రక్తాక్షి. కుంకుమ చుక్కలు కావు-విషబిందువులు-ఈర్ష్యాజ్వాలలు. మీసందేశము-అసూయ పిశాచపు వికటాట్టహాసమా ? ముఖమల్ రేఖలు కావు-మండుకొరకంచులు. మీ రేకలుచింపి-మీహృదయాన్ని ఛేదించెయ్యాలని వుంది. మొగ్గలని కాలిక్రింద నలిపినాశనం చేసేస్తాను. మీరేకులనుండి మాంసపుముక్కలు కోస్తాను. మీకళ్లనుంచి రక్తపుచుక్కలు పిండుతాను......

నేనెంత పిచ్చిదాన్ని! సౌందర్యాన్ని చక్కదనాన్ని మెచ్చుకోలేని స్థితిలోకి దిగిపోతున్నానే! ఎవరికానుక అయితేనేమి? ఈ ఎర్రగులాబీల వొయ్యారాన్ని అందాన్ని చూసి ఆనందించలేకుండా వున్నానే! తల్లితండ్రుల మీదకోపాన్ని వాళ్ళపిల్లలమీదనా చూపించేది? ఔరసులు కారని పసిపాపల పీకలు పిసుకుతామా? నోరులేని జంతువులు —మాటలేని పసికూనలు—గొంతులేని గులాబీ మొగ్గలు—వీటిమీదనా మనకోప తాపాలు? తల్లిప్రేమ—సౌందర్యంయొక్క శక్తి—మంచితనం యొక్క మహిమ—వీట్లని పెంపొందం చడం పోయి నాశనం చేయడమా? హాయుదేవుణ్ణి పూజించినప్పుడూ వక్కలాగేవుంది —మానవసమాజం. మట్టిదేవుణ్ణి పూజించినప్పుడూ వక్కలాగేవుంది. డబ్బుదేవుణ్ణి పూజిస్తున్నాం- ఇప్పుడు అంతకంటే దుర్న్యాయంగా వుంది. ఇహ - మరదేవుణ్ణి పూజిస్తే ఎలావుంటుందో? యింతకంటే అధోగతిలో మాత్రం వుండదేమో? భావలోలత్వంలో పడిపోకూడదు. యీ ఎర్రగులబీ మొగ్గలని గాజుకూజాలో జాగ్రత్తగావుంచి పడక గదిలో వుంచుతాను.

## 30

### అతడు

కచేరీకి వెళుదాం అని ట్రాంఎక్కేను. తీరా మౌంటురోడ్డు వచ్చేటప్పటికి - "అనార్కలీ" సినిమా బొమ్మకనిపించింది. పేరుచదివేటప్పటికి లాహోరులో షాలిమారు తోట- ఆ తోటలో గులాబీలు - దాంతో - శాంతానికి గులాబీపువ్వులు ఇద్దాం అనుకొని వారం రోజులైపోయింది - మరిచేపోయానే అనుకున్నాను. స్పెన్సరుకు నడిచి వెళ్లినా రిక్షామీద వెళ్లినా దర్జాకి లోపం అని, ఆ రవంతదూరం టాక్సీ చేసుకువెళ్ళాను. గులాబీపువ్వులు యిమ్మన్నాను. జాగ్రత్తగా ఉల్లిపొరకాగితంలో చుట్టి అట్టపెట్టెలో పెట్టాడు. పదిరూపాయలు అన్నాడు. యిచ్చాను. "ఎక్కడికి పంపించమన్నారు" అన్నాడు. చిరునామా యిచ్చాను. "చీటీ ఏదనా యిస్తారా" అన్నాడు. మాయింట్లో యిచ్చేనేవే — అందుకు చీటీ అవుసరం లేదన్నాను. పదిరూపాయలు- టాక్సీవాడికి ఒకటియినాం - పోతే—జేబులో రూపాయిమిగిలింది.

హైకోర్టులో ఈవేళ క్రిమినలు కేసున్నూ. గవర్నమెంటు పక్షం నాకు రెండవ వకాల్తీయిచ్చారు. దావా వాదిస్తున్నంతసేపు గులాబీపువ్వులు—శాంతం- నేను—యివే మనసులో వున్నాయి. మాటలుమాత్రం నోటినుంచి అప్రయత్నంగా వస్తూన్నాయి...

"పంచాయతీ సభ్యులారా! చూడండి—యీ స్త్రీ ఎంతపాపాత్మురాలో! చేసుకున్న పెనిమిటి దగ్గిరనుంచి లేచిపోయి పరపురుషునితో పోయింది!"...శాంతంతో నాకు మొదటిపరిచయం—తాగిన రిక్షావాడితో ఆమె అల్లరిపడడం—నేను అప్పుడు అక్కడికి వెళ్లడం తటస్థించడం—తరువాత రోజు సాయంకాలం సముద్రపు యిసకలో జాలారి వాళ్లపడవలనీడని కూచుని మాట్లాడుకోవడం—ఏమిహాయి అయిన రోజులు అవి!... "యిటువంటి స్త్రీలగతి యింతే! యిప్పుడు తిండిలేక—ఒక పాపానికి రెండుపాపాలు—కూమునదిలోపడి ఆత్మహత్య చేసుకోడానికి ఒడికట్టుకుంది"...కాశ్మీరు రోజులు—ఆ దేవదారులు సంగీతం—కళ్లుమెరసే ఆతెల్లని కొండలు—మనసుచెదరిపోయే శాంతం సౌందర్యం—చల్లని నీటికొలనులలాంటి ఆమెకళ్ళు—అర్థంలేని సంభాషణలు—నవ్వులు—బుజ్జగింపులు..."తనగర్భంలోవున్న—శిశువు ప్రాణాన్నికూడా తనవ్యభిచారానికి తనద్రోహానికి బలి యివ్వజూచింది. ఆత్మహత్యకంటె మహాపాతకం భ్రూణహత్య అంటారు మన శాస్త్రకారులు!"...ఎంతఆన్యోన్యం! ఆమె అనురాగం—ప్రేమ—ఆపేక్ష—అనురక్తి—మా యిద్దరిదీ ఒకటేమాట—ఒకటేప్రాణం—ఒకటే ప్రణయం—ఒకటే ఆత్మ—అర్థనారీశ్వరం!...... "అంతేకాదు—తనకడుపునకన్న రెండేండ్ల పిల్లని ఆకూములో పారేసింది. ఆత్మహత్య—భ్రూణహత్య—శిశుహత్య! పంచమహాపాపి! చుప్పనాతి! తాటకి! ఈ పిశాచికి యావజ్జీవపు కారాగృహశిక్ష విధించవలసిందని నా ప్రార్థన!"......డబ్బు కూడబెడుతున్నాను—శాంతం నన్ను దైవసమానంగా పూజిస్తూంది—ఆమె రూపలావణ్యం—నూరురెట్లు యినుమడించింది—బాబిగాడు కూడా వస్తూన్నాడు—ఆమెసంతోషం—గులాబీ అత్తరు పరిమళం!......

...గుమ్మంలో కాలుపెడుతూనే అడిగేను: "శాంతం! పువ్వులు వచ్చాయా?" అని. "ఏం పువ్వులు?" అంది. అని వక్కనిమిషం వూరుకుని: "ఓహో! లేడీ అయ్యంగారు నీకు పంపించిన పువ్వులా?" అంది. విని నేను గాభరాపడ్డాను. కొంపతీసి—ఆవిడ పంపించిందేమిటి? ఆవేళరాత్రి కారులో ఏదో అంది! కొంచెము బుకాయించి చూద్దాం—అని; "లేడిఅయ్యంగారు ఏమిటి—నాకు పువ్వులు పంపించడం ఏమిటి? ఆమాట కివస్తే—ఒకవేళ భాష్యం నీకుపంపించాడేమో? అన్నా. "భాష్యం ఎవడు?" అంది. "ఎవడా? ముప్పైమూడుకోట్ల లింగాల్లో బోడిలింగం!" అన్నా. 'నిష్కారణంగా అతన్నెందుకు—అనడం? ఆ మాటకివస్తే లేడీ అయ్యంగారే విరుబోడి—తరుబోడి!" అంది. నాకు చాలాకోపం వచ్చింది. "నేను ఒప్పుకోను ఆవిడే తలబోడి అంటె"—అన్నాను. అని శాంతం శ్లేషభోధపర్చుకుని ఫక్కునవ్వాను. శాంతం కూడానవ్వింది. "శాంతం! ఆ గులాబీలు నేను నీకుపంపించా—కావలస్తే యిదిగో స్పెన్సరు రసీదు" అని కాగితం జేబులోనించి తీసి చూపించా. శాంతం లోపలిగదిలోనుంచి ఎర్రగులాబీలు వుంచిన గాజుజాడీ తీసుకొచ్చింది. "నీముఖాన్న వున్న కుంకుమ—నీఅరచేతిలో గోరింటచుక్క—నీ పాదాలమీద లత్తుక—తాంబూలంతో పండిన నీపెదిమెలు—యీ ఎర్రటి

గులాబీమొగ్గలు !" అని ఆమెను నాదగ్గిరకు తీసుకున్నా. "బారిష్టరు పార్వతీశంగారు భావకవిత్వంలోకి దిగుతే చాలా ప్రమాదమే!'' అంటూ నన్ను హాస్యంచేసింది.

"అవునుకాని – ఎర్రగులాబీలను చూడగానే నామాట ఎందుకు జ్ఞాపకం రాలేదు ?" అన్నా. "చీటీపంపించికపోతే నాకు ఎలా తెలుస్తుంది ?" అంది. "వెన కటికి ఈగ యిల్లలుకుతూ పేరుమర్చిపోతే– పేదరాసి పెద్దమ్మా – పెద్దమ్మకొడుకా – కొడుకుచేతి గొడ్డలా – గుర్రంకడుపులో పిల్లా - నా పేరేమిటి ? – ఇ – హీ – హీ – ఈగ – అందిట. అలాగ్గా - నీలోనాంకున్న బాబిగాడు చెప్పలేదూ – నాన్న పంపించే దని ?"

"నువ్వుత్త వెర్రినాగన్నమ్మవోయి - శాస్త్రీ !" అంది. ఆమాటలు విని నేనెంతో గర్వపడ్డాను.

## 31

### ఆమె

లక్ష్మికి అప్పుడే పదోనెల! పురిటిరోజు తల్చుకుంటే భయంవేస్తుంది. ఆసుపత్రి. మంచంమీద పడుకున్నా. తెల్లటి యిస్త్రీదుస్తులు వేసుకుని యిద్దరు మంత్రసానులు. కార్బాలిక్కు లోషనువాసన. రెండుగంటలై కాలుతూన్న సూదులతో కడుపులో పొడిచేస్తూన్నట్టుబాధ. నరాలు అవయువాలు - అన్నీ తోడేస్తున్నాయి. భరించడానికి శక్యంకావడంలేదు. నోటంట మూలుగు. మూలుగుల్లా కేకలు. కేకల్లా అరుపులు. ఆ గొంతుక నాదికాదు. ఎవరిదో – అమానుషం – భయంకరం. ఇదేకాబోలు – ప్రాణం ఆఖరు – ఊపిరి ఎగిరిపోతూంది – అంధకారం ఆవరిస్తోంది—

... "శాంతమ్మగారూ ! చులాగ్గాపురుడు పోసుకున్నారు – చక్కని ఆడపిల్ల— ఆరుపౌనులు బరువు – ఒక్కమాటు చూడండి!" అని మంత్రసాని అంటే కళ్ళువిప్పి చూశాను – బంగారపుఛాయ. చేతితో ముట్టుకున్నాను – నవనీతం. ముద్దుపెట్టుకున్నాను – పెదిమెలు గులాబీరేకలు. కెవ్వుమని ఏడ్చింది. నాకడుపులోనుంచి ప్రేమతరంగాలు కొట్టుకువచ్చాయి. అంత నీరసంలోనూ – చేతులు చాచి పాపాయిని తీసుకుని జోకొట్టేవరకు ప్రాణానికి తృప్తిలేక పోయింది. ఈ ప్రేమ నాకుఎక్కడనుంచి వచ్చింది? యిన్నాళ్ళూనాలో ఎక్కడదాగివుంది? శాస్త్రితోనాకు మొదట పరిచయం ఐన

ప్పుడూ అలాగేఅనిపించిది - యితను పరపురుషుడు కదా ? యితని మీద నాకు మోహం ఎట్లావచ్చింది ? ఏమిటీ బంధం ?- అని. ఆ మోహం యొక్క రూపాంతరమే పాపాయి మీద ప్రేమ అనుకుంటాను. ఆ రోజుల్లో - శాస్త్రి నవ్వితే నా మనస్సులో పువ్వులు వికసించేవి. అతని ముఖాన్ని కొంచెం కోపం కనిపిస్తే - నా హృదయంలో అంతా చీకట్లు కమ్మేసేవి. ఈ పసిగుడ్డు పుట్టి ఒకదినం కాలేదు - యిది ఏడ్చి దీనికంట నీళ్లు కారితే - నాకంటినుంచి రక్తపుచుక్కలు కారినట్టువుంది. యిది హాయిగా నిద్దరోతే - నాకు ఆనందం - నిర్వాణం....

...శాస్త్రివచ్చాడు. ముఖాన్ని రక్తంలేదు. నాకోసం బెంగపెట్టుకున్నానన్నాడు. ప్రక్కమంచంలో పడుకున్న పాపాయిని చూశాడు. ముఖాన్ని సంతోషం! "శాంతం మూడుమూర్తులా మళ్ళీ నువ్వేసుమా!" అన్నాడు. ఆసంతోషంలో - మంత్రసాని వుందని చూచుకోకుండా - నన్ను ముద్దుపెట్టుకున్నాడు. రెండునక్షత్రాలు - రెండుప్రపంచకాలు - రెండుఆత్మలు - మిళితం అయాయి - జంటగులాబీపువ్వులు నిండుగా విడ్డాయి-అనిపించింది. సూర్యునితేజస్సు భూదేవత మీదపడితే చందమామ అవతరించింది- అన్నాను. "నీస్వరం - వేణుగానం" అన్నాడు. పాపాయిని ముద్దులాడేడు. "అదిగో! నవ్వూ! దీనికెక్కడనుంచు వచ్చిందోయి - శాంతం యీనవ్వూ?" అన్నాడు. "ఎక్కడనుంచా? శ్రీకృష్ణమూర్తి వేణువు విని రాధిక నవ్వితే - ఆనవ్వు నక్షత్రంఅయి - పాపాయి పెదిమెలమీద వాలింది!" అన్నా. "ఆ రక్తగులాబీ పువ్వు బొడ్డులో దాకున్న పరిమెళం" అన్నాడు శాస్త్రి ..చిన్నప్పుడు - బామ్మ నాన్నతో పోరుపెట్టేదిట: "అబ్బాయి! దీనికి ఓ - నా - మా - లెందుకురా? చదువుకున్న ఆడదాన్ని ఎవడు చేసుకుంటాడురా?" అని. ఆమాట జ్ఞాపకం వచ్చిందినాకు. "ప్రపంచకంలో యింతమంది వుండగా ఏమిచూసి నన్ను చేసుకున్నావు శాస్త్రి?" అన్నా. దగ్గిరకొచ్చి - నా తలనిరుముతూ - నలోపాఖ్యానంలో పద్యం చదివేడు కూనిరాగంతో:

> "రజనికరానన - మేచకకుంతల - రాజితరాజసుతన్ - విలసద్గజపతిగామిని - చందనగంధి - ప్రకాశిత - కాంతి సమన్విత - పంకజ దళలోచన - చూచి - కిరాతుడు - కామనిశాతశరాహతుడై - నిజబంధం బెరింగిచె-లాతాంగికనింద్యచరిత్రకు - వేడుకతోన్॥"

...భారసాల చేసుకోవడానికి రాజమహేంద్రవరం రమ్మనమని అమ్మవ్రాసింది. కాని మేమే ఇక్కడకు రమ్మనమని వ్రాస్తే వచ్చింది. అమ్మ పేరు పెట్టాం పాపాయికి. అమ్మ కొన్నాళ్ళిక్కడ వున్నతరువాత నన్ను పాపాయిని రాజమహేంద్రవరం తీసుకు వెళ్లింది. గోదావరినీళ్ళు గోదావరిగాలి పిల్లలకి మంచిదంటుంది - అమ్మ! శాస్త్రినన్ను ప్రయాణంచేసి పంపించాడు. నేను పాపాయి పట్నంవచ్చి అంతా నెల్లాళ్ళైంది.

## 32

### అ త డు

ఈవేళ ప్రొద్దున్న పదిపదకొండుగంటలకల్లా పురుడువస్తుందని చెప్పింది వైద్యు రాలు. నిన్నటి సాయంకాలంనుంచి బాధ పడుతూవుంది. ఈవేళ భోంచేయబుద్ధి పుట్ట లేదు. నాలుగుముద్దలు మింగి ఆసుపత్రికెళ్ళాను. లోపలిగదిలో శాంతం వుంది. నేను పైరసారాలో నిలబడ్డాను. శాంతం మూలుగు వినిపిస్తూంది ఆమూలుగకు అంతంలేదు. వింటూంటే నా హృదయం ఛేదించుకుపోతుంది. మూలుగు హెచ్చుఅయి - కేకలు విని పించేయి. మొదట నేను శాంతం గొంతుక కాదనుకున్నాను. కాదు శాంతందే! అబ్బ- యమబాధ పడుతూందే! నేను పచారు చేయడం మొదలెట్టాను. ఇద్దరు వైద్యులున్నారే? ఆమెను ఆబాధనుంచి తప్పించలేకపోతే వీరంతా వుండి ఎందుకు? మంత్రసాని గదిలో నుంచి తొంగి చూచింది. నేను గాభరాగా వెళ్లిఆమెను అడిగేను. "గుణ్ణును బైటపడని స్తారా - మీతొందరేనా? కాస్తఓపికపట్టండి - మీ ఆవిడ ఖులాసాగా నీళ్ళాడు తోంది!" అంది, గుంటవైగా అయింది. యీ మూలుగేమిటి? యీ యాతనేమిటి - ఖులాసాగా నీళ్లాడడం ఏమిటి? ఇంత పాషాణహృదయమా యీ మంత్రసానులది - అదిగో మళ్లీ వినిపిస్తూంది - దుఃఖంతో నాకడుపు తరుగుకుపోతూంది వస్తూంది - నిలువ దొక్కుకుంటున్నాను. పెదిమెలు కరుచుకున్నాను. పిడికిలి గోళ్ళు అరచేతి మాసంలోకి పోతున్నాయి...మా యిద్దరి జీవితానికి యిదేనా ఆఖరు? ప్రేమఘట్టానికి యిదినాంది అనుకున్నానే. శాంతాన్ని నేను మొదట మెరీనాలో కలుసుకోవడం-నిన్నకాక మొన్న లాగుంది. నేను సెనేటుహౌసుదగ్గిరవున్నాను. ఆమె ఎదురుగుండా వస్తూంది- యినుప చంతెనదగ్గిరవుంది. అప్రయత్నంగా కన్నెత్తి చూశాను. నా అన్వేషణ ఫలించిందను కున్నాను. అంతర్వాణి పలికింది. అంతర్యామి పలికేడు. నావేపుకన్నెత్తి చూడకుండానే వెళిపోతుందేమో అని పెద్దభయం పుట్టింది. అలావెళిపోతే - నేనేం చెయ్యను? యిది మెరీనా - ఆమెవెంట నేను పరుగెత్తలేనే? గెండుగజాల దూరం మాకిద్దరికీని - ఆమె సముద్రంవేపు చూస్తూంది. యేమని పలుకరిస్తాను - పరాయి స్త్రీని? ఇంగ్లండులో ఒకరినొకరం చూలాగ్గా పరియం చేసుకునేవాళ్లం. యిది మనదేశం. అదిగో! తలలో ఎర్రగులాబీ పెట్టుకుంది! చేతిని వొంటిజత గాజులు - వేలినివుంగరం లేదు - మెడలో ఏమీలేదు. నుదుట చిన్న ఎర్రచుక్క! రెండడుగులు - యికనావేపు ఆమెచూచే దేమిటి - అని నిరాశచేసుకున్నా. ఆముఖం యిటువేపు తిప్పింది. చిన్నినవ్వు నవ్వింది... మూలుగు వినిపించటంలేదు? అయ్యో! ఏం ప్రమాదం జరిగింది? ఎవ్వరూ చెప్పరేమి? తలుపుతీసుకుని లోపలికి వెళుదునా? - యిద్దరు వైద్యురాండ్రు ఆటువేపునుంచి వస్తు న్నారు. వాళ్ళలో వాళ్ళునవ్వుకుంటున్నారు. శాంతం ప్రాణాపాయంలో వుంటే

వీళ్లకి నవ్వుఎలావచ్చిందీ ? నిమిష నిమిషం చావుపుట్టుకలు చూసేవాళ్లకి మనసులు కరడుకట్టుకుపోతాయి కాబోలు ఆదిగో ! తలుపుతీసి మంత్రసాని నన్నుపిలుస్తోంది. "లోపలికి రండి. ఆడపిల్ల. శాంతంగారు నిద్రపోతున్నారు. లేపకండి " అంది... శాంతం పసుపునివుంది. ముఖంలో అలసట. కాని కళకాంతులు మరింత యినుమడించేయి. ప్రక్కమంచంలో చంటిపిల్ల బంగారపుబొమ్మ. భార్యాభర్తలు-సంసారం-యమయాతన-కొత్తజన్మ - కొత్తప్రాణి. తలమీద విష్ణుపాదంతో బలిచక్రవర్తి మోక్షంపొందేడు-రామపాదాలు తగిలి అహల్యోద్ధరించింది. "నీపాదధూళి నా శిరమునదాల్తు" - శాంతం ! అని మనసులో అనుకున్నాను. శాంతం కళ్లువిప్పింది. "ఆడపిల్ల. నీకు ఆశభంగం. క్షమించు !" అంది. "నాకునుగాక బుల్లి శాంతం దొరికింది అంతకంటె కాకింకేం కావాలి !" అని - ముద్దుపెట్టుకున్నా......

బారసాలకి మా అత్తగారు వచ్చింది. ఆవిడ పేరేపెట్టేం. మనవరాలుకదా-మాగాణి ఎక్కడికి పోతుంది ? అనుకున్నా. ఆవిడ చాలాసంతోషించింది. తనతో శాంతాన్ని పాపాయిని రాజమండ్రి తీసికెళ్లి మొన్ననే పంపించింది. పాపాయితో మా యిద్దరికీబాగా ప్రొద్దుపోతూంది. పాపాయి జాతకం వేయించాను నిడమర్తిసిద్ధాంతి గారిచేత. చాలాగొప్పజాతకం అన్నాడాయన. వరలక్ష్మి వ్రతంరోజున పుట్టింది. కాబట్టి ఆమ్మాయి సమస్త ఆభరణాలు ధరించి సర్వసౌఖ్యములూ అనుభవిస్తుందన్నాడు. ఇదే కనక మొగచిన్నవాడైయుంటే మహారాజయోగం వ్రాసివుందన్నాడు. జిల్లాకలెక్టరు అవకాలిసిందన్నమాట - బాబిగాడైయుంటే! సరి - కొంచెంలో తప్పిపోయింది. శాంతంతో చెబితే ఆమెమనసు చిన్నబోతుంది.

## 33

### ఆమె

నాకుపూలు అల్లికఅంటే - చికాకు అసహ్యం చీదర కోపమున్నూ. నాకు చేత కాదు కూడాను. యీచెన్నపట్నం రాజమహేంద్రం ఎండలకి పూలు మేజోళ్ళు, పూలు టోపీలు ఎందుకో చంటిపిల్లలకి తొడగడం - దొరలపిల్లలని చూసి అదొక గొప్పకింద పడిపోయింది. శాస్త్రి కచేరీనుంచి పెంద్రాళేవచ్చాడు ఇంటికి. "యిదేమిటి - పాపాయికి వంటిమీద గుడ్డలేకుండా అలా మొండి మొరకు లాగువదిలేశావే?" అన్నాడు. "దానికి దుస్తులెందుకోయ్అందము చెడపడానికి ! చూడు - తళ తళ ఎలా మెరిసి పోతూందో !

వేళ్ళుచూడు - చామంతిపువ్వులాగు. అరికాళ్ళు అరచేతులూ చూడు. కలవరేకుల్లా లేవూ? అరటిదవ్వలాగు ఆ తొడలూ మోచేతులున్నూ!" అన్నా. "అవునులే. అయినా ఆడపిల్లకదా అని నలుగురు ముక్కుమీద వేలేసుకుంటారు. నలుగురిలాగుదానికి కూడా మేజోళ్ళు, టోపీ, పూలుకబ్బా తొడిగితే - పోయె!" అన్నాడు. "దానివొళ్ళు పొక్కి బొబ్బలు కట్టడానికి - నేను మాత్రం ఆపని చెయ్యనుసుమా!" అన్నా. "అయితే నీయిష్టం!" అంటూ కోపంతో వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఇలాగు చీటికీ మాటికీ కోపంవస్తే కష్టం. సబబు సందర్భం వుండాలి. అయినా ఇంగ్లండు వెళ్ళివచ్చిన వాళ్లకి ఇదొకపిచ్చి. ఆదుస్తులే వేసుకోవాలి. వాళ్లలాగే కత్తూలూ కఠార్లు పుచ్చుకుని బల్లమీద తినాలి- లేకపోతే గొప్ప గోటుకి లోటూఅని. ఆ భాష - ఆ దుస్తులు - ఆ మోస్తర్లు - వాటితో ధొరలు ధొరసానులూ అంటే మోజు మానసికంగాను రాజకీయంగానుకూడా. "రాజకీయంగా" అని తలవని తలంపుగా ఎలా గొచ్చింది నామనసులోకి - ఆ విషయం గురించే నేను తలపెట్టనుకదా? మునుపు కాలేజీలో పాఠాలు చెప్పినప్పుడుకూడా - బ్రిటీషువాళ్ళు మనదేశం నుంచి డబ్బుతీసుకుపోతున్నారు - మనగ్రామపరిశ్రమలని నాశనం చేశారు - మనదేశంలో భారీ పరిశ్రమలని స్థాపించకుండా చేస్తూన్నారు - అని చెప్పడమేతప్ప - రాజకీయం ఎప్పుడూ తీసుకురాలేదు. మనకిరాజకీయం ఆసలేవద్దంటాడు శాస్త్రి. అంచేత అవూసేనేను పెట్టుకోను. అయినా రోజులుహిమ.వద్దన్నా తోసుకువస్తూంది.ఆడ్డదిడ్డం అంటే వెడదిడ్డం ఎందుకు- ఒక జత మేజోళ్ళుకొందాం పాపాయికి - కొంటే శాస్త్రి సంతోషిస్తాడు అని చెప్పి పాపాయని తీసుకుని రిక్షా చేసుకుని రెన్ బెన్నెట్టుకి వెళ్లాను. రిక్షాదిగబోతున్నాను - టాపుతీసివున్న వక పెద్దకారులో దుభాషు సుబ్బరామయ్యచెట్టి గారి కూతురు అలిమేలున్నూ శాస్త్రిన్ని నాప్రక్కనించే వెళిపోయారు. మేము యీచిన్నయింటికి వచ్చిందగ్గిరనుంచీక్లబ్బు, టెన్నీసు మానేశాను. అప్పటినుంచి అలిమేలున్నూ శాస్త్రిన్ని టెన్నీసు పోటీలలోజత. ఎక్కడికి వెళుతున్నారా అని చూశా. ఎదురుగా వున్న ఆటసామానుల దుఖాణంలోకి వెళ్ళి వక పావుగంటలో రెండు టెన్నీసు బేటులు కొనుక్కుని మళ్లీ కారుఎక్కి వెళిపోయారు.

నేనూ పాపాయి వకముష్టిరిక్షాలో- అలిమేలు శాస్త్రిదర్జాగా కారులో! మానపడే స్వభావం అసూయపడే నైజం కాదు నాది. కాని-మనసు కొంచెం చివుక్కుమంది. కోపం నటించి వెళిపోయాడా లేకపోతే అకస్మాత్తుగా కలుసుకున్నారా? రిక్షాలో కూచుని యీ ఆలోచన యేమిటి అని రెన్ బెన్నెట్టులోకి వెళ్లి పాపాయికి మేజోళ్ళుకొన్నా. కొన్నానేకాని - అంతసేపు అలిమేలు శాస్త్రి దృశ్యం మర్చిపోలేకపోయాను. అలిమేలుని నాకు బాగాతెలుసు. వీళ్లిద్దరి బొమ్మలూ పత్రికలలో అనేకసార్లు చూశాను. కాని యీ వేళ ఆదోమోస్తరుగ అనిపించింది. నాలో నేను విమర్శిం

చుకున్నా. యీ రెండు నెలలయి, పాపాయి పేరుచెప్పి ఇల్లుకదలి ఎక్కడికీ వెళ్లలేను. పాపం శాస్త్రి ఎన్నోసార్లు బతిమాలుకున్నాడు - సినిమాకు వెళదాం - నాటకానికి వెళదాం — సభలకి వెళదాం - పాటకచేరీలకి వెళదాం - అని. అతనికి విసుకు ఎత్తిపోయి వుంటుంది. ఈవేళ మధ్యాహ్నమే వచ్చేశాడుకూడా - ఎక్కడికేనానన్ను తీసుకువెడదాం అనుకున్నాడో ఏమిటో - అంతట్లో ఈ అనవసరపు తర్జన భర్జన వచ్చి వెళిపోయాడు. రోజంతా ఆకోర్టులో వుండి ఇంటికివచ్చి సరదాగా గడుపుదాం అనుకునేసరికి ఆశాభంగం అయింది — పాపం. నాదేపొరపాటు. నేనే అతన్ని నిర్బంధంగా పరాయివాళ్ల సహవాసం చేయిస్తున్నా. ఈవేళనుంచీ తప్పుదిద్దుకోవాలి...అనుకుని యింటికి వెళిపోయా. నేను వెళ్లేసరికి శాస్త్రి యింట్లోనేవున్నాడు. పాపం- వకటే పశ్చాత్తాపపడ్డాడు. క్షమాపణ వేడుకున్నాడు. "కోపంవచ్చి వీధిలోకి వెళ్ళాను. పైక్రాప్టు వీధిలో అలిమేలమ్మ కనిపించి, రేపటి పోటీఆటలకి కొత్త బేటుకొనాలి- ఎంచడానికి రమ్మనమని మౌంటురోడ్డు తీసుకుపోయింది. ఇప్పుడే ఇంటికొచ్చాను- నువ్వూ పాపాయి యెక్కడికి వెళిపోయారో అని బెంగపెట్టుకుని కూచున్నా"నన్నాడు. పాపాయిని లీసుకుని ముద్దులాడేడు. ఉన్నది ఉన్నటూ చెప్పాడు కదా అని తృప్తిపడ్డాను. నా అనుమానానికి అసూయకి సిగ్గు పడ్డాను. నేను పాపాయికి కొన్న మేజోళ్ళజత చూపించాను. "అసలు నిన్నూ పాపాయిని మౌంటురోడ్డు తీసికెళ్లి పాపాయికి మేజోళ్లు టోపీ కొందాం అనుకున్నా -" అన్నాడు. మేజోళ్లు పాపాయికి తొడిగి ఆదే సంబరంపడ్డం!

## 34

### అతడు

ఈ మధ్యను శాంతం వైఖరి చూసి నాకు భయం వేసింది. పొత్తిగా ఇల్లకూచి అయిపోయింది చంటిపిల్ల తప్ప మరో వ్యావృత్తి లేదుకదా. పాపాయి పుట్టిం దగ్గిరనుంచీ నేనసలు ఇంట్లో పరాయివాడిలాగే వున్నాను. చివరికి పాపాయిమీద అసూయపుట్టింది. సరే స్త్రీ స్వభావం కదా - అని నేనే మళ్లీ బుద్ధి మళ్లించుకున్నాను. ఏమైదో-వాని ధర్మమా అంటూ శాంతానికే తోచింది — నాకు చాలా అన్యాయం జరుగుతోందని. మొన్న టెన్నీసు పోటీలకి నేను అలిమేలమ్మగారు జట్టుగా ఆడుతూంటే చూడ్డానికి

వచ్చింది క్లబ్బుకి. ఇన్నాళ్లు నివురు గప్పిన నిప్పులాగున్న మనిషి — మళ్లీ మునపటి శాంతం అయిపోయింది. మళ్లీ మునపటి ఇంటికి మారిపోగానే ఇంట్లో టెన్నీసు కోర్టు వేయించి శాంతాన్ని మళ్లీ టెన్నీసులోకి దింపాలి.

పుస్తకాల్లో చదివిన చదువుకీ — దైనందినం అనుభవానికీ — లోకజ్ఞానానికీ — ఎంత తేడా వుంది!. ఈ ఐదారు నెలల్లై క్రిమినలు రివిజను పిటీషనులలోను, సెకండు అప్పీళ్ల లోనూ కూడా గవర్నమెంటు తరపున వకాల్తీలు నాకు ఇస్తూన్నారు. మన చక్రం తిరిగి మళ్లీ మంచిరోజులు వచ్చాయికదా అని సంతోషించాను. మొన్న ఖజానా దొంగ లెక్కల కేసులో కూడా రెండో వకాల్తీ నాకే ఇచ్చారు. చాలా చాకచక్యంగా నడిపించ వలసిన కేసు. అంతా అప్రూవరు సాక్ష్యంమీద నిలబెట్టాను — కుమ్మక్కు, మద్దత్తు, అసలు నేరం మున్నూ. విచారణకి కాస్త ముందుగానే పోలీసు సూపరింటెండెంటుతో మాట్లాడుదాం అనుకుని "శాంతం! యీవేళ వంట వకఅరగంట ముందుగానే చేయి. కచేరీకి త్వరగా వెళ్లాలి" అన్నా. "యీవేళ కొంచెం ఆలస్యం అవుతుందేమోనోయ్, శాస్త్రి! అయినా ఫరవా లేదులే. తొమ్మిదిన్నరకే విస్తరివేసి వడ్డించేస్తాలే. నాఅలస్యం వుండదు" అంది. వేళకే వండిపెట్టింది పాపం! నేను మళ్లీ పంచె విప్పి సూటు వేసుకోవడం ఆలస్యం అవుతుందని బల్లమీదే వెండి కంచంలో అన్నం వడ్డించింది. పాత వుసిరికాయ పచ్చడి — జబరుగా వెల్లుల్లిపాయలు వేసిన పచ్చిపులుసు — కందిపొడుం దానిమీద వెన్నపూస — అరటికాయ ముక్కలు — అప్పడం — పేలాలవడియం — పూరిబిండి — గుంటూరు గోంగూర పచ్చడి — నిడదవోలు నక్కదోస ఆవకాయ — తూర్పు ఆవకాయపిండి — కొరివికారం — పెరుగుబిళ్ల — మొన్న సామర్లకోట దత్తుడుగారు పంపించిన చక్రకేళీలు నాలుగున్నూ — ఆలమండ ముఖాసాదారుగారు పంపించిన మల్గోవాలు రెండు భోంచేశాను కాని — కడుపు నిండినట్టు అనిపించలేదు.

...అబ్బ! ఈ ప్రాసిక్యూటింగు ఇనస్పెక్టరు ప్రాణం తీసేడు కాదూ! బెంచిమేజిస్ట్రేటు ముందు ప్రవర్తించినట్టు హైకోర్టు జడ్జీగారి ముందు ప్రవర్తిస్తే పనికొస్తుందా? అయినా — బాగాఆలోచిస్తే — ఎవిడెన్సు అక్టు — ప్రొసీజరు — అసలు కోర్టుచర్య తతంగం అంతా మారితేనేకాని న్యాయానికి దిక్కులేదేమో అనిపిస్తుంది. యీ కర్మకాండ చాలట్టు "కేసులా" వకటికదా. నేరంచేసి తప్పించుకు పోవడానికి అన్నీ సందులే — సందులేమిటి — రాజమార్గాలే! గయలోపిండం పెట్టేసినట్టు సమ్మరీగా కొంత కాండ జరిగించేసి — పద్ధతులు బిగిస్తేనే సులువుగాను, సత్వరంగాను న్యాయం ఫైసలవుతుందేమో అనిపిస్తూంది. అయితే — మాలాంటివాళ్ళపని యేంగాను అనిభయం వేస్తుంది. న్యాయశాస్త్రం వ్రాసేవారు — న్యాయశాస్త్రం వృత్తిగా అవలంబించేవాళ్ళూ వకీళ్లే అవడంచేత ఆ ప్రమాదం మనదేశంలో సంభవించదు. మాతాతగారు ముప్పై

యేళ్ళు జిల్లాకోర్టులో గవర్నమెంటు ప్లీడరీ చేశారుట - ఒక్కరోజుకూడా పోలీసు వారిని గుమ్మంలో అడుగుపెట్టనివ్వలేదట. ఖూనీకేసు వాదిస్తున్నా సరే - ముద్దాయి నిర్దోషిఅని ఆయనకి తోస్తే! "జడ్జిగారూ! నాకేసులో బలంలేదు. ముద్దాయి నిర్దోషి అతన్ని వదిలిపెట్టవలసిందని నా ప్రార్థన" అనేవారుట. కొన్ని నెలల తరుబడి జిల్లాకోర్టులో క్రిమినలు సెషన్సులే వుండేవికావుట! ఒకరోజు సెషన్సుఅవుతూందిట. జగధాత్రిపురందివాను నిర్లైతులు ఖూనీచేశారని కేసునడుస్తూంది. జడ్జిదొర. బెంచిమీదికి తాగివచ్చాడుట. వెంటనే మాతాతగారు అప్పటికప్పుడు హైకోర్టుకి టెలిగ్రాంఇచ్చి - నిమిషాలమీద సాయింకాలంలోపుగా ఆర్డరని బదలాయింపుచేయించి - ఇరవైనాలుగు గంటలలో కొత్తజడ్జి వచ్చేటట్టు చేయించారుట! నేను ఆయన్ని ఆదర్శంగాపెట్టుకుంటే ఇక ఆర్జించినట్టే! కాంతానికి మా తాతగారిగురించి చెబితే - న్యాయవాదులమీద ఆవిడకు కాస్త గౌరవం కుదురుతుంది!

సాయంకాలం ఇంటికివచ్చాక కాంతంతో అన్నా - ఏమిటి ఈవేళ ప్రొద్దున్న వాటంకంతా అసామాషిగావుంది - అని. "ఏంలేదూ - దాసీదానికి పురిటిరోజులు అంచేత నెలరోజులు శెలవుఇచ్చా. మరోమనిషి కుదరలేదు. అంచేత పొయ్యిమీద ఎసరు పెట్టేసరికే ఎనిమిదైపోయింది" అంది. "పురిటిరోజులైతే? జీతం విరగ్గోసికుని బదిలీ ఎవరి నేనా పెట్టివెళ్ళాలి. అంతేకాని - సెలవు - జీతం - వున్నా? నయం! ఇంకా రోజుకి రూపాయి పారితోషికంకూడా ఇచ్చావుకావు?" అన్నా. "నాలాగే దానిదీ ఆడ జన్మ. నేను అనుకృతిలో పురుడుపోసుకున్నా. ప్రత్యేకపుగది. నాపిల్లకి తల్లిపాలూ-పోతపాలూ - మెల్లిన్సుఫుడ్డు - గ్లాక్సో. నాకు హార్లిక్సు - ఓవాల్టీను. దానికేలాగు? రోజుకి రూపాయి సాయం చేస్తాననికూడా చెప్పా మిగతా దేశాలలో ప్రసూతికి యజమానులు విధిగా ఇస్తారని మనంచదువుకోలేదూ?" అంది. "సరి! ఇంగ్లండులో యిస్తున్నారు - రష్యాలోయిస్తున్నారు- ఇస్తేమానె! వరువడి దిద్దేనీతులు, పుస్తకాలలో చదువుకునే సత్యాలు, పాఠాలలో చెప్పే ధర్మాలు, ఉపన్యాసాలలో చెప్పే నియమాలు - ఇవన్నీ ఆచరణలోపెడితే చచ్చిపోమూ? ఇంతకీ - వీళ్ళకీ ఇలాంటివి చెప్పకూడదు. ఇప్పటికే జనాభాహెచ్చుఅయి దేశం పాడైపోతూంది. ఇహ అంట్లుతోమడానికి దాసీవాళ్ళే దొరకరు" అన్నా. కాంతాన్ని టోపీవెయ్యడానికి పని మనిషిఅలా నటించిందేమో! కాంతానికి మహా జాలిగుండె.

## 35

### ఆ మె

"నీతోనే వుంటాను - నాయుండుబావా - నీమాటేవింటాను - నాయుడుబావా
సురుకులేమి కొవలె చందనబొమ్మా - నీవుసల్లగుండుపదిదాక-నాయుడుబావా"

అంటూ గెడ్డం చేసుకుంటున్నంతసేపూ శాస్త్రి పాడుతున్నాడు! పాపం ఇంతటిలో సంతోషపడిపోతాడు. "రెడీమేడ్ వంట'' అన్నాడు నిన్న! విస్తరంటలో ఎడంచేతివేపు ఎన్నివస్తువులుంటాయో కుడిచేతివేపుకూడా అన్ని వస్తువులూ వుండాలీ- అంటూశాస్త్రించెప్పాడు. పెద్దినంవంటకావాలందూ రోజూనూ - అనబోయి నాలిక కరచుకున్నా. అన్నీ యథావిధిగా వుండాలి-అరటికాయ పప్పుకూరచేస్తే మినపబద్దల్లా వెల్లుల్లిపడాలి. బచ్చలకూర రసంవండుతే కందముక్కలు నూగింజ పంటికి రావాలి' వంకాయముద్ద వండితే జిలుగుగింజలు విధిగా వేసితీరాలి!

మొగవాళ్ళతో కత్తిమీదసామే! పొద్దున్నలేచి - ఇల్లుతుడుచుకొని- కాఫీలు పెట్టి - గిన్నెలుకడుగుకుని - తలదువ్వుకుని - కూరతరుగుకుని - ఎసరుపెట్టి - శాస్త్రికి వేడినీళ్ళు తోడిపి- అతనికి బట్టలు అందిచ్చి - పాపాయికి పాలుపోసి - వొళ్ళుకడిగి మెరుగురాసి బొట్టుపెట్టి-బొడ్డుమీదగుడ్డవేసి వుయ్యాల్లోపడుకోబెట్టి - వంటచేసుకుని- శాస్త్రికి వడ్డించి - అతన్ని గుమ్మంలో కారువరకు సాగనంపేసరికి - ఎన్నివంకలసార్లు గుంజీలు తియ్యాలో - ఎన్నిమైళ్ళు నడక అవుతుందో అతనికేం తెలుస్తుంది? "వంటేకదా- రాళ్ళు మొయ్యాలా - కొండలు కొట్టాలా ? అంటారు !"-దస్తాగిన్నెలో ఎసరుపెట్టి - "లేతప్పేళా" అని చిటికెకొడితే- పంచపక్షపరవాణ్ణాలతో అరటాకులో భోజనం ప్రత్యక్షం అవు తుందనే వాళ్ళనుకుంటారు.

శాస్త్రి మంచివాడు. బుద్ధిమంతుడు. నేనంటే ప్రేమ. అయినా అతనితో కాపురం చేయడం అంటే తెలివి తేటలు చాకచక్యం ఎంత వుండాలి? "అవిడేకేమమ్మా ? మహారాజులాంటి మొగుడు - రత్నంలాంటి కూతురు !" అంటారు. అంతేకాని - ప్రేమ జీవితం - అంటే సామాన్యమా ? ఆ మొలకకు ఎంత దోహదం చెయ్యాలి - పెనిమిటి ? చెమట చుక్కలతో - కన్నీటితో నీళ్లు పొయ్యాలి. లాలనపాలన శృంగారం సరసంతో పెంచాలి. పువ్వులతో పూజించాలి. నవ్వులతో పువ్వులుని రాల్పించాలి అంతేకాని - గారడీవాడు టెంకపాతి బీజాక్షరాలు పలికేటప్పటికల్లా మామిడిచెట్టు మొలిచి పండు కాసినట్టా !

ఆ వేళ - శాస్త్రిని సంతోష పెడదాం అని - పొందూరు బొగడసరం అంచుచీర - అందుకు సరిపోయేటట్టు - క్షీరాబ్ధి పట్టు రుద్రాక్షంచు బాడీసు - తల్లో సన్న జాజులగుత్తి - చేతికి వంటి జత దంతపు గాజులు - వేసుకుని దగ్గిరికి వెళితే "శాంతం! అప్సరసలాగున్నావు!'' అని ముద్దు పెట్టుకున్నాడు.

అంతేకాని: "శాంతం! నీ తలలో పెట్టుకున్న జాజిమొగ్గల్లా గున్నాయోయ్ - నీ వేళ్లు! నీ వొంటి ఛాయలో ఆ దంతపుగాజు కలిసి పోయిందోయ్! ఆ చీరఅంచు - నీ ముఖాన ముంగురుల్లా వున్నాయోయ్!'' అని అంటాడేమోనని ఆశపడ్డా.

పోనీ అని చెప్పి - మొన్న రాత్రి బసోట్లోకి వెళ్లినప్పుడు - మామిడి పింజలు బుటా లక్కరంగు బనారసు చీర-చెమ్కీ అంచు పచ్చ ముఖమల్ రవిక - చేతిని నాలుగు జతల గాజులు మురుగులు - మోచేతిని తావీజు బాజిబందు దండకడియం వొంకీలున్నా - నడుమున వడ్డాణం కమలపట్టా పాంజేబులు, కొప్పు గొలుసులు, అడ్డబాస తప్పితే సుబ్బిసెట్టి భార్యలాగు, రామచిలుకలాగు, ఇంద్రధనస్సులాగు తయారైయ్యాను.

"హల్లో! శాంతం - అప్సరసలాగున్నావోయ్! ఏదీ - ముద్దు!" అన్నాడు.

అంతేకాని - "శాంతం - ఆ ముఖమల్ రవిక తొడుక్కుని, ఆ జుంకాలు, వొంకీలు పెట్టుకుంటే అచ్చంగా నూర్జహాన్‌లా గున్నావోయ్! ఆ బుటా బనారసు చీరకట్టుకుని నీ బంగారపుఛాయ వొంటితో - అచ్చు రాణీ పద్మిని లాగున్నావోయ్!" అంటే నాకెంత ఆనందంగానో వుండును.

రోజూ చూస్తున్న మనిషేకదా-సానితో సరసంకాని-పెళ్లాంతో సరసం ఏమిటి? అనుకుంటాడు. సంసారంలో కూడా - శృంగారం సరసం చమత్కారం ప్రణయం - ఇవన్నీ అవసరం అనుకోడు. అంచేతే - ఇప్పటి కాపురాలు గంతలు కట్టిన గానుగ ఎద్దులా - తయారవుతున్నాయి. నేను కూడా శాస్త్రి ప్రేమని నిలబెట్టుకోవాలి.

లేడీ అయ్యంగారు విందుకు పిలిచింది. నేను వెళ్లా లనుకోలేదు - కాని శాస్త్రి వెళదాం అన్నాడు.

'అలాగే వెళదాం - శాస్త్రి' అన్నా. దాంతో అతనికొచ్చింది సంతోషం - అమాంతంగా నన్ను గట్టిగా కౌగలించుకున్నాడు-ఎముకలు విరిగిపోతా యనుకున్నా- అతని సంతోషం చెప్పలేను.

"అద్దీ-అలాగుండాలి! చూసుకో ఈరోజు ఎంత తమాషాగాను, సరదాగాను గడుపుతామో మనం - మజా చూసుకుగాని! ఐనా తొలిచూరు ఒక్కపిల్ల పుట్టగానే మనం పళ్ళూడిన ముసలివాళ్ళ మైపోయామా ఏమిటి? మనకి సరదాలన్నీ ముందే వున్నాయి కాదూ శాంతం!" అన్నాడు.

## 36

## అ త డు

మాంబళంలో ఒక వాద్యార్ దగ్గిర నాడీగ్రంథం వుందని క్లబ్బులో తాతాచారి చెప్పాడు. మొన్న వెళ్లాను. అతని గుమ్మంలో పడిగాపులు కాసుకునివున్నారు పాతిక మంది జనం అందరూ ఆంధ్రులే! మీ తండ్రిపేరు కాశీపురాధీశ్వరుడూ అన్నాడు - మీ తల్లిపేరు శ్రీ హరిప్రియ అన్నాడు - మీపేరు నటరాజ అన్నాడు. నాన్న విశ్వనాథశాస్త్రి -అమ్మ పార్వతమ్మ - నేను చిదంబరాన్ని అన్నీ సరిగ్గా సరి పోయాయి! రెండు నెలల్లో గృహప్రవేశం వ్రాసివుందన్నాడు. మళ్ళీ తెనాంపేట బంగాళాకి వెళిపోతాం అన్నమాట. వచ్చే ఆరుద్ర దర్శనంలోపల ముద్రాధికారం ప్రాప్తం చెప్పివుంది అన్నాడు. అంటే...ఎడ్వకేటు జనరల్ గిరీ అనే అనుకోవాలి. అన్నీ తుచతప్పకుండా చెప్పాడు. ఇరవైరూపాయలు అడిగేడు కాని-అవతారిక వక్క పర్యాయమే చూడడం కాబట్టి పన్నెండుకి బేరంచేసి ఇచ్చేను. మళ్ళీ సలహా చెయ్య డానికి వస్తే టోకుధరే నిర్ణయం అనికూడా ఖరారు చేయించుకున్నాను. లాటరీలో ఏమేనా డబ్బువచ్చే యోగం వుందేమో అడగాలి శాంతంతో చెప్పలేను. చెబితే వేళాకోళం చేస్తుంది. అన్నీ జరిగేక చెప్పొచ్చు.

అప్పులన్నీ తీర్చేశాను. శాంతం పురిటికైన ఖర్చుకీ మా అత్తగారు ఇచ్చిన భారసాల కట్నానికీ సరిపోయింది కదా. శాంతం ప్రావిడెంటు ఫండు మళ్ళీ శాంతానికి ఇచ్చేశాను కదా. ఆస్టిను కారుకి మూడువేలుపోగా బ్యాంకిలో నికరం పాతికవేలూ నా దగ్గిర రొక్కం రెండువేలు-ఇక ఇబ్బంది పడక్కరలేదు. పాపం శాంతం ఎంతో కూడి కగా చేస్తూండబట్టి కదా.

ఈవేళ కచేరీకి బయలుదేర బోతున్నాను - ఎవరో కాలేజీ పిల్లలు నలుగురు స్వరాజ్యనిధి వసూళ్లకోసం వచ్చారు. నేను రాజకీయంలో - కలుగజేసుకోవడం లేదు అన్నా. "పోతే మానెలెండి - మీ డబ్బుతో మేం కలుగజేసుకుంటాం!" అన్నాడు ఒకడు. "నేను ఏవర్గానికీ చెందను" అన్నా. "స్వర్గానికి కూడా చెందరా?" అన్నాడు ఒకడు. "నేను తటస్థం" అన్నా. "గబ్బిలంశాస్త్రి!" అన్నాడు ఒకడు. "మీరు వ్యక్తి గతంగా పోకూడదు" అన్నా. "రక్తగతంగానూ పోములెండి!" అన్నాడు మరొక కుర్రాడు. "నాకు స్వరాజ్యం అక్కరలేదు" అన్నా. "లండనులో పుట్టేరా?" అన్నాడు ఇంకొకడు. "ససేమిరా - నే నివ్వన"న్నా. "ససేమిరా - మేం కదలం"

అన్నారు. అంటూ కారుముందర ఇద్దరూ కారువెనక ఇద్దరూ అడ్డంగా పడుకున్నారు. ఇంతట్లో జనార్దనంగారి కారు వస్తూంటే - గభాలున దానిలో కెక్కి - ఆయనతో కలిసి కోర్టుకి వెళ్ళిపోయా. ఆయననీ ఇలాగే అల్లరిపెట్టారుట పొద్దున్న - మరి తప్పించుకోలేక చెల్లనిరూపాయి జేబులోవుంటే అది డబ్బీలో పడేసి తప్పించుకున్నా నన్నాడు ఆయన నవ్వుతూను. దొంగనాణ్యాలు చెలామణీ చేయడంకింద రాదుకద అన్నా నేను హాస్యంగా. "ఆత్మరక్షణక్రింద అని వాంగ్మూలం ఇవ్వవచ్చులెండి" అన్నాడు ఆయన తమాషాగా! ఆయనకి స్మాల్ కాజు కోర్టుమీద ఆశవుందని విన్నాను. జనార్దనంగారికి నాడీజ్యోతిషం అంటే పరమకోపం. ఆయన యంతసేపు బృహత్ జాతకం - బృహత్ జాతకం అంటాడు. చూతాం - ఆయనకి జడ్జీప్రాప్తమో - నాకు ఎడ్వకేటు జనరలు గిరీ ప్రాప్తమో!

ఇంటికొచ్చాక శాంతాన్ని అడిగితే - తను పాతికరూపాయ లిచ్చానంది. నేను గుండె బాదుకున్నా. అయ్యో! ఎంతపని చేశావన్నా. "ఏం?" అంది. చెప్పా. "ఈ కుర్రకుంకలు ఊరుకోరు. అందరిదగ్గిరా వాగుతారు. ఇది గవర్నమెంటుకు తెలుస్తే నాకు పెద్ద దెబ్బ!" అన్నా. "నాదగ్గిర మరెవరో కుర్రాళ్లు మౌంటురోడ్డులో వసూలుచేశారు. పేరు సంతకం అడగలేదు - కాని రశీదు ఇచ్చారు" అన్నాది. "బతికించేవు. శాంతం! పాతికరూపాయిలు ఇచ్చాను అని నువ్వు అనేసరికి ప్రాణం బిక్క చచ్చిపోయింది! ఇప్పుడు బాధలేదు." అన్నా. "కాని ఎందుకేనా మంచిది. రశీదుమాత్రం నీ బనారసుచీరెపొరలో పెట్టిదాచు - పైకంటివాడికి కనిపించకుండా. రేపుపొద్దున్న స్వరాజ్యమే కనక వచ్చెనా - ఈరశీదు మనకొక యోగ్యతాపత్రం కింద పనికొస్తుంది!" అన్నా.

...రాత్రి కబుర్లు చెప్పుకుంటూ వసారాలో కూచున్నాం - లేడీ అయ్యంగారింట్లో విందు గురించి శాంతం అంది: "శాస్త్రీ! అన్నట్టు ఆవేళ పాటకచ్చేరీనాడు. నీతో చెప్పలేదు కాని - భాష్యం ఖాళీకారులో నేను ఇంటికివచ్చాను సుమా!" అంది "నేను లేడీ అయ్యంగారితో కలిసి ఇంటికొచ్చాను!" అన్నా. ఇద్దరం భలేనవ్వుకున్నాం "తొలినేజేసిన పూజాఫలమా" అని శాంతం పాడింది. ఎంతో హాయి అనిపించింది.

## 37

### ఆమె

"చాలా రోజులై మనం ఇల్లు కదల్లేదు. సోమవారం సెలవుకూడా కలిసొచ్చింది. పుదుచ్చేరీ వెళ్ళొద్దామా శాంతం?" అన్నాడు శాస్త్రి, నిన్న మధ్యాహ్నం మంచి ఉత్సాహంతో. అతని సరదా పాడుచేయడం ఎందుకని, సరే అన్నాను. మొన్న గంగాధరపురం జమీందారు కేసు గెలిచేసని ఎంతో పొంగిపోతున్నాడు పాపం, ఆరు నెలలు రాత్రిం పగళ్లు నిద్రాహారాలు లేకుండా పని చేసినందుకు మాట, మాణిక్యం రెండూ దక్కేయి శాస్త్రికి. ఆ ఉత్సాహం భంగం చెయ్యడం నాకిష్టం లేకపోయింది. అయినా — ఆ కేసులో శాస్త్రి రైతుల తరపున వకాల్తీ పుచ్చుకునుంటే బాగుండి పోను. రైతాంగపు హక్కుకోసం తంటాలు పడివుంటే - గెల్చినా, వోడినా ప్రజ ప్రశంసించి వుండును. ప్లీడరీ చేస్తూ పొట్ట పోషణ చేసుకుంటున్నా - దేశానికి, ప్రజలకి ఉపకారం చెయ్యగలిగే అవకాశం ఎందుకు తిరస్కరించాలి? రాజద్రోహం కేసుల్లో, బాంబుకేసుల్లో, ప్రజాపక్షం వహించి చిత్తరంజనదాసు ఎంత కీర్తి గడించేడు? ఈరోజునుంచి - శాస్త్రిని బుజ్జగిస్తూ, అతనిదృష్టి కొంచెం ఇటువైపు తిరిగేటట్టు చెయ్యాలి. నేను ఓపిక పడితే - తప్పకుండా తిరిగేటట్టు చెయ్యగలను.

రైలుప్రయాణం మంచి సరదాగా వుండేను. నాతో చెప్పకుండానే మొదటి తరగతి టిక్కెట్లు కొనేసి, టిక్కెట్టు కలక్టరు చేతిలో ఐదురూపాయలు పెట్టి కంపార్ట్మెంటు రిజర్వు చేయించాడు! మాసపత్రికలు, వారపత్రికలు పది కొనేసి పడేశాడు. చాకలేటుపెట్టె ఒకటి!...ఇన్నిరోజులైనాక, ఇన్నికష్టాలు అనుభవించింతరువాత మళ్ళీ సుఖం అనుభవించగలనా అనిపించేది! వెనకటి కాశ్మీరు రోజులే మళ్ళీ ప్రత్యక్షంగా అనుభవించాం. అబిలార్డు - హిలాయసీ; డేంటీ - బీట్రిస్; బాజ్ బహాదర్ - రూపమతి, తారా - శశాంకుడు...శాస్త్రి - నేనూ!!

క్వీనుమేరీసులో చదువుకుంటూన్నప్పటినుంచి పుదుచ్చేరి వెళదాం అని ఎన్నో సార్లు ప్రయాణం అయాను కాని వెళ్ళడం పడలేదు. వూరు ఎంతో బాగుంది ఆవీధులు ఆ పోకచెట్ల వరుసలు-శిలావిగ్రహాలు-ఆ ఔత్థానాలు-ఎంతో రమ్యంగా వున్నాయి. ఆ దూప్లే విగ్రహం చూస్తే - బుస్సీ బొబ్బిలిపాట జ్ఞాపకం వొచ్చింది! మన ఆంధ్రుల ఔన్నత్యం-ఫ్రెంచివాళ్ళ ఔన్నత్యం; ఒకప్పటి ఆంధ్ర వలసరాజ్యాలు-ఫ్రెంచి వలస రాజ్యాలు; ఆంధ్రుల కళాపిపాస, రసికత, జల్సా - ఫ్రెంచివాళ్ళ కళాపోషణ, వాళ్ళ రంగేలా, వాళ్ళ షోకులు - మన తల్లికోట-వాళ్ళ వాటర్లూ; మన క్షీణదశ-వాళ్ళ క్షీణ

దళ-వక్కలా కనిపించాయినాకు! పుదుచ్చేరీ ఎంతబాగున్నా వూరికి కళకాంతులులేవు వెలిసిపోయిన ముఖమల్;

మాసిపోయిన మధుపర్కాలు; వాడిపోయిన గులాబీ; మెరుగుపడిన జరీ ఇవే జ్ఞాపకంవచ్చాయి. హంపీశిథిలాలు చూస్తేనో - అదెక్కడ! నిండు యవ్వనంతో వుండి, బలవంతుడైన బాలకుమారుణ్ని హఠాత్తుగా వెనకనుంచి పొడిచేస్తే, పడిపోయిన మృతకళేబరం.

ఇహ ఫ్రెంచి సామ్రాజ్యమా - నూరేళ్లు నిండిపోయి, కళ్లు గుడ్డిపోయి, పళ్ళూడిపోయి, నడుం వంగిపోయి, సుఖరోగాబతో తీసుకుంటూ మూల మూలుగుతున్న జీవచ్ఛవం.

ఇందాక అనుకున్న పోలికలు పూర్తిగా తలక్రిందులైతె, యామే! ఆంధ్ర ఔన్నత్యం నిజమేకద?

పుదుచ్చేరీలో మంచి హోటేల్లో దిగేం. హార్బరు చూసేం. సముద్రపొద్దువ షికారు తిరిగేం. అక్కడనుంచి బట్టల మిల్లు చూపిస్తానని శాస్త్రి అంటే, అందులో కెళ్ళేం.

ఎకనామిక్సు ఆనర్సు మొదటి తరగతిలో ప్యాసయ్యాను, ప్రొఫెసరు పని చేశాను. కాని బట్టలు తయారుచేసే యంత్రాగారాన్ని ఎన్నడు చూడలేదు. ఇలాగుంటాయి మనదేశంలో చదువులు!

అబ్బబ్బ........ఏమిటా కోలాహలం - గందరగోళం ఆ యంత్రాల గర్జనలు— ఆ మర కదల్లు, ఆ మరకండెలు తిరుగుతూంటే ఆ పట్టాలు చక్రాలచుట్టూ తిరుగుతూంటే ప్రళయకాలపు హాహాకారాలు—పగిలిపోయేలాగు, గుండెలు అవిసిపోయేలాగు, చెవులు గింగుర్లెత్తేలాగు, ధూంధూములు............ధూళి ధూసరమయం గాలి అంతా దూది రేణువులే—దానికి తోడు ఊపిరి సలపకుండా చమ్మ........

పొగలు కక్కుతూన్న ఆ యంత్రాన్ని కాపాడ్డానికి ఆ చెమటలు కక్కుతూ రాత్రిపగళ్ళలో కలిసిపోయిన ఆ పనివాళ్ళు — బొంగరాల్లాగు విధివిరామంలేకుండా తిరుగుతూన్న ఆ కదుళ్ళని కనిపెట్టుకుని, వాళ్లుకూడా ఆ యంత్రాల్లో చక్రాల్లా—యీ కదుటినుంచి ఆ కదురుకి; ఆ కదురునుంచి యీ కదురుకీ, ఆధార అక్కడ ముడెయ్యా, యీ ధారం యిక్కడ ముడెయ్యా........

యింతమంది స్త్రీ జనం ఎందుకిలా పని చేస్తున్నారు? వీళ్ళకు భుక్తికి మరో ఆధరవు లేదా? ఆ నరక కూపంలో—సున్నితమైన స్త్రీ శరీరానికి ఆరోగ్యం ఎలా? అసలు యంత్రాగారాలు ఇంత అన్యాయంగా వుంటాయని యెప్పుడూ నే ననుకోలేదే, ఏ అర్థశాస్త్ర పుస్తకంలోనూ ఇలా వర్ణించబడలేదే? క్లాసుల్లో "ఇంగ్లండులో పారిశ్రామిక

విప్లవం" గురించి ఎంతో ఉత్సాహంగా ఉపన్యాసం చెప్పేవాన్ని సంవత్సరాల తరబడి— పుస్తకాల్లో వున్నది వొకటి, ప్రత్యక్షమైన యథార్థం మరొకటి అయిందే!

మిల్లు ఆవరణలో ప్రవేశించింది మొదలు, శాస్త్రి ఉత్సాహం చెప్పడానికి వీలులేదు అదే వర్ణించి చెప్పడం.

"మనదేశంయొక్క బీదతనం, దరిద్రం పోవాలంటే, ఇలాంటి మిల్లులతోనూ, యంత్రపరిశ్రమలతోనూ నింపెయ్యాలి, దేశం అంతాను. అప్పుడే మనదేశం భాగ్యవంతం అవుతుంది" అన్నాడు శాస్త్రి.

"భాగ్యవంతులయ్యేది ఎవరు - లక్షలుగుంజే మిల్లుయజమానులా, లేకపోతే రోజుకి అరణాలు గడించే ఈ శ్రామికులా?" అన్నా నేను.

"ఇంతచదువూ చదువుకుని యిదేమిటి శాంతం ఇలా అంటున్నావు? ఎవరి తాహతుకొద్దీ వాళ్ళవి గణన! నిన్న మొన్నటివరకూ వీళ్ళకి కూలి పావలావే వుండేది. అలాంటిది మిల్లుయజమానులందరూ పాపం అరణాలకి హెచ్చించారు. పెట్టుబడిదార్లు కూడా దయాదాక్షిణ్యంగల మనుష్యులే సుమా. మర్చిపోకు" అన్నాడు శాస్త్రి.

మరకదుల్లు, మరముగ్గాలు, మరమనుష్యులు, మరహృదయాలు......మల్లుతాన్లు, చీటీగుడ్డలతాన్లు, సైనుతాన్లు, చీరెలబేళ్లు, కొండల్లా పడివున్నాయి....ఇక్కడ పనిచేసే స్త్రీలు కట్టుకున్నవా...చింకిపాతలు, శిథిలమైన కోకలు, జీర్ణించిన రవికెలు...నేనే యీ గుడ్డలు కట్టుకుని, నా కడుపున పుట్టిన ముద్దులలక్ష్మిని చింకిబొంతలో ఆమూల కూచోపెట్టి, యీ మేస్త్రీల పరిహాసాలని ఓర్చుకుంటూ ఆ అరణాల డబ్బులకోసం పొద్దుగూకులు ఇక్కడ యీ బానిస పనిచెయ్యడానికి సహిస్తాడా శాస్త్రి? ఈవేళ యీ మిల్లు చూసింతరువాత - ఖద్దరుమీద పోతుంది నా మనస్సు. ఖద్దరు అంటే అదేదో గాంధీగారి వెర్రి అనుకునేవాన్ని. అది అవలంబించడం అంటే నాగరికతా పరిణామంలో వెనక అడుగు వెయ్యడం అనుకునేవాన్ని. మన కట్టుగుడ్డకోసం, యీ పెట్టుబడిదార్ల మీద ఆధారపడకపోతే, కోటానుకోట్లయిన పాటకజనంమీద ఎందుకు ఆధారపడకూడదు? అయితే గాంధీగారు ఖద్దరుకీ రాజకీయాలకీ ముడిపెట్టారు. నేనిదివరకెప్పుడూ రాజకీయాలకి దూరంగావుండేదాన్ని. గవర్నమెంటు వుద్యోగంలో వుండం చేత. ఇప్పుడు మాత్రం నేనెందుకు దిగడం అనిపిస్తూంది. దిగుతే శాస్త్రికేం చిక్కొస్తుందో - ఇప్పుడిప్పుడే కాస్త తలఎత్తుకుని నలుగురిలోనూ తిరుగుతున్నాం.

......... కెవ్వని కేక, అమ్మో అని ఏడుపు. ఒక్క లిప్తలో మరలన్నీ ఆగిపోయాయి! ఒక చక్రం దగ్గిర పనివాళ్ళందరూ మూగేరు. నేనూ పరిగెత్తేను. కండెల దగ్గిర పనిచేస్తూన్న వక స్త్రీ చెయ్యి చక్రం పట్టాలో తగులుకుపోయి మోచేతివరకూ చితికిపోయింది. ఆమె మూర్ఛపోయింది. రక్తప్రవాహం. మేస్త్రీలు ఇద్దరుముగ్గురొచ్చి ఆ అమ్మాయిని ఆస్పత్రికి పంపించేశారు. సనులు మానేసి అక్కడమూగినందుకు చీవాట్లు పెట్టి, ఎవరి మరల దగ్గిరకి వాళ్ళని పంపించేశారు.

"శాస్త్రీ! అమ్మాయి గతి ఏం కానోయ్?" అన్నాను.

"నష్టపరిహారము క్రింద నాలుగు వందలు ముడతాయి. ఫరవాలేదు. అంతోటి డబ్బు ఆ పిల్ల జన్మంలో ఎప్పుడేనా చూసివుంటుందా?" అన్నాడు శాస్త్రి.

కొట్టాలు పొగలు కక్కేయి. మరలు రంకెలు వేశాయి. ఆ మారణయంత్రం మళ్ళీ శివాలు ప్రారంభించింది. నాగరికత పేరట ఎన్ని ప్రాణాలు బలికావలసివుందో?

"శాస్త్రీ! ఇంక ఈవాళకి చాలును, హోటేలుకు పోదాం" అన్నా. నాలుక కరచుకొని, "రాత్రి సినీమాకి వెళదాం అనుకున్నాంగా?" అన్నా.

"అవును. శాంతం! ఈ ఉత్సాహంలో మర్చిపోయా సుమా! మిల్లులో ఇంక రెండో షిఫ్టు మొదలెడుతారుకూడాను. ఆ తొడతొక్కిడి ప్రారంభించకుండానే మనం ముందు ఇక్కడనుంచి బయటపడదాం!" అన్నాడు శాస్త్రి.

## 38

## అతడు

నేనీ గంగాధరపురం కేసు గెలవడం కాదుకాని ఫుల్ బెంచి తల్లకిందులైపోయింది! ఎస్టేట్సుల్యాండు ఆక్టు మళ్ళీ మరామ్మతు చేయవలసిందన్నమాటే! ఈ దెబ్బతో రైతాంగపుహక్కు ముక్కచెక్కలైనట్టే. రైతులవేపు కేసుపట్టాలని నాకుండెను. కాని జమీందారు ఇచ్చిన ఫీజు వాళ్లెక్కడివ్వగలరు? అయినా వృత్తిధర్మం మన్నెక్కడ కీడ్చుకుపోతే అక్కడికి పోవాలిగాని మన ఇష్టం పనికొస్తుందా? మహాభారతయుద్ధంలో అర్జునుడు బంధువులను చంపనంటే— కృష్ణుడేమన్నాడు? క్షత్రియధర్మం పాటించమన్నాడు. నా—నీ— అని ముందువెనుకలు ఆలోచించకుండాను. అలాగే ప్లీడరీలో కూడా. మన ధర్మం మనం నెరవేర్చాలి. అందులోనూ— ధర్మం, అర్థం మేళవించినప్పుడు అసలు అనుమానించకూడదు.

శాంతానికి సరదా కలిగిద్దాం అని— పాండుచేరి వెళ్ళివద్దామా అన్నా. "సంయ్" అంటే "సంయ్" అంది. మేం ఇద్దరం రైలుప్రయాణం చేసి ఎన్నాళ్ళయిందో కదా! శాంతానికి మంచి హుషారుకలిగిద్దాం అని, తనతో చెప్పకుండానే యేర్పాట్లన్నీ ముందే చేసేశాను. అక్కడ హోటేలుకి టెలిగ్రాం ఇచ్చేశాను. రైలుటిక్కట్లు ముందు కొనేశాను. రైలుప్రయాణం కలలో జరిగిపోయినట్టు జరిగిపోయింది. మనస్సులు యిద్దరివినీ పూర్తిగా ఏకం అయిపోయాయి. నిజంగా డబ్బులేకపోతే ప్రేమకూడా వుండదు. కడుపు కాల్తూంటే— ప్రేమ దగ్ధం అయిపోతుంది. శాంతం నిజంగా మంచి—"స్పోర్టు." ఈ

మాటకి సరియైన పదం మన తెలుగులో లేదు. ఎంచేత చెప్మా? మన ఆంధ్రుల్లో ఆగుణం లేకపోవడంచేతనా? అబ్బే— ఆ గుణం ఇంగ్లీషువాళ్ళు గుత్తకు కొన్నారా ఏమిటి?

"ధీరత్వం"— "గభీరత"— "శీలం"— "స్థైెర్యం"— "గంభీరం"—ఈ మాటలేవీ సరిపడవు.

పాండుచేరి చూస్తే నాకు ఫ్రెంచివిప్లవం, వెర్సలై భవనం, విక్టర్ హ్యూగో, రూసో, వోల్టేర్, ఏమిల్ జోలా—జ్ఞాపకం వస్తుంది. యూరపుకంతకీ నాయకులుగా ఉండేవారె, వీళ్ళనితోసి రాజుచేసి ఇంగ్లీషువాళ్లెలా ముందుకొచ్చారో నాకాశ్చర్యం వేస్తుంది. అట్టే ఆలోచిస్తే ఆంధ్రులకీ ఇంగ్లీషువాళ్ళకీ చాలా పోలికలున్నాయి. ఆ మొండితనం, కిందపడ్డా పైనవున్నాం అనడం, దబాయింపు, డాబుసరి, చొరవ, తమ భాషతప్ప మరోభాష సనేమిరా నేర్చుకోకపోవడం, భోజనప్రియత్వం, ఇంగ్లీషువాడు ఎక్కడకెళ్ళినాసరే—బీఫుస్టీకు, యార్కు—షైరు పుడ్డింగు మానడుకదా, మనకా గోంగూరపచ్చడి, ఆవకాయ వుంటేనేకాని గడువదుగదా! ఆంధ్రులకి ముందు మంచి రోజులున్నాయనే నాకు పూర్తినమ్మకం. మన పెసరపప్పుగాళ్ళు సైమను కమీషనుని బహిష్కరించకుండా వుంటే, యీపాటికి ఆంధ్రరాష్ట్రం వచ్చివుండునుకదా. నాలాంటి వాడికీ పాటికి ఆంధ్రరాష్ట్రంలో ఏ ఎడ్వకేటు జనరలో—లేకపోతే అధమం లీగల్ రిమెంబ్రెన్సరేనా అయివుందునుకదా...

కారికాల్ చెట్టియార్లు మొన్న కొత్తగాకట్టిన బట్టలమిల్లుచూపించాను శాంతానికి. ఆ యంత్రాలు, ఆ గడబిడ, ఆ అల్లకల్లోలం చూచి గాబరా పడిపోయింది. నిజంగా బట్టలయంత్రాన్ని కనిపెట్టిన ఆ అర్కురైటు ఎంత తెలివైవాడో కదా! ఎంత అవలీలగా తయారుచేసి పారేస్తోందో కదా—తాళ్ళమీద తాళ్లు—తాళ్ళమీద తాళ్లు! శాంతం ఈ చిన్నమిల్లు చూసే నివ్వెరపోయింది కదా-అసలు-ఇంగ్లండులో ఆ ఓల్డుహాము బ్రాడ్‌ఫర్డు, ఆ మిల్లులుచూస్తే ఇంకా యెంత హాశ్చర్యపడిపోనో! కూటికీ, గుడ్డకీ, ఉద్యోగాలకీ ఇంత అల్లాడిపోతున్నాం. నిజంగా మనదేశంఅంతా యంత్రపరిశ్రమలమయం చేసేస్తే, ఎంత మహోపకారం జరుగుతుందోకదా. నిజంగా ఆజామ్‌షడ్జీ తాతా ఎంత గొప్పవాడండీ! దేశం అంతటా విద్యుచ్ఛక్తి యంత్రాలు, బ్లాస్టుఫర్నేసులు, జెస్సియర్ కన్వర్టర్లు, బట్టలమిల్లులు, కర్మాగారాలు, మోటారు కార్ఖానాలు, రసాయన ఫాక్టరీలు, నావికాశ్రయాలు, రబ్బరుఫ్యాక్టరీలు, ఆయుధపు ఫ్యాక్టరీలు—తల్చుకుంటేనే చకితుణ్ణై పోతున్నానే!

మనం నిజంగా దీక్షగా పూనుకున్నాం అంటే—ఈపాటికి సహంపరిశ్రమలమయం అయిపోయుండేది దేశం. ఆ బెంగాల్ విభజన రోజుల్లో మొదలుపెట్టిన స్వదేశీ ఉద్యమం చివరంటు సాగించివుంటే—తిలక్కు పైసా ఫండు, సుబ్రహ్మణ్యయ్యరు నేషనలుఫండ్, చిదంబరంపిళ్లె స్వదేశీస్టీము నేవిగేషను కంపెనీ, బందరు జాతీయ కళాశాలోద్యమం—ఈపాటికి జపానేమనదగ్గిర పాఠం నేర్చుకునేది. మనమార్వాడీషావుకార్లు,

పార్సీ కోటీశ్వర్లు, చెట్టియార్ లక్షాధికార్లు, గుజరాతీ సేట్ జీలు, ఉత్తరాది వ్యాపారీలు, మన మహారాజులు జమీందార్లు వూనుకుంటే డబ్బుకాలోటు! అలాంటిది ముందుకు సాగిపోతున్న ఇంజన్ని అమాంతంగా వెక్కి తిప్పేశాడు—ఈ గాంధీ. అంతటితో ఆగేడా? ఈ ఇంజన్ని లాగిపారేసి, పోతుల్ని పూశాడు. ఇదే నాగరికత అంటాడు. అతనికెవ్వడూ ఎదురుచెప్పలేడాయె ఖర్మం. కట్టుగుడ్డ లేకుండా, చింకిపాతలతో మానం కాపాడుకోలేకుండా చస్తుంటే—రాటంతిప్పుకుని జీవించుకోమంటాడు! రోజల్లా ఇంట్లో చాకిరీచేస్తూ, చావడానికేనా వేళలేనివాళ్ళకి చస్తూంటే సంధిమంత్రం లాగు యీ మంత్రం ఒకటూ! ఇంతకీ బేడడబ్బులు గిట్టువుకద—అవతల మిల్లుల్లోనూ, కార్ఖానాలలో పావలా, అరణాలుకూలి పారేస్తున్నారాయె. మరిదేం అర్థశాస్త్రమో నాకు తెలీదు. మన యోగశాస్త్రానికి సరిపడి ట్టూ ప్రత్యేకంగా శరీరశాస్త్రం వుందట—అలాగానే ఖద్దరుకి సరిపోయేటట్టూ వేరే అర్థశాస్త్రం వుందంటాడు. అయితే, ఇతనికి తగినట్టే చేశాడు ఆ బొంబాయి అహమ్మదాబాదు సేట్లు—గిరాకీరోజుల్లో ఖద్దరని పేరుతో మిల్లుగుడ్డ తయారుచేసి అమ్మేశారు; ప్రజలూ కొనేశారు! ఇంతకీ—గిరాకీకొద్దీ సరఫరా, సరఫరాకొద్దీ గిరాకీ—ఈ సూత్రాన్ని బ్రహ్మదేముడేనా తప్పించగలడా? హిందూదేశం అంటే ప్రపంచం అంతటిలోనూ నగుబాట్లు అగచాట్లు అయిపోతూంటే. దాంతో వూరుకున్నాడా—అహింసఅంటాడు. సత్యంఅంటాడు. రాజకీయంలో ఇలా వకదాంతో ఒకటి ముడిపెడితే అసలికే సున్నా. బిసెంటే బాగా జవాబు చెప్పిందతనికి—ఎంత ధియాసఫిస్టేనా, పాశ్చాత్య రక్తమేగా?

మిల్లులో ఉన్నంతసేపూ శాంతం ఏమిటో పిచ్చిపిచ్చిగా మాట్లాడింది. ఆహాఁవుడికి ఖంగారెత్తింది అనుకుంటాను. మిల్లు యజమానులు ఎంతో తెలివితేటలతో దేశసేవ చెయ్యడానికనిచెప్పి, డబ్బు ఖర్చుపెట్టి మిల్లులు పెట్టడమేమిటి— వాళ్ళు ఉత్త దోపిడీదార్లు, అమాయకపు ప్రజని పీడించి రక్తమాంసాలని పీల్చిపిప్పిచేస్తున్నారని వాళ్లని నానా తిట్లు తిట్టడం ఏమిటి? ఈ ధోరణేమిటి శాంతం అంటే— "ఆడం స్మిత్తు, మార్క్సు, బ్రెంటానో, స్టూవర్టుమిల్లు అందరూ దొంగలు, అబద్ధీకులూ నాకిప్పుడు బోధపడింది" దంది. ఇంకేమిటి చెప్పడం! 'వెర్రికుదిరింది, రోకలి తలకిచుట్టరా' అన్నాడుట అలావుంది. వాళ్ళింత లాభం చేసుకుంటున్నారు, ప్రజకింత జీవనోపాధి కల్పిస్తున్నారన్న కృతజ్ఞతపోయింది— మీదుమిక్కిలి లాభాలుకూడా పావలాకూలిదానికి పంచిపెట్టమంటే ఇంకేం చెప్పడం! ఇలాగే వాదించింది శాంతం అక్కడున్నంతసేపూను. ఎంత అర్థశాస్త్రపు ఆచార్యత్వంచేసినా, చవకబారుసోషలిస్టుపుస్తకాలు ఇంగ్లండునుంచి దిగుమతి అవుతున్నాయి. అవి చదువుతే ఉన్నమతి కూడా పోతుంది నే నింగ్లండు వెళ్లొచ్చాను. అక్కడి సంగతులు, పరిస్థితులు నాకుతెలుసు. నాకే పిచ్చి అబ్బుమంటే అబ్బదే!

సరిగ్గా మేం అక్కడున్నప్పుడే చిన్న ప్రమాదం వకటి జరగాలీ? కాస్త రక్తం చూసేసరికి శాంతానికి మతి భ్రమించింది. ఆమాత్రం కాలు నలగకుండా, చెయ్యి నలగకుండా భుక్తిజరగమంటే జరుగుతుందా? ప్రపంచకంలోఉండే మహాజాతుల్లో హిందూ

దేశం అగ్రస్థానం ఆక్రమించాలంటే, ఎంతమంది అన్యాక్తులవాలి, ఎంతమంది వికలాంగులవాలి, ఎన్ని మృతికళేబరాలు కుళ్ళాలి? అసలు ఆడవాళ్ళని ఎవడు పనిచెయ్యమన్నాడు? చీరకొంగు చక్రంలో తగులుకుని ఆ చెయ్యిని లాగేసుంటుంది. నాలుగు డబ్బులు సంపాదించే టప్పటికె ఎక్కడలేని విస్సాకారం, నిర్లక్ష్యం, అశ్రద్ధ, పద్ధతులు ధిక్కరించడం - కాకిపోతే ప్రమాదం జరగదు. ఇలాంటి ప్రమాదాలు జరగడం, మిల్లు ఆగిపోవడం, ఉత్పత్తి తగ్గిపోవడం, దేశానికే అరిష్టం...ఈమధ్య శాంతం గాంధీపుస్తకాలు కొన్ని, రష్యాపుస్తకాలుకొన్ని తెప్పించింది. రష్యాపిచ్చిపట్టుకున్నా ప్రమాదమే-గాంధీపిచ్చిపట్టుకున్నా ప్రమాదమే. అయితేనేం, రష్యాతత్వానికి విరుగుడు గాంధీతత్వం - గాంధీతత్వానికి విరుగుడు రష్యాతత్వం. ఆ పాముతోక ఈ పాము ఈ పాముతోక ఆ పాము మింగుతే మనకేం ఫర్వావుండకూడదు!

రాత్రి సినీమా కెళ్ళేం. శాంతం అద్భుతంగా వుండేను. నిజంగా శాంతం గొప్ప "స్పోర్టు!"

## 39

### ఆ మె

నేను అనుకున్నట్టే అయింది. శాస్త్రి బుద్ధిమంతుడు. ప్రేమాస్పదుడు. తెలివైనవాడు. మంచివాడు. కాని - ఇటువంటి మంచితనమే కొంపతీస్తుంది. ఈ మంచితనం చేతగానితనం క్రిందకి దిగుతుంది. ప్రపంచంలో ఎంత అధర్మం అన్యాయం జరుగుతున్నా - ఉన్నదున్నట్టేకాని కదపకూడదనే వ్యక్తులు - 'మనకెందుకు లే!' - అని అమలులోవున్న పద్ధతుల్నే సమర్థిస్తారు. తనముక్కుదాటి చూడమంటే శాస్త్రి కళ్లు మూసుకుంటాడు. భవిష్యత్తంటే భయం. పురోగమనం అంటే పిరికితనం. ఇలాంటి వాళ్లుంటే అభివృద్ధిసున్న...రాత్రి సినీమాఅంతా అసల్ అమెరికన్ - దొమ్ములాట - గుద్దులాట - కొట్టుకోనూ - పొడుచుకోనూ - పేల్చుకోనూ - రైల్లోనుంచి నదిలోకి ఉరకడం - నదిలోనుంచి - వంతెనమీదకి - వంతెనమీదనుంచి - రైలుమీదకి దుమకడం - ఇదీ కథ! శాస్త్రి అదేశ్రద్ధగా చూడడం - ఆతృతతో కుర్చీలోనుంచి లేచిపోతూండడం - ఊపిరి బిగపెట్టుకుక్కూచోడం - చప్పట్లు కొట్టడం - చివరకి ఈలవెయ్యడంవక్కటే తరువాయి!

ఐస్‌కాఫీ చాలాబాగుంది, కాఫీ ఆఖరుగుక్కతాగుతూ - శాస్త్రి: "శాంతం! ప్రభువుదర్శనానికి వెళుదామా?" అన్నాడు.

'సరే' అని నోటిచివరవరకూ వచ్చింది. కాని యదార్థంగా ప్రవర్తించాలి అని చెప్పి: "నారు పిలుపురాలేదోయ్. క్షమించు" అన్నాను. శాస్త్రిపక్కడే వెళ్లాడు.

వివేకానంద పుస్తకాలు - అభేదానంద పుస్తకాలు - రాజయోగసారం - ప్రబుద్ధ భారతం - చదివేను. వేదాంతచింత అనేదినాలో రవంతేనా లేకపోవట్టే కాబోలు నాకేం బుర్రకెక్కలేదు. నేను ఇంటర్ చదువుతున్నప్పుడు 'గీతాంజలి' చదివేను. కాని నాకేం అర్థంకాలేదు. ఆవర్సు ప్యాసయ్యాక కాని రవీంద్రుడి కవిత్వం నాకు బోధ పడలేదు. అలాగే కొంత పక్కామొక్కలు తింటేనేకాని వేదాంత గోష్ఠిమీద అభిరుచి కలగదనుకుంటాను. మనోవేదన అనుభవంఅయి ఆపిలుపు వినబడేదాకా నేను దూరంగా వుండడమే సబబు. ఆ అనుభవం కలుగకుండానే కలిగినట్టు నటించడం నాచేతకాదు. భక్తులందరికీ ఆ పిలుపు అందిందా అంటే- అందేవేసుతున్నారని అనుకోవాలి.

...ఉమామహేశ్వరంమామ జ్ఞాపకం వస్తున్నాడు. ఆ రోజుల్లో కరణీకానికి రాజీనామా ఇచ్చేసి అత్తయ్యనీ నన్నూ అహమ్మదాబాదు కాంగ్రెసుకు తీసుకెళ్లాడు. సబర్మతీ ఆశ్రమంలో రెండుపూటలున్నాం. ఇంటికిరాగానే మామ తోటలో ఆశ్రమం పెట్టాడు. "మామ సుఖంమరిగినవాడు - చండశాసనుడు - కోపిష్ఠి. ఇతను ఆశ్రమం పెట్టడమేమిటి?" అని అనుకునేవాళ్ళం. అత్తయ్యది సత్యకాలం. నన్నుపిలిచి: ఇదేమిటమ్మా! మీ మామయ్య మల్లిపువ్వులాంటి మల్లుధోవతి కలువపువ్వులాంటి చంగావిపంచ మానేసి - కాయరంగు అంగవస్త్రం - బోడిగుండు - మెడలో అలారం గడియారమున్నా? నాకా భగవద్గీతశ్లోకాలేవో చెబుదూ - కంఠతో పెడతాను. లేకపోతే వారు మండిపడిపోతారు" అనేది. భోజనప్రియుడు - అతనికా చేదు బియ్యం - గుగ్గిళ్లు - చప్పిడి - యేంపడతాయి? దేహంలోను హృదయంలోను దహించుకు పోయేది ఆయనకి. మనిషి పూచికపుల్లలాగై పోయాడు. అత్తయ్య కీసన్యాసాశ్రమం బోధపడక మామయ్యకి తనమీద యేమిఆగ్రహంవచ్చిందో అని బెంగపెట్టుకుని ముక్కోటి దేవతలకీ మొక్కేసుకుంది. ఆశ్రమవాసులందరూ వీళ్ళలాంటి గృహస్థులే. మూడునాళ్ళ ముచ్చటయ్యాక - ఆశ్రమంలోనున్న 'ఆత్మపరీక్ష' పుస్తకం అంతా చాడీలు కొండేలు చిడిపికయ్యాలతో నిండిపోయి - రోజుకో సంపుటి తయారు! చివరికి సమిష్టి కుటుంబం అంతా గడపకో కంసాలిపొయ్యికింద కి దిగింది! మామ ఏభైఎకరాలపొలం ఐదుఎకరాలకి దిగజారింది. ఆశ్రమం మూసేసే అగత్యం లేకుండానే యవరియటుకువాళ్ళే లేచి వెళ్లిపోయారు... మొన్న ఉమామహేశ్వరం మామ పుల్లమ్మత్త తిరుపతియాత్ర చేసుకుని చెన్నపట్నం వచ్చారు. మామ మళ్ళీకరణీకం సంపాదించుకుని ఏభై ఎకరాలూ నిలబెట్టుకున్నాడు. మనిషికి వొళ్ళొచ్చింది. అత్తయ్య వంటినిండా జవాహిరీయే! అద్దాలో నెలపిల్ల -

చంకని యెడపిల్ల - చేతిని చంటిపిల్ల - యీ కొంగుపట్టుకొని పెద్దాడు ఆకొంగు పట్టుకొని చిన్నాడు! నాచెవిలో: "శాంతమ్మ! ఆశ్రమంమానేశాక మీమామయ్యకి యెంత శాంతం వోపిక వచ్చిందనుకున్నావు!" చెప్పింది. "అహమ్మదాబాదు ప్రయాణం జ్ఞాపకంవుందా మామయ్యా?" అని అడిగే. "లేకేమీ? అప్పుడేగా పులినిచూచి నక్కవాతెట్టుకున్నదీ!" అన్నాడు నవ్వుతూను... మొన్న శాస్త్రి: "మీమామ ఆక్షిపంపకం అప్పీలొకటి కోమట్లది పంపించాడు. మంచి తెలివైనబుర్రసుమా!" అన్నాడు.

...సాయంకాలం వచ్చాడు శాస్త్రి అతని ముఖం ఒక కొత్తకళతో ప్రకాశిస్తూంది.

## 40

## అతడు

మనస్సు నిర్మలంగా-ప్రశాంతంగా-ఆనందంగావుంది. దేశదేశాంతరాలనుంచి భక్తులు. భక్తుల భగవన్నామస్మరణ, పండితుల భాగవతిపారాయణ, చీనీచీనాంబారాల తళుకు, గులాబీపువ్వుల పరిమెళం, మంగళహారతులజ్యోతి, దేదీప్యమానమైనకాంతి, దివ్యతేజస్సు, నిశ్చలమైనశాంతి.

ఒక్కటే కొరత-శాంతం నాతోకూడా లేకపోవడం. ఈమధ్య ఈమెకి కొంచెం సోమలిష్టుగాలిచల్లింది. మనసులో వేదాంతం ప్రవేశిస్తే అంటుకుమందు-అని ఆశపడి ప్రభు దర్శనానికి రమ్మనమన్నాను. "నాకు పిలుపురాలేదోయ్" అంది. నాకుమాత్రం పిలుపు వచ్చిందా? భాజాభజంత్రీలతోనూ, పసుపుకుంకంతోనూ, చందన తాంబూలాలతోనూ-పిలుపువస్తేమాత్రం-హృదయద్వారానికిఘడియలుతాళాలువేసుకుంటే-ఆపిలుపుఅందేదెట్లా! నాస్నేహితులందరికి - యేట సహంమంది పుదుచ్చేరి సహంమంది అరుణాచలం వెళ్ళడం రివాజు. మొదట నాకెక్కడికి వెళ్ళడానికి తోచలేదు. పుదుచ్చేరి సముద్రం అరుణాచలశిఖరం రెండూ భగవల్లీలలే. అయినా నలుగురితోపాటూ నారాయణా అని-మొదట సర్ రామయ్యంగారితో ఇక్కడికీ తరువాత లేడీ అయ్యంగారితో అక్కడికీ

వెళ్ళాను. అప్పటినుంచి యేట అక్కడకో ఇక్కడకో వెళితేకాని నాకు తోచదు. ఇదే అలవాటు - సాధన! ప్లీడరీచేస్తూ బ్రహ్మతేజస్సుచేత ఆకర్షింపబడ్డానంటే నాకే నమ్మశక్యంకాకుండావుంటుంది.

......తమాషా! మనదేశపు ప్రతిభ ఉత్కృష్టత సంస్కృతి సంప్రదాయం మనకి ముప్పాతిక మూడువంతులు ఇంగ్లీషుద్వారానే తెలియడం! ఇప్పుడు ఇంగ్లీషు ప్రాముఖ్యత తగ్గించేస్తారట! వెయ్యిచెప్పినా లక్షచెప్పినా - మెయిన్సు హిందూలా ఆస్టీనుజ్యూరిస్ప్రూడెన్సు, పోలక్కుటార్ట్సు, ప్రీవీకౌన్సిలు, ఐ. ఎల్. ఆర్., వున్నంత కాలం ఇంగ్లీషుప్రభ తగ్గదు - సరికదా హెచ్చుతుంది...చిత్రం! జాతీయోద్యమం హెచ్చుగావున్నప్పుడే హిందూసంప్రదాయంమీద మనకిఅభిమానం హెచ్చుగావుండడం జాతీయత కొత్తరికంలోనే వివేకానందులవారి ప్రాబల్యం. ప్రతియువకుడు "వివేకానం దాస్ స్పీచెస్" బల్లమీద పెట్టుకుని కాషాయి అంగరఖా తొడుక్కుని చమ్లాచుట్టి నడుంబిగించి చేతులుకట్టుకుని వంకచూపుతో ఫోటో తీయించుకోడమే! సూరత్ కాంగ్రెసు రోజుల్లో బంగాలీ కచ్చ-కాలికి మహారాష్ట్ర చెప్పులు - చేత-మాక్సుముల్లరు "రిగ్ వేదా"! హోమురూలు రోజుల్లో మోకాళ్ళవరకూ లాంక్లాతు లాల్చీ - పాదాల వరకూ మడతపాణీ - ముఖమల్ టోపీ - చేత "ది-ఉపనిషద్సు"! గాంధీయుగంలో - మణుకుల వరకు గోనెపట్టా - గోష్పాదం - జానెడువెడల్పుఖద్దరుటోపీ - చేత "దిలార్డ్సుసాంగ్"! దుస్తుల్లోనూ తలకట్టులోనూ కళలోనూ వేదాంతంలోనూ రాచరికంలోనూ కాలంబట్టి పోకడలు!...తాతయ్య "ఆంధ్రకేసరి" చదివి - బెంగాలు విభజన అశ్వనీకుమారుని నాయకత్వం - రక్షబంధనం - బాంబుకేసులు - కాకినాడలో కెంపుదొరరాజమండ్రిలో హంటరు - ఖబుర్లుచెబుతూంటే అన్నయ్యకినాకు ఒకశేషుత్సాహం! మామయ్యలతో వందేమాతరంగీతం బృందగానంచేస్తూవీధులంటతిరిగేవాళ్ళం! సీతప్ప నాన్న సూరతునుంచివచ్చి-తిలక్కుఖపర్దే ఖబుర్లు చెపుతూంటే - మామయ్యలతోసహా అన్నయ్య నేను నిద్రాహారాలు మానుకుని వినేవాళ్ళం! కర్మయోగి తిలక్కు స్వరాజ్యాన్ని సనాతనాన్ని ఇటిక సున్నంలాగుకలిపి జాతీయోద్యమాన్ని స్థాపించాడు. నిరాడంబరజీవనం దేశసేవమిళితం చెయ్యడానికి గోఖలే - ఆర్యమతం అతివాదం కలపడానికి లజపతిరాయి - థియాసఫీ హోమురూలు జోడించడానికి బిసెంటు -ప్రయత్నించారు. నీతికి - రాచరికానికి మేళం కుదురుతుందా? ప్లీడరీలాగు - ఫుట్ బాలు క్రికెట్టు లాగు - రాజకీయం వకవృత్తే. ఆ వృత్తికి ప్రత్యేకధర్మాలు, ప్రత్యేకనియమాలు, ప్రత్యేక విద్వత్తు పాటించాలి. రెండింటికీ సమన్వయంచెయ్యాలని యీవేళ

గాంధీ అస్తంతమాత్రాన్ని కుదురుతుందా? లౌక్యం, ధర్మం—రాజకీయం నీతికలపగానే మనదేశం అంతా అల్లకల్లోలం అయిపోయింది. అయితే ఏం—చివరికి చెప్పేదొకటి చేసేదొకటే అవుతున్నాది. మరొక్క పదేళ్ళలో గాంధీ ఉద్యమమే పోతుందని కనిపిస్తుంది ఖద్దరు వుండదు—దేశం అంతట బట్టలమిల్లులమయం అయిపోతుంది. అంతమటుకు ఢంకామీద దెబ్బకొట్టి నే చెప్పగలను. ఇక ఈ సోషలిజం కనక తలయెత్తిందా యీ దేశంలో—సత్యం, అహింస, సహాయనిరాకరణం పూర్తిగాపోయి—మనకీ ప్రపంచంమీద అందరికీమల్లే, రాజ్యకాంక్ష, సైన్యం, యుద్ధపుటోడలు, తుపాకులు, ఫిరంగులు, ఏరోప్లేనులు, పార్లమెంటులు, కలక్టరుగిరీలు, ఉద్యోగాలకి పాకులాడ్డం తప్పదు. అంతే కాదు—ఇప్పుడు అస్పృశ్యతానివారణ హిందూ మహమ్మదీయ ఐక్యత అని ఎంత అరుస్తున్నాడో ఇతను—అంత హిందూ మహమ్మదీయ ద్వేషం, బ్రాహ్మణ శూద్రద్వేషం, పంచమద్వేషం—స్థిరం అయిపోతుంది. ఇంక స్వరాజ్యమూ—ఇంగ్లీషువాళ్ళకి మనకి పుస్తి ముడి మరింత బిగుస్తుంది. ఏమో—నామటుకు అదీ చాలా మంచిదనే అనిపిస్తూంది.

రాత్రి హోటేలులో "డిన్నరు" అద్భుతంగావుంది. శాంతం ఎదురుగా కూచుని వుంటే, వెనుకటి ప్యారిసురోజులు జ్ఞాపకం వచ్చాయి. షాంపేను అడగాలనుకున్నాను కాని శాంతాన్నిచూచి పెదిమె కరచుకున్నా. మొత్తంమీద షాంపుచేతే ప్రయాణం స్వర్గతుల్యంగా అనుభవించేను. హాయి !

## 41

### ఆమె

నేను ముసిలిముత్తైదువలాగ తయారవుతున్నాననిన్నీ, కొత్తవాళ్ళతో పరిచయం కలిగించుకోవడం, పాతస్నేహితులని కలుసుకోడం బొత్తిగా మానుకున్నాననీ, నన్ను శాస్త్రి పదేపదే దెప్పుతున్నాడు. సరేకదా అని లీలావతమ్మగారితో చనువుగా ఉండేటప్పటికి— అదో పెద్ద రాద్ధాంతసిద్ధాంతం అయింది. ఆమె పెనిమిటి రంగస్వామినాయుడున్నూ, శాస్త్రిన్నీ ఇంగ్లాండునుంచి ఇంటికొచ్చేటప్పుడు కలిసి ప్రయాణం చేశారట. ఆమధ్య ఎలక్ట్రిక్కుకంపెనీవాళ్ళకీ పనివాళ్ళకీ వచ్చిన తగాయిదాల్లో శాస్త్రి వాళ్ళింటికి రెండుమూడుసార్లు వెళ్ళడం— ఆవిడని చూడకపోయినా "చాలామంచివాళ్లు ఆమె మంచి చురుకైనదిట, ఆమెతో పరిచయంచేసుకుని సినీమాకి, క్లబ్బుకీ వెళుతూండకూడదా" అని అప్పట్లో శాస్త్రి నాతో అంటూండేవాడు. రోజూ నాలాగే ఆవిడ చంటిపిల్లని తీసుకుని కారుమీద బీచీకి వచ్చేది. అప్పుడు పరిచయం అయింది. స్కూలు

ఫైనలు చదువుకుందిట. కాని ఓ దేశంఅనీ, ఓ రాజకీయం అనీ, ఓ పత్రికఖబుర్లనీ ఆవిడకేం వున్నట్టు కనిపించదు. చిలకలామాత్రం తయారవుతు ది. సినిమాఖబుర్లు—సినిమా ప్రపంచకం— ఎంతసేపున్నూ. సరే, మనకేమి. ఏదోకొంత బీచిదగ్గిర—శాస్త్రి కోర్టునుంచి వచ్చేవరకూ కాలక్షేపం అని— ఆవిడ కారులో నేను కూర్చునో, మా కారులో ఆవిడ కూర్చునో— లోకాభిరామాయణం చెప్పుకుంటూ, రోజూ సాయింకాలం జరిగి పొయ్యేది. నిన్నకూడా మామూలుగా బీచిదగ్గిర మాట్లాడుకుంటూంటే, శాస్త్రి వచ్చి కలుసు కున్నాడు. అదివరకు లీలావతమ్మగారిని చూడకపోవడంవల్ల నేను ఇద్దరినీ పరిచయం చేశాను. ఆవిడ అమాంతంగా శాస్త్రి చేతుల్లో చెయ్యికలుపుకుని "ఏమమ్మో! యీ మన్మథ విగ్రహాన్ని— సాక్షాత్తు యీ రూడాల్ఫ వేలెంటైనోనీ— ఇన్నాళ్లు మాకు చూపించకుండా అట్టేపెట్టేసుకున్నారే!" అని అంది. ఆ మాటలు విని నాకు ముచ్చెమ్మ టలూ కమ్మేశాయి. నోట మాటరాలేదు. శాస్త్రిమాత్రం నవ్వుతూ "అట్టే పెట్టుకోక పోతే అడ్వర్‌టైజు చెయ్యమన్నారా ఏమిటి?" అన్నాడు. ఆమె జవాబు చెప్పింది కదా: "అవశ్యం! ఏమి? శశాంకుడ్ని తార అడ్వర్‌టైజు చెయ్యాబట్టేకదా, మహర్షి అంతటి వ్యక్తికూడా మెచ్చుకున్నాడు?!" శాస్త్రి అందుకున్నాడు: "మెచ్చుకోవడం కాదండీ— మహర్షిగారికి ఈర్ష్య!" వెంటనే ఆవిడజవాబు: "ఆ ముసలితొక్కకికూడా వసంతకాలపు వెన్నెలలో రాగోదయం!"

శాస్త్రి పక్కున నవ్వేడు. జేబులో నుంచి సిగరెట్టుపెట్టె తీసి, వెలిగించ బోతూంటే, ఆవిడ ఆపెట్టె చేతిలోంచి లాక్కుని, "అమ్మో! బంగారపు సిగరెట్టు కేసే? ఏమండోయి? మీరు అచ్చ కుబేరావారి కుబేరులా, లేకపోతే థీఫ్ ఆఫ్ బాగ్దాడా?" అంటూ తనంతటతనే పెట్టెతీసి "నా అమరజ్యోతిని వెలిగించిపెట్టరూ?" అని మొఖంమీద మొఖంపెట్టింది. "ఇదిగో! అచ్యుతాకన్యకి అమరజ్యోతి" అంటూ శాస్త్రి అగ్గిపుల్లతో ఆమె సిగరెట్టును వెలిగించేడు.

ఇలాగా ఇంకా కాస్సేపు సంభాషణ జరిగింది. మరి ఆ లీలావతమ్మగారి మాట ల్లోని మాధుర్యమో— చమత్కారమో— తెలియదుకాని, యీమధ్య ఎప్పుడూ ఇంత సేపు నాతో మాట్లాడినట్టు నాకు జ్ఞాపకంలేదు, పొరుగింటి పుల్లకూరంటే, ఆత పడి చావడం ఎందుకో?

నాకు కొంత ఓర్వలేనితనం వచ్చింది.

కొసకి—అన్నాగదా—"పిల్లకి పాలవేళయింది. ఇక ఇంటికెళ్లాలి మనం" అన్నాను అంతవరకూ యెంత చక్కగానో నిద్రపోతున్న పిల్ల వక్కసారి తెలివివచ్చేసి ఏడవడం మొదలెట్టింది.

దాంతో ఆవిడంటీ—"మీవారికి..పిల్లని ఎలా వూరోక్కపెట్టడమో—తర్ఫీదు చెయ్య లేదూ? వారికోసారి ఇవ్వండి! కనగానే సరా—పెంచడం తెలియద్దూ?" ఆవిడ మోటుమాటలు విని, శాస్త్రి మొఖం చిట్లించుకున్నాడు. అసలు—అతని మోస్తరేంవి

టంటే—చంటిపిల్లలు ఆడుకుంటున్నంతసేపు వాళ్ళతో సరిగా ఆడడం—ఓ ఏడ్చినా—ఓ పిసరు ఉచ్చోసినా—సరే—ఆమడదూరం పారిపోవడం. ఆవిడా మాటలనేసరికి—శాస్త్రికి యెక్కడలేని రోషంవచ్చి - చటుక్కుని - పిల్లని తీసుకున్నాడు. నిద్దరలోనించి ఏడుస్తూ లేచినపిల్ల - దాంతో మరింత - గట్టిగా - గుక్కపెట్టి ఏడవడం - మొదలెట్టింది. దానిమీద - ఏదోహాస్యం మండినట్టు - ఆవిడగారు - బీచంతా మారుమోగునట్టు- పక్కున నవ్వు. శాస్త్రి చీకాకు - ఇహ - ఇంతా అంతా చెప్పలేం, సరే - ఇంతలో ఆవిడభర్తగారు కూడా వచ్చారు - వాళ్ళిద్దరు కారుమీద - వెళ్ళిపోయారు.

పిల్ల ఏడుపు మానడంలేదు. మనంకూడా - బయలుదేరుతాం - అని అనుకుంటూండగా - సరి - లేడీ అయ్యంగారు - యెదురుగుండా - ఆవిడ రోల్స్‌రాయిస్ కారుమీద - తయారు. నాకు వొళ్లు మండిపోతూంది. ఆవిడ అంతదూరంనుంచే— "ఏది - మీ అమ్మాయిగారూ ?—" అంటూ వొయ్యారంతో వచ్చింది.

సరి నేనూ పిల్లని తీసుకుని కారులోంచి దిగి ఆవిడకి ఎదురుగుండా వెళ్లేను. ఆ దిగుతూండడంలో పిల్లగుడ్డ తలుపుకొక్కానికి తగులుకొని క్రింద మన్నులో పడిపోయింది. దాంతో శాస్త్రి ఆ గుడ్డని తీసి కారులో విసిరేసి "మరోగుడ్డ తెచ్చుకోరూ, అంత వెధవదరిద్రమా?" అని మండిపోతూ సణిగేడు. ఇంతట్లో ఆ రంభగారు "ఏదీ- ముద్దూ?" అంటూ పిల్లని నా చేతిలోంచి తియ్యబోయేసరికి, పిల్ల కెవ్వుమని మళ్ళీ సంగీతం మొదలెట్టింది. దాంతో శాస్త్రి ఎన్నడూలేని విసుగుతో "లేడీఅయ్యంగారూ! ఈ వేళ లేచి ఎవరిమొహం చూశామో కానీ, అన్నీ అపశకునాలే. మేంపోతాం సెలవు" అని అంటూ నన్ను కారు దగ్గిరికి బలవంతంగా ఈడ్చుకుపోయాడు.... దారిలో అరగంటు సేపూకూడా ఒక మాటా మంతీ లేదు సరిగదా— ఇల్లు చేరుకుని లోపల అడుగుపెట్టగానే, "ఇంట్లో ఎప్పుడు చూసినా చాకలిసంసారమే గదా— పిల్లగుడ్డలు తడపనూ, ఎండెయ్యనూ— తడపనూ, ఎండెయ్యనూ— తీరా ఎవరేనా వచ్చేసరికి కుళ్లుగుడ్డలు తయారు! సంసారంఅంటే అసహ్యం వేసిపోతూంటే—"అన్నాడు.

చమత్కారంగా సంభాషణ— రమ్యమైన రంభలూ— చంటిపిల్ల మాత్రం ఏడవకూడదూ— ఎందుకూ, ఏదేనా అంటే- శ్రుతిమించి రాగానపడుతుంది అని నేను మాట్లాడకుండా ఇంట్లోకి వెళిపోయాను.

## 42

### అతడు

నిన్నరాత్రి ఎడ్వకేటుజనరల్ బార్టనుఇంట్లో విందు. మేంఇద్దరం వెళ్ళేం - మంచి పోగ్గావెళ్ళింది. శాంతం చెప్పేదేమిటి? అందరినీ నవ్వించడమే-అందరూ శాంతంచుట్టే!

ఎడ్వకేటు జనరలు - వారి దొరసానిగారు - జడ్జీలు - వారి భార్యలూ - అందరూను. నాకెంతో ఆనందం. అయితే యేం! పాపం - యీమధ్య చితికిపోవడం మూలాన్ని - శాంతం మరీ నలిగిపోయింది. కాని ఇప్పుడు మళ్ళీ - చక్రం తిరిగింది - ఈలాగే పెద్ద కేసులు - మరి రెండొస్తేనా! యేదో ఇప్పటికి బ్యాంకీలో నలభైవేల వరకూ కూడ బెట్టేను కదా - ఈ దెబ్బతో - ఈ బొమ్మరిల్లు మార్చేసి మాంబళంలో పెద్ద మేడ - బేబీ ఆస్టినుపారేసి చెవ్రలెటు - తీసుకోవాలి. అప్పుడు శాంతం తెలివితేటలు నల్గురికి తెలియడం!...............

అబ్బ - ఈవేళ జరిగిన పరాభవాలా - పగవాడికేనా వద్దు నాయినా! కేసులన్నీ వాయిదాలు పడిపోవడంచేత - వేగంవే ఆటవిడుపు అయింది. అనుకోకుండా సెలవుదొరికిన - బడికుర్రాడులాగ అతి ఉబలాటంతో - శాంతాన్ని కలుసుకుని సినీమాకి వెడదాం - అని వరదరాజులు కారులో బీచికి బయలుదేరేను. వెంకటస్వామి నాయుడు భార్య కాంసును - ఆవిడతో కూర్చుని - బాతాఖానీ కొడుతూంది - శాంతం. ఇదివరగావిడని నేను చూడకపోయినా - ఆ తళుకు బెళుకులు - లక్ లక్కల కులుకులు - దొండపండు పెదిమెలు - జేగురు గోరింట - నాకు తలనొప్పొచ్చింది. శాంతం వేసుకోవడం వేరూ - అయితే తీరు, సొగసు వుండాలి. కాని ఈవిడేమిటి నాయనా?—సరి—ఏమైతేనేం! స్త్రీకదా? గౌరవం మర్యాదా చూపాలిగా అని చెప్పి - మాట 'దేసరికి - బాబూ! ఆవిడ - వెటకారం - శ్లేష, చెప్పలేం! నేనూ - తెలివితక్కువగా - ఆధోరణిలోనే ప్రసంగం సాగించా - శాంతం చీకాకుతో - చిందరవందర అవుతూందని - నాకు బోధపడిపోయింది. అయితే ఏంప్రసంగం - వక్కసారిగా - చివరకి - సినీమా "పులిస్టాపు" అనలేంగా!

"క్లోజప్పు"లా వెళ్ళింది. అక్కడికి ఆపేశాగా. అయినా శాంతం శాంతించలే. అంత కోపం ఎందుకో? ఇంతట్లో పాపాయి బీచి ఎగిరిపోయేటట్లు ఏడుపు— నేను తియ్యారించవలసొచ్చింది. నేను— నా ఆఫీసు కోర్టుదుస్తులు—వాళ్లో పిల్ల—తెలిసినవాళ్ళందరూ అప్పుడే కనిపించాలి? నాకు అతి తలవంపులైపోయింది. ఇహ రేపుపొద్దున్నా బారురూములోనూ, క్లబ్బులో— రంగనాథం, సీతారాం, దేవనేశం "శాస్త్రిది కింద చెయ్యేనురోయి!" అనీ— "ఆడుమళయాళంలో మంగళసూత్రం కడితే— ఇదిగో!" అనీ— ఈలా తట్టాబాజా, వెటకారం, వెక్కిరింతలూ సరా— గోరుచుట్టుమీద రోకటిపోటులా ఆవేళకే లేడీ అయ్యంగారు అప్పుడే తటస్థపడాలీ?— నా ఖర్మం కాలితే! ఎప్పుడేనా పాత స్నేహితుల్ని పిల్చి, కాస్త మజా చేసుకుందాం— అని అనుకునేసరికి ఆవేళే తయారు ఇంటికి గాంధీదాసులందరూ. ఇహ వాళ్ళ గుసగుసలు, వాళ్ళ ధర్మపన్నాలున్నూ. నాకు పరాయిస్త్రీలతో అంటేనే మొహమాటం. ఖర్మంచాలక మాట్లాడేనా— ఏదో అపభ్రంశం రావడం— శృతిమించిన రాగం— సరాగం— శాంతా రాగంవున్నూ.

సాయింకాలం అలాగే అయింది. నేనేదో గొప్పగా- గోటుగా- పాపాయినీ, శాంతాన్నీ నా స్వంతం- నా ఆస్తి అని నల్గురికీ తెలియాలని తంటాలు పడుతూంటే— ఆ లేడీ అయ్యంగారికి పాపాయిని చూపించబోయే సరిక్కి, ఆ పిల్లక్రింద గుడ్డ బురదలో కిందపడిపోవాలీ? సరే. నా అల్పాకా కోటుమీదే పాపాయి పాడుచేయడం. దీంతో పాటు శాంతం కట్టుకున్నా చీర యే తాతలనాటిదో, అలుగుడ్డలా అంతాచిరుగులే. ఇదంతా జరగడం బీచిమీద. వల్లకాటిలో రాఘనాథయ్యరులా నేను ఆమధ్యని షికారు కొచ్చే పెద్దమనుష్యులూ, జడ్జీలు, వకీళ్లు, బారిష్టర్లు— అందరూ అప్పుడే తటస్థపడాలీ? పీక పోయినట్టయింది. ఓ మూల లేడీ అయ్యంగారి నవ్వులూ, లీలావతమ్మగారి కేరింతలూ— ఛీ!

ఇంటికెళ్ళాక—పాపాయికి గుడ్డముక్కలు లేవా? నీకు గుడ్డముక్కలు లేవా? రోజంతసేపూ మరో పనిపాటూ లేదుకదా—వీధిలో కొచ్చినప్పుడేనా—నీకోసం కాకపోతే నా మర్యాదకోసం—సరిగ్గా అలంకరించుకోవద్దూ?—ఆపిల్లనా? చందవబొమ్మల్లే—గుడ్డాగుడుసూ లేదాయే? ఇంత ఏబ్రాసితనమా?" అని కోపం కొంతా కక్కేశా. నేను ఉగ్రనరసింహమూర్తినైతే - ఆవిడ ఏంతక్కువా - సాక్షాతూ-కాళికా అమ్మవారే—శాంతం అందికదా: "ఛీ - మరి నేనా లేడీఅయ్యంగారి మొహం చూస్తే వొట్టు. దాంతో - నాకు రేకత్తింది. నేను మౌనస్వామిలా మరి మాటాడలేక కారేసుకుని మౌంటురోడ్డువెళ్ళి కాన్నిమారాలో భోంచేసి అడియార్‌లో భరతనాట్యం చూసుకొని—తెల్లవారుఝాం—నాలుగింటికి ఇంటికొచ్చి—వసారాలో – మడతమంచం వేసుకుని—పడుకున్నా. శాంతానికికూడా నిద్రపట్టి వుంటుందీ—నే లేకపోతే. అయినా నాకోసం మేలుకొని—వుండొద్దూ? మొండిపట్టు—నేనూ మేడమీదికి వెళ్ళలే!

పొద్దున్న కాఫీదగ్గిర—సాయంత్రం సందర్భమే మాట్లాల్లే—అసలు ఒకరినొకరం పలకరించుకోలే.

## 43

### ఆమె

తేయినాంపేట బంగళాకి బసమార్చాం. పెద్ద బంగళా. వరండాలు, తోట, మోటారుషెడ్లు, నౌఖర్లకు ఇళ్లు—పాపం! శాస్త్రికి ఇప్పుడు మహస్థిమితముగావుంటుంది. ఈచిక్కులు వీడిపోయి మనుష్యుల్లోపడ్డాం-అని అతనికి ఎంతేనా ఆనందంగావుంటుంది!

అయితే నాకు ఆనందంగా వుందా? ఏమిటో- ఇదో పెద్ద మహాలోకంలా వుంది. ఈ ఇంట్లో వక్కర్తెని యేలా వుండడం? ఇరుగు లేదు- పొరుగు లేదు. ఎంత

నేపూ తాయారుతోనూ, తోటమాలితోనూ, పుస్తకాలతోనూ, పత్రికలతోనూ— ఎలా కాలంవెళ్ళబుచ్చడం? మరి నెలరోజుల్లో పాపాయికి రెండోయేడు వస్తుంది! ఇక నా అవసరంకూడా వుండదు దానికి!

రాయపురంలో ఇళ్ళే బాగున్నాయేమో అనిపిస్తుంది. ఇంటిమీద ఇల్లనీ, బొమ్మరిళ్ళని, వాళ్ళింట్లో మాటలు వీళ్ళింట్లోకి వినిపిస్తుందనీ, ఉమ్మడి కొళాయనీ— ఇన్నీ అనుకునేదాన్ని. ఇప్పుడు ఆ ఇళ్లు తల్చుకుంటే, అగ్రహారంలా- ఓమంచికేనా- ఓచెడ్డకేనా- ఇరుగుపొరుగు సాయానికేనా- సానుభూతికేనా- చదువొచ్చినా- రాకపోయినా అమ్మలక్కలందరూ కలిసికట్టుగా వుండేవారు. చదువుకొన్నదాన్ననీ, శాస్త్రులుగారి భార్యాననీ ఎంతో గౌరవించేవారు. ఇక్కడ ఈ బంగ్లాలో నడిసముద్రంలో తెప్పలాగున్నాను...... ఇళ్లు మారడం అంటే కొందరికి అతి సరదా, సినీమాకు, నాటకానికి వెళ్ళడం అంటే ఎంత సరదావో అంత. ఆ సామాను ప్యాకు చెయ్యడం, ఆ రభస, కూలివాళ్ళమీద అధికారం, నౌఖర్లని తిట్లు— ఈ హంగామా అంతా మళ్ళా కొత్తయింట్లోను. అది యేమి హాయి ఆనందమోకాని, నాకు తలనొప్పి. పాం పొరవిడిచినట్టు అస్తమానం మనం ఇళ్లు మార్చుకోగలమా? ఇళ్లుకూడా మనతో ఒక భాగం అయిపోవడం వే? లేకపోతే- నేనే ముసలిదాన్ని అయిపోతున్నానా? మార్పు అంటేనే తలనొప్పి వస్తే, దాని అంతరార్థం ఏమిటి? బుర్ర బెరడుగట్టిందనేగా?

బట్టలు బీరువాలోకి సర్దుతున్నా. కర్రపెట్టెలోంచి—కర్పూరం, లవండరు వాసనలు—తళతళ—కాకిబంగారం—నా పొందూరుజరీచీరె— శాస్త్రి పాఠ్మీనా నూటు; అరే వాటి "మధుపర్కాలు"—!।వాటిని చూసేటప్పటికి కడుపులో చెయ్యిపెట్టి కెలికేసినట్టయింది. గుండెలు ఝల్లుమన్నాయి—ఊపిరి సలపలేక—కళ్ళంట నీళ్లు తిరిగేయి—నాగ్గేళ్ళయిందా అప్పుడే ?......

శాస్త్రి ఇంటికొచ్చాడు—కొత్తింటికి - కొత్తపెళ్లికొడుకులా—అతని సరదా—హడావుడి—మరి చెప్పడానికి వీల్లే! నేనూ ఆ శృతిలోనే—కలుద్దాం అని ప్రయత్నించా—కాని వీణతీగె చెమ్మతగిలితే—నాదం ఇస్తుందా ?—ఈఅలసట నిస్పృహ ఏం షేక్స్పియర్ ? మొహం వేలేశావ్ ?—మహారాణిని చేశాగా—నౌకర్లు— చాకీర్లూ రథాలు—వాహనాలు—వజ్రాలమేడ—పువ్వులతోట—బంగారపు తూగుటుయ్యాల !— రావోయి ! ఇల్లాగ !" అని పంట్లాంజేబుల్లో—రెండుచేతులూ—పెట్టుకుని—కాళ్లు తలాయించి—డాబు - అధికారంతో అనేసరి నాకేమిటోలా అనిపించింది. "ఆ బంగారపు తూగుటుయ్యాలతో పాటు—నన్నుకూడా డబ్బిచ్చి కొన్నట్టేనా ?" అని చటుక్కునన్నా. అన్నాను—అని నాలిక కరుచుకున్నా. అయ్యో ! ఎంతమాటన్నాను ! తన సర్వస్వం నాకోసం ధారపోయడం—నేనతని సంతోషంలో లీనంకాకపోవడం అసలు తప్పే. మీదుమిక్కిలి యీ తెలివితక్కువమాట అన్నానే ! కాని ఆ చూశావా— నేనెంత ప్రయోజకుణ్ణో ఇదంతా నాది—నువ్వుకూడా—ఈ మోటారు

కార్లు—యీ సరంబాంతో పాటు - నా స్వంతం అన్న గొంతుక - వినిపించే—సర్కి నా నోటింట మాటలు—అప్రయత్నంగా జారిపోయేయి—! అతను తెల్లబోయాడు—ముఖం ముడుతులుపడింది—కోపంవచ్చింది—కథ అడ్డంగా తిరిగింది—"డా—ట్"! అని గిర్రని తిరిగి వెళిపోబోయాడు....చటుక్కున ఆ మధుపర్కాలు కల్లోలాగ కంటి ముందరొచ్చాయి...మా ప్రేమ—మా సంసారం—మా పాపాయి...ఆ వెళ్ళిపో బోతున్నతన్ని కౌగలించుకున్నా... శాస్త్రికి కోపం అసలుగాదు. వొచ్చిన ఇట్టే మాయం అయిపోతుంది... "శాస్త్రీ, పిచ్చి మాటన్నా క్షమించేం!..." ముద్దుపెట్టుకున్నాడు. "నిన్ను క్షమించడమేమిటి? నీ ప్రేముంటే లక్ష్మి సరస్వతు లున్నట్టేగా! నువ్వు పూర్తిగా అలసటపడిపోయివున్నావు. ఆ రాఘుపురం అగ్రహారం గాలి నిన్ను పూర్తిగా ఆరోగ్యరీత్యా, మానసికరీత్యాకూడా జీవచ్ఛవాన్ని చేసేసింది. ఇప్పుడు ఈ పూల్ బాగ్ వచ్చేశాం కనుక, ఇక ప్రాణవాయువుపీల్చు. ఏసంవుందే—మన జీవిత కథ మళ్ళీ మొదటినుంచీ ప్రారంభిద్దాం - ఒ. న. మః ల నుంచీ - ఏం! అనగా - అనగా ఒకరాజు ఆరాజుకో కూతురు ఆ కూతురు పేరట - శాంతంట. ఆ శాంతానికి మనోవ్యాధి పట్టుకుందిట - ఎంతమంది వైద్యులు మందిచ్చినా - కుదరలేదట. చివరికి ఓ శాస్త్రిలుగారు దారమ్మట పోతూంటే - రాజుగారుచూసి పిలిపించి - మా అమ్మాయికి మందిచ్చి కుదిర్చినట్లయిన అర్ధరాజ్యం - కూతుర్ని ఇస్తానన్నారట - ఓ - ఇంతకంటేనా నే చెప్పేవైద్యం - పుచ్చుకోమన్నా. మందులు పత్యం - పానం మాత్రం చేయించాలి అన్నాడుట. ఆరోజునించి వైద్యం ఏమిటి?—రోజు ప్రొద్దున్న షికారు- మధ్యాహ్నం స్నేహితుల యింటికి "విజిట్లు"—సాయంత్రం బీచి - రాత్రి సినీమా - తరువాత కన్నిమేరాలో భోజనం రోజువిడిచి రోజు - ఇంట్లో టీపార్టీ - తెలిసిందా యీ మందే మందు! ఇదే సంజీవి! - అంటూ నన్ను చెయ్యిపట్టుకుని లేవదీసి గిర్రని ఉప్పలగుప్ప-తిప్పేశాడు! "ఈకథ బాగుంది ఈ కథమాత్రం కంచికివెళ్ళడం నువ్వు మాయింటికి నేను మాయింటికీ వెళ్ళడం మాత్రం ఉండకూడదునుమా!" అన్నా. రాత్రి నాటకానికి వెళ్ళేం. సుగుణవిలాస సభవారి తారాశశాంకం. తరవాత - బసోటోలో కాఫీ - ఇంటికొచ్చాం. పిల్లకి మెళుకువొచ్చింది. ఇలు కొత్త అదే ఏడుపు...శాస్త్రికి తలవాల్చగానే గుర్రుని నిద్ర - నాకు పట్టలే...మళ్ళీ కథ కొత్తగా మొదలెట్టగలమా? అని భయంగా వుంది.........

# 44

## అతడు

అమ్మయ్య! మళ్ళీ యెప్పుడేనా "నా" దేన్నైనా అనగలనా అనిపించింది! ఆ రోజులన్నీ సూర్యుడిముందర పొగమంచులా ఎగిరిపోయాయి కద! నాఇల్లు, నా మోటరు కార్లు, నా శాంతం, నా పాపాయి— ఇంతకంటే ఏం కావాలి ఎవడికేనా! ప్రపంచంలో నన్ను ఇంక "హాఁ!" అని అనేవాడు లేడు కదా! శాంతంలో మునుపటి చురుకుదనం మళ్ళీ తీసుకురావాలి. "నివురు గప్పిన నిప్పు వోలె" కాస్త వూది, నిప్పుని మంటని చెయ్యాలి. అంతే. అప్పుడు మళ్ళీ నా శాంతం అయిపోతుంది. 'బాసు' వాళ్లందరికీ వో రెండు డిన్నరుపార్టీలు, క్లబ్బుస్నేహితులకి రెండు గార్డెనుపార్టీలు ఇచ్చానా- ప్రాక్టీసుకీ మంచిదీ, శాంతానికి సరదాగాను వుంటుంది. "నా" అనగలిగే తాహతు వుంటే యెంత హాయి?! నా శాంతం— నా ఇల్లు— నా మోటారు...... అబ్బే! వ్రాసినదే మళ్ళీ వ్రాస్తున్నానేమిటి?......

అబ్బ! కొంతమందితో మహాకష్టం. చామంతిపువ్వులంటే మా శాంతం చెవికోసుకుంటుందా- అలాగని సాయంత్రం ఇంటికొచ్చేటప్పుడు హార్టి కల్చరల్ సొసయిటీనుంచి ఎంచి తెచ్చా చామంతులు. శాంతం పుచ్చుకుంది. తల్లోను పెట్టుకోలేదా- పోనీ, "వేజు"లో పెట్టలేదూ- ఏమిటో అలాగా బల్లమీద అశ్రద్ధగా పడేశింది. అవి కాస్త వాడి వూరుకున్నాయి. బోలెడు డబ్బయింది కూడాను. మరి యెందుకో ఆ నిస్పృహ, నిరుత్సాహంవున్ను? ఏం కొరత- తాజ్ మహల్ లాంటి యిల్లాయె— నందనవనంలాంటి తోటాయె— బంగారపుబొమ్మ పాపాయి— బేబీ ఆస్టిన్ ఫోర్డూ సాక్షాత్తు కొల్సురాయిస్సాయె— అంట్లుతోమడానికి దాసీ— ఇల్లుతుడవడానికి మగోమనిషి—పాపాయి కోసం ఆయా—బట్టలు తడపడం, పక్కలు వెయ్యడం వొడ్డిమంగలాడు—గుమ్మంలో హామేషా బంట్రోతు— తోటకారు— తోటకారు పెళ్లాం— కారుడ్రైవర్లిద్దరూ— గుమాస్తా — గుమాస్తా పెళ్లాం ఎప్పుడేనా ఇంట్లోసాయానికాయె — ఏమిటితక్కువ? ఆ, అది కాదు. ఆ రాయపురం వాతావరణం లక్షణం ఇన్నాళ్లు ఎలా భరించిందో కదా? నాకైతేనా- రోజూ క్లబ్బు, టెన్నీసు, మీటింగులు- ఇవన్నీ వుండేవిగా. పాపం, శాంతానికి ఇల్లు చూసుకోవడం, పిల్లనిచూసుకోవడంతోనే సరిపోయేది. నేఅనుకున్నట్టు శాంతం నేనూ మళ్ళీ మొదటి దగ్గిరనుంచి మొదలెట్టాలి. రాత్రి తెల్లవారంతా, ఆ వరండామీద, నల్లని చీకటిరాత్రిలో, మాట్లాడుతూ గడిపేం. నాల్గేళ్ళ క్రింద శాంతం లాగు అగుపించింది. ఎన్నాళ్ళో అయింది ఇంత హాయిగా మాట్లాడుకుని.

మొట్టమొదటిరోజులు జ్ఞాపకం వస్తున్నాయి. ఈవేళలాగే ఆవేళ రాత్రి అంతా మాట్లాడుకున్నాం. కాని ఇప్పట్లా అంతులేని చర్చలు లేవు ఆరోజుల్లో. ఆరోజులు

తేలికగా వెళ్ళిపోయాయి. ఎంచేతంటే ఒకరి సహవాసం వకరికి క్రొత్త. ప్రపంచకం, సంసారం అంతా వలపుతోనూ, మోహంతోనూ నిండిపోయేది. ఒకరిని వకరం ఎడబాసి వుండలేకపోయేవాళ్ళం. మోహంలో లీనం అయిపోయేవాళ్ళం. నిజంగా ఆలోచిస్తే మూసుకంతులు నలపు నకవంకు ప్రేమ. ఆ రోజులు తల్చుకుంటే, ఇప్పుడు సిగ్గుగా వుంటుంది ఒకర్నొకరం మూసుకుని ముసిసిపోయేవాళ్ళం.

ఇప్పుడు మనసు, వొళ్ళుకూడా సాధువయిపోయాయి.

ఆ రోజుల్లో వలపు, ప్రేమ, ఆనందం, అనుభవించాము. కాని నూతిలో కప్పలాగే వుండేది మా జీవితం. "అజ్ఞానం"లోవుండి హాయి అనుభవించడం ఉత్కృష్టజీవితమా, లేక పోతే విజ్ఞానం సంపాదించి అసంతృప్తితో బతకడం, ఆ అసంతృప్తే, ఆనందం అనుకోవడం ఉత్కృష్టమా? "ఓ"అంటే"నా" రానివాళ్ళెంతమంది హాయిగాబతకడంలేదు? మొగాడు, ఆడదీకూడా రోజల్లా కాయకష్టంపడి, రాత్రిఅయేసరికల్లా కలోగంజో తాగి, సంసారాలు చేసుకుంటూ ఆవిధం హాయి అనుభవించేవాళ్లు ఎంతమిందిలేరు? వాళ్ళని చూస్తే నాకు ముచ్చటవేస్తుంది. వాళ్ళకి ఓ రాజకీయం అక్కర్లేదు. ఓ వేదాంత చర్చలు అక్కర్లేదు ఓ వాఙ్మయ విమర్శ అక్కర్లేదు కదా!

అక్కరలేని చిత్తక్షోభ పెట్టుకోకుండా శాంతం నేనూ ఎందుకలా హాయిగా వుండకూడదు? ఈ నా రికతలూ - ఈ చదువులు-ఈ సంస్కరణాలు - ఈ చర్చలూ - నాకేం నచ్చడంలేదు. నిరాడంబరమైన బతుకు - ఆనందమైన జీవితం ఎందుకు ఆదర్శంగా పెట్టుకోకూడదు - శాంతం నేనూను?.........

ఈవాళ ఏమిట్లో నిస్త్రాణగా వుంది హెచ్చరిక లేదు. బతుకంతా అతుకుల బొంతలా వుంది. అనుకున్నది ఏదీకూడా ఒక వరసా - ఒక వావి లోజరగడంలేదు. ఇంటికెళ్ళాలని బుద్ధెయ్యడంలేదు. పని తొందరచేత వూళ్ళోనే భోజనంచేసి ఇంటికొస్తానని శాంతానికి టెలిఫోనుచేసి లేడీఅయ్యంగారింటికి వెళ్ళి వాళ్ళింట్లో భోజనంచేస్తా.

అదేమిట్లో కాని ఇంటిగురించి సంసారంగురించి చివరకి నాగురించేనాకూడా ఎవరితో మాట్లాడ్డానికి బుద్ధి పుట్టడంలేదీవాళ.

మళ్ళీ మరోమాటాలోచిస్తే సంసారం - యిల్లు - పాపాయి - శాంతం మినహాయిస్తే నాకు మిగిలినదేమిటి ? నా ఆశలు ఆశయాలు కోర్కెలు ఎవరికోసం ?

పెళ్లి చేసుకోనంతవరకు గాలి గుఱ్ఱం. మోహంలో పడినంతసేపు జంఝామారుత భీభత్సం .తరువాత సంసారంలో అగమ్యగోచరం. అయోమయమనుస్మా ? నా కొక్కడికేనా లేక అందరికీ ఇదే అనుభవం ఆ ?

# 45

## ఆమె

నిన్న రాత్రి అంతా బాగానే వెళ్ళింది. వరదరాజులు - హేమం - ఇద్దరూ చాలా సరదా అయినవాళ్లు, మా యిద్దరికి పాతస్నేహితులే. వరదరాజులు, శాస్త్రి ఇద్దరూ - లండను స్కూలు ఆఫ్ ఎకనామిక్సులో కలిసి చదువుకున్నారు. క్వీన్ మేరీసులో నేను ఆఖరుసంవత్సరం పనిచేస్తున్నప్పుడే అతను-ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రొఫెసరు. ఆనర్సు క్లాసులకి నేను భూమిసిస్తు పద్ధతిమీద చెప్పేదాన్ని. అతను "పాహుకారు-మహాజన్ బ్యాంకులు" గురించి చెప్పేవారు. హేమం నేను - ఇంటరు మొదటి సంవత్సరంనుంచి ప్రొఫెసరుగిరీవరకూ-కలిసే అన్నిమెట్లూ ఎక్కాం. ఎన్నోసార్లు వాళ్లింటికి రమ్మన మని పిలిచేరుకాని వాళ్లు ఆవడిలో వుండడం మేం రాయపురం అంచేత పడలే.

ఇంటికొచ్చాం. డాబామీద వెన్నెల్లో కూచుని బత్తాయితొనలు వొల్చుకొని తింటున్నాం. పిచ్చాపాటి మాట్లాడుతున్నాం. శాస్త్రి వున్నాకే హేమంగురించి అదే పొగడ్డం మొదలెట్టాడు. "ఏం అందం ఉండీ ఆవిడది! వరదరాజులది అదృష్టం అంటే" అన్నాడు. నేవూరుకున్నా ఇంక అదే పదిమాట్లు కల్పించేడు. దాంతో-నాకు వొళ్ళు మండింది. "ఏం నేమాత్రం అందంగాలేనూ? ఆ రోజుల్లో రోజు నా చెవులో నూరుమాట్లు - వెయ్యిమాట్లు వల్లించేవాడివే అది ఇప్పుడు మరుపు అయిపోయి హైమవతీ శబ్దం మొదలెట్టేవే!" అని ఏదోఅన్నా. దంతో శాస్త్రి మరిమాట్లాడలే. మెల్లిగా లేచి క్రిందికి వెళ్ళిపోయేడు...నా కెప్పుడు అసూయ, ఈర్ష్య లేదే-నేనెందుకలా అన్నా? అసలు నామనస్సులో అలాంటి ఉద్రేకాలులేవే?...రాలేవనిధైర్యంగా అవ గలనా? నా మనసులోవుండే చీకటికోణాలు వెతుక్కోడానికి నాకేభయం వేస్తుందే. ఏ మూల ఏ ఉద్దేశాలు ఏ తలంపులు దాగి వుంటాయోవాటిని కాస్తా బయిటికి లాగితే ఏ రూపం ధరిస్తాయో అని నాకే సాహసం లేకుండావుంది! ఎవరి హృదయంలోతు వాళ్ళకే తెలియదే. ! నా మనస్సు కెలకడానికినాకే బితుకు బితుకుమంటే రెండో వాడి మనస్సు నే తెలుసుకోవడం ఎలా? అసలు బుర్రలోకి ఆలోచన వచ్చినా ఆ ఆలోచన మనదే అన్న సంగతి మర్చిపోతాం కాంసు!అది మనస్సులో ఏమూలనో బూజుపట్టినట్టు దాంకుంటుంది, అకస్మాత్తుగా అనుకోకుండా, అప్రయత్నంగా అన్నాట్లు తెరవెనుక దాంకొని మన్ని హేళన చేయ్యడానికే అన్నట్టు చటుక్కున పైకొచ్చేసి మన్ని మాట్లాడిస్తుంది...ఇవి నా మాటలే, నా ఆలోచనలేనా అనిపించింది. నేను ఎందు కన్నాను ఆ మాటలు? ఎందుకేమిటే? ఒక్క కారణమే అని వేలుమడిచి చెప్పగలం? నిజంగా నాకు అకారణంగానే ఈర్ష్య ఓర్వలేనితనమే వొచ్చింది. అదిన్నీ నే సంటూవుండగా మరోస్త్రీని పొగడ్డమూ అన్న కోపం, అసలు చికాకు ఇన్నీ ఇప్పుడు

కలిశాయి ఆ నిమిషానికి. అనకపోయినా బాగుండిపోను. అయితే ఏంజేయను? మన మనసు మనకి లోబడదు. మన నాలుక మన కంఠకంటే లోబడదు... మామూలుగా భోంచేసి శాస్త్రి హైకోర్టుకు వెళ్ళిపోయాక "హిందూ" చదువుకుని అప్పుడే పోస్టు బంట్రోతు "యంగిండియా" పట్టుకొచ్చాడు. పుచ్చుకుని, మొదటినుంచి చివరవరకూ చదివే. మళ్ళీ మామూలు గాంధీగారి "యంగిండియా"లే... ఎంచేతో ఈవేళ చదివేసరికి ఒక్కసారి ఒళ్ళంతా ఝల్లుమంది. కళ్ళు మూతబడ్డాయి. మూసుకున్నా కళ్ళముందే ఏవో నిప్పుగోళాల్లాగా కళ్ళముందు పరుగెత్తాయి... మనస్సులో ప్రళయంలాగొచ్చేసింది ఛా, ఈవేళనుంచి ఖద్దరుతప్ప మరోగుడ్డ కట్టుకుంటే ఒట్టు అనుకున్నా... ఇప్పుడు నే కట్టుకున్న బట్టలు శాశ్వతమా? ఈ యిల్లు - యీ మోటారుకార్లు నావా? నా వెల్లా అవుతాయి?... శాస్త్రి డబ్బేగా? అతనిస్తేనేగా నా కొచ్చేయి? నాకు "నాది" అని—"తన"దని భేదంలేదు—కాని... భేదమే... నా బ్యాంకి ఎకౌంటు వేరేగా వుంది. అయితే అదెంత? పట్టుమని ఐదువేలు లేదు. ప్రావిడెంటు ఫండేగా! శాస్త్రిదా ఎంతైవేలుంది... మా యిద్దరికీ భేదం లేకపోతే బ్యాంకిలో ఖాతా ఇద్దరిపేర కలిసి ఎందుకు వెయ్యడూ? దీనికేదేనా అంతరార్థం వుందా లేక లోకంమీద అందరూ మొగాళ్ళు చేస్తున్నట్టేనా? అసలు శాస్త్రికి తోచేవుండదు. తోస్తే వుమ్మడిగానే వుంచుతాడే... అయినా ఓ నిశ్చయానికి వొచ్చేక ఇక అట్టేముందు వెనుకలు ఆలోచన చేసే తత్వంగాదు నాది. నాకు హేమ్లెట్ లాంటి మనుష్యులంటే తలనొప్పి. ముందుకు గొయ్యి-వెనక్కి-నుయ్యి, ఆగొయ్యిలోతా-ఈ నుయ్యిలోతా-అని మీనమేషాలు లెక్క పెడితే ఏపనేనా చెయ్యగలమా? యీ "సైకోఎనాలిసిస్సు" యీ డాస్టొవస్కీ తజ్జనభజ్జన నాకు తలనొప్పి... వెంటనే బేబీ ఆస్టిను తీసి ఖద్దరుషాపుకు వెళ్ళి నా డబ్బుతో నూరు రూపాయిలు చీరెలు చేతిగుడ్డలు కొనుక్కొచ్చేశా. తలంటి నీళ్ళు పోసుకున్నా... ఆ తడి బట్టలతోనే నా బనారసు చీర్లు, వాయిల్సు, బెంగుళూరు పట్టు చీర్లు, ఉప్పాడ దాసన్నపేట చాపులు, నర్సాపురం లేసు జంపర్లు, అన్నీ పోగుచేసి తగలెట్టేశాను. ఆ పంటసేని ఖద్దరుచీర కట్టుకుని ఆ కడిపేనే, జాకెట్టుకూడా మంటలో పారేశాను. ఈ అగ్నిహోత్రంతో నా మనస్సులో ఆజ్ఞదికూడా ఉపశమించింది. ఆ ముతకగుడ్డలు కట్టుకునేటప్పటికి కొత్తజన్మ ఎత్తినట్టే అనిపించింది.

నేనుగూడా నలుగురితోపాటు యావద్భారత దేశంతోపాటు ఎందుకు సత్యాగ్రహంలో చేరకూడదు? నేనూ మాత్రం ఎందుచేత యీ ట్రిప్లికేను బీచి అంట ఉప్పు చెయ్యకూడదు? మొన్న నేనూ ఉప్పు పొట్లాం ఏభైరూపాయిలకు కొన్నాను. శాసనోల్లంఘనం చెయ్యడం అంటే జైలుకు వెళ్ళడానికి సిద్ధంగా వుండాలి.. అంతపని చెయ్యడానికి మనసు ఒప్పుకోవడం లేదు. ఉప్పుచేసినంత మాత్రాన్న స్వరాజ్యం మన చేతిలోకి వచ్చి పడుతుందా అనిపిస్తోంది నాకు నమ్మకం తోచడంలేదు. అంచేత ఉద్యమంలోకి దిగను. శాస్త్రికి ఉప్పు పొట్లం కొంటేనే ఎంతో కోపం వచ్చిందికదా. ఉద్య

మంలోకే దిగుతే ఇక చెప్పేదేముంది? ఈ ఖద్దరు వేసుకోవడమే అతని కంట్లో కంటకంగా ఉంది. ఈ విషయంలో మాత్రం నా దారి నేను చూసుకోవలసిందే! ఏం చేయగలం? నా వ్యక్తిత్వానికి భంగం రాకూడదు. నా అంతరాత్మని నేనే కాపాడుకోవాలి.

## 46

### అతడు

శాంతం ఏమిటి ఇల్లా మారిపోయింది? వరదరాజులు, హేమం, బాగా పాతస్నేహితులు కదా అని ఏదో మాటలసేసరికి అన్నమాట పట్టుకుని అలా దులిపేసిందేం? మునుపు ఎప్పుడు ఇలాగు లేనేలేదే! "హేమం మంచిరూపసి-వరదరాజులు మంచి అదృష్టవంతుడు సుమా" అన్నా. దాంతో ఎక్కడలేని రోషం వచ్చింది శాంతానికి. ఆవేశంగా: "నేను రూపసిని కానా? నాకంటే అందమైనవాళ్లెవరున్నారు? నేనంటే మీకిష్టంలేదు కాంసు? ఆమాట స్పష్టంగా అనకూడదా?" అని ఏమిటేమిటో గోదావరి ప్రవాహంలాగ అవే మాటలు! నేను అన్నమాటలో ఏం తప్పులేకపోయినా సమర్థించుకుంటే అనవసరంగా మరింత చర్చలోకిదిగడం అని అనుకుని చల్లగా జారిపోయా.

రాత్రి ఎంతకీ నిద్రపట్టలే - శాంతం డాబామీదే ఉండిపోయింది. మనస్సు పరి పరి విధాల పోతూంది. నేనంటే నాలిక తప్పిజారిఅన్నానుకాని శాంతానికేమైనా అనుమానం తగిలిందా?... ఆవిసురు హేమంమీదికి కాకుండా లేడీఅయ్యంగారిమీదకా? నేనీమధ్యని శాంతంలేకుండా రెండు మూడుసార్లు వెళ్ళడం శాంతానికేమైనా తెలిసిందేమో? తెలిస్తేమాత్రం అందులో ఏముంది? అసలు మొగుడు పెళ్ళాంమధ్య ఈర్ష్య అంటూ లేకపోతే ప్రేమలేదంటారు. నిజమేగా అది? అబ్బే ఎల్లానిజం అవుతుంది? నామీద ప్రేమకొద్దీ శాంతానికి ఈర్ష్యవొచ్చిందా? అదేఅవుతే లేడీఅయ్యంగారికీ నాకూ వున్న పరిచయమో - దానిమాట ఏమిటి? అయినా నావల్ల తప్పేంలేదు. బొత్తిగా మరొకళ్ళతో మాటామంతీ ఆడకూడదు అని ఆంక్ష వేస్తేఎల్లా? పెళ్ళికాకముందు ఎన్నో అనుకుంటాం. సంసారంఅంటూవచ్చేక ఎంతప్రేమవివాహంఅయినా మునుపటిఉద్దేశాలన్నీ తల్లకిందు లవుతాయి... లేకపోతే శాంతంకూడ ఏదో ఆలోచించుకోకుండా ఊరికినే దెప్పిందా? అంతే అయివుంటుంది.

జమాంతరం మహంతు ఖూనీకేసు త్వరగా అయిపోడంచేత ఇంటికే సరాసరి వచ్చేశా. మూడుగంటలకే గుమ్మంలో కారుదిగుతూను-గుడ్డకాలినవాసన! "శాంతం! శాంతం! గుడ్డకాలినట్టు వాసనవొస్తోంది. ఎక్కడో చూడు" అంటూ లోపలికొచ్చా. భోగిమంటలా

వాకిలిమధ్య అగ్నిహోత్రం! గుడ్డలమేటు! బనారసుచీర్లు, బెంగుళూరుసిల్కులు, ఇంగ్లీషు వాయిల్సు, అస్క్విత్ అండ్ లార్డుబ్లేజర్లు, లేసుఅంచుశర్వ్వాల్లు, ఉప్పాడజల్తారుచీర్లు మధురచీర్లు! పెద్దహోమగుండం, అగ్నిపర్వతం, ఖాండవదహనం ఎన్నివేలరూపాయిలు ఖర్చుచేసి నేను కొన్నానో "నాకే పాలుపోలేదు. ఇదంతా ఏమిటి! శాంతం"? అన్నా మాటాళ్లే. దగ్గరకెళ్లా. చెయిపట్టుకు నెవ్వూపే. తపస్సులోనో సమాధిలోనో వున్న మనిషిలా వుండేది కాని మామూలు శాంత కాదు. ముఖంలో అదోరకం వర్చస్సు! కొంచెం వెనక్కి తగ్గే. ఏమిటా చేతిలోది అని చూశా, గాంధీగారి యంగిండియా. మళ్ళీ మనిషివేపు చూశా. కట్టుకున్నది పల్నాడు చీరె బందరుఅద్దకం రవికె. ఇక బోధపడింది. మంటలు చల్లారాయి.

"ఇదంతా ఏమిటి? శాంతం?" అని మళ్లీ అడిగే "ఏంలేదూ, నేనీవాళనుంచి ఖద్దరు దీక్ష తీసుకున్నా అంతే!" "సరే బాగుందికాని ఈ గుడ్డలు భస్మం చెయ్యకపోతే ఎవ్వరికేనా ఇచ్చెయ్యకూడదూ? ఎంతడబ్బు నాశనం అయిపోయింది?" అన్నా "డబ్బుఉంటేనేమిటి పోతేనేమిటోయి? మహానుభావుడు ఆయన చెప్పేది మనంచెయ్యాలి. అంతే,!" అంది. "నేను మాత్రం కాదన్నానా? అదికాదు. ఈవిధంగా అందరికీ సాధ్యంఅవుతుందా? అందరం ఈ ముతకవస్తులు ధరించగలమా? సాధన అందరికీసాధ్యమా"? "ఈ పిచ్చిఖబుర్లు తీసెయ్యోయి అబ్బాయీ? మనిషికి సాధ్యంకానిదేంవుంది?" అంది. "నాకూ ఖద్దరు కట్టాలనేవుంది. ఇన్నాళ్ళనుంచి దేశంలో ప్రచారం అవుతూంటే, నీమనస్సుకీవేళ స్ఫురించిందికదా. నాకు రేపుస్ఫురించొచ్చు. అంతవరకు నేను ఎట్లాధరిస్తా? ఆత్మవంచన అవదూ?" "ఓహో లాయరుగారి వాదనలే!" అంది శాంతం హేళనగా. "అదికాదు శాంతం! నేచెప్పేదిబాగా ఆలోచించు. నాకూ దేశభక్తివుంది. గాంధీమహాత్ముడిమీద గౌరవంవుంది. అయితే నాకుకొన్ని ఆశయాలున్నాయి! మొన్న గవర్నమెంటు ప్లీడరుని వేయడంలో నామాట చీఫ్ జస్టిసుముందర రాొచ్చిందట. బాగా ముందుకొస్తున్నాడు. ఇకన్ని అడ్వకేటు జనరలుగా నేనా వెయ్యాలి అని జస్టిసు సారంగధరయ్యంగారు అన్నాడట. ఇప్పుడు నువ్వు ఖద్దరులోకి దిగావు అని తెలుస్తే నా భవిష్యత్తు అంతా గుండుసున్నా అయినట్టేననుకో. అయినా ఇంకా కాలం చాలా ముందుకేవుంది. నేనూ అడ్వకేటు జనరలుగా ఏ కొంత మూడేళ్లో చేసి పాపాయికి మంచిసంబంధంచూసి అప్పుడు ఏకంగా పనిమానేస్తా. ఇద్దరం మళ్ళీసారే దిగిపోదాం!" "ఓహో! దూరాలోచనండోయి! మాటా మాణిక్యంకూడా దక్కుతాయండోయి!" అని ఆక్షేపించింది. "అలాకాదు మంచోపద్దో యీ సంసార సాగరం మనిద్దరం కలిసే ఈదాలి కాదూ?" అన్నా. "కలిసి ఈదితే ఇద్దరం అనగితే! ఎవరికేవారే!" అంది. ఖద్దరుపిచ్చితో చాలించకుండా ఉప్పుసత్యాగ్రహంలోకూడా దిగుతుందేమో? అర్థకజ్ఞానం పోవడంతోపాటు రాజకీయంగా మూఢత్వంకూడావస్తే ఇక చెప్పేదేముంది? నా భవిష్యత్తు గురించేనా చెప్పి మానిపించాలి ఇందులోకి దిగకుండా.

నాకేం పాలుపోకుండావుంది... ఒకటనుకుంటే వకటవుతున్నాదేం? రెండు మూడు లకారాలు సంపాదించాక రాజకీయంలో దిగుదాం- నేనూ జాతీయవాదినేకదా అని అనుకుంటే ఇల్లా తిరిగిందేం? పోనీ-శాంతం నాతో ముందు హుషారేనా చెప్ప కూడదా? నిమిషాలమీద దిగపోతే పోయేదేంలేదుగా? నాకు ఎలాగో సర్దుకోవడానికి వీలుండును. చేతులోపడ్డ ఎడ్వొకేటు జనరలుగిరీ పోయిందే...ఇంతిలా ఎట్లా మారి పోతారా అని నాకేం అర్ధంకావడంలే! ఇంక నిలకడేమిటి?..." ఎవరికి వారే అనే సిందే శాంతం-ఏమి అంతరార్ధమో? ఏం తోచడంలే...

## 47

### ఆమె

పదిరోజులైై యీడైరీవేపే చూడలేదు. పాపాయికి కొంచెం సుస్తీచేసింది. దానిమూలానిన్ని, మొన్న రెండురోజులూ కాన్వొకేషను హడావుడులు అంచేత పూర్తిగా మర్చేపోయాను. పాపాయిపుట్టేక దాన్నాదీనా ఏమిటో క్వీన్ మేరీస్ వైపుకి క్రిందటి నాల్గుసంవత్సరాలు వెళ్ళలేదని యీమాటు వెళ్ళేను. ఆరేళ్ళు అక్కడచదువు, తరువాత నాల్గేళ్ళక్కడే పనిచెయ్యడం - పదేళ్ళ సంబంధంవుండడాన్ని - సహించుకుని క్వీనుమేరిస్ లోనేఅయింది—రోజూ మెరీనాకివెళ్లి కాలేజీ పక్కమ్మట వెళ్ళినప్పుడల్లా పదిసంవత్సరాల జీవితం కళ్ళముందరకొస్తుంది. మొన్న రెండురోజులూ దమయంతి, సులోచన, రంగనాయకి, అన్నపూర్ణనాదగ్గిరే వుండిపోయారు శాస్త్రి అందరితోనూ మంచిసరదాగా, హాస్యాలు చేస్తూ, అందర్నీ నవ్విస్తూ ఆతిథ్యం ఇచ్చాడు. కాలేజీ విడిచిపెట్టాక ఎవరెవరి మనుగడలు ఎల్లాజరిగేయో చెప్పుకున్నాం. దమయంతి బి. యే ప్యాసయ్యాక ఇంగ్లండువెళ్ళి వాళ్ళమళయాళంతన్నే ఒకతన్ని పెళ్ళిచేసుకుని అక్కడే వుండిపోయింది. లండనులోనే కాపురంట. జీతంఅంతా ఖర్చు అయిపోతుందిట కాని అక్కడే నచ్చిందంది. ఎవడిఘోష వాడిది - ఎవడిఖర్మం వాడిది. అయినా ఇరుగు పొరుగు సాయం మర్యాదా లేకపోలేదు. మొత్తంమీద స్వదేశంమీద మనసులేదంది. మూండేళ్ళకోసారి ఇండియాకి రావడానికి ఖర్చుతోకూడా సెలవు ఇస్తారుట సులోచన ఆనర్సుకెమిస్ట్రీచేసి వాళ్ళనాన్నగారు అలహాబాదులో ఎకౌంటెంటుజనరలుగావుంటే అక్కడికెళ్ళి అక్కడ "రిసర్చి"లోచేరి తరువాత అక్కడో మహారాష్ట్రియన్ని చేసుకుందిట. ఆయన శీతారాం ఆయిల్ మిల్సులో ఇంజనీరుగా వున్నాడుట. అప్పుడే ముగ్గురు పిల్లలుట. వెయ్యిరూపాయిలు జీతం, బంగాళాట. అంతా

బాగుందికాని అక్కడది వాళ్ళకీ వీళ్ళకీ ఏం పడ్డ లేదుట. ఆడవాళ్ళెవ్వరూ పైకిరారుట. జీవితంఅంతా కూపస్థమండూకంలావుంటుంది పాపం! రంగనాయికి నాతోకూడా సంవత్సరం లెక్చరరుగాచేసి వాళ్ళబంధువేనట యీమధ్య ఐ.సీ.యస్. ప్యాసయ్యాడట. ఇప్పుడు గోదావరి జిల్లాలో సబ్‌కలెక్టరుగా వున్నాడుట. ఆయన్ని చేసుకుంది. మొదటి నుంచి రంగనాయికి ఐ సీ. ఐస్. - ఐ. సీ. ఎస్. అనే పలవరించేది. నెగ్గించుకుంది. సంబంధం వాళ్ళవాళ్లు, వీళ్ళవాళ్లునిశ్చయించేనట. యీ గవర్నరుగారిపార్టీలు - అకలెక్టరుగారి దర్బార్లు - మహారాజుల ఆతిథ్యం - జమీందార్ల బహుమతులూ - రెండురోజులు ఇకఏమిటి యేకదాటిని ఖబుర్లు కురిపించేసింది. కోకాకూ, కూతుకూ-దొరసాని నవ్వుట. గవర్నమెంటువారి పెద్దకోడల్లా మాట్లాడింది మావగ్గిరకూడా! ఎంతైనా హోదా, అధికారం చలాయించడం అలవాటు అయితే అందరూ చులకనగానే కనిపిస్తారు. అన్నపూర్ణకి మూడోసంవత్సరం చదువుతూండగానే పెళ్ళయిపోయింది. ఎంతో బ్రహ్మాండం మీద చదువు పూర్తిచేయనిచ్చారు. అత్తవారు వాళ్లశాఖే పెంపకం జమీందారు అతనూ కాశీలో ఎమ్. ఏ. ప్యాసయ్యాడుట. మంచివుద్దేశాలున్నతనే అంది. కాని ఎలాగైనా జమీందారీ వేషాలు, వ్యవహారాలు నాకు కిట్టవు. అయితేనేం ఆ రేళ్ళ సంసారంఅయ్యాక ఇదీ బాగానేవుందనిపిస్తోంది. ఎక్కడికెళ్లినా ఫస్టుక్లాసు, రిజర్వుడు, పరివారసమేతం, రెండుకార్లూ!"అంది! రెండురోజుల ముచ్చట్లూ అయిపోయేయి. అందరూ వెళిపోయారు! అందరంకలిసి వుండేవాళ్ళం వక్కటేప్రాణంమాది. ఇప్పుడు ఒక్కరిది ఒకొక్క కథ - ఒకొక్కగాథ! వాళ్ళందరూ హాయిగా-సౌఖ్యంగా - ప్రేమానురాగాలతో సంపూర్ణమైన జీవితాలు జీవిస్తున్నారా? వీళ్ళందరికీ డబ్బుకి లోపంలేదుకదా? ఆ విషయంలో నాకంటే వాళ్ళందరూ అదృష్టవంతులే. కాని నాకున్నహాయి వీళ్ళకెక్కడ! పాపం - నేనంటే శాస్త్రి ప్రాణంపెడుతాడుకదా! కాని - నిజం చెప్పాల్సొస్తే - ఎవరి జీవితం వాళ్ళదేకదా! శాస్త్రి నేను ఎంతో అంత అన్యోన్యంగా వున్నామా - ఆయనా భావాల్లో - కొద్దిగా తేడాలొచ్చేస్తున్నాయి. అయితేనేం? ప్రేమకివన్నీ అడ్డొస్తాయా?

నిన్న సాయంకాలం మామూలుకంటె ముందే నాలుగు గంటలకే ఇంటికొచ్చేశాడు శాస్త్రి. నేనేదో లోపలి వసారాలో చదువుకుంటున్నాను. వెనకనుంచేవచ్చి కళ్లు మూశాడు. కళ్లుతెరచి విప్పేసరికి మఖమల్ పెట్టెలో తళతళ మెరుస్తూ వజ్రాలవుంగరం! ఏమిటిదన్నా? "అలాకాదు వుంగరం ముందు పెట్టుకో" అంటూ వేలికి తొడిగేడు. "దీనిభావమేమి తిరుమలేశ?" అన్నా. "వుంగరం నీకు నచ్చిందంటే చెప్తా"నన్నాడు. "నచ్చడమేమిటి? బేషుగ్గావుంది."అన్నా. "అయితేవిను"అన్నాడు. తూర్పుగోదావరి జిల్లాలో లింగాలపల్లి రాజాగారని ఒకగొప్ప జమీందారున్నాడట. సంవత్సరానికి ఇరవై లక్షలొస్తాయిట. ఐదారేళ్ళపట్టి రాజుగారికి రైతులకీ సిస్తుల గురించి తగాయిదాలుగా వున్నాయిట. ఆ తగాయిదాలమీద కేసులు పెరిగి అక్కడనుంచి రాజాగారు శిస్తులు పెంచడం, పొలంమీదనుంచి తొలగించడం,యిలాగ జరుగుతూనేవున్నాయి.

దాంతోపాటు క్రిమినలు చర్యలు. ఇలావుండగా రాజాగారి వాళ్లు పెద్దరయితుని ఒకణ్ణి ఖూనీచేశారు. అదో కేసు. సెషన్సులో రాజాగారికి వ్యతిరేకం అయింది ఇప్పుడు హైకోర్టులో అప్పీలు. రాజాగారితరఫున వకాల్తీకి శ్రీనివాసం, రాఘవయ్యగారు, బెన్సన్, వెంకటేశన అందరూ తంటాలుపడ్డారు. ఈవేళ మధ్యాహ్నం రాజాగారు స్వయంగా కబురుచేసి బెన్సన్‌కి సీనియరు వకాల్తీన్నీ, నాకు రెండో వకాల్తీనీ యిచ్చారు. అంతేకాదు యీ ఖూనీకేసువకాల్తీ యిలావుండగా హైకోర్టులోవున్న సివిలు కేసులన్నింటిలో నరసింహాచార్యంగారికీ, నాకూ జాయింటిచ్చారు.

“రిటైనరుకింద, ఫీజు అడ్వాన్సు క్రింద నాకు వెంటనే రెండువేలు ముట్టచెప్పేరు. ఆ రెండు వేలలోనూ నీకు ఐదువందలీ కట్నం!. అని ఎంతో ఉత్సాహంతో కౌగలించు కున్నాడు...... అతని పేరిమ ఉత్సాహం, ఔదార్యం నాహృదయానికి హత్తుకుని పోయాయి. కాని ఈ వుంగరం నే ఎట్లా తీసుకోను? ఎవరి డబ్బుతో కొచ్చింది? రయితుల రక్తమాంసం కాదూ?...... “శాంతం! ఏటటీలా పెదవివిరిచేస్తున్నావ్?” అన్నాడు. నేను ఎల్లా చెప్పను? అతని ఉత్సాహానికి భంగం కలిగించడం ధర్మమే? ఎప్పుడో ఒకసారి బయిటికి రావలసిందేగా......అతని మనస్సు నొప్పించకుండా చెప్పాలి....“శాస్త్రీ!నువ్వీకేసుపట్టకుండా వుంటేనా మనసుకెంతో శాంతివుండునోయి. ఈ రాజాలు, యీ జమిందారులు, వీరిదుర్న్యయాలు - అత్యాచారాలు వీటిలో మనం కూడా కలిగించుకోవడమెందుకోయి? యీవజ్రాలేమిటి - రైతుల రక్తపుచుక్కలు కావు? వాళ్ళరక్తమాంసాలు పిండుతే - పడిన తునకలు కావు? అటువంటివి నేనెలా ముట్టుకో గలను? నువ్వు ఎలా ముట్టుకోగలవు? నాకొద్దుశాస్త్రీ!” “ఇదేమిటి, శాంతం ఇల్లాఅంటు న్నావు? ఇదంతా నీకోసం-పాపాయికోసంగాదూ? అయినా-నేను బారిష్టరుని - ఎవరి తరఫున వాదించమంటే వాళ్ళతరఫునే వాదిస్తాను. అంతేకాని ఆ ఖూనీతో నాకేం సంబంధం - నాకేంసానుభూతి?” “నీకు సానుభూతిలేనిపనికో నువ్వెందుకు కల్గించు కోవాలి”? “అదేమిటి? ఇంతకీ-ఆఖూనీ ఎవరుచేశారో ఇంకా తేలందే! ఇలాంటి ధర్మ సందేహాలు పెట్టుకుంటే ప్రపంచకంలో బతకడం ఎలా?” “అలాగని దొంగడబ్బు ప్రజ లనిపీడించి సంపాదించినడబ్బు, రైతులపీకపిసికి కక్కించినడబ్బు, మనకెందుకు? ఈడబ్బు లేకపోతే మనకీ బతుకే గడవదా? అలాగు సంపాదించిన ధనం నిలవదంటారు మనవాళ్లు. నువ్వు అంతఆపేక్షతో ఈ వుంగరం ఇస్తుంటే నేను తోసెయ్యను. కాని నన్ను పెట్టుకో మనిమాత్రం బలవంతంచెయ్యకు - చేతిలో చెయ్యివెయ్యి!” అన్నా. “అలాగేలే! కాని నువ్వు చదువుకున్న అర్థశాస్త్రమంతా ఆచరణలో పెడితే ఎట్లా? యీ శాస్త్రాలకి నీకు దేమిటి?- నీ “రికార్డో, మిల్లు, బెంటామ్, బాగా చదువుకో. ప్రపంచంలో అన్నిరకాల మనుష్యులూ వుండాలి. నేయేదిచేసిన నీకోసమేనని మాత్రంఅని మర్చిపోకు!”అన్నాడు... నాధోరణి శాస్త్రి పట్టించుకోలే. అతను ఎక్కడ చిన్నపుచ్చుకుంటాడో అని భయం వేసింది. వుంగరం పెట్టుకోమని బలవంతంచెయ్యలేను. అదేపదివేలు......

## 48

### అతను

లింగాలపల్లి రాజాగారి కేసులు ఇన్నాళ్ళకి నాకొచ్చింది. దీంతో నేను చిన్న పట్నం న్యాయవాదుల్లో మొదటి శ్రేణీలోకి వచ్చినట్టే! యీ ఖూనీకేసుతో నా పేరు ఇంక నిలబడిపోవాలి ఏముంది - ఇలాంటివి మరిరెండు సివిలువికూడా వస్తేనా - రెండు మూడేళ్ళలో ఎడ్వకేటు జనరల్ గిరీ నాదే! యీ వకాల్తీకి - ఎంత పోటీ - ఎన్ని సిఫార్సులు - ఎన్ని బేరసారాలు జరిగేయి? నాకు వెనుకదన్ను లేకపోయినా జాతికబలమే పూర్తిగా సాయం చేసింది. కొంత ఆంధ్రాభిమానంకూడా నేమో-అబ్బే! అతని పీకలమీద కొస్తూంటే ఆంధ్రాభిమానమేమిటి - ప్రాణాలుదక్కి బయటికెలా పడడంరా భగవంతుడా అని యేడుస్తూంటే యీ దెబ్బతో షెవ్రలెటు కార్లు రెండూ అమ్మేసి ఒక బ్యూక్‌న్నూ, ఒకే పేకార్డు కొనాలి. ఏమిటో - నేనిన్ని పేక మేడలు కడుతూంటే శాంతం వాటినన్నిటిని ఉఫ్ఫని ఊదేస్తూంటుంది. ఎంతో సంభరంతో వుంగరము కొని తీసుకువెళ్ళినా - మొహంమీద పేడనీళ్ళు కొట్టినంత చేసింది. ససేమిరా నేనా వుంగరం పెట్టుకోనంటూ - ఒక ఉపన్యాసం కొట్టింది. మరి తన చదువుకున్న అర్థశాస్త్రం అంతా మర్చిపోయిందో - లేకపోతే కొత్త అర్థశాస్త్రం తయారు చేస్తోందో. జమీందార్లు దేశద్రోహులుట-రైతులు సాక్షాత్తూ దేవతాసంభూతులట - భూమి అంతా రైతులదేనట. జమీందార్ల డబ్బు ఎవడు తింటే వాడికి పుట్టుగతులు వుండవుట - అందుచేత నేను లింగాలపల్లి రాజాగారితరఫున వకాల్తీపట్టకూడదుట ఇంకా ఏమిటో...ఏమిటో నేనూ కాస్త ఎకనామిక్సు చదువుకున్నానుగా - కాని యీ ధోరణేమిటి? ప్రపంచం మీద సాగాలా - వద్దా? అందులోనూ మనదేశంలో అనాదిగా వస్తూంది. ఈవేళ పోవాలంటే పోతుందా? రాజులు-ప్రజలు; గొప్ప - బీద ఇవి ఉన్నంతకాలం ఎక్కడ మెలగవలసిన వాళ్ళక్కడ మెలగకపోతే - యీ భూచక్రం తిరగడం ఎల్లా? మరి శాంతం ఉద్దేశాలు ఎల్లా మారుతున్నాయో కాని - అప్పుడు పాండుచేరీలోనూ అంతే. మహారాజులమీదస్వదేశసంస్థానాలమీదదారుణంగాచెక్కేసింది.అయినా రైతులు రైతులూ అంటే - చిన్నరైతులూ వున్నారు - పెద్దరైతులూ వున్నారు. ఇనాందార్లు న్నారు - జమీందారీలు కొనే తాహతుగల రైతులూఉన్నారు. మేకల్ని, గొర్రెలినీ కలిపేస్తే ఎలా? అయినా ప్రతీదానికిన్నీ అనుమానం, ఎందుకన్నా? విపరీతపు విమర్శన పెట్టుకోవడమున్నా - మనస్సు పాడుచేసుకోవడమున్నా...అస్తమానూ ప్రపంచకం మరామత్తే అని దేవుల్లాడితే ఇక మన తిండీ, మన తిప్పలూ మన సంసారాలు ఇవి జరగడం ఎల్లా?... నేనుకూడ కొంత మారుతున్నానా ఏమిటి చెప్మా? మునుపు నాకింత సులువుగా చిరాకుపడడం కోపం రావడం వుండేదికాదు. సాయంత్రంపూరి కేనే వచ్చింది వెంకన్నమీద. కాములసారులు అయిపోయాయి, వెళ్ళి చప్పున తీసుకు

రారా - అని రెండుసార్లు చెప్పా. తీసుకురాలే. అరగంట అయిపోయాక ఎందుకు పిల్చారు అయ్యగారూ అంటూ వచ్చాడు. దానిమీద నాకు కోపంవచ్చి పట్టలేకగ దుం చెంపకాయలు ఇచ్చా. వాడు ఏమీ అనకుండా కిందకి దిగిపోయి బజారు వెళ్ళి పోయాడు ఆకులు తీసుకురావడానికి. మరి శాంతానికి ఎల్లా తెలిసిందో చిందులు తొక్కుతూ వచ్చింది మహా ప్రళయంలాగ. కాబట్రుద్రుళ్లా - ఇంక అదే నన్ను చీవాట్లు పెట్టడం..." నేనేమీ చెయ్యలేదు. ఎన్నిమాట్లు పిలిచినా రాకపోతే కోపం వొచ్చి - వో దెబ్బ వేశా" అన్నా "అలా వాడిమీద చెయ్యి వెయ్యడానికి నీకేం అధికారం వుంది? నీ నవుకరయినంతమాత్రాన్ని కొట్టడానికి నీకేం అధికారం? జీతం పుచ్చుకున్నంతమాత్రాన్న నీకు బానిసా వాడు - వాడికిమాత్రం అభిమానం, అభిజాత్యం లేవా? యజమానివైనంత మాత్రానికి - మర్యాదమించి ప్రవర్తించడమా?" అని ఏమి టేమిటో అంది. "నేనుమాత్రం ఎప్పుడూ నవుకర్లనూ కొడుతున్నానా? నాకుమాత్రం తెలీదా?" అన్నా-"ఏం-మన నవుఖరుని - వక్కమాటు నీవు చరిచినంతమాత్రాన్ని - ఏం అంత మహాపాపమూ, ఘోరమూ జరిగింది?" అన్నా శాంతం వూరుకోలే. "ఎంతకీ వాడికో రూపాయి పారేస్తేపోయె - అంతేగా" అన్నా. "ఓహో! నీ దెబ్బ విలువ రూపాయన్నమాట" అంది. "అయినా, వాడేమీ అనలేదుగా - ఎందుకీ హడావుడి?" అన్నా. "అలాంటప్పుడు కిందకిలేని దురద బచ్చలకేల? అంటావు నువ్వు" అంది. "అయితే నువ్వేమిటంటావు?" అన్నా. "వెంకయ్య రాగానే వాడికి క్షమాపణ చెప్పు!" అంది. "శాంతం - నువ్వు అంటే నాకు - ఎంతో ప్రేమ, గౌరవం వుంది. సాధారణంగా నీమాట తీసేయను. కాని ఇందులోమాత్రం నాది తప్పువున్నా నవుఖరుకుమాత్రం నేను ప్రాణంపోతే క్షమాపణ చెప్పను. ఇంకానయం!" అన్నా. దాంతో గిర్రున తిరిగి వెళ్ళిపోయింది...ఇహ - ఏం అనడం? రైతుకు వ్యతిరేకంగా నడవకోడదూ - రాజాగారి కేసు పట్టకూడదూ - జమీందారు దగ్గిర డబ్బు పుచ్చుకో కూడదూ - నవుఖరు ముండావాడిని ముట్టకూడదూ-బంట్రోతుగాణ్ణి నాయనా, బాబూ అనే పని చేయించుకోవాలి! ఒక వేళ కోపం వచ్చి ఎదన్నా అంటే వాడికాళ్ళు పట్టు కుని వాడికి క్షమాపణ అర్పించుకోవాలి!...బొత్తిగా బోల్షివిక్కులా తయారవు తూందే...ఈవేళ ఇది - రేపు మరోటీ వస్తూందే - ఎల్లాగ?...మొన్న రెండురోజులూ పెళ్ళిల్లులా వుండేను. శాంతం స్నేహితులందరూ గొప్పవాళ్ళయినా, వాళ్ళతో సమాన తాహతితో మసిలింది. శాంతం తక్కువేమిటి? నిజంగా వాళ్ళందరికంటే తెలివితేటలు గలది. బాగా చదువుకున్నదిన్నీ. వాళ్ళతో నాగురించి ఎంతో గొప్పగా చెప్పింది. నా ప్రాక్టీసు గురించి, నా సంపాదనగురించి, నా కళారాధనగురించి, నా ఆంధ్రాభిమానం గురించి ఏమిటేమిటో చెప్పింది. వింటూంటే నా మనస్సు పొంగిపోయింది. వాళ్లుకూడా శాంతం కబుర్లు విని విరుచుకు పడిపోయారుగా! ఆవేళ రాత్రి విందు - హాస్యాలు - భోజనకాలపు ఉపన్యాసాలు చెప్పేదేమిటి? శాంతం గురించి ఇంకా అందరికీ తెలియాలంటే నలుగురితో జోస్తీగా తిరుగుతూ

డాలి. లేడీ అయ్యంగారితో కలిస్తేనా ? ఓ-ఇహ - చెప్పడానికుంటునా ? అయితే నిజానికి శాంతం విజ్ఞానం, చదువు ఆవిడకెక్కడిది ? లేడీ అయ్యంగారి లౌక్యం, చాకచక్యం, చలాకీతనం శాంతం నేర్చుకోవాలి....అదిగో నేను అవిడనీ ఈవిడనీ, తైపారవేసి చూడకూడదు. ఎప్పుడూ అలా చెయ్యను అనుకుంటూనే వుంటాను. మళ్ళీ మనస్సు ఆగకుండా అలా వెళ్ళిపోతుంది. నేనుకూడా లేడీ అయ్యంగార్ని గురించి కాస్త మర్చిపోవడానికి ప్రయత్నించాలి...ఇంతకూ శాంతానికి కొంత కొత్త వ్యాపకం, వేలంబన వుండాలి. చేతినిండా ఏదో ఒక పని వుండాలి...పాపాయి ఒక్కత్తె అయిపోయింది కూడాను......

## 49

## ఆ మె

మొన్నరాత్రి "ఈస్టు ఎండ్ వెస్టు" క్లబ్బువాళ్ళ వార్షికోత్సవం కన్నిమేరాలో అయింది క్లబ్బు ప్రెసిడెంటు జస్టిసు జాన్సన్, వైస్‌ప్రెసిడెంట్లు మిస్‌జిన్‌వాలాన్నూ, శాస్త్రిన్ని, సెక్రటరీ లేడీ అయ్యంగార్నున్నూ, సర్ గోవిందస్వామీను. నన్నాహ్వానించేడు శాస్త్రి యీ పల్నాటి ఖద్దరులో నేనెందుకక్కడికి-నేనేం డాన్సు చెయ్యగలనా కాక్‌టైల్సు సేవించగలనా నేనెందుకు పానకంలో పుడకలాగన్నా. "అబ్బే నువ్వొస్తే కాని వీల్లేదు నేను వైస్‌నేమిటి, నువ్వు రాకపోవడమేమిటి?" అన్నాడు. మొండి పట్టుపట్టి నట్టుంటుది వెళ్ళకపోతే-ఆవేళ లేడీఅయ్యంగారి మొహంచూస్తే వొట్టన్నాగా ఆపంపుమీద గౌరవంలేదనుకుంటాడు శాస్త్రి అని - వెళ్ళా...ఓహ్, ఓ-వచ్చారు ప్రముఖులూ, వారిభార్యలు, "సొసైటీస్త్రీలు", తెలుపు - నలుపు-చామనచాయలు జోరుగా వుండేను. లేడీఅయ్యంగారు నన్ను అందరికీ పరిచయంచేసింది విందు - ప్రాచ్యప్రతీచీ, చీకటి - వెన్నెల, శాకాహారం, మాంసాహారం, సోమరసం, చెరుకురసం, ధూమపానం, తాంబూలాలు, ఎండావానా నక్కలకుక్కలపెళ్ళి, అంతాతమాషాగావుండేను. ఉపన్యాసాలు, భలేగావుండేను. చప్పట్లు కొట్టడానికేవచ్చారు అందరూను. శాస్త్రి బాగా నవ్వించేడు అందరినీ. విటూన్నంతసేపు నాశాస్త్రేనా ఇతను అనిపించింది. ఎప్పుడూ చూస్తున్న మనుష్యుల గొప్పతనం మర్చిపోతూంటాం. పైవాళ్ళు జ్ఞాపకం చేస్తేనే అప్పుడు కళ్లుతెరుస్తాం....డాన్సు...నాకు మొదలునుంచి పాశ్చాత్యనాట్యం అంటే అసహ్యంమనేదాన్ని. కాని, ఆ వాతావరణం - ఆ సంగీతం - లయ - ఆ అడుగులు అందంగానేవుండేవి. స్త్రీలు పురుషులు కలిసి గిర్రుని తిరుగుతూంటే కొంత వొయ్యారం

గానే వుంటుంది. కాని ఎలాగనుకుంటే అలాగే. శాస్త్రి, లేడీఅయ్యంగారు రెండుమూడు సార్లు కలిసి "ఫాక్స్‌ట్రాటు" "వాల్ట్జ్" చేశారు చూడ్డానికి రమ్యంగానే వుంది. ఆ సంగీతంకూడా సరిగ్గా సరిపోయింది. ఇంటికొచ్చేసరికి తెల్లవారుఝాము నాల్గు అయింది!......

ఈ వేళ సాయంత్రం మామూలుగా మెరీనాకి వెళ్ళేం. బ్యాంకువాద్యం, జనం. దొర్లు, దొరసాన్లున్నూ, ఆ సంగీతం బోధపడకపోయినా మనవాళ్లుకూడా చాలామంది వొచ్చారు. లేడీఅయ్యంగారు, శాంతాదేవి ఆవిడ పెనిమిటి, అంతా మా కారువద్దిగర కొచ్చారు. ఆ సంగీతం ఎవరికర్థమవాలి? వచ్చేకార్లు, వెళ్ళేకార్లు-బాతాఖానీ ఇంతట్లో ఒక మోటారుసైకిలుమీద ఒకదొరసాని వెనకని ఒకదొర-యీ దొరేమో ఆవిడని అనుకుని వెనక చెయ్యి ఆవిడ నడుము చుట్టు వేసుకుని బర్రుమని వెళ్ళింది. అందరూ విడ్డూరంగా చూడ్డం మొదలెట్టారు. అక్కడనుంచి విమర్శలూ. "చూశారా యీ సినిమాదృశ్యం! వీళ్ళ మర్యాదలూ మండిపోనూ! యీ వెకిలితనమేమిటండీ?" అంది లేడీఅయ్యంగారు. శాంతం అంది. "మొగుడూ పెళ్ళాం ఏమో లెండి" "-అయితేనేం యిది మెరీనా అనుకున్నారా - వాళ్ళపడగ్గది అనుకున్నారా? పెద్దా - చిన్నా అందరు వచ్చేస్థలం యింతా భాసా!" అందావిడ. "అయితే-ఏమిటి? యింతకీ వాళ్లని చూసి చెడిపోయిందెవరు? మీకింతకోపం రావడానికి" అన్నా నేను. "చెడిపోయేదెవరంటారేమిటి? అందరమూన్నూ. యీలాంటి పోకిరీలని విచ్చలవిడిగా తిరగనిస్తే మానంవున్నవాళ్లము, శీలంవున్నవాళ్లము యింక యిళ్లలో కూచోవాలింకనే!" నేనూరుకోవలసింది - ఆవిడతో పిచ్చిగా వాదించడం మొదలెట్టా. "మొగాడు ఆడది చెట్టాపట్టాలు వేసుకుని తిరగడం చూసినంత మాత్రాన్నే శీలానికి మానానికి భంగంవస్తే, ఆ శీలం మానం విలువేమిటి?" అన్నా. "ఏమో! మీలాంటి చదువుకున్న స్త్రీలలా అంటేనే నేం చెప్పలేనుగాని. మాలాంటి హిందూ సాంప్రదాయం వాళ్లందరికీ అసహ్యంగా నేవుంది. ఏమైనా మనవాళ్ళెవ్వరూ ఇంత అసభ్యంగాను, యింత బాహాటంగాను బరితెగిపోవడం లేదు. మనక్రైస్తవ మేరీసు పిల్లలింక యీ దొరసాన్లలాగు మొదలెడతారో ఏమి ఖర్మమో?" అందిఆవిడ. "అదేమిటలా అంటారు? మొన్నా గిండీగార్డెన్ పార్టీలో నోటని సిగరెట్టు లేని అమ్మాయిన్ని, మొహానికి, గోళ్లకి రంగులేసుకోని ముద్దరాలూ వుంటే వొట్టన్నారెవరో!" అన్నా. "మామీదేమిటా దెబ్బ! గార్డెను పార్టీలో డాన్సులున్నూ మెరీనామీద ప్రణయవిహారం వంటే టండీ - శాంతం గారూ! శాస్త్రిగారూ! మా వాదప్రతివాదాలకి మీరు తీర్పుచెప్పండీ!" అని శాస్త్రిని మధ్యకి లాక్కొచ్చింది. శాస్త్రి అన్నాడు: "నాకు ఏహ్యంగానే కనిపించిందిసుమండీ." "హిప్స్, హిప్పు, హుర్రే!" అని చప్పట్లు కొట్టిందావిడ... నాకొంచెం చిన్నతనమే అనిపించింది. శాస్త్రి నన్ను వెంటేసుకురావడం ధర్మం... లేకపోతే అనుకోకుండా బయిట పడిపోయేదా?...ఛీ- ఛీ- నేనేమిటిలా రాస్తున్నా - మనసుకంటే కలమే ముందు పరిగెత్తుతోందేమిటి?......

# 50

## అ త డు

కన్ని మేరా టీపార్టీలో బాగా మాట్లాడేనని శాంతం మెచ్చుకుంది. లేడీ అయ్యాంగారితో మూడుసార్లు డ్యాన్సుచేశాను. శాంతం ఏమనుకుంటుందో అని భయపడ్డానుగాని ఏం అనలేదు సరేకదా నాకూ్కడా నేర్పుదురూ అని ఆవిడని అడిగింది. లేడీ అయ్యాంగారు ఎంతబాగా డ్యాన్సు చేసింది! పాపం చచ్చిపోయినాయన దొరా దొరసాన్ని పెట్టి నేర్పించాడుట: అతిడేం డ్యాన్సుచేస్తాడు - టైయే కట్టుకోవడం సరిగ్గా చేతగాక పోతే! కాని చేతితో చెయ్యికలిపి ఆవిడతో అలా డాన్సు చేస్తుంటే వొళ్ళు జలదరించింది. సంగీతంకూడా తలకెక్కింది - ఆ లయ వింటూంటే మతిపోయినట్టే అయిపోయింది! ఇంగ్లండులోకూడా నేనెప్పుడు డాన్సుహాల్సుకు వెళ్ళినా-యిలాగే ఉండేది నాకు. వొంటిని ఎలెక్ట్రిక్కు బేటరీ పెట్టినట్టే. ఏదైనా - ఎలా అనిపిస్తుందంటే పురుషుడూ స్త్రీన్నీ చివరకీ భార్యాభర్తలన్నా సరే - సామీప్యం - స్పర్శ మహా చెడ్డ ప్రమాదంకింద పరిణమిస్తాయి...అరే! నేనేమిటి గాంధీలా రాస్తున్నానేమిటి?... పార్టీ మాత్రం మంచి జల్సాగా వెళ్ళిపోయింది. శాంతంకూడా నిజంగా ఇంగ్లీషు సంగీతం నృత్యం నేర్చుకుంటేనా-అందరినీ మించిపోతుంది. అందుకు సందేహంలే-కాని ఖద్దరూ-ఇంగ్లీషు నృత్యం యీ రెండు ఎల్లా కలుస్తాయి? అదేం! ఖద్దరు దేశభక్తుల్లో మాత్రం రసికుల్లేరా - సరజాణలు లేరా? లేడీ అయ్యాంగారు ఖద్దరువేషం వేసుకుంటే ఎలా వుంటుందోనో! ఎంత చురుకుగా చాకచక్యంగా ఏర్పాట్లు చేయించిందండీ - మొన్న టీపార్టీలో! అంతలాంటి మనిషికూడా ముతకగుడ్డలు కట్టుకు సెసర్కి మెత్తకై పోతుందేమో? ఖద్దరు హృదయపరివర్తనం తీసుకొస్తుందంటారుగా!... ఏమేనాసరే-ఖద్దరు గురించి శాంతంతో వాదన పెట్టుకోవడం మంచిదికాదని నిశ్చయించుకున్నా. మొగుడు, పెళ్ళాం అయినాసరే రోజూ వూరికే వాగ్యుద్ధాల్లో దిగకూడదు. ఖండన మండనాల్లో అహంకారం బయటకొచ్చేస్తుంది. పైవాళ్ళవుతే ఆప్పటికప్పుడే సరి. వాళ్ళెవరో మనమెవరమో. కాని కావలసినవాళ్ళమవుతే మర్చిపోలేం. వాదనలు తీవ్రం అయిపోతే-లోపాలు తాపాలు తప్పవు. ముందు మేం ఇద్దరం ఎన్ని అనుకున్నా చివరికి బుజ్జగింపులతో అంతా సర్దుకుపోయ్యేది. ఇప్పుడట్లా అవటంలే. మొగుడూ పెళ్ళాంలోనూ అసలు విషయాల్లో తేడాఉంటే కష్టమే. నాకూ శాంతానికి అభిప్రాయాలు భిన్నం అయిపోతున్నాయి. ఈ ఖద్దరు వొకటి. ఈ ధోరణి ఇంక ఎందులోకి యీడ్చుకు పోతుందో? స్త్రీలు-స్వేచ్ఛ యివొకగొడవ. నిన్న ఎవసరంగా వొచ్చింది దొరసాని మోటారుసైకిలుమీద - వకరివెనకాల ఒకరు కూచుని పోతూంటే - దానిమీద లేడీ అయ్యాంగారూ - శాంతం వాదించుకున్నారు. దొరసాని మోటారుసైకిలు నడుపుతూంటే ధొర వెనకాల ఆవిడను కౌగలించుకుని కూర్చోవడం - అదీ బాహాటంగా

మెరీనామీద తిరగడం వెకిలితనం - నీతిబాహ్యం - కామోద్రేకం అని ఆవిడ-ఎవరి స్వేచ్ఛ వారిది, దీనిలో తప్పేంవుంది? నీతి నియమాలన్నీ నిర్ణయించడానికి పోలీసు వాళ్ళని పెడుతారా యేమిటి అని శాంతం - ఇలా కాస్సేపు కాస్తగట్టిగానే వాదించుకున్నారు. చివరకి లేడీఅయ్యంగారు నన్ను తీర్పు చెప్పమంది. ఈమోస్తరుగా తిరగడం "పబ్లీకుగా" రోడ్డుమీద అందులోకి నలుగురూ జూడాలని - చాలావిడ్డూరంగానూ - ప్రజానీతికి వ్యతిరేకమేనండీ అని నేనన్నాను. అన్నాను - నాలిక కరుచుకున్నాను. నాకూ అసహ్యంగానే కనిపించినా, నలుగురిలోనూ వున్నప్పుడు శాంతాన్నే నేను నిలబెడుతూండడం ధర్మం. ఏమిటో ఆ నిమిషానికి అంతవరకూ ఆలోచన వెళ్ళలేదు. లేడీ అయ్యంగారు ఏదిచెప్పినా మంచిచమత్కారంగాను ఘాటుగాను చెప్తుంది. అంచేత ఆవిడవేపే నేనూ వుండాలనే అనిపించింది. ఆ నిమిషానికి మాత్రం-అదిన్నీ-యీ విషయంలో ఆవిడ అభిప్రాయం నా అభిప్రాయం వకటే అవడంచేత నా వోటు శాంతానికి వ్యతిరేకంగా ఇచ్చేశాను. శాంతం మనస్సు చివుక్కుమంది. నేను కనిపెడుతూనేవున్నా. మా యిద్దరికి తేడాలలో యిప్పుడు యిదొక కొత్తఅంశం తేల్తూంది. ఇంక ఇందుమీద రోజూ నాకూ శాంతానికీ మాటమీద మాటలువస్తే యిక మనస్సుకు శాంతి యెట్లా వుంటుంది? ఆడవాళ్ళు - స్వేచ్ఛ-అంతటితో ఆగరు. ఆడవాళ్ళు - ఆర్థికస్వాతంత్ర్యం ఆస్తిలో హక్కు యివన్నీ వస్తాయి. సరే విడాకుల హక్కుకేం - మావిషయంలో ఎలాగా మేం "సివిలు" వివాహం కాబట్టి ఆ హక్కు వుంటుంది. అయితేమాత్రం మాంసం తింటున్నామని, ఎముకలు మెళ్ళో కట్టుకున్నట్టు హక్కు వున్నంతమాత్రం ఆడది వినియోగిస్తుందా? నలుగురినోట్లో పడిపోవడమేగా?.....అనుకున్నట్టుగానే యింటికి వెళ్ళగానే భోజనం చేసేక పాపాయి ఐదోయేడు వచ్చాక దాని చదువు మాటేమిటి? అని అంది శాంతం. ఏముంది ఆరేళ్ళొచ్చాక సీమ పంపిద్దాం అన్నా. "ఛీ! వెధవ బానిసచదువులు! చిన్నప్పటినుంచి భావదాస్యమేనా! దాని ఖర్మం?- అందరి పిల్లలతోపాటు దాన్నీ కార్పొరేషను బడికే పంపిద్దాం" అని శాంతం అంది. దానిమీద కొంత చర్చ చేసుకున్నాం. అయినా యీ చిన్నవిషయానికి చర్చెందుకో! మన శ్రేణివాళ్ళందరూ వాళ్ళపిల్లల్ని కాన్వెంటికి పంపడం మామూలు. మనం అలాగే చేస్తే పొయ్యేదిగా...దీనికెందుకో శాంతానికి యింత పట్టింపు? యింటికొచ్చాక నోరు విప్పడానికే భయంవేస్తుంటే...

# 51

## ఆమె

నాకు కోర్టుఅంటే అపరిమితభయం. ఆ భయంతోనే వెళ్ళాను మధ్యాహ్నం రెండుగంటలకి. సభఅంతా వకీళ్ళతోనూ గుమాస్తాలతోనూ ప్రేక్షకులతోనూ - తీర్థమే ఆడబోతూందో - జాతరే జరగబోతూందో - విడ్డూరమే వినబోతామో - చోద్యమే చూడబోతామో - అన్నట్టు ఇసకవేస్తే రాలకుండా కిక్కిరిసిపోయుంది. ఆఖరు బెంచీ మీద కాస్త జాగావుంటే కూచున్నాను. వచ్చినవాళ్ళలో సహంమంది స్త్రీలే. పేరంటానికి తయారైనట్టు - సింగారించుకుని - అలంకరించుకుని - తల్లో పువ్వులగుత్తులు ముడుచుకుని - అత్తరుపన్నీరు గంధంరాసుకుని - వచ్చారు !...పొద్దున్న కాఫీతాగుతూ 'వూళ్లోవిశేషాలేమిటి - శాస్త్రి ?' అని అడిగే. "వూరూ వాడా అట్టుడికినట్టుడికిపోతూ దేశంఅంతా గగ్గోలెత్తిపోతూంటే-పరదేశబ్రాహ్మడు పేదరాశిపెద్దమ్మ నడిగినట్టు అడుగుతున్నావే - విశేషాలేమిటని ! విను-పాతర్లపూడి జమీందారు ఇంగ్లండువెళ్ళి అక్కడ నాలుగేళ్లుండిపోయాడు. ఆరోజుల్లోనే కాంతాపురం రాజుగారి కూతురుకూడా సీమ వెళ్ళింది. ఇద్దరూ అక్కడపెళ్లిచేసుకున్నారు. జమీందారు డబ్బంతా గుర్రప్పందేలు-మోటారు సరదాలు - పోలోచక్కర్లు మీద - రాణీగారు దుస్తులమీద విందులమీద నాటకాలమీద - తగలేసిం తరవాత స్వదేశం వేంచేశారు. మరేంవచ్చిందో - రాజాగారు పాతర్లపూడి కోటలోనూ - రాణీగారు ఊటీ సిమ్లాడార్జిలింగులోనూ - మకాం. ఇలా వుండగా-రాణీగారు కుమారరాజాగారిని కన్నారు. రాజుగారు మాత్రం-పిల్లాడు తన కొడుకు కాడంటూ - విడాకులకి దావావేశారు. నేను రాజాగారితరఫున. ఈవేళ నువ్వు తప్పకుండా కోర్టుకువచ్చి నావాదన వినితీరాలి సుమా !" అన్నాడు. లింగాలపల్లి వ్యాజ్యం అయాక - వ్యాజ్యాలంటే నాకు అసహ్యంపుట్టింది. అయినా శాస్త్రిరమ్మమంటున్నాడు కదా అని వెళ్ళేను.

రాణి బోనులోవుంది. శాస్త్రి అడ్డుసవాళ్లువేస్తూ - ఆవిడనోటంట పలుకరాని మాటలు - సంసార్లం వినరాని మాటలూ పలికిస్తున్నాడు. ఈ ప్రశ్న ఆడదాన్ని అడగవలసిన ప్రశ్నా?-అన్న విచక్షణలేకుండా-'ఫలానానాడు సిమ్లాలో ఫలానా నవాబుతో ఫలానా హోటేలులో బసచెయ్యలేదా ? - ఫలానారోజు బొంబాయిలో ఫలానా నవాబుతో ఫలానా హోటేలులో భార్యాభర్తలని పేర్లు నమోదుచేసుకోలేదా?-ఫలానా నాడు - ఊటీలో ఫలానా రాజుతో కలిసి ఫలానా వైద్యునిదగ్గరికి వెళ్ళలేదా ?' అని అడిగి ఆవిడకి పుట్టుగతులు లేకుండా చేసేశాడు. ఓ ప్రశ్న వేసినప్పుడు హాస్యం-మరొక ప్రశ్న అడిగినప్పుడు కరుణ- తరువాత ప్రశ్న అప్పుడు రౌద్రం, మళ్ళీశాంతం - ఇలాగ్గా నవరసాలు వుపయోగిస్తూ ఆవిడ రహస్యాలన్నిటిని బయటపెట్టేశాడు. ఇది ఆంతరంగిక విషయం. దీన్ని మనం అడగకూడదు - అన్న చింత లేకుండా - పొద్దున్న పదకొండు

గంటలమొదలు - ఆవిడని అలాగు జలకడిగేసేశాడు. చివరికి ఆవిడ ఆ ప్రశ్న పరం పరలకి తట్టుకోలేక- "మరి నేనింక భరించలేను బాబూ!" అంటూ భోళ్లున యేడ్చేసింది-బోనులో. దాంతో శాస్త్రి: దఃఖం ఆపుకోకండమ్మా! కళ్ళంట నీలాలు కారితే-నోటంట సత్యం కూడా రాలుతుంది" అన్నాడు - నవ్వుతూనూ. అందరూ ఫక్కున నవ్వేరు. శాస్త్రి మాటలువిని నావొళ్ళుమండిపోయింది. ఎంతఅయనా స్త్రీనిఅంతక్రూరంగా హింసించడమా-పరువు తీసేయడమే? ఆ రాజుమాత్రం మహాతిన్నానైనవాడా? పట్టపగ్గాలులేకుండా అడ్డమైనవాళ్ళతోనూ తిరగడం లేదా? అతనికీర్తి ఎవరికి తెలియదు? అయితేయేం? అతడు మగరాజు-స్త్రీ అందరికీ లోకువే. కౌరవసభలో దుర్యోధనుడు ద్రౌపదీవస్త్రాప హరణం చేస్తుంటే-నేనక్కడ సహిస్తు ఎలాకూర్చోగలను? నేనాకచేరీలో వుండలేక వచ్చేశాను...ఇంటికొచ్చేశానే కాని - శాస్త్రి వేసిన ప్రశ్నలన్నీ నాచెవిలో గింగురు మంటూనే వున్నాయి. ఆవిడ ఎంత విచ్చలవిడిగా తిరిగినా స్త్రీ అని దయాదాక్షిణ్యం వుండొద్దా? బోనులోకెక్కించి ఆవిడని నడివీధిలో పెట్టెయడమే? ఆ వచ్చిన ఆడ వాళ్ళందరూ ఎలాసహించుకుని కూర్చున్నారు? సహించుకుని కుచోడమేమిటి? శాస్త్రి ప్రశ్నలు - ఆవిడ యేడుపులు - విని నవ్వులూ వేళాకోళాలున్నూ! 'దీనికింతే శాస్తి' అని ఆపతివ్రతలు శపించడం! ఏం ప్రపంచకం?...

శాస్త్రి ఇంటికొచ్చాడు - గొప్పగాను - నవ్వుతూను. అతని నవ్వు చూసి నాకు మరింత కోపం వచ్చింది. "శాస్త్రీ! నువ్వీవేళ ఆవిడని అడ్డు పరీక్ష చెయ్యడంలో - అంత అధర్మంగానూ - అంతనీచంగానూ - అంత అశ్లీలంగానూ - ప్రవర్తిస్తావని నేనెప్పుడూ అనుకోలేదోయ్!" అన్నా. నామాటలువిని అతని ముఖం ఎర్రబారింది. "చాలా పెద్ద మాటలే విసిరావే!" అన్నాడు శాస్త్రి. "మళ్ళీఅనమంటే అంటాను. అధర్మం - నీచం-అశ్లీలం!" అన్నాను. దాంతో మరిమాటాడకుండా శాస్త్రి మేడమీద కెళ్ళిపోయాడు. ఇంకీరాడు - అంతకీరాడు- మేడదిగి. ఈలోపుగా ఫలహారం-కాఫీతయారుచేయించి బల్ల మీద సిద్ధంగావుంచా. మేడదిగివచ్చాడు. 'ఫలహారం చేశాక సముద్రపొడ్డుకెళదాం' అన్నా. "నాకేమీవద్దు నేను క్లబ్బులో ఫలహారం చేసేవచ్చా" నన్నాడు. 'నువ్వు రాక ముందే నేనూ కాఫీతాగేను. మెకీనాకెళదాం' అని నేనన్నాను. ఇంతట్లో భాష్యంవచ్చాడు. గుమ్మంలో కాలుపెడుతూనే నాకునమస్కారంచేసి 'శాంతంగారూ యీవేళ శాస్త్రి "క్రాసు" పరీక్ష చేసినట్టు ఎన్నడూ ఎప్పుడూ ఎవడూ చేయలేదంటే నమ్మండి! అమ్మ! ఆరాణీని బోనులోపెట్టి నిలుచున్నపాటుగా వీపు చీరేసి చర్మంవొలిచేశాడండి!" అన్నాడు. శాస్త్రి ముఖం గులాబీపువ్వులా విడింది. 'శాంతం-భాష్యానికి కాఫీ ఇవ్వడం మర్చిపోయావు!" అన్నాడు. భాష్యానికి కాఫీఇస్తూంటే తనూ కాఫీపుచ్చుకున్నాడు. నేనూ పుచ్చుకున్నాను.

శాస్త్రి ఉత్తరీయం వేసుకోవడానికి మేడమీదకి వెళ్ళాడు. అప్పుడు చెప్పా భాష్యంతో శాస్త్రి చేసిన అడ్డుపరీక్షమీద నాఅభిప్రాయం. కొసకి అన్నా: 'ధర్మం -

న్యాయం - శాస్త్రం - పద్ధతీ - నీతి - నియమం - అంతా మొగవాడు సృష్టించిన బంగారపు సంకెళ్లు. ఆబానిసగొలుసుల తొడిగించుకొని, నగలని మురిసిపోతూంది స్త్రీ!"

"ఈమాయ ప్రపంచంలో మొగాళ్ళంఅందరం పాత్రగ్లపూడిరాజులాంటివాళ్ళం-ఆడాళ్ళందరూ ఆరాణీలాంటివాళ్ళు. మీబోటి విశాలదృష్టిగలవారు దయార్ద్రహృదయులూ నూటికీకోటికీ ఒకరైనా వుంటారో వుండరో!' అన్నాడు.

అతనిమాటల అంతరార్థం? ముఖస్తుతి స్తోత్రపాఠమా? లేక-కడుపులో ఉన్న మాటా? అతని కరస్పర్శకీ అతనిచూపులకీ నాహృదయంగడగడకొట్టుకుంటూంది. మరుపు రావడంలేదు...అందరం మెరీనాకెళ్ళాం.

## 52

## అతడు

'క్రాసుపరీక్ష' పూర్తిచేశాను-కోర్టువారు బెంచిదిగిపోయారు. దాంతో బారిష్టర్లు వకీళ్లు, గుమాస్తాలు, సాక్షులు, కోర్టుసిబ్బంది, ప్రేక్షకులు-అందరూనన్ను చుట్టుముట్టేసి-ఊరేగింపులాగు - నన్ను కారువరకూ సాగనంపేరు! ఇదంతా శాంతం చూసివుండవలసింది - ఆలస్యం అయిందని ముందే యింటికివెళిపోయిందికాని! అయిన ఆలస్యం ఎలాగ అయింది - క్లబ్బులో దాహం పుచ్చుకునే ఇంటికి వెళదాం అనుకున్నానుకాని - శాంతం అభినందవాలని అందుకునేవరకు ఆగలేక సరాసరి ఇంటికే వెళ్ళాను. 'నావాదన ఎల్లా వుంది? చివరవరకు వుండకుండా ముందుగానే వచ్చేశావే!, అన్నా.

ఇక మొదలు పెట్టింది శాంతం నన్ను దులిపేయడం...రాణీని వీధిలోపెట్టేశావట. ఆవిడ మానం,శీలం,గౌరవం,మర్యాద,మట్టిలో కలిపేశానట. ఆడదిఅన్న కనికరంలేకుండా ఆవిడ నోటంట అడ్డమైనమాటలూ పలికించానట. 'ఇదేమిటి-శాంతం! తోడివకీళ్ళందరూ నన్నాకాశంమీదకెత్తి ప్రపంచం అంతా నాకు బ్రహ్మరథం పడుతూంటే నువ్విలా అకారణంగా నామీద విరుచుకు పడడమేమిటి? అన్నా. "మొగాడు ఎన్ని ఘోరాలు, ఎన్నిపాపాలు చేసినా తప్పులేదు. ఆడది ఒక్కపొరపాటు చేసినట్టు అనుమానంవుంటే చాలు-దాన్ని హతమార్చేసి అథఃపాతాళానికి అణచివేయడమే! ఆరాజాగారివైఖరి - చేష్టలు-అతగాడి పోకిరీతనం-జూదం - వాటిగురించి నువ్వుకోర్టులో ప్రసంగించవేం?. అంది. "ఇదేమిటి? నేనతని తరఫు వకీలునని మర్చిపోయావా యేమిటి?" అన్నా. "అసలీ అన్యాయం అంతా ధర్మశాస్త్రంలోనే వుంది మొగాడికో న్యాయం - ఆడదానికో న్యాయం - ప్రభుకో న్యాయం భృత్యుడికో న్యాయం - ధనికుడికో న్యాయం బీదవాడికో న్యా

యం - యీబూటకపు ధర్మశాస్త్రం కల్పించి నీలాంటివాళ్లు పొట్టనింపుకుంటున్నారు. నీన్యాయశాస్త్రం-నీపద్ధతులూ - నీసాక్షిపరీక్ష - పాపపంకిలం కాకపోతే మరేమిటి? నువ్వు న్యాయంకోసమే తాపత్రయపడుతే నీ 'క్లయింటు' ధర్మరాజే అన్నట్టెందుకు వాదిస్తావు? అతడు నీతో రహస్యంగా చెప్పినసంగతులని కోర్టువారియెదుట పెడితేనే గాని సత్యం న్యాయం ఎలాతేల్తాయి? నిజం మభ్యపరుస్తే న్యాయానికే నువ్వు అడ్డు తగలడంలేదా? నీ 'క్లయింటు' డబ్బుతిన్నావుకాబట్టి అతని పక్షం గెలిపించాలి- అదే నీపరమావధి. నీవాడుదోషి అని నీకుతెలిసికూడా-నిజం మరుగుపరచడం - నీ నోటికెలా వస్తే అలామాట్లాడ్డం - అబద్ధపు వ్యాజ్యాలు పట్టడం - దొంగసాక్ష్యం బనాయించడం- ముద్దనష్టపు ఆస్తుకోసం వ్యాజ్యాలు వేయించడం - అందుకు పెట్టుబడిపెట్టడం - గెలుస్తే భాగంపంచుకోడం-ఇదీ నువ్వుచేస్తూన్నపని! ఛీ-నీకు సిగ్గులేకపోతే-నాకు సిగ్గు వేస్తూంది! యీలా అధర్మంగా సంపాదిస్తూన్న మాలకూడుతిని నేను మయలపడి పోతున్నాను!" అని అంటూ అక్కడనుంచి లేచి ఇంట్లోకెళ్ళిపోయింది...

శాంతం చెప్పినదంతా నిజమే. పెట్టినచీవాట్లూ - తిట్టినతిట్లూ సబబే - కాని - నన్నంటే యేంప్రయోజనం? నేనేం మనువునా - శాస్త్రకారుణ్ణా? యీ ప్రపంచ మహాప్రవాహంలో నేనొక నీటిబొట్టును. నా కుటుంబంకోసం-నా పొట్టకోసం - నేను యమయాతనపడుతూంటే - నన్ను నానామాటలూఅంటే నేనేంచేయగలను? 'నువ్వు చేసేదంతా అధర్మం - నువ్వుతలచేదంతానీచం - నువ్వుచెప్పేదంతా అశ్లీలం - నువ్వు పలికే దంతా పచ్చిఅబద్ధం - నీ బతుకే అనర్థం!' అని శాంతమే నన్నంటే - నేనింకెలా సహించడం? నన్నింకా ఎల్లాపొగుడుతుందో - ఎల్లామన్ననచేస్తుందో-ఎల్లాస్తుతిస్తుందో - అని గంపెడాశతో రెక్కలుకట్టుకుని ఇంటికివాస్తే - పేడనీళ్ళు చెప్పుదెబ్బలూనా? నేనుచేసేని ప్రతీదీ మహాపాతకం అని ఆవిడకుతోస్తూంటే - ఇక ఈ సంసారం ఎందుకు- యీ బతుకెందుకు?......

మెరీనాకెళ్ళి ఇంటికొచ్చేటప్పటికి ఆలస్యంఅయింది. మేమూ ఇంట్లోకి వెళ్ళబోతున్నాం-ఇంతట్లో లేడీ అయ్యంగారొచ్చింది. కారుదిగుతూనే ఆవిడ తిన్నగా శాంతందగ్గరకొచ్చి శాంతాన్ని కౌగిలించుకుని: "శాంతంగారూ! ఈవేళ శాస్త్రిగారు ప్రదర్శించిన సాక్షివిచారణాకౌశలం అమోఘం! ఆ ప్రచండ వాక్పటిమ అజేయం! ఆసమయస్ఫూర్తిఅద్వితీయం! ఆ న్యాయశాస్త్రపాండిత్యం అనన్యసామాన్యం!"అంటూ- వెంటనే కారెక్కి వెళ్ళిపోయింది. ఉత్సాహపూరితములైనపొగడ్తలు-మనోరంజకములైన ఆ మాటలువిని - ఒక గడియపాటు ప్రపంచాన్ని మర్చిపోయాను. తెలివితెచ్చుకుని శాంతంవేపుచూశాను. ఆమెముఖం ఏర్రబారివుంది. కళ్ళు చింతనిప్పుల్లా మెరుస్తున్నాయి. ముఖాన్న చెమట. చెమటచుక్కల్లో కుంకుమబొట్టు కరిగిపోయింది. ఏమీ మాట్లాడకుండా - గిర్రునతిరిగి ఇంట్లోకివెళ్ళిపోయింది...రాత్రంతా శాంతంనాతో మాట్లాడలేదు. నేనూ మాట్లాడలేదు...

...నిద్రలోకల. ఉద్యానవనం. ఉద్యానవనంలో పచ్చని పచ్చికబయలు. పచ్చిక బయలుపైన నేనుపడుకొనినున్నా. చల్లని పిల్లగాలులు. పండువెన్నెల. పుష్పవర్షం. ఆకాశంమీద పరిగెడుతూంది చంద్రబింబం. పరిగెడుతూన్న చంద్రబింబం నన్నుచూచి నాదగ్గిరాగింది. ఆగిన చంద్రబింబంలోనుంచి లేడీ అయ్యంగారు ప్రత్యక్షమయింది. ఆమె చేతిలో పువ్వులదండ. పువ్వులదండ నామెళ్ళోవేసింది. మెళ్ళోవేస్తూ: "...అమోఘం! ...అజేయం!...అద్వితీయం!...అనన్యసామాన్యం!" అని పలికింది...కలకరిగిపోయినా తీయని ఆమె పలుకులు ఇప్పటికీ నాచెవుల్లో వినిపిస్తూనేవున్నాయి.

## 53

### ఆ మె

ఉత్తపుణ్యానికే పెద్ద గంద్రగోళం అయిపోయింది! నిన్న పత్రికల్లో చదివేను- ఈవేళ నుంచి వారం రోజులవరకూ దామెర్ల రామారావుగారి చిత్రాలు ఆంధ్రసమ్మేళన వారి ఆధ్వర్యాన విక్టోరియా హాలులో ప్రదర్శిస్తారని. మధ్యాహ్నం రెండుగంటలకే వెళితే సమ్మర్దం వుండదు- చిత్రాలు సావకాశంగా చూడవచ్చు - ఐదుగంటలముందే వెళిపోరావచ్చుననుకుని వెళ్ళేను.

చిత్రాలు ఏర్పాటు బాగావుంది. చూడడానికి కళ్ళకి ఇబ్బందిలేకుండా చిత్రాల్ని కంటియెత్తునే వేలగట్టేరు. వెల్తురుచిత్రాలమీదపడి ప్రతిబింబించకుండా జాగ్రత్తపడ్డారు. అన్నిటికంటే ప్రశంసనీయం ఏమంటే - ముఖ్యమైన చిత్రాలముందు కుర్చీలు సోఫాలు వేశారు - సావకాశంగా కూచుని చూచేందుకు-చిత్రకారులు చూచి వ్రాసుకునేందుకు.

రామారావుగారు మరో నాలుగుకాలాలు బ్రతికుంటే ఎంత బాగుండుననిపించింది! ఆయన వేసుకున్న "స్కెచ్చిలు" వందలు వేలు వున్నాయి. ఆంధ్రత్వం ఆయన చిత్రాలలో ఉట్టిపడుతూంది! "దశరథ మహారాజు అవసానదశ" ఎంతో బాగావుంది.

"సిద్ధార్థరాగోదయం" అద్భుతంగా వుంది...

"అతిలోకలావణ్యవతియా యశోధరా దృక్కులాకర్షింప స్థిరచిత్తు సిద్ధార్థు జన్మాంతరాయాత సంస్కార వశముచే రాజపుత్రుని కపుడు రాగోదయంబయ్యె."

సిద్ధార్థుని ముఖవర్చస్సు చిత్రించినపుడు, చిత్రకారునిచిత్తంలో హృదయవాణిపలికుంటుంది. అందుచేతే యశోధరని అంత లావణ్యవతిగా చిత్రించగలిగేడు! ఎంతసేపు చూసినా తనివితీరలేదు. ఆ చిత్రం తరువాత "పల్లెటూరి బావి" అనే చిత్రం వుంది. దృశ్యం సామాన్యందే అయినా, తెలుగుపడుచుల వొయ్యారం, సోయగం, ప్రత్యక్షంగా

తాండవిస్తున్నాయి. జీవం, అభినయం నిండి వున్నాయి. బొమ్మచూస్తూ ముచ్చటపడ్డాను. ఆనీళ్ళబిందెలు చూచినపుడు జ్ఞాపకం వొచ్చింది-యీవేళ శుక్రవారం - శాస్త్రి తలంటు కునే రోజు ఐదుగంటలకి ఆతను ఇంటికొచ్చేసే వుంటాడూ-అని. గడియారంచూసేసరికి ఐదుంపావైపోయింది. శాస్త్రి కచేరీనుంచి ఇంటికొచ్చేసి ధూందాం చేశేస్తూంటాడు - ఆ ఓర్వ్రమంగళాడు చిందులు తొక్కుతూంటాడు - ఏం చెయ్యనూ? - అనుకుంటూ టాక్సీ చేయించుకుని ఇంటికెళ్లాను. శుక్రవారం సాయంత్రం తప్ప మరి వకరోజు తలంటించుకోడు. అదేం పట్టింపో నాకు తెలీదు.

బంగాళా చేరేసరికి వుంది ఇక. టాక్సీడ్రైవరుని నేనుకొన్న బొమ్మఇంట్లో పెట్టమని అద్దె ఇచ్చేశా. అప్పుడు మొదలుపెట్టాడు : "నేను ఇంటికొచ్చేటప్పటికి, నువ్వుండొద్దా? ఈవేళ తలంటురోజు కదా ? వారానికోసారి తలంటుకోకపోతే నాకు కాకచేస్తుందని నీకు తెలీదా ? మొగాడేలాగ విధిలేక వీధిలోపడి సంపాదించాలి. ఆడదికూడా వీధులో పెత్తనాలకి వెళితే సంసారం ఎలా చస్తుంది ?" అని గుక్కతిప్పకుండా వడ గళ్ళవానలా అదే కేకలేశాడు. నాకు కొంచెం రోషమే వచ్చింది. "నీకు వేళపట్టున తలంటి జలకం ఆడించడానికి నేనేం 'నర్సు'నికాను - అందుకు నన్ను జీతం ఇచ్చి వుంచ లేదు. "అనబోయాను. కాని మళ్ళీఎందుకు అనవసరంగా వాగ్వాదం-ఇప్పుడు అతనితో వాదిస్తేనేకాని స్త్రీ స్వతంత్రం స్థిరపడదా ఏమిటి? అని చెప్పి, నోరునొక్కుకుని, తలంటిపోసి, కాఫీ ఇచ్చా.

కాఫీ పడేసరికి అంతరంగమున ఆత్మారాముడు కాస్త చల్లబడ్డాడు! ఇంకా కొంచెం హుషారు ఇద్దాం అని : "నిన్నటి ఓట్లుస మొబైల్ కారు కొనేసినట్టే?"అన్నా. ఏడెనిమిదితములపాకుల చిలకలు నమిలి, పీఠీ ఆరంగాలసువాసనవక్కపొడివేసుకుని,బొడ్డు గిల్లి లవంగం నమిలి, హంస పాదుగొట్టం తీసి అందుమీద జాజికాయి గీసి. గుండనోట్లో వేసుకుని, జాపత్రి దాల్చినచెక్క నమిలి యాలగ్గింజలని ముందుపళ్ళతో కొరికి, కాచు ముక్క వేసుకుని, నాలుగుసార్లు తాంబూలం నమిలి, నాలికచాపి పండిందాలేదా అని చూసుకుని-అప్పుడు నవ్వుతూ : "మొన్న సోమవారం జరిగిన విశేషానికి నీకు బహుమతీ ఆ కారు!" అన్నాడు. "మొన్న సోమవారం జరిగిన విశేషం నాకు తెలిసినంతవరకూ నరసయ్యమ్మగారి మనోవృత్తి కేసునెగ్గకుండా చెయ్యడమేకదూ!" అన్నా. "ఏం ? అదొకగొప్ప విశేషం కాదా ఏమిటి? ఆవిడ 'పాపరైనా' సంఘ సంస్కర్తలందరూ చందా వేసుకుని కలకత్తా ఎడ్వకేటు జనరలు కళ్యాణ సుందరమ్ గారిని పెట్టారు. మా ప్రొప్రియిటరుగారు నన్ను నమ్ముకుని నా వక్కడిమీదే వదలిపెట్టేశారు. పాపం, బతికి చెడ్డది. ఆవిడమీద నాకెంతో సానుభూతి. అయితే నేనేం చేసేది? హిందూ శాస్త్రం అందు వ్యతరేకం. ఆమాటే నేను కోర్టులో చెప్పేను. నా వాదనలో తలవెం ట్రుక వాసితప్పిందేమోచెప్పు?" అన్నా. "ఏమిటో శాస్త్రి? ఆడదాన్ని అల్లా వేపుకుచంపకపోతే మీప్రొప్రయిటరుతో చెప్పి సాలీనా వెయ్యిరూపాయిలు పారే

యించలేక పోయినావా?" అన్నా. "అమ్మయ్యో! ఆవిడకి ఐదోయేటే వైధవ్యం ప్రాప్తంఅయింది. ఇప్పుడావిడకి ఏభై యేండ్లు. మా క్లైయింటు నలభై ఏడు వేలిచ్చుకోవాలన్న మాట- రాజీచేసుకున్నా! నయం, మా ప్రాప్రయిటరుగారు ఆ మాటవింటే గుండె పేలిచస్తాడు.!" అన్నాడు. "పీడాపోయే" అన్నా కోపం వచ్చి. "నయం యింకా!" అతను వస్తే మా ప్లీడర్గ్లమాటేమిటి? ఈ కేసుకి నాకు పదివేలు ఫీజున్నూ ఐదువేలు బహుమతీన్నీ. వార్షికం వెయ్యిచ్చారు. చూసుకోమరి శాస్త్రిమజా!" "ఒక స్త్రీ మనోవృత్తిలేక చస్తూంటే, మరో స్త్రీ మోటారుకారుతో అన్ని సౌఖ్యాలూ అనుభవిస్తూండడమా? ఆ కారు ఎక్కడం ఉంటే నాకు ఒక అఘాయిత్యం లాగుందోయి!" అన్నా. "మొన్న సోమవారం అంతటికంటే గొప్ప విశేషం జరిగింది. ఆవేళ నీ పుట్టినరోజు కాదూ? నువ్వు మర్చిపోయినా, నేను మాత్రం మర్చిపోలేనా? ఆరోజుకీ కానుక!"అన్నాడు శాస్త్రి చెయ్యినిమురుతూను. "మన కిదివరకేవున్నాయిగా ఫోర్డు, షెవర్లెట్టున్నూ? మళ్లీ యెందుకోయి మూడోకారు? ఇంతకీ యీ మూడు కార్లకీ అయే పెట్రోలు, టైర్లు, సామానులూ యీడబ్బంతా ఏ అమెరికాకో ఇంగ్లండుకో కార్ల అసలు ఖరీదుతో సహా ఈకడ్డీ కప్పం కట్టుకోవలసిందేగా? యెందుకొచ్చిన భోగమోయి ఇది?" అన్నా. "నీకు ఈ ఏకనామిక్సు పిచ్చి ఇంకా వదల్లేదు. శాంతం! నేనూ అర్థశాస్త్రం చదువుకున్నాను. నీకంటె పెద్దవాణ్ణి. మొగాణ్ణి. నే చెప్పేది విను. మనకి మూడు కార్లుండడం దేశానికి మంచికాని చెడ్డకాదు. ఇదంతా దేశంయొక్క మూలధనం అనుకో!" అన్నాడు. సరే, పుణ్యానికిస్తూంటే, పిచ్చగంధం అని దెబ్బలాడినట్లు అతను నామీద ప్రేమకొద్దీ కారు బహుమతి చేస్తుంటే, ఈ అభ్యంతరాలు చెబితే చిన్నబోతాడని: "శాస్త్రీ! నీ కానుకకి ఈ కానుక బదులు!" అంటూ తేలిగ్గా ముద్దు పెట్టుకున్నా. శాస్త్రి మహా ఆనందపరవశుడై పోయాడు.

"ఒక చిన్న గమ్మత్తు చేశాను. శాంతం!" అన్నాడు నవ్వుతూను శాస్త్రి "తీర్పు చెప్పాక, నేను వెంటనే పత్రికా ప్రతినిధిని వెంటపెట్టుకుని హిందూలా ఫోరమ్ ఎసోసియేషనుకి వెళ్ళి వెయ్యిరూపాయలు విరాళం ఇచ్చి యావజ్జీవ పోషకుడుగా చేరేను. వాళ్లుకూడా మరునాడు సభలో నన్ను వైస్ప్రెసిడెంటుగా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. ఏం! తెలివైన పనంటావా, కాదా?"

ఫక్కుని నవ్వేను. "భలే! శాస్త్రీ!"అన్నా. మనసులోమాత్రం ఒక నిట్టూర్పు విడిచాను.

# 53

## అతడు

యీవేళ పన్నెండు గంటలతోనే నాకు కోర్టులో పని అయిపోయింది. మధ్యాహ్నం స్మాల్ "ఇంట్లో" లంచి. కొత్తకాలువమీద సరాసరి హైకోర్టునుంచి అడయార్ వెళ్ళేను. మెక్‌రే వెళ్ళిపోతున్నాడని అతనికి అతని భార్యకిన్నీ వీడుకోలు విందు. స్మాల్ దంపతులు నన్నున్ను కొంతమంది ముఖ్య స్నేహితులని మాత్రమే పిలిచారు. బ్రాడెనుబరీ, అతని పెళ్ళాం, అతని జూనియర్ పర్సెల్ అతని భార్య, పాండురంగ, జయరాజు, మదరాసు కలెక్టరు ఫిట్జువిలియం అతని పెళ్ళాం, చెల్లెలు అనబెల్ సింథియా టెంపిల్‌వుడ్డు. లంచి చాలా బాగుంది. ఎనిమిది రకాల "కోర్సులు" 1898 పాటూ బ్రిమూండు వైను, వీడ్కోలువిందు కదూ - ఉపన్యాసాలు, టోస్టులు, హాస్యాలు - ఓ-భలేగా వుండెను.

అన్నిటికంటే అద్భుతంగా వుండెను-మిస్ టెంపిల్‌వుడ్డు. ఇరవై రెండేళ్ళపడుచు-ఇంగ్లీషు ఎమెచ్యూర్ టెన్నిస్ ఛాంపియన్. నాలుగు రోజుల క్రిందే వచ్చింది ఇండియాకి. నా అదృష్టంవల్ల, ఆవిడ ప్రక్కనే వేశారు నాకు కుర్చీ. ఏమి చమత్కారంగా మాట్లాడింది ఏమి ఆమాటతీరు! ఆ సమయస్ఫూర్తి! ఆ రూపురేఖలు! ఆపిల్ పువ్వు ఛాయ-ఇంగ్లీషు పడుచుల అందం అంతా ఆవిడలో ఉట్టిపడుతూండెను. లంచి అంతసేపు, తరువాత కూడా నేనావిడతోటే సంభాషణ. ఎంతసేపు మాట్లాడినా తృప్తికాలేదు నాకు. ఆ అమ్మాయికూడా నాతోనే అంతసేపూ మాట్లాడింది. నాలో కూడా ఏదో నచ్చివుండాలి ఆ అమ్మాయికి! లంచి పూర్తి అయ్యేటప్పటికి నాలుగు నలభై అయింది. అప్పుడు జ్ఞాపకం వొచ్చింది - శుక్రవారం సాయంత్రం తలంటూ అని. అన్నా-పాపం-శాంతం ఏం కనిపెట్టుకుంటూందో, ఇంకా రాలేదని ఏం బెంగపెట్టుకుంటూందో ఏమిటో, నేను గంటక్రిందే ఇంట్లో వుండవలసి వుండెనే - అనుకుంటూ గాభరాపడుతూ, ఏమిక్షమాపణ చెప్పడమాని ఆలోచించుకుంటూ, కారేసుకుని యింటికొచ్చాను.

కాంతం కోపంతో ఎక్కడ ఎదురుపడుతుందో అనుకుంటూ చడీచప్పుడు లేకుండా ఇంట్లోకెళ్ళాను. తాయారు సాళ్లో ఎదురుపడింది. "అమ్మగారేం చేస్తున్నారు?" అని అడిగే. "అమ్మగారు భోంచెయ్యగానే పెరియమెట్టు వెళ్ళారని వెళ్ళేరు. నాలుగ్గంటలకే వచ్చేస్తానన్నారు" అంది. ప్రాణం కుదుటబడింది. ఒతికేం, భగవంతుడా! నావల్ల తప్పే లేదనుకున్నాను సరే మరో ఘడియకల్లా వచ్చేస్తుందికదా అనుకుంటూ, హిందూపత్రిక చదువుతూ ముందు వసారాలో కూచున్నా. కాసేపటికల్లా టాక్సీలో శాంతం వచ్చింది "నేనూ ఇప్పుడే వచ్చాను శాంతం" అనబోతున్నాను-ఇంతట్లోకి ఆ డ్రైవరు పటం వంటి

వసారాలో పెట్టాడు దాంతో పెరిగి స్మోట్టు అంటే బోధపడింది. రామారావుగారి చిత్రాల ప్రదర్శనాలకెళ్లి ఏమేడెనిమిది వందలుతె లేసేదోబొమ్మ వకటికొనుక్కొచ్చిందని దాంతో నాకెక్కడలేని కోపంవచ్చేసి, ఆలస్యంగావచ్చిందన్న మిషతో నాలుగు దులుపులు గలిపేశా - ఆ కారణంగానే - తెలిసివుంటే.

ఓర్థ"భాండారి" మర్దన చేస్తున్నంతసేపూ లెక్కలు వేస్తునేవున్నా. పుట్టుతో సహా రెండుమూర్లజానెడు పొడుగు, మూరెడు జెత్తెడు వెడల్పు ఉంటుందో వుండదో ఏ ఏడు వందలో ఎనిమిదివందలో పారేసిందే - ఆ లెక్కనిచూస్తే - వదరపుగజం గమారపు పదహారుండురెండల ఏభైరూపాయలు పడి దే-అర్ధాని మాంటురోడ్డులోనే స్థలం కొని పారేయ్యొచ్చునే - అని ప్రాణం మహానొచ్చుకుంది. ఇంతకీ యీ స్వదేశీసాంప్రదాయం బొమ్మల్లో అందమా చందమా? సెల్లాళ్ళ లంకణాలుచేసినట్టు - ఏమిటా ముఖాలు, ఆ వాలుకళ్ళు, ఆ కందిరీ నడుములు, ఏనుగుతొండాల్లాగ చేతులు, అరటి బోదల్లాగ కాళ్లు- భోగంవాళ్ల అభినయంలాగు చేష్టలు - నాకు బోధపడదు. సహాం డబ్బు పెడితే రవివర్మబొమ్మలు పటాలుకట్టినవి ఎక్కడెక్కడో వస్తాయి - రెండువరసలు పెట్టుకోవచ్చు డ్రాయింగురూములోనూ, పడకగదిలోనూ, వసారాల్లోనూ, వంటింటిలోనూ, కావలిస్తే మిగిలినవి కొట్టుగదిలో కూడాను. ఆ రవివర్మబొమ్మలు చూస్తే ఏపుగాను దబ్బపండులావొళ్లు, బూరెబుగ్గలు, బొద్దుగానడుం, రూపు, రేఖ, అందం చందం, తీర్చిదిద్దినట్లు ముద్దొస్తూవుంటాయి. అసలిని "తిలోత్తమ ఒంటి ఆకుతూ"వున్న బొమ్మ చూసి, నాభార్య ఇలాంటిరూపసి అయితే బాగుండును అనుకునేవాడిని చిన్నప్పుడు అలాంటివి కొనక ఏ ఎనిమిదివందలో తొమ్మిదివందలో యీబొమ్మకా!

తలంటింతా అయింది-శాంతం "శ్రీరామరక్ష వెయ్యేళ్లాయుష్షు" పెడతూంది - అప్పుడు జ్ఞాపకంవొచ్చింది చెక్కబుక్కు నా జేబులోనేవుంచిపెదా - తన స్వంతడబ్బు పెట్టే కొనుక్కుందని. సరే పర్వాలేదనుకున్నాను. మరొకమాటకూడా తోచింది. రేపు ఉదయం పత్రికల్లో ఎలా గాపడుతుంది. ఫలానామిసెస్ శాస్త్రిగారు కొన్నారూ అని. పొరపాటుమీద అచ్చువాళ్లు "మిస్టరుశాస్త్రి" అనివేస్తే మరీమంచిది. ఎలాగేనా మన పేరు నలుగురికీ తెలుస్తుంది. మనకి కావలసిందే అది - అనుకునేటప్పటికి కోపం పూర్తిగాపోయి సంతోషంకూడా వొచ్చింది. సరే పెళ్ళాంతో తగువు తెచ్చుకొన్న తరవాత పక్కసారిగానే శాంతించి, రాజీపడడం బుద్ధిమంతుల లక్షణం కాదనుకొని, కాఫీత్రాగి, తాంబూలంవేసుకుని, ఏదో ప్రపంచుతున్నంగా కనబడేలాగు, ఫోటో ఆల్బం తీసి బొమ్మలు తిరగేస్తున్నా-శాంతమే సంభాషణ మొదలెడతుందని. "శాస్త్రీ! నీ ఇంగ్లడు అనుభవాలు, అక్కడ నీస్నేహితులగురించి, నాకు వినాలనే వుంటుందోయి. నీ ఆల్బములో ఇంకా ఎన్నిఫోటోలో మిగిలిపోయాయి - నువ్వు చెప్పినవి. హాయిగా కూచున్నాం ఫోటోలు చూపించవు?" అంది.

"అంతకంటేనా! నువ్వు లేనిపోని అనుమానాలు పడతావేమోనని మాత్రం నాకు భయం"అన్నా.

"నేనెప్పుడూ అలా అనుకోను. ఆవేళ యింతవరకూ చూపించావు తరవాత ఫోటో తిరగ వెయ్యమన్నావా ?" అంది.

ఆల్బం పుచ్చుకుని, బొమ్మ చూశాను. రెండునిమిషాలు కళ్ళుమూసుకున్నాను. నాకే నవ్వొచ్చింది. "చెప్పమంటావా యేమిటి? అయితే విను" అన్నా. "యీ అమ్మాయి నీకు నచ్చిందా ?" అని అడిగే.

"ముఖం బాగుంది వయస్సు చెప్పలేం - పాతిక వుండొచ్చు-నలభైవుండొచ్చు అంటంగానేవుంది. మంచి పొడగరి. చేతులు, వ్రేళ్ళు, పొడుగ్గా, సన్నంగా నాజూగ్గా వున్నాయి. కళ్లలో దయ, సానుభూతి ప్రతిబింబిస్తూన్నాయి. నర్సు దుస్తుల్లోవుంది చేతిమీద రెడ్ క్రాసుచిహ్నంవుంది. నిండు పెదిమెలు. అది తప్పితే, మడోన్నా చిత్రం లాగుంది." అంది శాంతం.

"హెన్నీ సల్లివన్‌తో నాకు అకస్మాత్తుగా పరిచయంకలిగింది ఇంగ్లండులో నాదప్పుడు మొదటిసంవత్సరం. ఎండాకాలం సెలవులు, కారన్వాలులో గడుపుదాం అనుకున్నాను. రివెయిరా ఎక్స్‌ప్రెస్సులో లండనునుంచి బయలుదేరేను. పెంజాన్సులో దిగడం ఎందుకు అని చెప్పి అంతకుముందు చిన్న స్టేషను హేయిలు అన్న వూరొస్తే అక్కడదిగేను. ఉత్తరగ్రామం. రైలుపెట్టిదిగి, మూటభుజాన్నేసుకుని స్టేషనునుంచి బయలుదేరేను. యీ చిన్న స్టేషనులోనే నొక్కడినేదిగేను అనుకున్నాను. కాని నావెనుకాలె ఒకమ్మాయి బుజాన్ని మిలిటరీసంచీ, నీళ్ళసీసా, చేతికర్ర, దిట్టమైన జోళ్లు ఆహోర్లు వ్వమ్మడే వస్తూంది. నావరకూరానిచ్చి పలకరించేను. ఒకరినొకరం పరిచయం చేసుకున్నాం. నా సంగతి చెప్పేను-తనసంగతి చెప్పింది - ఆ నిమిషంలో కాదనుకో-రానురాను.

"అయితే మీ స్నేహం శుక్లపక్ష చంద్రుడిలాగు ప్రవర్ధమానం అయిందంటూ !" అన్నాది శాంతం.

"అలాగే అనుకో. పౌర్ణమి వచ్చేవరకు మాత్రం రెండు నెలలు గడిచేయి !" అన్నా నవ్వుతూనూ : "కథ కానీ మరి."

"హెన్నీ ఐరిషుపిల్ల తల్లిమాత్రం ఫ్రెంచిది."

"ఆసలే బంగాళాదుంపకూర. అందులో మసాలాఖారం !" అన్నాది.

"అక్షరాల సత్యం ! తల్లితండ్రులు క్యాథలిక్కులవడంచేత, దైవభక్తి, పాపభీతి, ఫాదరీలంటె హడలు, ఆదివారం చర్చి, తర్చు ఉపవాసాలు, ప్రాయశ్చిత్తాలు- ఈప్రకారంగా తల్లితండ్రుల అంచనే జాగ్రత్తగా పెరిగింది. తండ్రి బడిపంతులు అవడంచేత జాగ్రత్తగా చదువుచెప్పేడు. పిల్లకి పద్దెనిమిదేళ్ళొచ్చాయి.పనికోసం ఆనిడబ్లినుపంపించాలనుకుంటూంటే తండ్రి అకస్మాత్తుగా చచ్చిపోయాడు. మరోసంవత్సరం అయాక తల్లి కూడా చచ్చిపోయింది. బతుకు ఆధరవు లేక లివర్పూలు వచ్చింది. యేదేనా మిల్లులోపనో, ఎక్కడేనా చాకరీవో చూసుకుందాం అనుకుని. ఇంతట్లో యుద్ధంవచ్చింది.

ఈ యుద్ధం మన పాలిటి అదృష్టం అనుకుని, వెంటనే రెడ్ క్రాసులో చేరి, నర్సుగా వెళ్లింది. యుద్ధం అంతా పనిచేసి- ఫ్రాంసు, బెల్జియం, ఇటలీ రణరంగాలన్నీ తిరిగి- చెక్కుచెదరకుండా, ఐరిషుపిల్ల కాదూ- గడుసుది, వొంటికీ, హృదయానికీ దెబ్బ తగిలించుకోకుండా, నాలుగు డబ్బులు మిగుల్చుకుని, లండను వచ్చేసింది ఇన్నాళ్లూ కష్టపడ్డాం, నాలుగురోజులపాటు హాయిగా విశ్రాంతి తీసుకుని, ఆ తరువాత యెలాగూ వుంది వుద్యోగాన్వేషణ- అని చెప్పి, ఆ వేళే లండనునుంచి హాయిలు బయలుదేరింది. ఆవిడకీ స్థిరమైన కార్యక్రమం లేదు. నాకూ స్థిరమైనకార్యక్రమంలేదు. అంచేత యిద్దరం కలిసి తిరుగుదాం అనుకున్నాం.

"కారన్వాలంటే ఎంతో చక్కని ప్రదేశం. అలసటలేకుండా మైళ్ళకొద్దీ నడవొచ్చు. ప్రొద్దున్నే ఆరుగంటలు కొట్టేప్పటికల్లా లేచి దంతధావనం చేసుకుని రోడ్డుపుచ్చుకునే వాళ్ళం. ఆదేశంలో తెల్లవారకుండానే పాలు పితుకుతారు ఆవేళకి పరాయివాళ్లెవరున్నా ఎన్ని పాలు తాగగలిగితే అన్నీ డబ్బుపుచ్చుకోకుండానే ఇస్తారు అంచేత పొద్దునే బయలుదేరి గుమ్మపాలు ఆరగించి, పదిమైళ్ళు నడచేవాళ్ళం. అప్పటికి ఏ ఒంటి గంటో రెండో అయేది. మాతో కూడా తెచ్చుకున్న రొట్టె, వెన్న, బిస్కట్లు, టొమాటోలు ఛీజుతిని, యే చెట్టుక్రిందో గడ్డివాము నీడనో ఒక గంటసేపు విశ్రమించేవాళ్ళం. మళ్ళీ యే నాల్గు గంటలకో బయలుదేరి సాయంకాలం ఎనిమిది, తొమ్మిది గంటలవరకు నడుచుకుని రాత్రి ఏ పల్లెటూరి హోటలులోనో భోంచేసి, ఆరుబైటనో, సముద్రపొడ్డునో, పడుకునే వాళ్ళం. శనివారాదివారాలు మాత్రం దగ్గిరవూళ్లో హోటల్లో బసచేసి, వేడినీళ్ళ స్నానంచేసి, శుభ్రంగా మూడుపూట్ల భోంచేసి, మళ్ళీ సోమవారం కాలినడకని బయలు దేరేవాళ్ళం.

"అలాగు కారన్వాలుతీరం అంతా తిరిగాం. "ల్యాండ్సు ఎండ్," "లిజర్డు", "టింటేజెల్," "లయోనెస్సే" అన్నీ తిరిగాం. అవకాశం వున్నప్పుడల్లా సముద్రస్నానం చేసేవాళ్ళం ఈతలో పందేలు వేసుకునేవాళ్లం. గోజుకుంటూ వచ్చి ఇసకలో దొర్లి మళ్ళీ కెరటాల్లో దూకేవాళ్లం వుప్పలగుప్ప తిరిగేవాళ్లం. హెూన్నీవొళ్లు మంచి కసరత్తు చేసిన వొళ్లు. దండలు తిరిగి రివటలు లాగుండేది. పంజాపడితే ఇంక పటకారంటే నమ్ము! ముఖమల్ లాంటి చర్మం, నిర్మలంగా వుండి పచ్చటి రక్తనాళాలు కనిపించేవి ఆ కెరటాల్లో ఆడుతూంటే - ఆ తడిసిన తలవెంట్రుకలలోనుంచి సూర్యకిరణాలు మెరుస్తూంటే తళతళమని కరగబోసిన తామ్రంలా వుండేది. నవ్వితే కళ్ళు మెరిసేవి. ఎలకపళ్ళలా వుండేవి ఆమె పళ్లవరసలు.

"చమత్కారంగా మాట్లాడుకునేవాళ్ళం ప్రపంచములోవున్న అన్ని విషయాల గురించి వాదించుకునేవాళ్ళం. రోజంతా నడవడంవల్ల, ఆటలాడడంవల్ల, వొళ్లుబాగా అలిసేది. రాత్రి ఆ ఆరబయటని పడుకుంటే, కళ్లుమూసుకునేసరికి నిద్రపట్టిపోయేది. ఇలాగా ఒకరోజు ఆడుతూ పాడుతూ నడిచి రాత్రి సముద్రపొడ్డున్న పడుకున్నాం.

వకరబ్బరుగుడ్డ పరచుకుని మూట తలక్రింద పెట్టుకుని నేను పడుకున్నాను. వక ఏడ్తెంగజాల దూరంలో హెన్నీ పడుకుంది.

ఆగస్టు నెల. వెన్నెల రాత్రి చల్లనిగాలి కొడుతూంది సముద్రం హోరుమంటూంది. ఆకాశాన్ని నక్షత్రాలు వేలకొద్దిరాలుతున్నాయి. ప్రక్కనున్న పల్లెటూరిలో పంటకోత తైయ్యాక ఆడుతూ పాడుతూ సంబరం చేసుకుంటున్నారు. వారిపాటలూ, నవ్వులూ దూరాన్న వినపిస్తున్నాయి. జగత్తు సర్వమున్నూ నవ్వుతూంది. నాకు వెంటనే నిద్రపట్టి పోయింది............నిద్రనుంచి వక్కసారిగా మెలుకువవచ్చింది. ఎవరో నావంటి మీద చెయ్యివేసి నన్ను ఆపాదమస్తకము తడుముతున్నారు....చల్లని చేతులు, హంస తూలికలవంటి వ్రేళ్లు-నాహృదయసీమమీద వాలేయి.... "శాస్త్రీ! శాస్త్రీ!"అని బొంగురు పోయిన గొంతుకతో నన్నెవరో పిలుస్తున్నారు....దూరంనుంచి అనుకున్నాను-కాదు- నాచెవిలోనే....ఎవరైయుంటుంది ఈవిధంగా నాతో స్వేచ్ఛతీసుకునేవారు?...... హెన్నీ నల్లినన్!...కళ్లువిప్పకుండానే పోల్చుకున్నాను....ఆమెస్పర్శ, ఆ స్వరము.

"ఓహో! ఇరవయ్యో శతాబ్దపు ప్రవరాఖ్యుడవా యేమిటోయి, నువ్వు? సరే, వరూధిని యేమంది?"అంది శాంతం.

"ఏం, హెన్నీ?" అని కళ్ళువిప్పి ప్రశ్నించుదాం అనుకున్నాను. కాని గొంతుక రాలే. మనసుడిల్లపోయింది. ఆమె వేడిఊపిరి నా నుదుటిమీద ఆల్లాడుతూంది. తల కట్టు నా మెడమీద వింజామరంలాగ నాట్యంచేస్తూంది. వెలుగురాసిన గొంతుకతో మళ్లీ నన్ను చెవిలో పిలిచింది. ఆపిలుపు వెనుకటికంటె బలవంతంగా వుంది...ఆమె కోరిక నాకు బోధపడింది. నేనేమిచేయడం? ఆమె నావొళ్ళు తడుముతూంటే నాకు ప్రాణా లున్నాయో లేదో నాకు తెలియలేదు. ఆలోచనా శక్తి పోయింది వొళ్ళు తా పక్ష వాతం కమ్మింది ఆమె కోర్కె అంగీకరించుకునా? ఆమె అరచెయ్యి నా గుండెల మీద అనినప్పుడు, ఆమెచేతిలోనే అగుండె పేళ్ళున పేలుపోతుందేమో అనిపించింది. గుండెలు కొట్టుకోవడం కాదు-ఉరుములు, పిడుగులు లోనధ్వనిస్తున్నాయి...నావంట్లో అప్పుడు ప్రవహించినది మరుగు రక్తంకాదు విద్యుజ్జ్వాలలు - నా మెదడులో ఝంఝామారుతం-హృదయ సీమలో సంక్షోభం-మహాసంగ్రామం-సంకులసమరం....

"ఆమె కోర్కె అంగీకరించడంలో తప్పేముంది?...తప్పు ఒప్పు-ఎవడు నిర్ణయించగలడు? నిర్ణయిస్తే మాత్రం నిర్ణయాన్ని అమలు పర్చడం సాధ్యమా? ఒక స్త్రీ... ఒక పురుషుడు ..వీరిరువురిమధ్య ప్రకృతి సిద్ధమైనదే నీతి. ఇంకేకీ...నేనా-కోర్కె తీర్చేది? నాలో కోర్కె లేదూ? లేదని ధైర్యముగా చెప్పగలనా? లేదని నేననుకున్నంత మాత్రాన్న నిజమని నామనస్సాక్షి ఒప్పుకుంటుందా? ఆత్మవంచనఎందుకు? ఆమెతో ఆడుకున్నప్పుడు ఆమెవొళ్లుతగిలితే నాకు ముచ్చమటలుకమ్మేవి కావా? ఆమె నవ్వితే నా హృదయంలో ఆమె నవ్వు ప్రతిధ్వనించలేదూ? కలువరేకుల్లాంటి ఆమె కళ్లనుంచి మెరుపులు మెరిసినప్పుడు నాతల తిరిగిపోయేదికాదూ? అప్పుడు నాకు మంచి

చెడ్డలు తెలిసినట్టా తెలియనట్టా? నాలో నేవాంఛవుంది. వుండటంలో తప్పేమిటి? నా కెందుకింత అనుమానం? జన్మధర్మంకాదా?....

"మనసు కుదుటబడకుండా వుంది. యే నిశ్చయానికి రాలేకుండావున్నాను. ఏపని చేసినా నేను మనోవాక్కాయకర్మలతో చెయ్యాలి. నేనదే నా లక్ష్యంగా పెట్టుకున్నాను...ఎన్ని అనుకున్నా శాంతి రావడంలేదు... అదిగో - మళ్ళీ నన్ను లేపుతూంది. లేస్తే ఏదో ఒక నిశ్చయానికి రాకతప్పదు. కార్యరంగంలోకి దిగక తప్పదు. అవుననేనా అనాలి - లేకపోతే కాదనేనా అనాలి. నేను సహజంగా పిరికివాడిని. కార్యరంగంలోకి ఉరకలేను. చప్పున ఇదమిత్థమని స్థిరం చేసుకోలేను. నా మనస్సులో నిరంతరం సంక్షోభమే. మొద్దునిద్దర నటించడమే నాకుశరణ్యం. నేనునిజంగా గాఢనిద్రలో వున్నాననే అనుకుంటూంది. మళ్ళీ పిలుస్తూంది...యీసారి ఆమె పిలుపు బలవత్తరంగా వుంది. వెయ్యి ఇనుప సంకెళ్ళతో నన్ను లాగుకుని పోతూంది. ఇనుప సంకెళ్ళు - బంగారపు తీగెలా?... నేను లేవకూడదు. లేచి ఆమె చూపులు ఎదుర్కొంటే - నా మనస్సు నా అదుపు ఆజ్ఞల్లో వుండదు. నా వొళ్ళు పరవశం అయిపోతుంది... అయినంతమాత్రాన మునిగిపోయిందేముంది? ప్రేమలోకాతీతమైంది కాదా?...ఆమెనుండి నేను కోరేది - ప్రేమా - వాంఛా...? నేను చెప్పలేను. రెండు మనస్సులు రెండు శరీరాలు కలుసుకున్నప్పుడు - ఎవరు నిర్ధారణ చేస్తారు? ఎవరు చెయ్యగలరు?...

...నన్ను లేపుతోంది. ఇటించి అటు వొత్తిగిలేను నిద్ర నటిస్తూనే. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తొట్రుపాటు లేకుండా ప్రశాంతంగా తీస్తున్నాను. వంట్లో నరాలు బిగపట్టకుండా సహజంగా వుండేటట్టు నా ఆధీనంలోనే పెట్టుకున్నాను...ఎంతసేపిలా వుండగలను? నాకేం ఖర్మం? నన్ను శిక్షించేవారెవరు? నేనెందుకు సహజమైన పురుషుడిలాగు ప్రవర్తించకూడదు?...కొంపతీసి, హెన్నీ నన్ను వలలో వేసుకోవడానికి ప్రయత్నించడం లేదుకద? ఆమూల పొదలో ఎవరినేనా దాంకో పెట్టిందేమో- నామీద సాక్ష్యం బెదిరించి-డబ్బు గుంజుకోవడానికి?... ఈలాంటి కక్కుర్తి లోపడి నా స్నేహితుడొకడు నానా చిక్కులూ పడుతున్నాడు ... మరొకటి ... హెన్నీ ఆరోగ్యమైన మనిషే. కాని ఆమెపుట్టుపూర్వోత్తరం నాకేం తెలుసు? ఆరోగ్యం అన్నది అంతరంగిక విషయం. ఆమె రక్తంలో ఏ క్రిమికీటకాలు దాగివున్నాయో? ఆ అంతర్గతాలైన సూక్ష్మజీవులు నా శరీరంలో ఏమి మార్పులు, ఏమి జాడ్యాలు, ఏమి విప్లతాలు తెచ్చిపెడతాయో? శరీరారోగ్యం అన్నది మన వంశీకులు పెట్టిన భిక్ష. సుభిక్షమో - దుర్భిక్షమో? ఒక్క నిమేష వాంఛకు నా భావి ఆరోగ్యం అంతా పందెం వెయ్యకూడదు...హెన్నీ యెడల నేనెంత నీచంగా ఆలోచిస్తున్నానో కదా? ఆమెకు నీచపు బుద్ధులు, కళంకమైన శరీరంకూడా ఆరోపిస్తున్నానే...ఈ సంఘర్షణ ఇక సహించలేను...ఏమైనాకానీ ... ఏదో ఒకటి తేల్చివెయ్యాలి ... యువకుడ్ని -

ఆరోగ్యవంతుడ్ని - కారణాకారణాలు తెలుసుకోనగలిగే వ్యక్తిని - ఆమె ప్రేమాస్పదుడను..."

ఇలా చెపుతూ వున్నా—"దుబ్బుని" మేడమీదనుంచి చప్పుడు వినిపించింది. చంటిపిల్ల కెవ్వుని కేకేసింది "లక్ష్మి వుయ్యాలలోంచి పడిపోయింది. ఏందెబ్బ తగిలిందో ఏమిటో! నేను మేడమీద కెళుతున్నాను- శాస్త్రీ!" అంటూ శాంతం మేడమీదికి పరుగెత్తింది.

...అరగంటైంది. శాంతం యింకా మేడదిగి రాలేదు. నాకథ పూర్తికాకుండానే వుండిపోయింది. శాంతం నాగురించిఏమనుకుంటూందోఏమిటో? ఆఖరుమాటతరువాయిగా యీ అవాంతరం వచ్చింది నేనారాత్రి హెన్నీకి లొంగిపోయి నా బ్రహ్మచర్యాన్ని పోగొట్టుకున్నాననుకుందో ఏమిటో? "నా వ్రతం నిలబెట్టుకున్నానుసుమా, శాంతం!" -అని ముందే చెప్పేయగలసింది - యిన్ని చిలుకలూ పలువలూ పెట్టకుండా. అయితే, ఆనాడు నేనుపడిన ఆవేదనంతా చెప్పడం మంచిదనుకున్నాను. ఇప్పుడు వెళ్ళి చెపుతే, పనికట్టుకు చెప్పినట్టుంటుంది. అపనమ్మకం మరింతబలపడుతుంది. అప్పటికీ- చెపుదాం అని మేడమీదికి వెళ్ళా. శాంతం, పెదిమలమీద వేలుంచుకుని: "హుష్షు! ఏడ్చేడ్చి యిప్పుడే కన్నుమూసింది. చప్పుడు చెయ్యకుండా నువ్వు కిందగదిలో పడుకో, శాస్త్రీ" అంది.

నేనారాత్రి బ్రహ్మచర్యం నిలబెట్టుకోవడం యదార్థం. మనోబలం వల్లనైతేనేం పిరికితనంవల్లనైతేనేం? అదెవరికి కావాలి? అది నాస్వవిషయం. అంతరంగిక విషయం. నా ధర్మాన్ని నిలబెట్టుకున్నానన్నదే ముఖ్యం. ప్రపంచానికి, శాంతానికి తెలియవలసిందదొక్కటే కర్మప్రధానం కాని, కారణం ప్రధానం కాదు. ఇంతకీ- ప్రపంచానికి చాటవలసివస్తే బుద్ధిబలంవల్ల, మనస్సు పటుత్వంవల్ల, బ్రహ్మచర్యం వహించవల్ల, అనే చెప్పొచ్చు. కాదని ఎవరనగలరు? కాదా ఏమిటి కూడాను? బడాయి అనుకుంటే అనుకుంటుందేమో కాని ఏదేనా సమయోచితంగా, శాంతంతో చెప్పెయ్యాలి, ఆవేళ నేను బ్రహ్మచర్య దీక్షకి భంగం రాకుండా కాపాడుకున్నానని. నిజమేగా?

అన్నట్టు జ్ఞాపకంవచ్చింది. ఈ కథజరిగిన రెండు సంవత్సరాలైంతరువాత ఇండియన్ ఎసోసియేషను బిలియర్డ్సు ఛాంపియన్ షిప్పుఆటలకి వెళ్ళేను ఒర్కింగు హోముకి. ఆఖరు వరుసవరకు నేను నిలబడ్డాను. నాది ముప్ఫై హేండికేపు. ఆట రెండువందలు "అప్". నా ఎదుటి ఆటగాడు 138. నేను 156. ఆటచెయ్యి నాది. ఇరవైయేడు బ్రేకు. నా ఆట సాగుతూంది. "డబుల్ కేనను ఆఫ్ ది రెడ్డు". ఇంతట్లో, ప్రేక్షకుల్లో ఎవరో నలుగురైదుగురు కలిసి మాట్లాడుకుంటున్నారు గట్టిగా. ఒకతను అంటున్నాడు! "ఒరేః దాస్ గుప్తా! ఈ థామస్ గాడికి కాయంవుంది ధైర్యం ఇల్లే!" అన్నాడు. అందరూ గొల్లుమన్నారు. నేను ఆటమధ్యని తుళుక్కుపడ్డాను. గురి తప్పిపోయింది. నా సంగతి ఇక్కడెవరు ఖయాలుపెడుతున్నారని అదావేపు చూశాను.

తెలిసినముఖం ఒక్కటిలేదు. పుచ్చకాయలుదాం అంటే బుజాలు తడుముకున్నా ననుకున్నాను. ఫలితం ఆటవోడిపోయాను. హెన్నీ సల్లివన్ యొక్క పడ్డోన్నా స్వరూపం- -ఆవేళ మళ్ళీ మనస్సులో ప్రత్యక్షం అయింది!

# 55

## ఆమె

శాస్త్రికథ మంచి రక్తికట్టే వేళకి సగ్గా రసభంగం జరిగింది. పాపాయి వుయ్యాలలోనించి దొర్లి క్రిందపడిపోయింది. కంటిమీద బొడుపుకట్టింది. సున్నం బెల్లం పట్టేశాను. ఒక అరగంట ఏడ్చి, అలిసిపోయి పడుకుంది. రాత్రి పాపాయి పక్కలోనే పడుకున్నాను.

నిద్ర పట్టలేదు. హెన్నీ గురించే జ్ఞాపకం వొచ్చింది. పాపం - ఆ రాత్రి ఆమె ఎంత బాధపడిందోకదా! నాలుగు సంవత్సరాలు అహోరాత్రాలు ఆ యుద్ధంలో పని చేసి మనశ్శాంతికోసం తహతహపడిన ఆ హృదయం ఎంత ఆవేదన పొందిందో! ఆరాత్రి యుద్ధరంగం- మారణహోమం. రక్తపాతం- ఎక్కడ చూసినా తలలులేని మొండేలు- ఉత్తరించుకుపోయిన పీకలు- చేతులు- కాళ్లు- మరఫిరంగుల మోత- శతఘ్నులు- భీభత్సం. విమానాల హోరు. ఘడియ ఘడియకు మృత్యుదేవతని వెన్నంటి వేటాడుతున్నారు. ఇప్పుడే క్షణమాత్రం విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆ కొంతకాల్లో... రెండు రోజులై తిండిలేదు... మిగిలిన ఒక మాంసపు తునక ఆమూలకు కనిపించింది. దానికోసమై ఒకరితో ఒకరు పోట్లాడుకుంటున్నారు. ఒక నిముషం క్రింద మిత్రులు - ఇప్పుడు శత్రువులు... పంచేంద్రియాలు చెలరేగుతున్నాయి. అదిగో ఆ శిథిలమైన యింటిలోంచి ఒక క్రోంచి పరుచు బైటకు వచ్చింది. ఆ స్త్రీని పంచుకోవడానికి స్నేహితులిద్దరూ ఒకరి నొకరు పొడుచుకుంటున్నారు. ఘోరప్రమాదం వున్నప్పుడు ఒకరిని రక్షించడానికి ఒకరు ఆత్మబలి అవడానికి మళ్ళీ సిద్ధం... యమునితో హాస్యము - మృత్యువుతో చెలగాటం - విధినే తోసిరాజుచేయడం - చావుబతుకులకు విలువ యేమిటి? ఈవేళ వుంటారు - రేపు పోతారు. యీ బొందలో ప్రాణం వున్నంతవరకు- లభించినంతవరకు సౌఖ్యం అనుభవిద్దాం. ఆ తరవాత సర్వం శూన్యం ... పొట్ట చీలిపోయింది - పేగులు పైకి వేళ్లాడుతున్నాయి. విపరీతపుబాధ. వొళ్ళంత కట్లు...ఆ నర్సు ఒక్క నవ్వుతో ఒక్క కనుసైగతో - మోక్షము, స్వర్గమువాళ్ళకి!...

ఈ దృశ్యాలు అనుభవించిన హెన్నీ - ప్రేమకోసం ఎంత పరితపించిపోయిందో? ప్రేమ, వాంఛ, అనురాగము, కామము - ఆమెకు ఆ నిమిషంలో ఏం తెలుస్తుంది? నేనే ఆమె స్థితిలోవుంటే నాకు తెలుస్తుందా? నా జీవితంలో నాకు తెలిసిందా? నేను మాత్రం మరోవిధంగా ప్రవర్తించి వుందునా? ప్రేమార్త ఆయివున్న హృదయం - సౌఖ్యం అన్వేషిస్తున్న శరీరం - వీటికి ధర్మసూత్రాలు వర్తిస్తాయా? మానవ స్వభావానికి సహజమైందే ధర్మం.

ఆ రాత్రి ఆ సముద్రుడు భూదేవిని నురగలుకక్కుతూ పరుగెత్తి కౌగిలించుకుంటూంటే, ఆమె హృదయంలో అసూయ జనించదూ? ఆ పిల్లగాలులు ఆకాశాన్ని వీస్తూంటే, ఆ గాలులు ఆమె మనస్సును రేకెత్తించవూ? ఆమె హృదయంలో దవానలము దహించుకుపోతూ కార్చిచ్చులు చెలరేగవూ? ఆ తారామండలం తమ పొంత నుంచి పారిపోతూన్న చంద్రుణ్ణి పట్టుకుందాం అని ప్రయత్నించి తప్పిపోయి ఆఖరి నవ్వుతో భూమిమీద పడిపోతుంటే, ఆ నవ్వు ఆమె హృదయ చీకటులలోకిచొచ్చి సంతోషం కలిగించదూ? ప్రేమ, సౌఖ్యం ఎదురుగుండా వస్తూంటే వాటిని తప్పించుకుని పారిపోవడంఎవరిశక్యం?...

ఇంద్రియనిగ్రహమా? స్త్రీ పురుషుల కది సాధ్యమా? మనసా- వాచా కూడా జన్మంలోపరస్త్రీని, పరపురుషుడిని తలంచని వ్యక్తి వుండడం దుర్లభం. మన పాతివ్రత్యం, మన బ్రహ్మచర్యం, మన గృహస్థధర్మాలు, పక్క కర్మలోనే ఆచరిస్తూంటాం. అంతకంటే హెచ్చువెళ్ళలేము. ఆనాడు శాస్త్రి హెన్నీ కోర్కె తీర్చివుంటేనే నాకెంతో సంతోషం. అతడేమిచేశాడో నాకు తెలియదు. నేనతన్ని ఎన్నడూ అడగను. అతను ఏమిచేసినప్పటికి కూడా, మనస్ఫూర్తిగాను, సహజంగాను, స్వభావయుతంగాను, ప్రవర్తిస్తే నాకదే సంతోషం. ధైర్యవంతులు క్షణమాత్రం ధర్మంవీడినా తప్పులేదు. పిరికిపందలు మాత్రం ధర్మాన్ని ఎన్నటికీ పాటించలేరు.........

రెండురోజులై అశ్రద్ధ అయింది. ఈ పుస్తకంలో వ్రాయడం పడలేను. పుస్తకం తీసి వెనకవ్రాసిన పేజీలు తిరగవేస్తూంటే నాలో ఎంతమార్పు వచ్చిందో నాకే ఆశ్చర్యంగా వుంటుంది! అనుభవంపట్టి మారుతూండేదే కదా మనుష్యప్రకృతి? ప్రపంచచరిత్రే మారుతూంది. ఇతిహాసమే మారిపోతూంది. పరిస్థితులపట్టే మానవకోటి ప్రవర్తన, వ్యక్తి ప్రవర్తన కూడాను. ముక్కు మూసుకు, నవరంధ్రాలూ బంధించి లక్ష గాయత్రీచేసి ధర్మంపట్టుకుని వేళ్ళాడుతానంటే- అసలు ధర్మమే మారిపోతూంటే! నిన్నటి ధర్మం ఈవేళ లేదు-ఈవాళ ధర్మం రేపువుండదు. శాశ్వతధర్మాలంటూ వున్నాయా? అనిపిస్తూంటుంది నాకు సత్యం, ధర్మం దేశకాల పాత్రాలని అనుసరించేకావూ? ఆర్యకాలంలో నిష్కామకర్మ, అపరిగ్రహం, జ్ఞానసముపార్జనం, జ్ఞానదానం, ఇవీ బ్రాహ్మధర్మాలు. ఇప్పుడవి మారిపోయాయి కావా? ఏదో ఒకవిధంగా డబ్బుసంపాదనే ఇప్పట్లో ప్రధానం. ఎలా సంపాదించినా తప్పులేదు. దివాలాతీసి సంపాదించినా, బ్రిడ్జి ఆడిసంపాదించినా,

షేరు మార్కెట్టులో సంపాదించినా, బీదలదగ్గిర చికిత్సకోసం డబ్బుగుంజి సంపాదించినా, రైతులని పీడించి సంపాదించినా, తప్పుడుసాక్ష్యాలు యిచ్చీ యిప్పించీ, సంపాదించినా, సంపాదిస్తేనే మర్యాద! వకతం దాటిపోతే సమకాలీకులు మర్చిపోతారు, మరీ చిక్కుండదు. సంపాదించకపోతే-అసమర్థుడు, అప్రయోజకుడు, గౌరవమర్యాదలకి హక్కుండదు. మా పెద్దతాతగారు నలుగురు సాన్లని వుంచుకున్నారట. ఉంచుకోపోతే పురుషలక్షణమే కాదుట- ఆరోజుల్లో! యూరపులోనూ అంతేగా మొన్ననిన్నటి వరకూ! మహారాజులంటే చచ్చిపడిపోయేవారు మునుపు. ఇప్పుడెవరికీ లక్ష్యమేలేదు. కూలివాడుకూడా ఆత్మగౌరవంకోసం పాకులాడుతున్నాడు. ధర్మం యిలాగే తారుమారవుతూంటుంది. నేను వెనక "శశిరేఖ"గురించివ్రాసింది చదువుకుని- నేనేనా వ్రాసినదనుకున్నాను. ఉద్రేకంలో వ్రాసివుంటాను. స్వేచ్ఛంటే అచ్చువేసిన ఆబోతులాగు తిరగడం కాదే. దాహం వేస్తున్నాదని చెప్పి పదిమందికి రచిపెట్టి త్రాగిన గ్లాసుతో తాగగలమా? ఇది స్వేచ్ఛకాదు. విషయలోలత్వం. ప్రపంచంలోవున్నది స్త్రీ పురుషసంబంధం ఒక్కటేనా? మానవ జీవితానికి, వ్యక్తిజీవితానికి అదేనా ప్రధానం అయింది? విషయలోలత్వం, బహుభార్యాత్వం, బహుభర్తృత్వం - ప్రజాభిప్రాయం ఎప్పుడూ అసహ్యించుకుంటుంది. వ్యక్తిత్వము,సమానత్వము, గౌరవము, స్వాతంత్ర్యము, స్థిరత్వము - గృహస్థ జీవితంలో ఇదేముఖ్యమైన లక్ష్యం. ఇదేనిజమయిన అభ్యుదయం......

"అమ్మా తల్లీ" అంటూ కిందనుంచి కేకవినిపించింది. పన్నెండు గంటల వేళప్పుడు ఎవరు పిలుస్తున్నారు చెప్మా? అని క్రిందికి వెళ్ళిచూశాను. పదహారేళ్ళమ్మాయి- చింపిరిజుత్తు-మాసిన పరికిణి, చిరిగిపోతూ చిరిగిపోతూవున్న బాడీసు, మెళ్లో నల్లపూసల పేరు- ముక్కుని చెవులని పూచిక పుడకలు- మొండిచేతులు- "ఆకలేస్తుందమ్మగారూ- అన్నంపెట్టించరా?" అని అడిగింది. తప్పకుండా అన్నం పెట్టిస్తానమ్మా అని, ముందు వేడివేడి కాఫీ తాగు, ఆ తరవాత తలంటుకుని స్నానంచెయ్యి అప్పుడు భోంచేద్దువుగాని-అని చెప్పి లోపలికి రమ్మన్నాను. తలంటుకున్నాక నాచీర బాడీసు ఇచ్చాను. భోంచేస్తున్నప్పుడు తన కథ చెప్పింది. వాళ్ళది నైజాంట. నాందేడు దగ్గర పన్నెండు మైళ్ళ దూరంలో పల్లెటూరట. తల్లితండ్రులు అతి బీదవాళ్ళట. ఈఅమ్మాయి ఇంకా ముగ్గురు చెల్లెళ్ళు, నలుగురు తమ్ముళ్లున్నట. బ్రాహ్మల్లట. మురికినాట్లుట. మళయాళంనుంచి యెవరో యిద్దరు మగవాళ్లు, ఆడవాళ్లు వాళ్లవూరు వొచ్చి యీ అమ్మాయిని, తల్లిదండ్రులకి రెండువందల రూపాయిలు ఖరీదు ఇచ్చి కొనుక్కున్నారుట. ఆరు రోజుల క్రిందటనే నైజాంనుంచి బయలుదేరి తోవలో షేక మహమ్మదు వూరులో మరోయిద్దరు అమ్మాయిలని కూడా చెరుమూడువందలూ ఖరీదుచేసి, నాల్గురోజుల క్రింద అందరూ కలిసి నైజాంనుంచి బయలుదేరి నిన్నసాయంత్రం చెన్నపట్నం వచ్చారుట. ఈ అమ్మాయికి వాళ్లని చూసి భయం వేసిందట. రెండు మూడుసార్లు పారిపోవడానికి ప్రయత్నించిందట. కాని సాగలేదుట. ఆఖరికి నిన్నసాయంత్రం బహిర్భూమికి

వాళ్ళని చెప్పి, ముసుగువొడ్డి వెనుక గుమ్మంగుండా, పొరుగు ముసుగుదొడ్డిలోకి పారిపోయి రాత్రి అల్లా అక్కడే దాంకుని చీకటితోనే ఖబ్రస్తానులో దాంకుని మధ్యాహ్నానికి ఇక్కడికొచ్చి చేరుకుందట. భోంచేస్తున్నా తనేహ్రా తనకోసం వెతుక్కుంటూ వాళ్ళెవరేనా ఇక్కట్లో జొరబడి తన్ని తీసుకుపోతారేమో అని భయం. భోజనం అయాక ఎందుకేనా మంచిదని, తల దువ్వి జడేసి, సిగేసి చెవులకి వెలసిపోయిన నాదుస్తులు ముక్కుకి ఎర్రరాళ్ళ ముక్కుపుడక పెట్టి చేతులకి గిల్టుగాజులు కాళ్లకు పుసుచ్చేరి గొలుసులు పెట్టి, పొడరు కుంకంబొట్టు. కాటిక పెట్టేసరికి—పూర్తిగా వేరేమనిషి అయిపోయింది! మీతల్లి దండ్రుల దగ్గరకి పంపిచేద్దునా, అని అడిగితే—నైజాంలో తాగడానికి గంజేనా దొరకదమ్మా, మీదగ్గిరే మీరువుంచుకుంటే వుంటానమ్మా, అని ఏడుస్తూఅంది సరేలే యీవాళనుంచి నీ పేరు "సుభ" సుమా! అన్నా.

పాపాయితో ఆడుకుంటూంది—ఇంతలో శాస్త్రి కోర్టునుంచి ఇంటికి వచ్చి ఆపిల్లను చూసి: "ప్రెసిడెన్సీ మేజస్ట్రీటుగారి అమ్మాయేమిటి? పాపాయితో ఆడుకోడానికా వచ్చిందా?" అని నవ్వుతూ అన్నాడు. "కాదు సుభ" అన్నాను. అని అమ్మాయి కథ చెప్పా. శాస్త్రి ఏదో నణుక్కున్నాడు "సరేలే"అన్నాడు చివరకి.

శాస్త్రి స్నానంచేసివచ్చాడు. వసారాలో కూర్చుని కాఫీ త్రాగుతున్నాం. సుభ ఏదో హిందూస్తానీ "గజల్" రాగంతీసి పాడుతూంది. గొంతుక శ్రావ్యంగావుంది. భైరవిలో బాగా విసురుతూంది. శాస్త్రి అన్నాడు: "శాంతం నీ శిష్యురాలు సంగీత కళావేత్తలా వుందే. అభివందనాలు!" "ఆఁ! ఏదో విన్నపాటలాగుంది. నేర్చుకుందా యేమేనానా?" అన్నా. "ఆ అమ్మాయి మనస్సులో ఎంత విచారంవున్నా, సంతోషం వెలిబుచ్చుతూ పాడుతూంది. నిజమైన కళ కళకోసమే!" అన్నాడు శాస్త్రి. "కళకళకోసమే ఏమిటి? అన్నం అన్నంకోసమే- ఆవకాయ ఆవకాయకోసమే అన్నట్టుంది. కళ మన అందరికోసం - ప్రపంచంకోసం. ప్రజాకోటిని ఉత్తేజపరచడానికోసం. ప్రపంచరథాన్ని ముందుకు నెట్టడానికోసం!" అన్నా. "అదేమిటట్లాఅంటావు? కళ ఉత్తమమైనది అది పరిపక్వ వస్తువు నియోగార్థంకాదు అన్నాడు శాస్త్రి. "ఏం? అలాగైతే కళ మైలబడిపోతుందా"? అన్నా. "నీ వెటకారం వెనకపెట్టు. కళఅన్నింటి కంటె అతీతమైంది. కళావేత్త ప్రత్యేకవ్యక్తి. సామాన్యనీతులు, కట్టుబాట్లు అతనికి వర్తించవు. అతనికి ప్రపంచంతో సంబంధంలేదు. కవిగంతు అతనికి తోచినట్టు రాసి పారెయ్యడమే. నీకు నచ్చిందా పాడుకొని సంతోషించు. లేదా - నీ ఖర్మం. అంతేనే కాని కవిని అతని కళని ఈ పాడుప్రపంచంయొక్క కొలతబద్దలతో కొలవకు" అన్నాడు. "అయితే యీ ప్రపంచంవదిలేసి సప్తసముద్రాలూదాటి అక్కడవొంటి స్తంభం దంతపుమేడ కట్టించుకుని వుండమను. ఈ సంగతి బోధచెయ్యి-మన ఈనాటి కవులకి. నీకు చాల కృతజ్ఞులవుతారు. ఇలాంటి పాడు పందొమ్మిదో శతాబ్దపు నీతులు వినే పెళ్ళాంమొగుళ్ళే వుస్తైంరహో అమ్ముకుని వాళ్ళకి యిప్పుడు చిప్పచేతికొచ్చింది"

అన్నా. "అవుతే నువ్వనేదేమిటి? ప్రపంచకం మెచ్చుకోనేలా వ్రాయాలంటావా? అయితే కళ యింక సంకరమైపోతుంది" అన్నాను. "ఇప్పుడు మహా అయిపోయేదా ఏడిశిందా ఎమిటి? కవులందరూ టెక్స్టుబుక్కు కమిటీవాళ్ళ చెప్పుచేతల్లో వున్నారు, చిత్రకారులందరూ సేట్‌జీల బొమ్మలు రాస్తున్నారు. సంగీతవిద్వాంసులు గ్రామఫోను కంపెనీల గులాములైపోయారు. సినీమానటులు చెట్టియార్లకి అమ్ముడుపోయారు. ఈ వేళ కళస్థితి యిది ఇహ ఆ కాస్తకూడా లేకుండా చేస్తావు కళ కళకోసమే అంటే" అన్నా. "నేనన్నదీ-కవి కాని, గాయకుడు కాని, చిత్రకారుడుకాని ఒక ఉద్దేశంకోసం కళని అవలంబిస్తే అది సరైన కళ కాదని" అన్నాడు శాస్త్రి. "ఒక ఉద్దేశం అంటూ లేకపోతే అతని నవ్వులు అతని ఏడ్పులు వినేవరకు నాకేంపట్టింది? ఉద్దేశం, లక్ష్యం వుండాలి. కవి ముందుకు సాగిపోతూవుండాలి. ఆదర్శవంతుడుగా వుండాలి తన సమాజానికి పురోగామిగా వుండాలి. దీనులకి, ఆర్తులకి, కష్టజీవులకి, బానిసప్రజలకు, బతుకుమీద ఆశ కల్పించి జీవితానికి ఒక అర్థం నిర్ణయించి వాళ్ళని స్వేచ్ఛాసమరంలో పరాక్రమవంతులనుగా చెయ్యాలి వాళ్ళ జీవితాన్ని సుఖవంతంగానూ, ఫలవంతంగానూ, జయప్రదంగానూ మార్చాలి. సంఘంలో కళోపాసకుడికి, కళావేత్తకి ఉత్తమస్థానం వుంది సంఘంలో తానుకూడా ఒక పౌరుడననుకుని తన విధిని నెరవేరుస్తే - సంఘం గౌరవిస్తుంది. తిండి, బట్ట, యిచ్చి బహూకరిస్తుంది లేదు నేనుకొండమీదకోతిలా కూచుంటాను. నా యిష్టంవచ్చింది నేను రాస్తాను. నా యిష్టంవచ్చినప్పుడు నేను రాస్తాను. నన్ను ముట్టుకోకు నామాలకాకి అంటే - సరే నీతిండీ బట్టా నువ్వే తెచ్చుకో అబ్బాయీ! అంటుంది సమాజం" అన్నా.

"కళని ధర్మార్థ కామసాధనాలకి వినియోగించడమే మన హిందూ సాంప్రదాయం. త్యాగరాజు ఏమన్నాడో చూడు... సంగీతశాస్త్రజ్ఞానము సారూప్యసౌఖ్యదమే మనసా...నియమనిష్ఠ యశోధనము కల్గునే నేర్పుగల్గు త్యాగరాజు నేర్చిన సంగీతశాస్త్రజ్ఞానము" అని కృతిపాడేను.

"కృతి పూర్తి అయిందా?" అన్నాను. "ఏమిటూ తొందర?" అన్నా. "ఏమీ లేదూ - దేశకాచారి 'ట్రాన్సుఫర్ ఆఫ్ ప్రాపర్టీ' కొత్తకూర్పు ఇప్పుడే వచ్చింది. అందులో డొమెస్టిక్ ట్రాన్స్ఫరు గురించి ఏమి వ్రాశాడో చూద్దాం అని" అన్నాడు.

"మీ లాయర్లకెప్పుడూ ఇదే ఘోషకదా." ప్రపంచకం అంతా మీకోసమే వుందనుకుంటారు!" అన్నా.

# 56

## అతడు

దాంకుపోయేవాళ్ళందరినీ ఇంట్లో తెచ్చిపెడుతుంది మనకెందుకు ఒకరిగొడవ అంటే వినదు. మహా చెడ్డ అల్లరి వచ్చిపడింది! నేను సాయంత్రం ఇంటికొచ్చేసరికి ఎవరో కొత్తముఖం కనిపించింది. ఓహో వెంకట్రామయ్యగారి అమ్మాయి కాబోలును - అసలు ఇక్కడవున్న పెద్దకుటుంబాలే నాలుగో ఐదోనూ. తెలుగువాళ్ళవి - మనవాళ్లందరితోను స్నేహంగా వుండడం చాలామంచిది అనుకుని సంతోషిస్తే - తుమ్మలపల్లివాళ్ళమ్మాయి కాదంటూ ఆపిల్ల వృత్తాంతం చెప్పుకొచ్చింది. ఎవరో ఎవరిపిల్లనో తీసికొని పోతూంటే మనం మధ్యవర్తిత్వం చేస్తే మనకి చుట్టుకుంటుంది. "శరణుజొచ్చినవాని మదిలోన కరుణ నెరపక బ్రోచుట మంచి నియమంబు సుమ్మ"అని రెండోక్లాసు నీతి పద్యాలు నా మొఖంమీద ఏకరువుపెడితే నేనేం చెప్పేదీ?

అయినా ఆపిల్ల పెద్దపిల్లామె. మైనారిటీ తీరిపోయినట్టుంది. ఆ అమ్మాయి ఇష్టం వుండే మా దగ్గిరకొచ్చిందంటారు రేపు. "ఈ బానిస వ్యాపారం చూస్తూ చూస్తూ ఎల్లా ఒప్పుకుంటామోయ్, శాస్త్రీ?"అని అంది. చూస్తూ ఊరుకోలేకపోతే కళ్ళు మూసుకునేది - ఏం చేస్తాం? లోకం మరమత్తా మన ఉద్యోగం? యీపిల్లకి చెప్పి మనదగ్గిరకి పంపించి - రేపొద్దున్న మనమీద అక్రమంగా యీపిల్లని ఇంట్లో నిర్బంధించి మోసగించి, మభ్యపరచి, అబద్ధాలాడి, వాళ్ళింట్లో బలవంతంగా పెట్టుకున్నారనీ, ఆ తల్లితండ్రులు, ఆ మళయాళంవాళ్ళూ మనమీద దావాతెస్తే మనం కాస్త ఇందులో ఇరుక్కుంటే చస్తాం.

"అమ్మాయిని పడుపు వృత్తిలోకి దింపడానికేనోయి — ఆ మళయాళంవాళ్లు వేసిన ఎత్తు. అలాంటి అమాయక పసిపిల్లలిని రక్షించడం మన విధికాదోయి?" అంది కాంతం. మనకేమిటి సాక్ష్యముంటంటూ? నీకంత అనుమానం వుంటే పోలీసువాళ్ల కప్ప చెప్పు పిల్లని" అన్నా. "సారి! ఏడ్చినట్టే వుంది. ఆఅమ్మాయిని పోలీసుస్టేషనులో వదలి పెడితే-కంచే చేన్ని మేస్తుంది." అంది. "ఏంచేయమంటావు. మేస్ట్రీటు దగ్గరకెళ్ళి ఫిర్యాదు చేసుకో అంతవరకే మన విధి" అన్నా. దాంతో కోపం పట్టలేక "నీవిధిఅంతే అయితే నావిధి ఇంతే!" అని దగ్గిర సంజీవరావు డెసిన్నియల్ డైజెస్టుంటే ఆపుస్తకం నామీద గిరవాటేసింది. చప్పున బుర్రతిప్పుకున్నా కాని లేకపోతే నాకు శిరచ్ఛేదమేఅయిపోను! అవునూ-పడుపువృత్తికోసమే ఆ అమ్మాయిని తీసుకొచ్చారూ-దానికి నిదర్శనమేమంటా? పిల్లని డబ్బిచ్చికొనడం పద్ధతిలో చెల్లదూ. అయితే కొన్నవాళ్లకి అమ్మిన వాళ్లకీ సలహా చెప్పడానికి వకీళ్లు లేరా? అమ్మో! వాళ్లకి సలహా చెప్పేవాళ్లు ప్రివీ కౌన్సిల్లో వాదించే లాయిర్లే-అంతకీ తక్కువ వాళ్లుకారు. అసలు యిలాంటి

వ్యాపారంలో ఎంతోమంది వాటాదార్లుంటారు- అయిళ్లు అద్దెలకిచ్చేవాళ్లు—ఆవ్యాపారం కప్పి పుచ్చడానికి పరో చాటు వ్యాపారం నడిపించేవాళ్లు ఆ వ్యాపారంలో భాగస్తులు, అందుకు సంబంధించిన సారాయికొట్లు, రెస్టారెంట్లు, వైనుషాపులు, బ్యూటీ పార్లర్లు సోడా షాపులు, కాఫీక్లబ్బులూ- అబ్బో ఈకూపీ బైటకి లాగితే మహామహులు, హేమా హేమీలెందరి పేర్లో వీధిలోకొస్తాయి—లంపటా ఎంతో వుంటుంది. కదిపితే కుళ్లు. అంచేత ధీమంతుల లక్షణం గప్ చుప్‌గా వూరుకోవడమే ఆమాట చెపితే శాంతానికి అర్థం కాదు. అన్నీ చెప్పేను- ఇంకా మరో మాటకూడా-అన్నా: "ఎదిగిన పిల్ల, పరాయిది మనం ఇంట్లో పెట్టుకున్నాం అంటే—నాకు అపఖ్యాతి" దాంతో తారాజువ్వలామీదపడింది. "ఎంతసేపు నీఖ్యాతి-నీగొప్ప-నీమర్యాదా-నీస్వార్థం-చూసుకోవడమేనా? ఒకరికి ఉపకారం చేసాం- సాయం చేద్దాం- అని అక్కరలేదూ? ఈ పిల్ల నాయింటికొచ్చింది. నా శరణు అడిగింది. ఈ పిల్ల యిక్కడే వుంటుంది. బోధపడిందా? ఇక ఈ ప్రస్తావన ఇందులో ఆపు!" అంది కాలు కిందకొడుతూను

ఇంక చేసేదేవుంది? "సరే! నేను మాత్రం వొద్దనలేదే. తప్పకుండా మన ఇంట్లోనే వుండనీ. మన పాపాయిని ఎత్తుకోడానికీ నీకు ఇంట్లో సాయంగానూ కూడా వుంటుంది. మరో మనిషిని మనం ఎలాగ పెట్టుకోవాలనుకుంటున్నాం. జీతం కలిసొస్తుంది కూడాను. అన్నట్టు ఓకంటితో కనిపెడుతూండే- ఆపిల్ల నైజం సరిగా తెలిసేంత వరకూనూ!" అన్నా-ఎందుకేనా మంచిదని. దీర్ఘంగా ఆలోచిస్తే ఇదీ బాగానేవుంది. ఏది జరిగినా మనలాభంకోసం ఉపయోగించుకోవాలి. అదే గడుసుతనం ఈవారంలో ప్రెసిడెన్సీ కాలేజీ హిస్టరీ ఎసోషియేషనులో ఉపన్యాసం ఒకటుంది — వై. యమ్. సి. యే.లో వకటుంది. ఆరెండు ఉపన్యాసాల్లో సమయోచితంగా యీ నైజాం పిల్లకి నేను శరణ్యంయిచ్చినట్టూ యిరికించాలి. రేపు ప్రొద్దున్న పత్రికల్లో పడుతుంది. నా పేరూ పలుకుబడీ తెలుస్తుంది. కీడెంచి మేలెంచమన్నాడు రేప్పొద్దున్న ఏదేనా తగాయిదా వొచ్చినా—ఈ ఉపన్యాసాల్లో బహిరంగంగా చెప్పేసిన సంగతి బాగా పనికొస్తుంది.

చాలారోజులై శాంతా పాడ్డమే లేదు. అటువంటిది ఇందాకానే త్యాగరాజు కీర్తన వకటి పాడింది. హాయిగా వుండేను. కాని పాటముందు "కళకళకోసం కాదు. కళకొక ఆదర్శం వుండాలి"అంటూ కొత్తసిద్ధాంతం వకటి తీసుకొచ్చి నన్నొప్పుకోమంటుంది. వాల్టరుపేటరు, రస్కిను, విలియమ్‌మారిస్, ఆస్కారువైల్డు, వర్ణించేవాడిని. "కళ కళకోసం కాద"ంటే నేనెలా వొప్పుకోనేది? కవిని, చిత్రకారుడిని, గాయకుడిని వాళ్ళమటుకు వాళ్ళని వదిలేయాలి కళ పూనినప్పుడు రాస్తారు లేకపోతే లేదు. అంతే కాని వాడి అంతరంగిక జీవితంతో సామాన్యులకేం నిమిత్తం వుంది? డిక్వెన్సీలా నల్లమందు, భంగూ, మాదుం వేసుకుంటే వేసుకుంటాడు - టాగూరులా పాదాలవరకూ పట్టు అంగరఖా వేసుకుంటే వేసుకోగాక - అరవిందుడిలాగు గెడ్డాలు, జడలు పెంచు

కుంటే పెంచుకోనీ - ఆస్కారువైల్డులాగ రంగేలా కానీ - బైరన్‌లాగు గాలిగుడ్డు తిరుగుళ్లు తిరుగుతే తిరగనీ - అదంతా మనకెందుకూ? సామాన్యులకి వర్తించే కట్టు బాట్లు, నీతులు సాంప్రదాయాలూ అతనికి వర్తించవు. వీటన్నింటికీ కవి, కళావేత్త అతీతులు. ఇష్టం వొచ్చినప్పుడు రాస్తాడు, కష్టం వచ్చినప్పుడు మానేస్తాడు, అసలు రాయేరాయడూ. వాళ్ళకల్లా స్వేచ్ఛ ఇచ్చి వదిలేస్తేనే - అసలు కళ పుడుతుంది. అంతే కాని "ఏకాంతం" గురించి వ్రాయకు, "కన్నీటిశోకం" గురించి వ్రాయకు, "నెల యేరు" గురించి వ్రాయకు, "ఎడబాటు" గురించి వ్రాయకు- అంటే ఎలా చావడం? "కోయన్నృత్యం" "దేశదాస్యం," "ఇంజను గర్జన," "డైనమో సంగీతం" "రాట్నం రాగం" "కరువు పిశాచం" "తోళ్ళ కంపు" - వీట్ల గురించి వ్రాసిందే అసలైనకళ అంటే ఎలా చస్తాం? ఇంక డబ్బున్నవాళ్ళకి కళ అమ్ముడుపోవడమే! సరే - శ్రీనాధుడా, పోతనా, మనకి ఆదర్శం?

అయితే వస్తుంది - ఈ కాలపు కవి అన్నవాడికల్లా తన పద్యాలు అచ్చువేయించాలని వుంటుంది. గాయకుడికి గానసభలు, కాలక్షేపాలు పెట్టించి పేరు పూరు సంపాదించాలని వుంటుంది. చిత్రకారుడికి ప్రదర్శనాలు పెట్టించి బొమ్మలమ్ముకోవాలని వుంటుంది. నటుడికి నాటకాలు వేయిస్తే అందులో నటించాలని వుంటుంది ఈపనులు అన్నీ చేయించటం అంటే డబ్బుతో పనాయె? ఈ డబ్బు ఎవరు ఖర్చుచేస్తారు? ఇంత సొమ్ము ఎవరు మదుపు పెడతాడు? పెడితేమాత్రం - లాభం పొందుకావదాయె; కవికీ, గాయకుడికీ; చిత్రకారుడికీ నటీనటులకీ - దుప్పే! ఈ సమస్య ఎవడు పూర్తిచెయ్య గలడు? అయినా, నాకెందుకీ చిత్తక్షోభ! నేనేం పద్యాలు పాడాలా, బొమ్మలు వ్రాయాలా?

## 57

## ఆమె

దేశంలో ఉత్సాహం పొంగిపోతూంది! ఉప్పుసత్యాగ్రహం రోజుల ఉత్సాహానికంటే మరింత ఉజ్వలంగావుంది! గాంధీగారిని అరెస్టుచేసి రెండు నెలలైయింది. వేలాది ప్రజ ఆవేశంమీద జైళ్ళకి వెళుతున్నారు. ఇప్పటివరకు ఉత్సాహం తప్ప మరొకటిలేదు ప్రజల్లో. ఈ ఉత్సాహం ఎన్నాళ్ళుంటుంది? ఈ జైళ్ళకు వెళ్ళడం ఎన్నాళ్ళు సాగుతుంది? జైళ్ళు నిండినంతమాత్రాన బ్రిటీషువాళ్ళు మనకి లొంగిపోయి స్వరాజ్యం ఇచ్చేస్తారా? వీళ్ళని జయించి స్వాతంత్రం సంపాదించడం యింత సులువైనపని అవుతే మహాత్ముడి

వంటి రాజకీయవేత్త ప్రపంచంలో యిదివరకు పుట్టలేదు - యికమీదట పుట్టబోడు. సంవత్సరంలో స్వరాజ్యం వస్తుందన్నాడు. ఇంతవరకూ బ్రిటిషువాడు దిగివచ్చే సూచనలు ఏమీ కన్పించడంలేదే. ఖద్దరువ్యాపకం బాగావుంది. చాలామంది కడుతున్నారు. ఖద్దరుదీక్ష పుచ్చుకున్నవాళ్ళల్లో నేనొకర్తిని. ఆవేళనుంచి ఈవేళవరకు మిల్లుబట్ట అన్నది ముట్టుకోవడంలేదు. ఆరునెలలై నియమంగా రాట్నంకూడా వడుకుతున్నాను. కాని స్వరాజ్యం సూచనలు కనిపించడంలేదు. ఉప్పు వండినంత మాత్రం బ్రిటీషువాడు భయపడి వెళిపోతాడా అని ప్రపంచకం అందరూ నవ్వుతున్నారు మనవాళ్లే హాస్యం చేస్తున్నారు మితవాదులకి సత్యాగ్రహం అంటే కిట్టదు. కడుపులో చల్ల కదలకుండా స్వరాజ్యం రావాలంటారు. అసలు వాళ్ళకి స్వరాజ్యం అంటే భయం. వాళ్ళకంటే వకాకు హెచ్చు చదువుకున్నారు- మన పత్రిక శిఖామణులు, పెట్టుబడిదార్లున్నూ. డొమినియను ప్రతిపత్తికంటే హెచ్చు మనకెందుకంటున్నారు. మహమ్మదీయులు అసలు కలిసి రావడంలేదు సరేగదా, బ్రిటీషువాళ్ళతోనే చేతులు కలుపుతున్నారేమో అనిపిస్తూంది. బ్రాహ్మణ బ్రాహ్మణేతర ఉద్యమం వకటి లేవనెత్తేరు. పంచముల్లో కూడా చీలికలు తెస్తున్నారు దేశం అంతా ముప్పైమూండు కోట్లమందీ ఏకంకాకుండానే యీ సత్యాగ్రహం మొదలుపెట్టేను గాంధీగారు. కొసకి యిదెట్లా పరిణమిస్తుందో? స్వరాజ్యం వొస్తుందని నాకు తోచడంలేదు. మన కష్టాలు మరింత హెచ్చవుతాయేమో అనిపిస్తూంది.

ఖద్దరు కట్టడం, నూలు వడకడం తప్ప మరి రాజకీయాల్లో నేనేమీ కలుగజేసుకోవడం లేదు. అప్పుడుమాత్రం ఉప్పుపొట్లం కొన్నాను. అది శాస్త్రికి యిష్టం లేకపోయింది. లక్షలాదిప్రజ వెళుతున్నారే జైళ్ళకి నేనెందుకు వెళ్ళకూడదు అనిపిస్తూంది. అయితే నాలో నేనేనానిజం చెప్పుకోవద్దా? జైలంటే విపరీతభయం నాకు. చీమ కుట్టితే భరించలేను. వేళకి కాఫీలేకపోతే తలనొప్పొస్తుంది. ఎండలో రెండు నిమిషాలు నడుస్తే ముఖం కందిపోయి తలపోటొస్తుంది నేనేం వెళ్ళగలను? అందులో చంటిపిల్ల వకర్తి. లక్ష్మిని వదిలి వక్క నిముషమేనా నేను వుండలేను. యెంతమంది తల్లులు పసిబిడ్డలని వదిలివేసి జైళ్ళకు పోవడంలేదు? పిల్లలతల్లిని నేనొక్కర్తినేనా? నా కెందుకింత పిరికితనం? ఇంటిమీద వ్యామోహమేనా కారణం? నేనువలచి-కోరి-చేసుకున్న నే-శాస్త్రిని ఎల్లా విడిచిపెట్టి వెళ్ళగలను? నాకేమేనా అయితే శాస్త్రి ఒక్కడూ యీ ప్రపంచంలో నెగ్గుకురాగలడా? నేనుంటేనే కాని వక్క నిముషమేనా అన్నానికి నడవడే? కాఫీలో వక్కరవ్వ పంచదార ఎక్కువ తక్కువైనా త్రాగలేడే. పెరుగుపచ్చడిలో వక్క నీటిచుక్క కలిస్తే రాచ్చిప్పపాళంగానే గిరవాటు వేస్తాడే - పోపులో మిరపబద్ద మాడిందంటే పీటమీదనుంచి లేచిపోతాడే. ఇతను ప్రపంచంలో ఎలా నెగ్గుకొస్తాడు నేను లేకపోతే?

స్వార్థం హెచ్చయిపోతూంది నాకు. ఇంత పిరికిదాన్నేమి? నేను లేకపోతే ప్రపంచం ఆగిపోతుందా? ఎవరిదారినివారు పోతారు శాస్త్రి ఏదో చూసుకుంటాడు.

నాలుగురోజులు నాకోసం ఏడుస్తాడు. అక్కడనుంచి మామూలే అయిపోతుంది. పాపాయీ అంతే. చిన్నతనం. అసలు ఏడుపే చేతకాదు. ఎంతసేపు ఆటతోనే సరి పోతుంది - ఎన్ననుకున్నా భయం పోకుండావుంది...

శాస్త్రి పత్రికలు చదవడమే మానేశాడు. మీదమిక్కిలి నేను చదువుతూంటే వెటకారం కూడాను. గాంధిగారిని నానాతిట్లు తిడుతున్నాడు. "మీగాంధీ ఈవేళ ఎన్ని మణుగుల ఉప్పు తయారుచేశాడు? ఎన్ని లక్షలు జేబులో వేసుకున్నాడు?" అంటాడు. ఖద్దరు కట్టుకున్నంత మాత్రాన్న "నా" గాంధిగారై పోయినట్టున్నూ, తనది ఈదేశం కానట్టున్నూ ఎందుకేనా మంచిదని రెండు ఖద్దరులాల్చీలు నేను తీసిన ధారంతో నేయించింది కుట్టించుకున్నాడు. ఇలాంటి వాళ్ళని యేమిటనడం? మళ్ళీ మంచివాడూ- నేనంటే ఇంతా అంతా ప్రేమకాదు - నాకోసం ఎంత డబ్బైనా ఖర్చుపెడతాడు. కాని స్వార్థం, అంతా స్వార్థం.

తాజా: పదిరోజులై యీ పుస్తకం మాటే మర్చిపోయాను! సత్యాగ్రహోద్యమం అన్ని అడ్డంకులూ దాటి ముందుకు సాగిపోతుంది. కోటానుకోట్లు శ్రీకృష్ణ జన్మస్థానానికి యాత్ర వెళుతున్నారు. జైళ్లు, బందిఖానాలు, పోలీసులు, తెల్లవాళ్ళు అంటే పల్లెటూరి పాటకజనానికి సహా భయం పోయింది. నేను జైలుకు నాఅంతట నేను వెళ్ళడానికి సాహసించలేకపోయినా, వాళ్ళంతటవాళ్లు పోలీసులువచ్చి "రా! రమ్మ"న్నంటే సిద్ధంగా వున్నాను. రోజూ ప్రొద్దున్న పదిగంటలనుంచి మధ్యాహ్నం నాలుగింటివరకు జార్జిటవును సత్యాగ్రహ శిబిరంలో వాలంటీరుగా పనిచేస్తున్నాను వారం రోజులై. సత్యాగ్రహులకి భోజనసదుపాయాలు చెయ్యటం, ఊరేగింపులకి పంపించుతూండడం, డబ్బు దసకం, లెక్కడొక్క వ్రాసి రహస్యంగా ఉంచడం, ఈపని చేస్తూన్నాను. ఉడతాభక్తి అనుకుంటున్నాను. నాతోకూడా, నా పాతస్నేహితులు తార, జయంతశ్రీ, దమయంతి, రుద్రమదేవి పనిచేస్తూన్నారు. వాళ్ళ మగవాళ్ళకి శాస్త్రిలాగే ఉద్యమం అంటే కిట్టదు. శాస్త్రికింకవరకూ నేనిక్కడ పనిచేస్తున్నానని బాగా తెలీదు. ఏదో చూచాయగా ఎక్కడో కోర్టులో ఎవరిదగ్గరో విన్నట్టుమాత్రం వుంది నన్ను అడగాలేదు. నేను చెప్పాలేదు. శని ఆదివారాలుమాత్రం అతను ఇంట్లో వుంటాడని నేనూ శిబిరానికి వెళ్ళడంలేదు

ఈ ఉద్యమం ఉద్రేకంలో ఇంటిమాట మర్చిపోతున్నాను. పాపం - సుభవుండబట్టి - ఆ అమ్మాయే అంతా చూసుకుంటూంది!

# 58

## అ త డు

వారంరోజులై "డైరీ" ముట్టుకోలేదు. ఏం వ్రాయను? దేశంలో దావానలం దహించుకు పోతూంటే - కోర్టులూ, వకాల్తీలూ ఏంచస్తాయి? పద్ధతంటేనూ, "లా" అంటేనూ గౌరవంపోయాక ఇంక అరాజకమేగా! దేశం వొదిలివెళిపోవా లనిపిస్తూంటే! గొల్లలపాలెం జమీందారు ఖబురుచేశాడు సలహాకోసం. రైతులేమో మేటేసిన లంకల్లో చేపలపంట మాదీ అని అల్లరి చేస్తూన్నారుట. దావా దాఖలుచెయ్యడమా అని సలహాకి రాజమండ్రి రమ్మనమని టెలిగ్రాం వేశాను. వెళ్ళి నాల్గురోజులు అక్కడున్నా. వ్యాజ్యంవెయ్యమనే సలహాయిచ్చా. హక్కు నిలబెట్టుకోవడం ప్రధానం. లేకపోతే మేటవేసిన లంకలు మావి అంటారు. రాజమండ్రిలో అల్లరే. అయినే- ప్లీడర్లందరూ మాత్రం నిశ్చలం! ఒక్కడూ ప్రాక్టీసు మానలేదు. వృత్తిధర్మం బాగా నిలబెడుతున్నారు. రాజమండ్రినుంచి వచ్చినతరువాత హైకోర్టులో వరదన్ కనిపించి "శాస్త్రీ! జయంతినరసింకేసు గెల్చినందుకు అభివందనాలోయ్!" అంటూ - "ఏమిటి మీ ఆవిడ మా ఆవిడ కూడా గాంధీమతం పుచ్చుకున్నారటగా! రోజూ శిబిరానికి వెళుతున్నారుట. నీకూ తెలుసునా?" అన్నాడు. నేను తెల్లబోయాను. అయినా మనకి తెలియదంటే ఇంట్లో పెత్తనం మనదికాదనుకుంటాడని, చప్పున: "అసలు నేనే వెళ్ళమన్నది మనం ఇటూ అటూ వుండడం మంచిది. ఏమంటావు?" అన్నా. "నా అభిప్రాయం అంతే. శిబిరానికి వెళుతూవస్తూన్నందుకు మార్గంలో ఏం ప్రమాదం లేదనుకో. హాస్యం చేస్తాను విను. మా మేనత్త అల్లుడు శివరాజు సి. ఐ. డి. లో ఎసిస్టెంటు కమీషనరు. వాడు చెప్పేడు - నీకేంభయం లేదురా, వరదా, ఆ శిబిరం "రెయిడు" చెయ్యడానికి నేనే ఆజ్ఞయివ్వాలి- ఇరవైనాలుగు గంటల ముందుగా నేను నీకు హుషారిస్తాను - అప్పుడు మాత్రం జయంతి అక్కడలేకుండా చెయ్యి - అన్నాడు నీకుకూడా ఖబురుచేస్తాలే. అయినా యింకా ఇరవైరోజులవరకూ ఫరవాలేదులే అన్నాడు మావాడు". "షెబాష్ వరదన్! వందనాలు" అన్నా. శాంతంతో నాకు తెలియనట్టే నటించాలి. లేకపోతే బిగుస్తుంది. శివరాజు కన్నుగీటేటప్పటికల్లా ఏదో మిషమీద పాండుచేరికో, బెంగుళూరో కొట్టేయొచ్చు కారుమీద ఆనాటికి. వరదన్‌ని కన్నిమేరాకి లంచికి తీసుకుపోయాను. శాంతానికి యిష్టంఅని చాకలేటు కేకు, గులాబీపువ్వులూ పట్టికెళ్ళేను.

శాంతం అప్పుడే ఇంటికొచ్చినట్టుంది. మొఖం కందగడ్డలా వుంది. రెండు కాళ్లన్నా అవి ఎక్కడుండా ట్రాంమీదే వెడుతూంది. కసిపెట్టానుకమా. పాపం అలసిపోయింది. జాలేసింది ఏమంటే ఏ పేచీ వొచ్చి జైలు కెళిపోతానంటుందో! వెళితే మరేం ఫరవాలేదు కాని - చేతులోకొస్తూన్న అక్కౌంటెంటుజనరల్ గిరీ గోత ఎగిరిపోతుంది- అని భయం. గులాబీపువ్వులిచ్చా. పువ్వులని ముద్దుపెట్టుకుంది. ఇంట్లో కళి

పోయింది. వసారాలో కూచుని చాకలేటు కేకు ఫలహారం చేస్తూ కాఫీ తాగుతున్నాం పోస్టువాడొచ్చి ఉత్తరాలిచ్చాడు. శాంతం అందుకుంది.

“విదేశీ ముద్రతో నీకేదో కార్డు, శాస్త్రీ! ఇదెవరోయ్ ఈ లకుముకులు, సీతాదేవిన్నీ ? అంది.

“నాకేం తెలుసు ? కార్డు నువ్వే చదివితే నాకంటేముందు నీకే తెలుస్తుంది” అన్నా. చదివింది. “ప్రేమతో విట్టోరియో (వయస్సు 6); అలాస్సాండ్రో (వయస్సు 4; మరియు హెన్రీయెట్టా, కౌంటెస్సా బార్టలోమియో - పెట్రాచీనీ” అమ్మయ్యో! నానోరు పట్టదోయ్. ఎంత పెద్ద పేరో ? అంది. కాస్సేపుండి: “ఎవరు శాస్త్రీ! ఇంత నాంబడా...?” అంది. “చెప్పమన్నావా ఏమిటి ?” అన్నా. “అవశ్యం! రాజబంధువులని చెప్పుకోనికూడా దాపరికం ఎందుకు?” అంది. “మరికొంచెం కాఫీన్నీ, ఆ ఫోటోల పుస్తకం పట్టుకురా, అన్నా.” రెండూ వచ్చాక, హెన్నీ సల్లివన్ను ఫోటో తీసి చూపించేను. శాంతం ఒక అయిదు నిమిషాలు ఆ బొమ్మ యీ బొమ్మ చూసి “అరే - రెండూ హెన్నీవేనోయ్! ఈ ఇటాలియన్ కౌంటెస్ అవతారం ఎప్పుడెత్తింది - ఎలా ఎత్తింది? ఆ కథ వివరింపుగని.” అంది. “వైశంపాయనుడు జనమేజయుంకిట్లనియె!” అని మొదలెట్టాను.

నా పరీక్షలైపోయాయి, ప్యాసయ్యాను. వెనిస్‌లో స్టీమరు ఎక్కుదాం అని రెండురోజులు ముందుగానే చేరుకున్నాను. సాయంకాలం పడవషికారు వెళ్లేను. పడవషికారు అయిపోవచ్చింది. నా పడవ ముందుగుంచే మరోపడవ వెళ్ళి వొడ్డున ఆగింది. స్వంతపడవలాగుంది. బంగారపునగిషీ అంబారీ - షామియానా, జరీదుస్తులతో బట్రోతులూ - పదిమంది దిగేరు దొరలూ దొరసానులున్నూ. ఒకతను నలభైఏళ్ళవాడు మిలిటరీదుస్తుల్లో వున్నాడు. జరీభుజకీర్తులు. ఛాతిమీద “మెడల్సు” నడుమున కత్తి. అతనే యజమానిలాగున్నాడు. అతని భార్యో కాబోసును-ఒకావిడ ముప్పైయేళ్లుంటాయి. అసలు ప్యారిస్ “గౌను” మెడలో ముత్యాలహారం నా పడవవాడిని అడిగేను- ఎవరు వాళ్ళని. “జనరల్ కౌంటు బార్టలోమియో పెట్రాచీనీ-ఆయనభార్య కౌంటెస్సునూ అండీ” అన్నాడు. ఎవరో కళ్ళున్నలు మనకెందుకు అనుకుని, నేనూ నాపడవదిగి వాళ్ళప్రక్కనుంచే వెళ్ళిపోయాను.

నాలుగడుగులు వెళ్ళేను, “శాస్త్రీ! శాస్త్రీ!” అని ఎవరో పిలుస్తున్నట్టు వినిపించింది. ఇక్కడ మనని పలుకరించేవాళ్లెవరుంటారని అనుకుని, వెనక్కి తిరిగి చూశా. కౌంటెస్సు చరచరన నావేపుకొచ్చి “అప్పుడే హెన్నీ సల్లివన్ని మర్చిపోయావుటోయి శాస్త్రీ?” అంది ఇంగ్లీషున. “క్షమించు, హెన్నీ! ఐదేళ్ళయింతరవాత నిన్నిక్కడ కలుసుకుంటానని ఎల్లా అనుకోను? అంతేకాని నిన్నెలా మర్చిపోతాను?” అన్నా. తన పెనిమిటితో నన్ను పరిచయం చేసింది. “నాముఖ్యస్నేహితుడు నాకు మహోపకారం చేసినవాడు” అని. నాకేం బోధపడలేదు. సరే తరవాత అడుగుదాం

అనుకున్నా "మాతో ఈసాయంత్రంగా వొచ్చేసి, రాత్రి మాతో భోంచేసి, మా ఇంట్లో వుండిపోవాలిసుమా" అంది. రేపు మధ్యాహ్నం స్టీమరులో నేను వెళ్ళిపోతున్నాను. నేనెలా రాగలను? క్షమించు హెన్నీ" అన్నా. "క్షమించు, గిమించు, నైజాంతా. నిన్ను అమాంతంగా తీసుకెళ్ళిపోతున్నా!" అంది. అందరం కలిసి వాళ్ళమోటారులో వాళ్ళ భవనానికి వెళ్ళేం. నా గౌరవార్థం పదిహేనుమందిని విందుకు పిలిచింది. హేమాహేమీలందరూ, అతిరథులూ, మహారథులున్నూ. హడావుడిచేసేసింది. ఇంకేక చెప్పేదేమిటి? నేను శాకాహారిని అన్నమాట జ్ఞాపకముంచుకుని, పంటకాలు చేయించింది. విందయాక- నన్ను తనగదిలోకి తీసుకెళ్ళింది. సోఫామీద కూర్చోబెట్టుకుంది తనకథ చెప్పింది.

"ఆవేళ రాత్రి నువ్వు ఎంతచెప్పినా లేవలేదు. మొదట నిద్రపోతున్నావనుకున్నాను. తరువాత తెలిసింది. "ఛీ నువ్వొక చవటవి నేనొక అపసంతిని!" అని నన్ను నేను తిట్టుకున్నాను. నా పడకదగ్గిరకి వెళిపోయి నా వస్తువులు మూటకట్టుకొని బుజాన్నేసుకుని ఆ చీకటిలోనే యకాయకిని ఆ పదిమైళ్ళు నడచి తెల్లారగట్టూం మూడుగంటల ఎక్స్ప్రెసు ట్రైనోదగ్గిర ఎక్కి లండను పదిగంటలకి చేసుకున్నా. నామీద నాకే కోపం వచ్చింది "ఛీ! ఎంతపని అయింది?" అని అనుకున్నాను. ఆవేళే సాయంత్రం ప్యారిస్ వెళిపోయాను. అప్పటికి కాని నాకు నీమీద కోపంపోలేదు. ప్యారిస్లో ఉద్యోగంకోసం తిరుగుతూంటే రెండోరోజున అకస్మాత్తుగా ఒక రెస్టారెంటులో మేజరు బార్టలోమివో పెర్రాచీనీ కనిపించాడు. వెనక 1916లో కేపరేట్టో యుద్ధంలో అతనికి ప్రమాదమయిన దెబ్బ తగిలింది మెషీను గన్ను గుండు తగిలి. నేను యుద్ధరంగంలో ఆస్పత్రిలో పనిచేస్తున్నాను. నేనప్పుడు పెర్రాచీనీకి ఉపచారం చేశాను. బాగై పోయాడు. అప్పుడు నన్ను పెళ్ళిచేసుకోమని అడిగేడు. నేను ఒప్పుకోలేదు తరవాత మళ్ళీ ప్యారిస్ రెస్టారెంటులో కలుసుకోవడమే. ఇకేముంది. బార్టలోమివో నేనూ పెళ్ళిచేసుకున్నాం. ఇప్పుడిక్కడుంటున్నాం. ఆరాత్రి నువ్వు నన్ను తిరస్కరించడమే నాకు మహోపకారం చేశావు. అంతే బూర్లెగంపలో పడ్డాను! బార్టలోమివో నన్ను దేవతలా చూసుకుంటాడు. భూమిమీద పడనివ్వడు. పువ్వుల్లోపెట్టి పూజిస్తున్నాడు. అతనంటే నాకూ ప్రేమే.- ఏమైతేనేమి? ఆరాత్రి మాత్రం! నువ్వు ఒక చవటవి. నేనొక అపసంతిని!" అని నవ్వుతూ ఒక ముద్దు పెట్టుకుంది. మర్నాడు నేను స్టీమరెక్కి స్వదేశం బయలుదేరేను. ఇదీ హెన్నీతో నాస్నేహం కథ-అన్నా.

"అయితే ఆ రాత్రి వుత్తిత్తే - శాస్త్రీ? నీయిల్లు బంగారంగానూ! హెన్నీ అన్నమాట అక్షరాల నిజమే!" అని - ఐదునిమిషాలైన తరువాత నన్ను కౌగిలించుకుని, నా తలంతా రేపేసింది కడుపుపట్టుకుని అదే నవ్వుతూనూ.

## 59

### ఆమె

గురువారం: ప్రొద్దున్న పదకొండుగంటలు; ఈవేళ ఎంచేతో ఏమీ తోచడం లేదు. మనస్సులో ఏదోలాగావుంది. శాస్త్రి నిన్న వూరికెళ్లేడు. లక్ష్మిని చూసినప్పుడల్లా గుండెలు ఝల్లుమంటున్నాయి. ఏదో ఆపద జరగబోతుందేమో అనిపిస్తూంది. పది రోజులక్రిందట జార్జిటౌన్ శిబిరం పోలీసులు "రెయిడు" చేశారు. అందరినీ అరెస్టు చేసి వెంటనే శిక్షించేసి బళ్లారి తీసుకుపోయారు. రోజూ నేను శిబిరానికి వెళ్ళేదానిని. ఆ ముందురోజు బెంగుళూరు వెళ్ళను అనుకోకుండా. ఆ మర్నాడు వచ్చేద్దాం అనుకుంటే కారుటైరు చెడిపోవడంచేత వేళకి బయల్దేరకపోయాం. మరునాడు చెన్నపట్నం చేరేసరికి శిబిరం అంతా మూసేసి సీళ్లువేసేసి వుంది. నా స్నేహితురాళ్లందరూ ఏదో పనుల్లో వుండిపోయి ఆరోజు శిబిరానికి ఎవ్వరూ వెళ్ళలేదుట. రెండురోజులైౖ మళ్లీ ముత్యాలపేటలో మరొక శిబిరం ఏర్పాటు చేశారు అక్కడికి రోజూ వెళుతున్నాను. అప్పుడే ప్రజల్లో కొంత ఉత్సాహం తగ్గినట్టనిపిస్తూంది నాకు. మునపటిలాగు జనం అంతగా ముందుకు రావడంలేదు. పోలీసులు లాఠీచార్జీలు మొదలుపెట్టారు. వలంటీర్లు రావడం సన్నగిల్లుతోంది. పోలీసుల దెబ్బలకి వాళ్లుకూడా భయపడుతున్నారు. జరిమానాలు వేసి ఇళ్లూ, వాకిళ్ళూ, ఆస్తులూ జప్తులు చేస్తున్నారు. పోలీసుల భీభత్సాలకి జనం అల్లాడిపోతున్నారు. ఇలా హింసాకాండ సాగిస్తే, ఉద్యమం కొంత మందగిస్తుంది. ఆ గాంధీమహాత్ముడు జైల్లోవుండి ఏమనుకుంటున్నాడో? జైళ్ళలో మగ్గుతూన్న వేలాది సత్యాగ్రహులు ఏమని పరితపిస్తున్నారో కదా?... నాకు శిబిరానికి వేళయింది. లక్ష్మిని ఒక్కసారి మళ్ళీ ముద్దుపెట్టుకోవాలని మరీ ఆశగావుంది. సుభతో నేను లేనప్పుడు పాపాయిని జాగ్రత్తగా చూస్తూండే అని చెప్పాను. ఇక వెళ్ళాలి... మళ్లీ మరొకసారి లక్ష్మిని చూచి వెళ్ళిపోతాను.

... ... ... ...

ట్రాము రౌండుతాణా దగ్గర ఆపేశారు. ఇక ముందుకు వెళ్ళనన్నారు. దిగి గవర్నమెంటు హౌస్ వేపు నడిచేము. జనం రోడ్డుకు రెండువైపుల వేలాది గుమిగూడిపోయారు. అక్కడనుంచి ఇంక వెళ్ళడానికి వీలులేకపోయింది. నేను అంజుమాను దగ్గర నిలబడి చూస్తున్నాను. ఠాణా దగ్గిర సాయుధపోలీసులు లాఠీలు ధరించి బారులు తీరి నిలబడ్డారు. వారి వెనుక ఇంకా చాలమంది పోలీసులు నిలబడివున్నారు. ఏమి జరగబోతుందో ఎవ్వరికీ తెలిసేట్టులేదు. కాని ప్రజల్లో అలజడి హెచ్చుగావుంది.

ఇంతట్లో ఎవరో కేకవేశారు —"సత్యాగ్రహులు వస్తున్నారు వస్తున్నారు" అని. పోలీసులు ఆశ్చర్యపడి చూస్తున్నారు అంజుమాను పక్కసందునుండి ఇద్దరు సత్యాగ్రహులు "మహాత్మాగాంధీకిజై!" అని నినాదాలువేస్తూ రోడ్డుపైకి వచ్చారు. జం

అంతా ఒక్క పెట్టున భయంకరమైన పిడుగులాగ ఒక్క గొంతుకతో "మహాత్మాగాంధీకి జై" అని కేకలువేశారు. సత్యాగ్రహులుచేత కాంగ్రెసుజెండాలు, నుదుట కుంకుమతిలకం, మెడలో పుష్పమాలలు. నాలుగు అడుగులు ముందుకుసాగేరు జైజేలు మిన్నుముట్టుతున్నాయి. ప్రజల ఉత్సాహం ఉప్పొంగిపోతూంది పరవశులైపోతున్నారు. ఇంతలో "పోలీసులు! పోలీసులు!" అనికేక. తూర్పునుంచి పోలీసుదళం సత్యాగ్రహులకి ఎదురుగా వస్తూంది. సత్యాగ్రహులు నాలుగు అడుగులు ముందుకునడిచారు. పోలీసులు వీళ్ళని ఎదుర్కోడానికి సాగివస్తున్నారు. ఇరుపక్కలా పిస్తోళ్ళునరించి తెల్లసార్జెంటులుగుర్రములమీద స్వారీచేస్తున్నారు. లాఠీ పోలీసులవెనుక వరుసలుతీర్చి సన్నీలుబిగించి తుపాకులతో సాయుధ పోలీసులు వస్తున్నారు. సత్యాగ్రహులు నేను నిలబడ్డ స్థలందగ్గరకు వచ్చి రోడ్డుమైన కూరుచున్నారు. గాంధీమంత్రం జపిస్తున్నారు. పోలీసులు పది బారల దూరంలో వున్నారు. హాహారావాలుచేస్తూ లాఠీలు తిప్పుతున్నారు. లాఠీలను నేలమీద కొడుతున్నారు. గుర్రాలు కదంతొక్కుతున్నాయి. నోట నురుగులు కక్కుతున్నాయి కాళ్ళనాడములు సూర్యరశ్మికి తళతళ మెరుస్తున్నాయి. సాయుధభటులు సన్నీలతో సాముచేస్తున్నారు. సత్యాగ్రహులకూ పోలీసులకూ ఎంతోదూరములేదు నాలుగైదుబారలే. ప్రజలదృష్టి సత్యాగ్రహులమీదనేవుంది గుర్రాల సకిలింపులు, పోలీసుల పిచ్చికేకలు, సార్జెంటుల అట్టహాసం......నా చెవిలో ఎవరో పిలుస్తున్నారు నా పేరుపెట్టి. నా కాళ్లు వణుకుతున్నాయి, కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి... అదుగో! నా ఎదురుగా నిలబడి భరతమాత నన్ను పిలుస్తూంది..."శాంతం! శాంతం!" అని వేలుపెట్టి సత్యాగ్రహులనే చూపిస్తూంది ఆమూర్తి భరతమాతే! కాదు - కాదు - నా ప్రతిబింబం! మళ్ళీ పిలుస్తూంది. ఈసారి భరతమాతకాదు - నా పాపాయి - లక్ష్మీరూపుధరించింది! నాపాపాయి - నేను - భరతమాత - అందరిదీ వకేరూపు! అందరం భరతమాతలమే! అతల్లి పిలుస్తూంది- తొందరగా రమ్మంటూంది.... "వస్తూన్నా!-వస్తూన్నా!"అని ఆమెతో అన్నాను.... ముఖంతిరిగినట్టయింది...కళ్లువిప్పాను. సత్యాగ్రహులు అక్కడే నిశ్చలంగాకూచున్నారు. గాంధీనామం స్మరిస్తున్నారు...వారివేపు చూశాను: సుబ్బయ్య - రామమూర్తి. కాదు- కాదు. రామలక్ష్మణులు వశిష్ఠులవారిదగ్గిర వేదశ్రవణంచేస్తున్నారు...కృష్ణార్జునులు - కురుక్షేత్రంలో రథంమీద కూచున్నారు.... గౌతమబుద్ధుడు, ఆనందుడు బోధివృక్షంకింద తపస్సు చేస్తున్నారు ... కృష్ణరాయలు, విద్యారణ్యులు హంపీమండపంలో కూచున్నారు.... రాజరాజనరేంద్రుడు, పోతన గోదావరి తీరాన్న పురాణశ్రవణం చేస్తున్నారు ...కాదు కాదు...అక్కన్న మాదన్నలు...శివాజీ శంభాజీలు...గురునానకు గురుగోవిందులు... నానాసాహెబు - తాంతియాతోపేలు... రామకృష్ణులు- వివేకానందులు...తిలక్కు- బిపినచంద్రులు... లజపత్‌రాయి - అజితసింగులు .. గాంధీ - జవహరులు... చిత్తరంజన - సుభాషులు... ప్రకాశం - పట్టాభిలు... అఖండభారతం....

అదిగోపోలీసులు! లాఠీల ఇత్తిడితొడుగులు మెరుస్తూన్నాయి. సన్నీలు తళతళ మంటున్నాయి. గుర్రపులాడాలు కాంతిస్తున్నాయి. ఇదిగోయుద్ధరంగం. కురు

క్షేత్రం- లంకాపణ్ణం- తక్షశిల-స్థానేశ్వరం - జల్లికోట-బక్సారు-ప్లాసీ పానిపట్టు-ఢిల్లీ-
- దండీతీరం - అఖిలభారతం...

ఇదిగో పోలీసులు! వచ్చారు! గజందూరమే! గుర్రాలకదం నాగుండెలమీద పడుతున్నట్టుంది. లాడముల మెరుపులు నాకళ్ళలో పొడుస్తున్నాయి, రామూర్తిసుబ్బయ్యలు సత్యాగ్రహ మంత్రం జపిస్తున్నారు. పోలీసులొచ్చారు సత్యాగ్రగులమీదపడుతున్నారు. సార్జెంట్లు హుంకారాలుచేస్తున్నారు. పోలీసులని రేకెత్తిస్తున్నారు: ఒకటి-మార్రో రెండు-మార్రో మూడు-మార్రో ఒకటికొట్టు రెండు-అడ్డి మూడు-మార్రో" వీపుమీద కొట్టారు. రొమ్ముమీదకొట్టారు. దెబ్బమీదదెబ్బ. సుబ్బయ్యకి స్పృహలేదు. రామూర్తి కిందపడిపోయి రక్తంకక్కుకుంటున్నాడు. పోలీసులు మళ్లీలాఠీలు ఎత్తేరు. సుబ్బయ్య తలమీద లాఠీ పడుతోంది ఇంకేముంది... క్షణం మాత్రం!...

భరతమాత సుబ్బయ్య దగ్గిర నిలబడి నన్ను పిలుస్తూంది. "గాంధీకి జై!" అంటూ పరుగెత్తి సుబ్బయ్యమీద పడ్డాను. అతని తల కౌగలించుకున్నాను. "ఒకటి... మార్రో!"...నాకుడి భుజంమీదపడింది. చక్రాంకితాలు. "రెండు కొట్టు!" ఎడమభుజం మీద పడింది......రామపాదుకలు...... "మూడు - అడ్డి!" తలమీద పడింది శఠగోపం......

... ... ... ...

జనరల్ ఆసుపత్రి - శనివారం: నిన్న కట్లు విప్పేరు. నీర్సం కొంచెం తగ్గింది. తలమీద పెద్ద దెబ్బే తగిలిందన్నారు. వెన్నుపూస దగ్గిరలోవున్న పేగులు అదిరేయిట కూడా. ఇంకా పదిరోజులు ఆస్పత్రిలోనే వుండాలన్నారు. నర్సులు, వైద్యులు, మెడికల్ కాలేజీ కుర్రాళ్లు నన్నెంతో గౌరవంతోనూ, ఆపేక్షతోనూ చూస్తూన్నారు. నేనేదో గొప్పపని చేశానంటున్నారు...సుబ్బయ్య, రామమూర్తిగార్లను అరెస్టు చేయకుండానే రాయపురం ఆస్పత్రికి తీసుకు వెళ్ళేరుట. వాళ్లుకూడా చికిత్సపొంది నింపాదిగా వుంటున్నారుట...చెయ్యి కొంచెం స్వాధీనం అవుతూంది. పెన్సలుతో వ్రాయగలను. మళ్లీ మర్చిపోతానేమో...ఆ గుర్రపుడేల తళుకు ఇంకా కళ్ళలో పొడుస్తునే వుంది! జన్మాంతం ఈ దియాత్రం మరుపుకురాదు!

## 60

### అతడు

మంగుళూరు, గురువారం: నిన్నరాత్రి ఆలస్యంగా చేరిందిక్కడికి రైలు చాలా అలసట అనిపించింది. మరి రాత్రి కాగితాలు చూడలేకపోయాను. అయినా చూడ

క్కరలేదు కూడాను. వృత్తిలో ప్రథమశ్రేణి అందుకున్న తరవాత దానంతటు అదే వచ్చేస్తాయి - వాదనలూ, సమయస్ఫూర్తి, వాక్ధోరణీన్ని. న్యాయాధిపతి పదకొండు గంటలకే సరిగ్గా తీశాడు మాకేసు. ఇతడు పోడూరులో చేస్తూండగా రెండుకేసులు ఆయనదగ్గిర నేను వాదించి గెల్చాను. అంచేత ఆయనసంగతి నాకు బాగా తెలుసు. వాది తరఫున అక్కడి పెద్దవకీలుగారు ఆయన వాదన మొదలుపెట్టేరు. ఒక అరగంట సాగించేరు. కోర్టుహాలు అంతా ప్లీడర్లతో నిండిపోయింది. చాలా ముఖ్యం అయిన కేసు-వాదీ ప్రతివాదీ ఈ జిల్లాలలో చాలా పెద్ద జమీందార్లు. ప్రతివాది-నాక్లయింటు-ఇద్దరిలోనూ పలుకుబడిగల జమీందారు. దత్తత చెల్లదని వాది తరఫున వకీలుగారు వాదిస్తున్నారు....ఇంతట్లో కోర్టుబయట పెద్ద కలవరం వినిపించింది. కాంగ్రెసు జండాలు పట్టుకుని బడిపిల్లలే వెయ్యిమందికి పైగా "గాంధీమహాత్మునికి జై!" అని అరుస్తూ కచేరీ ఆవరణలోనికి జొరబడ్డానికి ప్రయత్నించారు. కోర్టుబంట్రోతులు, జమానులు పట్టుమని పదిమందిలేరు. యీ అల్లరి చిల్లరి మూకను ఎల్లా అడ్డగలరు? అయినా - పిల్లల్ని బస్మమాసేయమనడంలో అర్థం నాకేం బోధపడ్డంలేదు. ఇదేం రాజకీయం? చదువులు మానేసుకుని చట్లు మానేసుకుని దేశానికి వీళ్ళేం స్వరాజ్యం తెస్తారు? అయ్యయ్యయ్యో? రేచుకుక్కల్లా ఆ బడిపిల్లలతో ఈ బంట్రోతులు ఏం సాలగలరు? కోర్టువారుమాత్రం సిరస్తాదారుని పిలిపించి కోర్టుహాలు తలుపులు వెంటనే మూసి - పోలీసుస్టేషనుకి టెలిఫోను చెయ్యమన్నారు. ఏముంది - రెండు ఎర్రపాగాలు, రెండుబెత్తాలు చూచేసరికి కుర్రాళ్ళు పరుగో - పారిపోయారు. కోర్టుతలుపులు తెరిచి మళ్లీ విచారణసాగించేటప్పటికి పన్నెండున్నర అయింది. ఈ అవాంతరం ఎప్పుడైతే వచ్చిందో-మరి వకీలుగారు మొదటిపూరులో సాగించలేకపోయారు. అసలు ఆయన పెద్దబ్బాయే విద్యార్థుల నాయకుడుట. పాపం తనపిల్లాడికి ఏం దెబ్బతగిలిందో అని ఆయనకి బెంగగా కూడావుండేనేమో. ఏం అయితేనేం - నా అదృష్టంకొద్దీ, నాక్లయింటు అదృష్టంకొద్దీ-ఆయన వాదన చప్పపడిపోయింది. ఎలాగో పాపం ముగించేశాడు-కోర్టువారు ఫలహారానికి లేచారు.

ఫలహారానంతరం నేను మొదలుపెట్టాను. మొట్టమొదటగుండానే: "కోర్టువారు సహజధైర్యస్థైర్యాలతో అల్లరిమూకలను లొంగిపోకుండా "లా" యొక్క గౌరవము, మా అందరి పరువు కాపాడినందుకు మీకు మేం కృతజ్ఞులం!" అన్నా. కోర్టువారికి మొన్ననే రావుబహదూరు బిరుదుఇచ్చారు. అంచేత నామాట ఆయనకు బాగానచ్చింది! కోర్టువారు తలపాగాతీసి మేజామీదవుంచి రెండుసార్లు తలవిదుల్చుకుని, జుట్టు ముడి వేసుకుని, తలపాగా పెట్టుకుని: "యీ కోర్టుయొక్క గౌరవమర్యాదలు నిలవబెట్టడమే నా ప్రధానకర్తవ్యము. అంతేగాని తుంటరుల అల్లరిచేష్టలతో మనకు ప్రసక్తిలేదు. ప్రతివాది కౌన్సెలుగారికి . నా వందనాలు!" అని సెలవిచ్చారు. మొదటినమస్కార బాణం బాగాతగిలిందిరా - అనుకున్నాను...ఇంక మొదలెట్టా - కొట్టినపిండేగానాకు!

మితాక్షరం దాయభాగం, మనువు, మెయిను, శ్రీనివాసయ్యంగారు, ముఖ్యమైన ప్రమాణాలు అన్నీ వర్ణించేశాను. గడియారం ఐదుకొట్టింది. ఆఖరు తడాఖాకొట్టేను-భరతగిరి కేసులో హిందూ ధర్మశాస్త్రం అనుసరించినా - ఆయా రాజకుటుంబాలలో అనాదిగా వస్తూండే ఆచారాన్ని అనుసరించినా-పుంచుకున్న స్త్రీకొడుక్కి వారసత్వపు హక్కున్నూ, రాజ్యాధికారంవుంది-అన్న తీర్పు వివరించేను. "గౌరవనీయులగు ఈకోర్టు వారుహిందూధర్మమును గౌరవించెదరు గాక!" అనిచెప్పి కూచున్నాను. "ఈకోర్టువారు తమవిధిని నిర్భయముగా నెరవేర్చి హిందూధర్మమును నిలబెట్టెదరు" అన్నారు కోర్టువారు. సరి - ఇక నాగెలుపు నిశ్చయం అని తేలిపోయింది!

రాత్రి మాక్లీడరుగారింట్లోవిందు. వూరిలో వకీళ్ళందరూ వచ్చారు. జడ్జీగార్లు, నలుగురు సబుజడ్జీగార్లు, ఇద్దరుమునసబులు వస్తూంటే - ఆశ్రితజనంరారా మరి! విందు పూర్తి అయింది. ఇంతట్లో నాపేర టెలిగ్రాంవచ్చింది. చించిచూచుకున్నా :

"సాయంకాలం ఐదుగంటలకి లాఠీచార్జిలో శాంతానికి దెబ్బలుతగిలేయి. జనరల్ ఆస్పత్రిలోవుంది. ప్రమాదమేమీలేదు. బెంగపెట్టుకోవద్దు-భామ్యం"

ఏంతోచలేదు. వెంటనే రైలుంటే బయలుదేరే. కాళ్ళుచేతులు వణకడం మొదలెట్టాయి. వళ్ళంతా ముచ్చెమటలు. డైనింగు కారువాడినిపిలిచి వక డబుల్ విస్కీ పుచ్చుకున్నాను. నరాలు కొంచెం స్థిమితపడ్డాయి... అక్కరలేనిది కలుగజేసుకుంది శాంతం ఈసత్యాగ్రహంలో. చివరికి దెబ్బలుకూడా తగిలించుకుంది. మనకిదినొద్దు-అని నేనుశతపోరు పోరినా వినిపించుకుందికాదు. పాపం ఆదెబ్బలని ఎలాభరించిందో? చిన్న కురుపుతవుతే ఎంతో బాధపడిపోయేదే? డాక్టరు ఇంజక్షను ఇస్తాడంటే భయపడి పోయేదే? ఇంతధైర్యం ఎక్కడనించొచ్చింది?......

యీరోజుల్లో చెన్నపట్నం వదలివెళ్ళడం నాదే బుద్ధితక్కువ. నేనుపట్టిన అన్ని కేసుల్లో ఇది గొప్పదని సంతోషించేను. నేను కేసుముగించడం - శాంతానికి దెబ్బలు తగలడం - వక్కసమయంలోనే జరిగింది. పాపం - పాపాయి ఎల్లావుందో? ఏం ఏడుస్తూందో?...భామ్యంపేర టెలిగ్రాం వేశాను-శనివారం మధ్యాహ్నానికి వస్తున్నాను. రైలుకి రమ్మనమని... ఏంతోచక పత్రికలు కొన్నాను. పత్రిక విప్పేటప్పటికి, మొదటి పేజీలోనే పెద్దక్షరాలలోవుంది. "సుప్రసిద్ధులైన బారిష్టరుగారి భార్యకు లాఠీ గాయములు తగులుట - వలంటీర్లు స్పృహతప్పిపోవుట-అతీతమైన త్యాగము" వివరాలు చదివేను. శాంతాన్ని కళ్ళకద్దుకోవాలి! ఆ స్వార్థరాహిత్యానికి - ఆ ధైర్యస్థైర్యానికి! సామాన్యం మనిషి కానేకాదు! ఆవలంటీర్లుకూడా అలాంటివాళ్ళలాగేవున్నారు!

పత్రికచివర చిన్నఅక్షరాలతో వుంది : సింధులోప్రస్తుతంఖాళీగావున్న ఎడ్వకేటు జనరలుగిరీకి చెన్నపట్నం బారిష్టరుశాస్త్రిగారిని నియమించుటకు ఆ గవర్నమెంటు

నిశ్చయించారని విజ్ఞులు అనుకుంటున్నారు. శాస్త్రిగారి వయస్సు 32 సంవత్సరములు. ఈ ఉద్యోగానికి వీరినే నియమిస్తే, ఎడ్వకేటు జనరల్ గిరీ చేసినవారందరిలో ఇండియా మొత్తానికి వీరే చిన్నవయస్కులు"...పదేపదే చదివేను. ఈ ఉదంతం జరక్క పోయివుంటేనా...... ఆంధ్రుల కెవ్వరికీ ఇంతవరకు ఎడ్వకేటుజనరల్ గిరీ ముట్టలేదు. నాకు కిట్టనివాళ్ళు యీ ఉదంతాన్ని నాకు వ్యతిరేకంగా వినియోగిస్తారు. అయినా చూద్దాం......

శనివారం : సర్కారు ఆస్పత్రికి వెళ్ళి శాంతాన్ని చూశాను. కళ్లంట నీళ్ళు గిర్రున తిరిగేయి నాకు. తను వ్రాసిన దినచర్య సంజ్ఞచేసి చదవమంది...పాపాయి ఇక్కడే వుంది... శాంతాన్ని చూడడానికి జనం వచ్చే తీర్థప్రజ - విధీవిరామంలేదు... పత్రికా ప్రతినిధులు, కాంగ్రెసు హేమాహేమీలు... నామాటే ఎవ్వరూ అనుకోవడంలేదు... డాక్టరు శంకరమీనన వచ్చాడు. నన్ను తెలియదు. శాంతం నావేపు చూపించింది. ఆయన పోల్చుకుని, నాతో కరస్పర్శచేసి "శాస్త్రిగారూ! మీరు ధన్యులు! శాంతంగారికి చికిత్స చేయడం అంటే మాయొక్క అదృష్టమేనండీ" అన్నాడు..... నా మనస్సుకు శాంతి కలిగింది. "స్పోర్ట్సు" అంటే నిజంగా శాంతమే!.

## 61

### ఆమె

పదిరోజుల్లో తిరిగి నయం అయిపోతుందనుకున్నాను గాని, ఇంటికొచ్చేసరికి ఇరవైమూడురోజులైంది. కడుపులో ఏదో నరం అదిరిపోయిందని శస్త్రం చేశారు. నయం అయ్యాక ఇంటికొచ్చేశాను. రెండు నెలలపాటు ఏ పనీ చెయ్యలేకపోయాను. పాపం, శాస్త్రి నాకోసం ఇంత అంత శ్రమతీసుకోవడం కాదు. నర్సుని తైనాతీ నాకోసం, మరో వంట అతన్ని, పాపాయికోసం మరో ఆయాని డబ్బు నీళ్లలా ఖర్చుపెట్టాడు.

నా ఆరోగ్యాన్ని పట్టి జైలుకువెళ్లే ఉద్దేశం మానుకున్నాను. ఆమాటవిని శాస్త్రి చాలా సంతోషించేడు. అతని ఉద్దేశం ప్రకారం కొన్నాళ్ళవరకు రాజకీయంగా యే పనీ వొద్దంటాడు. ఇంట్లో ఎలా కూచోను? ఆ మాటంటే "అంత నీకు జాతీయసేవ చెయ్యాలంటే, విరాళాలు పోగే, పదిరూపాయిలు మామూలుగా యిచ్చేచోట యాభై ఇయ్యి. యాభై యిచ్చేచోట రెండొందలియ్యి. విరాళాలు ఎప్పుడు కాగితం మీద వెయ్యకు. సభలలోనూ నాయకుల సమక్షాన బహిరంగంగా ఖరారు చెయ్యి" అన్నాడు.

"వేళాకోళమా? నిజంగానేనా?" అన్నా. "మనోవాక్కాయ కర్మలా చేస్తున్నా. నీ కింకా చెయ్యాలని వుంటే, స్వదేశీ ఉద్యమంలోకి దిగు. ఒకరిని బాధ పెట్టనిది నీకు బాధలేనిదీ. కాదన్నావూ-హిందీ ప్రచారం చెయ్యి. సూక్ష్మంలో మోక్షం. అదీ కాదన్నావూ-ఖద్దరు ఉన్నదేగా. నూతనంది కావాలంటే హరిజన సేవ వుంది. ఆడుతూ పాడుతూ చేసుకోవచ్చు ఎక్కడికేనా కారుమీద వెళ్లొచ్చు, కారుమీద రావొచ్చు. ఇంకా నిర్మాణాత్మకం కావాలి - దంపుడుబియ్యం ఉంది, సర్వోత్కృష్టమైన సేవ అహో బలరావుగారి నారింజపండ్ల ప్రసాదంకంటె గాంధీగారి దంపుడుబియ్యం ఉద్యమం నూరురెట్లు విలువైంది." అన్నాడు.

నాలుగు నెలలై హరిజన సంఘంలో చేరి పనిచేస్తున్నాను. సత్యాగ్రహంలో దెబ్బలు తిన్నానని కాబోలు, నన్ను వెంటనే కార్యనిర్వాహక సంఘంలోనికి ఎన్నుకున్నారు. సత్యాగ్రహపు రోజులలో ఆరంభించిన ఉద్యమాలన్నీ, ఆ అసలు ఉత్సాహం తగ్గేక, వెనకబడుతున్నాయి. ఒక్కొక్కప్పుడు ఒట్టే ఆలోచిస్తే హరిజనోద్యమంవల్ల, మనం వాళ్ళు మరింత వేరుపడిపోతున్నామేమో అనిపిస్తోంది. ఉద్యమం వచ్చిం తరవాత తురకలకీ మనకీ వైషమ్యం మరింత హెచ్చయింది మహమ్మదీయులని ఏమాత్రం ఉద్యమంలోకి లాక్కురాలేకుండా వుంది కాంగ్రెసు - సరేసరి వాళ్ళు బ్రిటీషువాళ్లవేపు మరింత మొగ్గుతున్నారు. చివరకి వాళ్ళకీ మనకి ఐక్యత కుదరదేమో అనిపిస్తోంది రాను రాను కాంగ్రెసు, హిందూమహాసభ ఒకటే అయిపోయి తురకలం, మనం మీ ఖర్మాన్ని మీరు మా ఖర్మాన్ని మేము వుంటాము- అన్నంతవరకు వస్తుందేమోకూడాను. హరిజన సమస్యని వుత్త మతసమస్యకిందాను, సంఘసమస్యకిందాను కట్టేయక, రాజకీయసమస్య అని, ఆర్థిక సమస్య అని తెలుసుకుని పనిచేస్తే బాగుంటుందేమో అనిపిస్తుంది.

సాయంకాలం విజయరాఘవయ్యగారింట్లో హరిజనోద్ధారక సంఘం కార్యవర్గపు సభ జరిగింది. సంవత్సరిక సమావేశం సందర్భంలో ప్రత్యేకం ఏమేనా చేద్దామా అన్న విషయం ఆలోచించడానికి సభ. ఇంకేకముందేం అనుకున్నాం అంటే- సంవత్సరం రోజున ఉత్సవంతో హరిజనులని కార్యనిర్వాహకపు సభ్యుల ఇళ్ళకి తీసుకువెళ్ళి వాళ్ళ ఇళ్ళలో హరిజనులచేత నీళ్ళు తోడిస్తే బాగుంటుందని. అదే ఇప్పుడు ఖాయపర్చడానికి సభ ప్రొఫెసరు సుందరరామన్ అన్నారు: "మా తల్లి ముసలావిడ ఒప్పుకోదండి. అంచేత నన్ను క్షమించండి." దివాన్ బహదర్ రంగనాథరావుగారు అన్నారు: "నన్ను మాత్రం ఇందులోకి లాక్కురాకండి. మా ఆవిడకి ఎల్లా తెలిసిందో మా లావు నూతిగోడ ముట్టుకుంటే నూతిలో పడి చస్తానని ఒకటే బెదిరింపు. నేను దాపరికం లేకుండా అందరితో ఇప్పుడు చెప్పేస్తున్నాను. నేను చెయ్యలేనిపని సభవారిని చెయ్యమని ఎల్లా అనగలను? అంచేత నా వోటు వ్యతిరేకమే" అన్నాడాయన. జస్టిస్ బిందు మాధవరావుగారు అన్నారు: "మా తోట నూతిలో చేదవేయిస్తే నాకేం అభ్యంతరం లేదు. వంటింటి పెరట్లో వున్న నుయ్యిమాత్రం వదిలిపెట్టేయండి. ఈ సవరణతో నేను సభ

వారి ఎదుటవున్న ఉపపాదనను బలపరుస్తున్నాను" అన్నాడు. హరికిశన్ దాస్ భగవాన్ దాసు గారు మాట్లాడ్డానికి లేచేరు. ఆయన యేమి మాట్లాడుతారో అని ఆయనవేపు అంతరు చూశారు. ఎంచేతంటే, హరిజనోద్ధారక సంఘానికి ఆయన వక్కడే పాతికవేల రూపాయిలు విరాళం యిచ్చాడు. నూలువ్యాపారస్తుడు మద్రాసు వరీఫు: "నాకెంతమాత్రం ఈ తీర్మానం ఇష్టంలేదు. వ్యక్తిగతంగా ఎవరికేనా ఇష్టంవుంటే వాళ్లు వాళ్లిళ్లల్లో తోసించుకోవచ్చుగాని సంఘం పేరిట బలవంతంగా వోట్లబలంతో హరిజనోద్ధారణ చెయ్యడం సభయొక్క స్వేచ్ఛాసిద్ధహక్కులకే వ్యతిరేకం" అన్నాడు తణుకుబెణుకు లేకుండా. పుల్లాభపట్ల వెంకటచలంగారు గొప్ప కాన్స్టిట్యూషనల్ లాయర్. ఆయనకి సత్యాగ్రహంఅన్నా కాంగ్రెసన్నా అరికాలిమంట. హరిజనసేవన్నా, సంఘసంస్కరణ అన్నా ప్రాణం. ఆయన: "అమానుల్లా చక్రవర్తిలాగు మనం తొందరగా విప్లవం తీసుకు రాకూడదు. అసలికే చెడుతుంది. మనకి హరిజనసేవమీద యెంత ప్రీతివుంటే అంత జాగ్రత్తగా పోవాలి. ఎంచేతనంటే నా ఉద్దేశం ఏమిటంటే-సభ్యుల్లో కొంత అభిప్రాయ భేదం వుంది కాబట్టి అది సాక్షీఅవడానికి వక సబ్‌కమిటీ ఏర్పరచి విషయం వచ్చే సాంవత్సరిక కాంగ్రెస్ సభకి వాయిదావేయడం సలహాకారి. ఆవిషయం నేను ప్రతిపాదిస్తున్నాను" అన్నాడు నేనొకర్తెను తప్ప మిగతా వారంతా వాయిదా వెయ్యడానికి ఒప్పుకున్నారు. నా అసమ్మతిని మూలం వ్రాతమూలంగా నమోదు చేయమన్నాను. ఏకగ్రీవంగా వుంటే బాగుండును-అని గుసగుసలాడేరుకాని నేనులొంగకపోవడంచూసి, పుస్తకంలో వ్రాసుకున్నారు సభ అక్కడితో సరి అన్నారు.

ఇంటికొచ్చేటప్పటికి తొమ్మిదైంది రాత్రి. "ఏం ఇంతాలస్యం?" అని శాస్త్రి అడిగితే సంగతి చెప్పేను. పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వేడు. నేనన్నాను: "శాస్త్రీ! నాకు హరిజనసేవ చాలుననిపిస్తూంది. కలం కాగితం అందుకో - రాజీనామా రాసి పంపించేస్తాను. నాలుగుక్కాలాలపాటి ఇంటిలో రత్నం వసుక్కుంటూ కూచుంటాను" అన్నా. "అదికూడా ఎందుకు? ఏం పుణ్యమా పురుషార్థమా?" అన్నాడు శాస్త్రి. "అలా కాదు. పూర్వజన్మం వాసన అమాత్రం వుండనియ్యి" అన్నా.

## 62

### అతడు

"అమ్మయ్య! ఇన్నాళ్లకి శాంతం కళ్లనుంచి నిండులు రాలేయి. హరిజనసభలో జరిగింది వినేక దుప్రబ్బినట్టు వ్వేను. అన్నీ అలాగేవున్నాయి. వకఅడుగు ముందూ రెండడుగులు వెనకా! ఎందుకొచ్చిన ఉద్యమాలంటా! డొమినియన్ స్టేటస్ కావాలో అని అడి

గితే ఇప్పుడివ్వడానికి సిద్ధంగావున్నాడు అదిమానుకుని స్వరాజ్యం అని వకడూ పూర్ణ స్వరాజ్యం అని వకడూ-సంపూర్ణస్వరాజ్యం అని మరొకడు అసలుకే టోక్లెక్కం పెడతాడువాడు !ఏదేనా, ఇంగ్లీషువాడిని చూసి మంచినేర్చుకోవాలి రాజకీయం!

నేను మొదటినుంచీ శాంతంతో చెప్పేను- మనకెందుకీగొడవ-అంటే వింటేకాదు. మాఅన్నయ్య మావదినె సెశీలీనిచూస్తే ముచ్చటేస్తుంది అతని వైద్యవృత్తేమో అంతేమో. జిల్లాసర్జను హాయిగా ఆర్జిస్తూన్నాడు సెశీలీ ఆఫీసర్లక్లబ్బుకెళుతుంది. స్త్రీసమాజానికి వెళుతుంది. ఒకరిజోలె ఒకరిసొంటి వాళ్లకక్కరలేదుకదా. కొడుకునీ కూతురినీ చక్కా ఇంగ్లండుపంపించేరుకదా. వాడే ఐ. సి. య స్సో ప్యాసయివస్తాడు. శాంతంఅలాఎందుకుండకూడదూ-అనవసరంగా ఈరాజకీయాలు పెట్టుకోకపోతే? నాకుముఖ్యమూను. శాంతానికి ముఖ్యం. రాజకీయంలోకి దిగడానికి నాకుకావలసినంత గడువుంది ముందుకి. యీ గోపాలపురంకేసుగెల్చినా-పదివేలుతప్పవుగద. ఓడిపోయానూ, ప్రివీకౌన్సిలుకు ఎలాగు వెళతాం. ఎలాగైనా మనకి వకటే.

చెన్నపట్నంలో ఇల్లొకటికట్టించాలి. ఇల్లుకడితేగానిఇక్కడ మనకి పరువురాదు "ఇల్లుకట్టుకుంటే, ఇంటికి కట్టుబడివుండిపోవాలి-ఒకస్థిరత్వం ఏర్పడిపోతుంది.- దాంతో స్వార్థం ఏర్పడుతుంది - చెట్టుక్రింద వున్నట్టుంటేనే మంచిది"- అంటుంది శాంతం. అంటే ఇంకాకొంతపిచ్చి వుండిపోయిందన్నమాట! యీ ఎండాకాలానికి-ఉత్తరదేశం తీసుకెళ్లి, మసూరీ, సిమ్లాకెళ్లి అక్కడవుంటే, అక్కడసరదాలు చూసేసరికి యిది కుదిరిపోతుంది. శాంతం మళ్లీనలుగురిలో పడాలి.

## 63

### ఆమె

నాలుగు నెలలా? - ఇంకా ఐదునెలలు గడవాలి? ఎలా గడుస్తాయో? ఈ జీవితం చిత్రం యేమిటోకదా? నా మనస్సులోవున్న ఆలోచనని నేనే పోల్చలేకుండా వున్నాను. నా హృదయాన్ని నేనే విప్పి చదువుకోలేకుండా వున్నాను. నా దేహంలో యే బ్రహ్మాండమయిన మార్పులు జరుగుతున్నాయో నాకే తెలియడంలేదు... ..నాకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, వ్యక్తిత్వం - వుందా - లేకపోతే - అరిషడ్వర్గాల చేతుల్లో కీలుబొమ్మలాగు - యీ సంసారం అనే తుఫానులో గాలిగుడ్డలా - కొట్టుకుపోతూండడమేనా? పులుసూ, కారం తింటూ - అచ్చంగా భూమిమీద రెండు కాళ్ళతోనూ నిర్మొహమాటంగా - నిలబడడానికా - ధైర్యంలేదు! నిస్సాహసంగా, "నా" అన్న తాప

శ్రయం లేకుండా, ఆధ్యాత్మికంగా పరలోకధ్యానంమీదే వుందామా — ఆ ఆకాశం అంచన యే! ఇప్పుడు నేనిలాఎందుకుండాలి? ఈస్థితి-నా దేహస్థితివిచ్ఛిన్నకమా - ప్రమాదమా? ఎట్లా సంభవించింది? జాగ్రతావస్థా - నిద్రావస్థా - సుషుప్తావస్థా? ప్రేమా? ప్రణయంవా? కామంవా?...లేకపోతే అలవాటా?...యీమాటు వెకటిమాటులాలేదు నా మనస్సు. అప్పుడా - డాక్టరు చెప్పగానే మనస్సంతా ఆనందంతోనిండిపోయి పొంగిపోయింది. కాళ్ళకి రెక్కలొచ్చాయా అని అనిపించింది. గాలిలో నడిచినట్టే-ఆకాశమీదనుంచి అలా మేఘాలతో కలిసి యీదుకుని వెళిపోతున్నట్టే వుండేది. శాస్త్రిని చూచినప్పుడల్లా - గుండెల్లో - మనసులో- చెవుల్లో-సంగీతమయం! కళ్ళంట నీళ్లొచ్చేవి. అకారణంగా ఓ పెద్ద కరటంలాగు దుఃఖం వచ్చేది. అతన్ని కౌగలించేసుకుని - అతని దేహంలో అమాంతంగా మాయం అయిపోవాలా అనిపించేది. నలుగురిలో తిరగడానికి సిగ్గు మొహమాటంగా వుండేది - మళ్లీ రెండోనిమిషానికే-ఎంతో గర్వంగాను వుండేది... ఇప్పుడల్లాలేదేం? శాస్త్రి అంటే ప్రేమ పోలేదే? అయితే - ఆ ఉదృతం - తగ్గిందేమో అనిపిస్తూంది..."ఉదృతం"అని కలం వెళ్ళిందేమిటి? ప్రేమకూడా కొన్ని సందర్భాల్లో ఉన్మాదం - రోగం - మేనా ఏమిటి చెప్మా? అబ్బే - జీవకోటిలో ప్రతీ వ్యక్తీ అనుభవించే లీలని రోగంఅని ఎట్లా అనడం? శాస్త్రి అంటే ప్రేమ-ఆపేక్ష-అనురాగం - చనువు-అలాగే వున్నాయి. కాని......ఏదో అద్భుతగులుతూంది. ఏమిటది? యీ ఐదేళ్ళ సంసారంలో అనేక ఘటనలు సంభవించాయి. అనేక అనుభవాలు అనేక కొత్తభావాలు అనేక విధాలుగా ఎదుర్కొన్నాను. "మనిద్దరిదీ వకటే మనస్సు - వకటే దేహం" అని అనుకున్నా - హావభావాలు వేరుగానే వున్నాయి. దృక్పథాలు వేరేగా వున్నాయి....గోరంతలన్ని కొండంతలు చేస్తూన్నానాయేమిటి? వ్యక్తులుఇద్దరైం తరవాత యే భేదాలు లేకుండా ఎల్లా వుంటారు? కవలపిల్లలలోనహా వాళ్ల మనస్సు వీళ్లదికాదు, వీళ్ళ మనస్సు వాళ్ళదికాదు. గంగా యమునా కలిసిపోయినా, గంగనీళ్ళు గంగవే-యమున నీళ్ళు యమునవే కావడంలే! అయినా, ఆమాత్రం వడుదుడుకులు లేకుంటే - సంసారం ఏమిటి?-అబ్బే! యీ కలవరంలోనించి నేను బయటికి వచ్చేయాలి.మా ఇద్దరి మధ్యనీ మనోకలురానంతసేపు-యీ భేదాలున్నా ఫరవాలేదు. అలాంటిదెప్పుడూ జరగదు కూడానూ...మరి అనుకున్నట్టు-మళ్ళీ ప్రయత్నం లేందే - ఎల్లా జరుగుతాయో? అనేకసార్లు అనుకునేదాన్ని - పాపాయి పక్కకే అయిపోతూంది - దానితో ఆడుకోడానికి వూపోసుకడానికి దానికి మరో చిన్ని తమ్ముడో - చిట్టి చెల్లాయో వుంటే బాగుండును- అని! సరిగ్గా అల్లాగే అయింది! ఈ మాటు అచ్చంగా మామామగారి పేరో - అత్తగారి పేరో పెడితే తీరిపోతుంది. శాస్త్రి సంతోషిస్తాడు. వాళ్ళవాళ్ళకీ నా మీద కోపం కాస్త తగ్గుతుంది. ఎమిటో పేర్లలో ఏముంది? అలాగని వెంకయ్య పుల్లంభొట్లు, సుబ్బి, సత్తి అని ఎట్లా పెట్టనూ? అయితే ఏం? తత్సమ తద్భవాలున్నాయిగా కాళిదాసు వాఙ్మయాన్ని మర్చిపోయినా,బొంబాయి ఫిలిమ్సువాళ్ళ తారల్ని

మననం చేస్తున్నాంగా! బంకించంద్రుడూ పాంచకడీ, మన ఆంధ్రదేశంలో ఇలకిల్లి సంతకాలం - నా పిల్లలికి, మల్లమ్మనీ, రుద్రమ్మనీ ఎట్లా పెట్టను? రవీంద్రనాథ టాగోరూ, విద్యాసాగరూ అని పేర్లు పెట్టడం - ఆ కుర్రాళ్ళు నాలుగో ఫారంలోనే దండయాత్రలు కొడుతూండడం - తిలక్కు, గాంధీ అని నామం పెట్టడం - వాళ్ళు యింతా యే గవర్నమెంటు అబ్కారీ డిపార్టుమెంటులోనో, యే సి. ఐ. డి లోనో చేరటం-ఏం అందంగా ఉంటుంది! మనం సరోజి అని పిలవడం - దాని జడపిలకాల్లే వుండడం, చిన్నప్పుడు పరిమళ అని పెట్టడం, అది పెద్దదయాక జిడ్డోడుతూ తయారవడం ఎంత పొడరు పూసుకున్నా, ఎంత సబ్బుతో తోముకున్నా! తల్లి దండ్రులు వాళ్ళ దేశభక్తి, ఆంధ్రత్వం, వాళ్ళ భావకవిత్వం, వాళ్ళ పిల్లల పేర్లలో చూపించడం -తోటిపిల్లలు ఉడికిస్తూంటే వీళ్ళు ఏడవలేక చావడం. మా నాన్నా అమ్మా యీ పేర్లు మాకెందుకు పెట్టారురా బాబూ - యే పుల్లయ్యో, సింగయ్యో, యే సీతో, వెంకో అని నలుగురిలాగ పెడితే తీరిపొయ్యేది-అని యావజ్జీవం వాళ్ళు ఏడవడం - యెందుకొచ్చింది? నేను మామూలు పేర్లే పెడతాను: ఆ తరువాత వాళ్ళు దేశభక్తులూ, పండితులూ అవుతే వాళ్ళ పేర్లువాళ్ళే మార్చుకుంటారు, వాళ్ళకి వచ్చినట్టూను......

......శాస్త్రితో చెప్పా - వినిపొంగి పోయాడు! యీ మాట కొడుకుడితే బాగుండును శాంతం! అన్నాడు. ఏమిటో కొడుకైతేనేం కూతురైతేనేం? కొడుకే కావాలని కోరికేమిటో! "నీ కేం కావాలి - కోరుకో!" అన్నాను. "యేం ఘనకార్యం చేశానని కోరమన్నావు - వరాన్ని?" అన్నా "నీలాంటి ఆంధ్ర నారీ రత్నమో - నాలాంటి తెలుగు దొరో రేపు అవతరించ బోతూంటే --" "బొమ్మూరు మెట్టమీద సారంగధరుడా, కొండవీటి కొండదొంగ - లేకపోతే నెల్లూరి నెరజాణా, పల్నాటి వీరంగనా?" అన్నా నేను నవ్వుతూ. "నీకన్నీ వేళాకోళాలే! శ్రీ కృష్ణ దేవరాయలో - నల్లమ్మ జేవో అనకూడదూ?!" అంటూ ఫోను చేసి నూజ్ మాల్కి ప్లాటినం బూర్లి - వుమ్మిడివారినుంచి రిస్టువాచీ - కన్నిమేరానుంచి కేకు, రామకృష్ణానుంచి బాదంఖీరు తెప్పించి హడావుడి చేశాడు! శాస్త్రికి ఇంకా కుర్రతనం పోలేదు!...

## 64

### అతడు

ఈవేళ కొండెక్కినట్టుంది - యీ శుభవార్త విన్నాక! ఈ మూడు నాలుగు నెలలూ యీ వాదనలూ - యీ చికాకు - యిప్పుడు బోధపడింది. పాపం శాంతం

మాత్రం ఏంచేస్తుంది - వొంట్లో బాగుండకపోతే! ఆవేళ నిజంగా నాకు యెంతేనా కోపం - నిరుత్సాహం - అఁకూడదుగాని చిరాకీ అసహ్యంకూడా వచ్చేసింది శాంతమీద. నన్ను అర్థంచేసుకోకుండా నాతో వితేటలు పోల్చుకోకుండా లౌక్యం తెలుసుకోకుండా యేవో నాలుగుముక్కలు కొత్తపోకడలు పట్టుకుని ఆ రాణీని అగ్నిపరీక్ష చేశానని నన్ను అమాంతంగా తిట్టిపారేయడమూ - ఆ లేడీఅయ్యంగారు ఎంతో మెచ్చుకుని ఉత్సాహంగా ఆ టెలిగ్రాం వెయ్యడమూ - ఏమిటీ అన్యాయం అనిపించింది. రహస్యం తెలిసేక యిప్పుడు బోధపడింది. ఆరోజుల్లో మనిషిని పూర్తిగా అల్లాడించేసి - తల్లకిందులచేసి పారేస్తుంది కాంసు? స్త్రీజాతి అంతా యీ యాతన పడవలసిందేగా? అందులోకీ సున్నితంవైన మనసు. నాజూకు చిత్తప్రవృత్తిగల స్త్రీయేగనక ఐతే మరీ గాభరా పడిపోతుంది! అందుకోసమే పురుడు పోసుకోవడం అంటే మృత్యువు నోటిలోంచి బైటపడి మళ్ళీ జన్మమెత్తడమే అంటారు మనవాళ్ళు. ఈ రెండుమూడు రోజులాయి శాంతం చాలా ప్రశాంతంగావుంది. ఈమధ్య మనస్పర్ధలూ, గొడవలయాక పాత శాంతమే అయిపోయింది. వచ్చే యీ అయిదారు నెలలలోనూ, నూతనసృష్టితో యీ నిన్నా మొన్నా తెచ్చిపెట్టుకున్న తమాషాభావాలన్నీ మర్చిపోతుంది తప్పకుండానూ. అసలు ఆవేళ ఆ ఖద్దరు కట్టుకోవడంతో మొదలు. అదికూడా మర్చిపోతే... అసలే తెలుగు - అరవపోటీ - అందులోకీ బ్రాహ్మణ - బ్రాహ్మణేతరం ఒకటి - దుర్భిక్షంలో అధికమాసంలాగ. అదిగో వీడి పెళ్ళాం ఖద్దరుకడుతుంది అని - ఇదో రాయి వెయ్యగానే ఆ అడ్వకేటు జనాలు గిరీకున్న అవకాశాలు రొంక ఎగిరిపోయి వూరుకుంటాయి. శాంతానికి అసలు ప్రపంచకం ఏం తెలుసు? ఎం. ఏ అంటే ప్యాసయి ఆ పరనా కాలేజీలో నాళ్ళు పనిచేస్తేమాత్రం ప్రపంచకం ఎట్లా తెలుస్తుంది - నాలుగు డక్కాముక్కాలు తినాలి - కాస్తసాఫీ తేరాలి కాని! పూర్తిగా సత్యకాలం అవుతే ఎట్లా... యీమాటు బాచిగాడు పుడితే... ఏమిటి మన యిష్టంవా యేమిటి! ఎల్లాగేనా ఆడపిల్ల అంటే తల్లిదగ్గరే చనువు - తండ్రికేం అధికారం వుండదు. మగపిల్లడనగానే తండ్రిదే పైచెయ్యి అవుతుంది - అవాళీకూడా. మగపిల్లలికి తర్ఫీదుచెయ్యడం యెంత చదువుకున్న ఆడాళ్ళకేనా తెలీదు. ఆ ప్రపంచకంమే వేరు - ఆ సరదాలు - ఆ భావాలు ఆ కోరికలూ - ఆ వాంఛలూనూ. ఏదైనా ప్రయోజకుడై వోయింటివాడై కుటుంబ సాంప్రదాయం నిలబెడుతూ డబ్బు సంపాదించి వో హోదా - వో తాహతూ - పెళ్ళాం పిల్లలూ - "నా" అని నిలబెట్టేవాడు మొగాడేగా - ఎన్నికబుర్లు చెప్పినా? బాచిగాడికి ఓ నామాలదగ్గిరనుంచి నేనే స్వయంగా చదువుచెప్తా ఫర్డుఫారంవరకూ యింటిదగ్గిరే చెపుతా. స్కూళ్ళలో సహంకాలం వృధావేకదా. పన్నెండేళ్ళకే స్కూలు పైనలు పాసు చేయించెయ్యాలి. ఆ తరవాత దేవుడు మేలుచేస్తే కేంబ్రిడ్జిని బియ్యే ప్యాసు చేయించడం తరవాత ఇంగ్లండూ - ఐ. సి. యస్. న్నూ. పాడూము దుకొస్తాడు. నాకూ మంచిపేరూ. శాంతంతో యిప్పుడే కంతులన్నీ యెందుకూ అనవసరంగానూ. ఈ నా ఐదునెలలూ బాగా వెళ్ళిపోయి. నేనన్నట్టే అవుతే బాగుంటును. ప్లాటిం

బ్రూచి - రిస్టువాచి పెట్టుకుని శాంతం అదే పొంగిపోవడం!......కూనూరు దేవస్థానం కేసులో వాళ్ళు ఖబుర్లమీద కబుర్లు పంపిస్తున్నారు. పట్టడమా మానడమా? మంచి తమాషా అయిన లాపాయింటు వుందిగాని దేవస్థానం డబ్బుతిని జలసాచేసిన మహాంతు వేపు ఎలా పనిచేయడం? రెండోపక్షం వాళ్ళు వీభూతిరాయుళ్ళు డబ్బేం యివ్వలేరు. ధర్మసంస్థాపనార్థాయ- అని మనం జోలెకట్టుకు యెక్కడ తిరగ్గలం? అయినా మాద్దాం.........

## 65

### ఆమె

మనదేశపు చరిత్రలో ఈవేళతో ఒక గొప్ప ఘట్టం పూర్తి అయింది. మధ్య రౌండుటేబిలు నాటకం తొమ్మిదినెలలూ మినహాయిస్తే మూడేళ్ళు నడిచింది పూర్తిగా సత్యాగ్రహయుద్ధం. యీ ఆరునెలలు యేదో పేరుకి మాత్రం ఉద్యమంకాని, ఉద్రేకం ఉత్సాహం పోయింది ప్రజల్లో. మహా మహా తర్ఫీదు పొందిన సైన్యాలే ఒక్కధాటీని యుద్ధం చెయ్యలేవుకదా, అటువంటిది - సామాన్యజనం ఇంత ధైర్యంతో ఉద్యమం సాగించారంటే ఆశ్చర్యం కదూ! ఆ మౌంటురోడ్డు లాఠీచార్జి తల్చుకుంటే నాకే తెలీదు ఆ ధైర్యం నాకెక్కడనుంచి వచ్చిందని. అబ్బ! ఆ గుర్రపులాడేల మెరుపులు ఈవేళకి కూడా కళ్ళలో పొడుస్తూన్నట్టే అనిపిస్తూందికద! లక్షలాది జైళ్ళకి వెళ్లేరు, దెబ్బలు తిన్నారు, ఫకీర్లయిపోయారు - చివరికి ఫలితం ఏమైనట్టూ అనిపిస్తూంది నాకు. క్రింద పడినా- పైనేవున్నాం అనడం, అనుకోవడం, రాజనీతేమో. కాని, ఉద్యమం ఆఖరు చేయడం అంటే మనం ఓడిపోయినట్టు ఒప్పుకోవడమేకద? ప్రజల్లో నిలబడడానికి ధైర్యం లేకపోయిన తరవాత గాంధీగారు మాత్రం ఏం చేస్తాడు? మధ్యలో వెనక్కి జారిపోకూడనే అని ఇప్పుడనిపిస్తూంది వెనక్కి దిగడిపోయి దాన్ని గురించి నాకు విమర్శించడానికి హక్కులేదేమో? నిజమే! అయినా చరిత్రమాత్రం విమర్శించదా?

మొత్తంమీద చూస్తే - ఉద్యమం మనదేశంలో అందరినీ కూడగట్టుకురాలేక పోయిందేమో అనిపిస్తూంది. పల్లెటూరిజనం, రైతులు కూలి నాలి చేసుకునేవాళ్ళూ - వీళ్ళ నెవరినీ ఆకర్షించలేకపోయింది వాళ్ళని దూరంగా వుంచేసింది కూడాను- కరాచీలో ఎన్ని కబుర్లు చెప్పినా- నాయకత్వం మధ్యతరగతివాళ్ల చేతుల్లో పడిపోయింది. ప్రొఫెసర్ హంపరామన్న, జమీందారు విస్సన్నగారూ కూడా ఆరునెలలు జైల్లో కూచున్నంత మాత్రాన నాయకులైపోతే ఎల్లా? నాకు విముఖత ఏర్పడ్డానికి సహా ఇదే

కారణం. నాలాంటి యువకులం అందర్నీ సోషలిస్టులని తిడుతూంటే, యీ నాయకులు దేశాన్ని యేం ముందుకు తీసుకెళ్తారు? నాయకుల్లో లోపమా, అసలు తత్వంలో లోపమా? గాంధీగారి సిద్ధాంతంలోనే లోపం అయితే - ఇంతమంది ఆయన శిష్య కోటిలో ఎల్లా చేరారు? శిబిరంలో అప్పుడంతే వాలంటీర్లు ఎంతోమంది వచ్చి నాతో మాట్లాడారు. వాళ్లు జైళ్ల కెళ్ళొచ్చిన తరవాత - ప్రతీ వాలంటీయరూ ఆరి తేరిన సోషలిస్టులాగే మాట్లాడాడు- కుర్రాళ్లెవ్వరూ భగవద్గీత చదవడంలేదు. ప్రతీ వాడూ కూడా - ఏదో అసంతృప్తి వెళ్లబుచ్చడమేను. నాయకులంటే గౌరవంపోయింది. కాంగ్రెసు డబ్బున్నవాళ్ళ చేతుల్లోకి వెళిపోతున్నదేమో అనుకుంటున్నారు. కుర్రాళ్లు ఉద్యమంఆపేయడం వాళ్లెవళ్ళకీ పిసరంతైనా ఇష్టంలేదు. ఇంత త్యాగం వృధా అయిపోయిందంటున్నారు. నేను తిన్న దెబ్బలన్నీ వృధాయేనా? తల్చుకుంటే నిస్పృహావస్తోంది. నన్ను పాట్నా సభకి రమ్మంటున్నారు సుబ్బయ్య, రామ్మూర్తి వాళ్లున్నూ. వెళ్ళి ఏం ప్రయోజనం? మనమాట వినేవాడెవడు? అయినా - గాంధీగారే వున్నారుకదా! చివరంటా అయన్నే నమ్ముకోవాలి-పాలముంచినా నీటముంచినా

## 66

### అతడు

శాంతం నోటనుంచి విన్న ఆ శుభవార్త! ఈ వేళ పత్రికలో యీ శుభవార్త! యీ సత్యాగ్రహం ఆపుచేద్దాం అని ఇన్నాళ్లకేనా తోచింది ఈ గాంధీగారికి. ఆరు నెలలముందే ఆపేసి వుండవలసింది. నన్నడిగితే అసలు ఉద్యమం లేవదీయడమే శుద్ధ తప్పు. ఇంతకీ ఫలితం ఏమిటి? సగంమంది ఫకీరులయ్యారు, సగంమంది రౌడీలు సోషలిస్టులున్నూ తయారయ్యారు. చివరికి మళ్ళీ యథాప్రకారం. ఆ వొచ్చే డొమీనియను ప్రతిపత్తికూడ మాయం అయిపోయింది. నేను మొదటి దగ్గరనుంచీ అంటూనే వున్నాను - పట్టితే తిలక్కు మార్గం పట్టండి - లేదా గోఖలే మార్గం పట్టండి. రెంటికీ చెడ్డ రేవడిలాగు - యీ ఉద్యమం ఏమిటంటా? రాజకీయంలో అంటుతే బుర్ర లేకపోతే కాళ్ళు. నాకు మనస్కరించకే చేరలేదు. ఇంతకీ నేను చేరినా, శాంతం చేరినా, కీర్తనా ఉపకీర్తనా నాకేగా వచ్చేది? అందులోకి ఏదొచ్చినా అదికిముందు మన ఆంధ్రులకే కావాలి. జైలుకెళ్ళొచ్చారో లేదో ప్రతీ ఆంధ్రుడూ సోషలిస్టేకద. వీళ్ళకేం తెలుసు సోషలిజం అంటే? నాకు తెలుసు నేను ఇంగ్లండులో ఆరు సంవత్సరాలున్నాను. ఆ సోషలిజం అక్కడ పుట్టి పెరగాల్సిందేగాని మన దేశానికి పనికిరాదు. మన సాంప్రదాయమే వేరు. రాజన్నా, జమీందారన్నా, ధనవంతుడన్నా ప్రజల్ని

బిడ్డల్లాగ, డబ్బుని మైగ్లసొత్తుల్లాగు, తాము సంరక్షణ కర్తల్లాగు వ్యవహరించడమే. అలాంటిది ఇప్పుడిప్పుడే కాస్త పరిశ్రమలంటూ లేవతెస్తూంటే, యీ సోషలిజం ఒకటా అవి గొంత నాశనం కావడానికి? శాంతంచుట్టూ ఈ కుర్రాళ్లు మహా తిరుగుతున్నారు. ఈ శరీరస్థితిలో పాట్నా లేదు గీట్నా లేదు అని నేను రెండు కసురులు కసిరేసరికి ఎవరి మానాన వాళ్లు పోయారు. ఈ ఉద్యమ ఫలితం యిదొక్కటి కనిపించింది! లేనిపోనిది. ఈ కుర్రాళ్ళందరూ మళ్ళీ సహాయనిరాకరణం అంటూ ఏవుపద్రవమో తెచ్చిపెట్టరు కద? కాంగ్రెస్‌లో యీ పెద్దరికమే వున్నన్నాళ్ళు ఆ ప్రమాదం వుండకూడదు. అయినా పెద్దలందరికీ కాళ్ళు పీకిపోతూయి. అందులోకీ మళ్లీ ఎస్సెంబ్లీ ఎన్నికలు రుచిమరిగితే అసలు బుద్ధే తిరిగిపోతుంది! ఇంతకీ మనది మొదలు దగ్గిరనుంచి పంచాయతీ పద్ధతి. ప్రజాస్వామ్యం మనలోనుంచే పుట్టింది. అందుచేత పార్లమెంటు విధానంమీద మనకు మోజు వుండడం సహజమే.

అన్నట్టు-శాంతం ఈ ఉద్యమంలో దెబ్బలుతినడంవల్ల నా ఎడ్వకేటు జనరలు గిరీ పోతేపోయింది కాని ఆలోచించి చూస్తే అదీ నా మంచికే-నిపిస్తూంది. ఆరోజుల్లో అయివుంటే అందరూ నన్ను వేలుపెట్టి చూపించి దేశద్రోహి అని తిట్టివుందురు. ఇప్పుడు అందరూ ఏమంటున్నారు? ఎడ్వకేటు జనరల్ గిరీ పోయినా సరే భార్యనిమాత్రం ఉద్యమంలోకి పంపించేడంటున్నారు అందుచేత ఈమాటు పక్కా గొంతుతోనే హైకోర్టు బెంచీమీద కూరకొచ్చు-ఎప్పటికేనా కాంగ్రెసువాళ్ళు రావడంఅంటూ వుంటేను. ఇప్పటి నుంచీ అప్పుడప్పుడు ఖద్దరు వేసుకుంటూండాలి. ఈ గవర్నమెంటు ఆఫ్ ఇండియా యాక్టు పాసుకాకముందే ఏదేనా శాంతానికి పురుడు వచ్చేలోపుగా మళ్లీ ఏ హడావుడులు లేకుండావుంటే అదేచాలు.

## 67

### ఆమె

ఈవాళికి కలం ముట్టుకుని యేనాలుగు నెలలైందో! ఏమి జబ్బులు-బాబూ! బతికి బయటపడతాం అనుకోలేదు. తల్చుకుంటే, మళ్లా ఆ సావిత్రీ-సత్యవంతుడూ-యముడూ, రవివర్మ చిత్రించినబొమ్మ కళ్ళకికట్టి-ట్టుంది. ఆ నాజబ్బులోనూ - శాస్త్రి జబ్బులోను, ఆ బొమ్మ - అచ్చంగా ఆ బొమ్మే-యెన్నిసార్లు నా కళ్లముందర కొచ్చిందో గదా? ఇప్పటికి - నిజంగా ఆ యముడు అలా పాశంపట్టుకుని నాయెదుట నిలబడితే పో యిక్కడనుంచి పో-అని నేను నిజంగా అన్నా నేమోకూడా!... ఆవేళ [illegible]

వర్షం-వూహూవాడా యిలా యేకం అయిపోతూంటే-యిప్పుడా. ప్రధానమంత్రిగారింట్లో విందుకు హాజరుకాకపోతే మునిగిపోయిందేమిటి'' అని నేనన్నా వినాన్నాడు కాడు. ఆడయారునుంచి వచ్చేటప్పుడు కారు అల్లరి పెట్టిందిట-తడిసి ముద్దై ఇంటికొచ్చాడు. దాంతో న్యూమోనియాలోకి దింపేసింది. పదిహేనురోజులు నాకు నిద్రాహారంలేదు - ఒకరోజు మరీ భయంవేసింది. డాక్టరు మూర్తిగారి ధర్మమా అంటూ నెల్లాళ్లలో శాస్త్రి తేరుకుని మళ్లీ కచేరీకి వెళ్లడం మొదలెట్టాడు...

సరి - నాలుగురోజులైంది కాంసు - నావంతు! ప్రొద్దున్న ఎనిమిదిగంటలైంది "కాంగ్రెసు పెద్దలెవరో నిన్ను టెలిఫోనులో పిలుస్తున్నారు. శాంతం!" అని శాస్త్రి కేకేశాడు. సావడిలోనుంచి గుమ్మం దాటుతున్నాను - కాలు జారింది - పడిపోయాను. అసలేబరువుగావున్నాను - దాంతో - నానాచికాకు అయిపోయింది. నెల్లాళ్లమళ్లీని ఆస్పత్రిలో. వెనకటిపాపాయి పురిటి ఆస్పత్రిరోజులు జ్ఞాపకం వస్తున్నాయి. బాధ హెచ్చుగావున్నా - మనసులో ఆనందం ఆవేశం వుండేవి అప్పుడు. ఇప్పుడు - ఏమిటో అంతా బెంగే. ఆస్పత్రిలో అంతా పరిశుభ్రం - బయట అంతా కుళ్లు - ఏమిటిదీ - అనిపించేది.

యీ పుట్టుకలు - యీ చావులు - యీ అహంకారాలు - యీ డాబులు దర్పాలు - ఏమిటీనాటకం అనిపిస్తుంది. మళ్లీ రెండో క్షణంలోనే - శాస్త్రి పాపం ఒక్కడూ ఇంట్లో ఎలాగున్నాడో - వంట బ్రాహ్మడు సరీగా వేళకి భోజనం, ఫలహారంచేసి పెడుతున్నాడో లేదో - పాపాయి ఎలావుందో - తొమ్మిదిగంటలూ కొట్టేసరికి అన్నం పెట్టకపోతే వుండలేదు - ముందు వామూ యింత ఆవునేతి పిసరు కలిపి పెడుతూందో లేదో సుభ - అని ఇవే జ్ఞాపకంవొచ్చి - కడుపులో వేధించుకుపోతూంది.

శాస్త్రి రెండుపూటలూ వస్తాడు నన్ను చూడడానికి. పాపాయిని తీసుకుని పొద్దున్న సుభ, సాయంత్రం తామాకూ వస్తారు. నా జబ్బుకి శాస్త్రి చాలా చిన్నబోయాడు. కొడుకు పుట్టాలి - కొడుకు పుట్టాలి - అని యెంత పలవరించాడో - అంత ఆశాభంగం అయింది అతనికి - పాపం. నూరుపాళ్లేనా అని వుంటాడు నాతో - వల్లభజోశ్యుల వారివంశం మరి వుండదేమో - అంటూ. నాకేం అలా అనిపించడం లేదు - సరేకదా - వల్లభజోశ్యుల వారివంశం అంతరించితే - పుట్టి మునిగిపోయిందేముంది? - అనబోయాను కూడాను...

నలుగురు పిల్లలు చుట్టూ వుండాలి - మనవలిని మనవరాళ్లని యెత్తుకోవాలి - కోడళ్లూ అల్లుళ్లు ఇంటికి వస్తుండాలి వెళుతూండాలి - అని నాకు యేమాత్రం అనిపించదు. మరి నేను అందరి ఆడవాళ్లలాంటిదాన్నా - లేకపోతే ప్రత్యేకవ్యక్తినా?

యీ ప్రమాదం ఎందుకు రావాలీ - అని అప్పటే ఆలోచిస్తున్నాను - పదిరోజులైై. "నీ జీవితపంథా మార్చుకో - నీ స్వభావంలో చురుకుపాలు హెచ్చు - చైతన్యంకోరే! వ్యక్తిత్వం నీది" - అని నాతో ఎవరో చెపుతూన్నట్టు అనిపిస్తూంది. ఆశయమా? శకునమా ?

యీమధ్య మూడు నాలుగుసార్లు అస్పత్రిలో నన్ను చూడడానికి వచ్చింది - ఊర్వసీ మిత్ర. మొన్నసాయంకాలం - ఊర్వసీ వచ్చింది. అవిడ వెంటనే శాస్త్రీ వచ్చాడు - ఇద్దరు కలిసే వచ్చారా అనిపించింది. ఊర్వసి నేను కాలేజీలో కలిసి చదువుకున్నా - ఊర్వసీ అంటే నాకు మొదలు దగ్గిరనుంచి ఏమిటో కిట్టేది కాదు. అప్పటి రోజుల్లోనే మొగాళ్లవెంట పడుతూండేది అని అనేవారు. ఇప్పుడు పూర్తిగా బాహాటం అయిపోయింది. తండ్రి కలకత్తానుంచి వచ్చేసి చెన్నపట్నంలో ఏదో ఉద్యోగంచేసి చచ్చిపోయాడు. డబ్బున్నవాళ్లూ కారూ - పెద్ద కుటుంబం. ఊర్వసి బి. య్యే. అయ్యాక ఉద్యోగమూ చెయ్యలేదూ - మరెలాగు గడుపుకొస్తూందో! మళ్లీ - రోజు కోచీరె - మోటారుకారూ - రాయపేటలో ఇల్లు - అన్ని విందులకీ - వివాహాలకీ గార్డెను పార్టీలకీ అన్నిఫోటోలలోనూ - హాజరు! మళ్లీ చూస్తే - అందమూ లేదూ. శాస్త్రి ఊర్వసీ కలిసి నిలబడితే - నాకు అతి ఏవగింపుగావుంది. నేను అను మానం పడేమనిషిని కాను. కాని శాస్త్రి జాగ్రత్తగా వుండాలి. అతను వంటరిగా వుండలేడు. అయినా నేనేం అనకూడదు.

ఈ అస్పత్రి నెలరోజుల్లోనూ భారతం విరాటపర్వం చదివేను. పద్యాలు బోధపడతాయో బోధపడవో అని భయంవేసింది కాని - ఉగ్గుపాలతో అలవడిన భాష అర్థం కాకపోవడం ఏమిటి - అని ప్రయత్నించి - చదివేను. దేముళ్లని, దేవతలని పులుసు, ఖారంతినే మనలాంటి మనుష్యుల్లాగే చిత్రించి పారేశారు. అందుచేతనే ఎంత పురాతనగ్రంథం అయినా, ఆధునికంగా మనం ఎంత ఈ కాలపువాళ్లం అయినా, అంత సరదాగా చదివి ఆనందించగలుగుతున్నాం...

వక్కటి ఆశ్చర్యం వేస్తూందినాకు - పదిహేనేళ్లాయి గాంధీగారి నాయకత్వాన్న జాతీయోద్యమం నడుస్తోంది గదా - దేశంలో - అటువంటిది - మన ఆంధ్ర సారస్వతంలో కాని, ఆంధ్ర శిల్పంలో కాని - ఉద్యమాన్ని కథావస్తువగా తీసుకున్న వక్క పుస్తకం కాని, ఒక్క బొమ్మఎంతో వ్రాయలేకపోయాం - కళాసృష్టిలో ఇంత అథోగతిలో వున్నామే-ఆంధ్రులం- కాని, గొప్పలు చెప్పుకుంటామే? మనకీర్తి నిలబెట్టడానికని - "మాలపల్లి" ఒక్కటివుంది - వేలు నొక్కి చెప్పడానికి...అది తప్పితే - సున్న.

తాజా: ఇంటికొచ్చి పదిరోజులైంది. ఇంటికొచ్చానన్న ఆనందంలో దినచర్య వ్రాయడమే మరిచిపోయాను, తాయారు - సుభ - పాపాయి - శాస్త్రీ

శాస్త్రి అంటే నాకు అమితప్రేమ - అతనిలో ఎన్నిలోపాలు వున్నా - అతనంటే ప్రేమే...పదేళ్లు సంసారం చేసింతరవాతకూడా పెనిమిటిమీద నాకు ప్రేమ పోలేదు- అని అనగలగడం - గొప్పమాటే అనుకుంటాను...భార్యాభర్తలు అందరూ అలాగే అనుకుంటారనుకుంటాను ఎవరిమటుకువాళ్ళు!

## 68

## అతడు

శాంతం మళ్ళీ ఇంటికొచ్చి నలుగురిలోనూ తిరుగుతుందనుకోలేదు- ఆవేళ అంబ్యులెన్సులో ఆసుపత్రికి పంపించేటప్పుడు! శాంతం ఇంటికొచ్చి పదిరోజులైంది- ఇప్పుడు నాకు కాస్త మనసు కుదుటపడింది- యీ రెండు మూడు నెలలూ కీలుబొమ్మ లాగు వేళపట్టున పనులు చేసుకుంటూ గడిపేను. కాని - ఏం మనసు కుదుటబడదు! నా పదిరోజులు సుస్తీకేమిటి? శాంతం జబ్బుచేయడం - నేను కన్నకలలు, కట్టిన గాలిమేడలు - అన్నీ ఎగిరిపోయాయి. నా సుస్తీ, శాంతంజబ్బు - బోలెడు ఖర్చు అయిపోయింది. మళ్ళీ అదంతా కూడబెయ్యాలంటే ఎన్నాళ్లుపడుతుందో? నాకు ఉపచారం చెయ్యడం - తను మంచంపట్టడం - నేను తనను ఆస్పత్రిలో చూడడానికి వెళ్లి - బాచిగాడో - డబ్బో - అని సణుగుతూంటే - తనకి ఎంత చికాకు - ఎంత బాధగా వుండెనో కదా.

ఎంత మర్చిపోదాం అనుకున్నా మర్చిపోలేకుండావున్నా. బాచిగాడు - బాచిగాడని ఎన్నిఆశలుపెట్టుకున్నా - ఎంతో ఉబలాటపడ్డా. అన్నీ సున్నా అయి పోయాయి - అన్నీ అడుగంటిపోయాయి. మొదటిమాటే ఆశపడ్డాను. ఆడపిల్లని - మంత్రసాని చెప్పగానే - సరే మనచేతిలో యేంలేదు కదా - అని సమాధానపడ్డాను. సరి - పాపాయి - దాని సంరక్షణ, దాన్ని శింగారించడం - దాంతో రెండేళ్లు మూడేళ్లు గడిచిపోయాయి. తరవాత - కాంగ్రెసు - సత్యాగ్రహం - లాఠీచార్జీ - హరిజనసేవ - వీట్లలోపడి నాలుగేళ్లు నామాటే మర్చిపోయింది. సరి. అన్నీ బాగున్నాయనుకునే సరికి - ఈమాటు ఇలా దగా అయిపోయింది.

కొడుకేపుట్టాలి - కుటుంబం నిలబెట్టాలి- వంశం చిరస్థాయిగా వుండాలి - అను కోవడం ప్రత్యేకం పురుషుడి నైజం అనుకుంటాను. దేవుడేదిస్తే - కాయ అయితే

కాయ - పండైతే పండు - దాన్నే కళ్లకద్దుకుని - తృప్తిపడడం - స్త్రీస్వభావం. నూరుసంవత్సరాలు - వెయ్యి సంవత్సరాలు - అయనాలు, యుగాలు- అనంతకాలం- ఇలా చరిత్రాత్మకంగా ఆలోచించడం స్త్రీనైజంకి విరుద్ధం. అంచేతే మనవాళ్లు- బాలా త్రిపురసుందరిని శక్తిగా పూజించినా - బ్రహ్మనే సృష్టికర్తగా చేశారు. ఆర్యులు సింధునదీతీరాన్ని ఏకొద్ది శతాబ్దాలపాటో సమష్టిగా జీవించినా - ఆర్యావర్తంలో స్థిరనివాసం ఏర్పరచుకోగానే- సంఘజీవనంలోనూ, కుటుంబజీవనంలోనూ - పురుషునికే ప్రాముఖ్యతఇచ్చి - సమాజాలు - రాజ్యాలు - ధర్మాలు - ఏర్పరుచుకున్నారు. శాంతంతో యీమాటచెప్పి లాభంలేదు- ఒకమాటుననన్ను "కొరకుబారిన కాపిటలిస్టు" అంది !......

పాపాయంటే నాకు ప్రాణంశాంతం. ఆసుపత్రిలో వున్న నెల్లాళ్లూ- నా మంచం దగ్గిర తన వుయ్యాలమంచం వేయిస్తేనేగాని పడుకునేదికాదు. ఆ నెల్లాళ్లూ 'అమ్మ' అనమాట మర్చేపోయింది -ఎంతసేపూ "నాన్న - నాన్న" అనే. అయినా యేముంది - మరి పదిపదిహేనేళ్లయాక - యీ చెట్టునుంచి రెక్కలు కట్టుకుని ఎగిరిపోయి - మరోచెట్టుమీద గూడుకట్టుకుంటుంది.

డాక్టరు గురుమూర్తి మొదలియార్‌గారిని తరిచి తరిచి అడిగేను - శాంతం వంట్లో అంతర్గతంగా మరేం జబ్బులేదుకదా అని. ఎంతమాత్రంలేదు - అప్పుడు లాఠీఛార్జీలో దెబ్బలు తగలడంవల్ల లోపలి అవయవాలు ఇంకా పచ్చిగానేవున్నాయి. అవి ఆదరకుండామాత్రం చూసుకుంటే - మరేం భయంలేదు - ప్రమాదం అంటకంటే లేదు - అనిచెప్పాడు. శస్త్రంచేసిన వైద్యులు ఇద్దరూ కూడా అలాగేఅన్నారు. అంచేత నేనెంతమాత్రం బాచిగాడిమీద ఆశవదులుకోలేదు.

అయినా యోగించాలి. అంచేతే మనపూర్వులు సుపుత్రజననంకోసం ఎంతో తాపత్రయపడేవారు. యాత్రలు, ఉపవాసాలు, తపస్సులు - చేసేవారు. జాతకఫలం - నక్షత్రబలం - ముహూర్తవిశేషం - వ్రతఫలం అనుకునేవారు. "కర్మ" అంటే - అది వక సివిల్ ప్రొసీజరు కోడ్డు అనమాట. కర్మానుభవం తప్పించుకోవడానికి - జపాలు, హోమాలు, శాంతులు - ఒక మోస్తరు - స్టే ఆర్డర్లు, ఇంటరిమ్ ఇంజంక్షనులు, కౌంటర్లు - అనమాట.

కొంచెం మనం నమ్మితే - మిగతాదంతా సబబుగానే వుంటుంది. చాదస్తం-మూఢనమ్మకం అని కొట్టేడానికి వీలులేదు. ఈ యుద్ధం వచ్చాక- పాశ్చాత్యదేశాల్లో నమ్మకాలు ఎంత పెరిగేయో - సత్యాగ్రహం వచ్చింతరవాత మనదేశంలో కూడా అంత హెచ్చయాయి... ఈ ఉద్యమం నాకుసురుకే వచ్చినట్టుంది కాని - అప్పుడూ

ఆలాఠ్‌చార్జీ మూలాన్ని ఎడ్వకేటు జనరల్ గిరీ ఎగిరిపోయింది - ఇప్పుడూ కాంగ్రెసువాళ్ల పిలవడంమూలాన్ని బాచిగాడు ఎగిరిపోతాడు.

శాంతం త్వరగా ఆరోగ్యవంతురాలవాలి. అన్నట్టు లాడిబేటింగు సొసైటీ ఉపన్యాసాలివ్వడానికి జస్టిస్ రాధాశ్యామాణీ వస్తున్నాడు కరాచీనుంచి - గొప్ప సిద్ధాంతి, త్రికాలజ్యోతిష్కుడు, హనుమంతోపాసకుడు అని పేరు - ఆయన్ని సలహా అడుగుతాను - కుంభహారతి చేయించమంటాడేమో. ఒక్కటేచిక్కు - శాంతానికి తెలియకుండా కొంచ నడిపించాలి. తెలిసిందంటే మండిపడుతుంది.

49

## ఆమె

శుభలేఖ చదివేను.

"పెండ్లి పిలుపు - కామాక్షి వరదరాజం - కొత్తూరి శివసుబ్రమణ్యాం: ధాతృ నామ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౦ శుక్రవారం: సాయింకాలం 6-30: బండ్లవారితోట-పరశువాకం". ఎవరు చెప్మా - అనుకున్నాను! ఇంతట్లో శాస్త్రి హడావుడిగా వచ్చి-"లేడీ అయ్యంగారుకి సుబ్బయ్యకి మంచి అందం అయిన వస్తువ వకటి పెళ్లి కట్నం ఇవ్వాలి మనం- సాయంకాలం మౌంటురోడ్డు వెళదాం" అన్నాడు. అప్పుడు తెలిసింది!

......పెళ్లికి వెళ్లాం. లేడీ అయ్యంగారు ఎంతో అందంగా వుంది. అసలే చక్కని మనిషేమో - చిన్న కుంకుం బొట్టు పెట్టుకుంది - మరీ చక్కగా వుంది. "బుగ్గలకీ, పెదిమెలకీ రంగేసుకుంది - ఇంకా ఎవరిని వలలో వేసుకోవడానికని!" అని సీతా చంద్రం అంది. కాస్త గట్టిగానే నలుగూరు వినేటట్టూ. అసూయ మాటలకేంగాని - అందం మీద బొట్టు మరింత రాణించింది. మొట్టమొదట రోజుల్లో రామయ్యంగారు బతికివున్నప్పుడు నన్ను ఆమెతో పరిచయం చేసిన రోజుల్లో - ఆవిడంటే నాకూ కొంచం అసూయగానే వుండెను. ఆవిడంటే భయంగానే వుండెను - ఎప్పుడేనా శాస్త్రికి కళ్లు జిగేలుమని పోతాయేమోనని. తరువాత ఆవిడ పెనిమిటిపోయి - ఇంకా పరిచయం హెచ్చు అయాక - ఒప్పుకోవాలి కదూ - నాకు అనుమానంకూడా వేస్తూండేది - శాస్త్రివేపు ఆవిడ విసిరే చూపులు - ఇతని హాస్యాలు - చూస్తూండే

సరికే. కాని నాదే పొరపాటు - అందం అయిన స్త్రీ - డబ్బుంది - అందరితోను కలిసి మెలిసి తిరగడం అంటే సరదా - అలాంటప్పుడు పూజలర్పించేవాళ్లు కేంకొరుదవ?

కాని - సుబ్బయ్యకీ ఈవెడికీ పరిచయం అయినట్టు నా కెప్పుడూ తెలీలేదే! అసలు వాళ్లిద్దరిదీ ఒకజట్టు కానేకదుకదా ?...సిబిరంలో వున్నప్పుడు సుబ్బయ్యా - సుబ్బయ్యా - అని పిలవడం తప్ప - అసలతనిపేరే నాకు తెలియదు. ఆ రోజుల్లో - అప్పుడే అతను సబర్మతీ ఆశ్రమాన్నించి వచ్చాడేమో - తలంతా తిరుపతివరం - గోష్పాదం అంత పిలక - పొట్టిగా పంచ - వంటిమీద ఉత్తరీయం - అసలు ఖద్దరు మనిషంటే "ఓయి!" అన్నట్టు! కాని - అతని ముఖంలో మంచి నాజూకు - తెలివి వుండేది. వాలంటీర్లందరిలోకి అతనంటే నాకు హెచ్చు అప్యాయంగా వుండేది. లాఠీ ఛార్జీ అయిం తరవాత మళ్లీ మొన్న నా జబ్బులో చూశాను. అప్పుడు తెలిసింది- అతని పుట్టు పూర్వోత్తరం - శాస్త్రి చెబితే.

వాళ్లదీ గొవ్వూరు దగ్గిర పొన్నూరట. తాత ముత్తాతలనుంచి మంచి భూవసతి వున్నవాళ్లట. అరువేల నియోగులు. కంపెనీ పొగాకు చ్చిం దగ్గిరనుంచి ఆ వ్యాపారంచేస్తూ బాగా డబ్బు సంపాదించారుట. సుబ్బయ్య పొగాకు వ్యాపారం మీదే ఇగ్లాండు, అమెరికా వెళ్లాడుట. తరవాత ఉద్యమంలో చేరడం - జైలున్నూ. ఉద్యమానికి చాలా డబ్బు సహాయ్యం చేశాడుట. మొన్ననే వ్యాపారం మీద హాంకాంగు, షాంగహై వెళ్లి వచ్చాడుట.

అతిథులందరికీ స్వాగతంఇస్తూ వాళ్ళిద్దరూ ఒకరి ప్రక్కన ఒకరు నిలబడివుంటే నాకు ఎంతో సరదాగావుండెను. సుబ్బయ్యది పొగాకువ్యాపారం అయినా కాంగ్రెసు వాడవడంచేత ఖద్దరు మధుపర్కాలే కట్టుకున్నాడు. లేడీ అయ్యంగారుమాత్రం- నాకు లేడీ అయ్యంగారనేవస్తుంది!- జార్జెటుచీరె, పట్టుబాడీసున్ను - అచ్చంగా విదేశీ బట్టలే. రాజకీయంగా ఇద్దరుదీ వేరు వేరు తోవలుకదా - సంసారం హాయిగా వెళుతుందావీళ్ళిద్దరిదీని - అనిపించింది.

మనదేశం పరాధీనంగా వున్నన్నాళ్లు కుటుంబాల్లో రాజకీయంగా అభిప్రాయ భేదాలుంటే సౌఖ్యానికి ప్రతిబంధకమే. తల్చుకుంటే - నాకే భయంవేస్తుంది - శాస్త్రికి నాకు ఎప్పుడేం వొచ్చిపడతుందో అని. ఇప్పుడేం వుంది ఉద్యమం అంతా ఆగిపోయింది. కాని మళ్లీ ఉద్యమం ప్రారంభం అయితేనో - శాస్త్రి ఏ ఎడ్వకేటు జనరలో అయి - నేను ఏ జైల్లోనో, ఏ కాంగ్రెసుదళంలోనో పని చేస్తూంటే - అసలు ఇద్దరం కలిసివుండడం ఎలాగు? ప్రేమకంటే అతీతంకదా - దేశం?

లేడీ అయ్యంగారు మంచి గడుసు మనిషి - తెలివితేటలు గలది. అంచేత తప్పకుండా మారిపోతుంది. రాజకీయంగా సుబ్బయ్యకి చేదోడు వాదోడుగావుండి - అతన్ని

మంచి వృద్ధిలోకి తీసుకువస్తుందనే నాకు తోస్తూంది...ఆ వేళ లారీఛార్జీ జ్ఞాపకం వస్తూంది - సుబ్బయ్య, రామస్వామి, నేను! తల్చుకుంటే - అదోజన్మం అనిపిస్తూంది... వధూవరులు సుఖంగా వుండాల్సింది - అని మనఃపూర్తిగా ఆశీర్వదించేను.

నేను శాస్త్రి సుఖంగావున్నాం. 'సంసారం సాగరం దుఃఖం' అని మాతాత రోజుకి అథమం పది సార్లేనా అనేవాడు - మా చిన్నతనంలో. ఆ మాట ఆయనకి ఊతపదం అయిపోయింది. ఆయన ఆ మాట అనేటప్పుడల్లా - మా తొమ్మండుగురు మేనమామలు - మా ఆరుగురు పిన్నిలు మా కళ్ళముందర కనిపించగానే - చిన్నపిల్లలం మేం పకాలని నవ్వేవాళ్ళం! నా సంసారం నాకు క్షీరసాగరంగానేవుంది మొత్తం మీద! కాని - శాస్త్రిమాత్రం -మరీ గడుసుగా ప్రవర్తించకుండావుంటే బాగుండును - అనిపిస్తుంది - అలా ప్రవర్తించినప్పుడుమాత్రం - నిజంగా దుఃఖసాగరమే అనిపిస్తుంది.

కారులో ఇంటికివస్తూ శాస్త్రిని అడిగేను: "పెళ్ళిపెద్దవికదా, శాస్త్రీ! నాకి సందేహంతీర్చు. పెళ్లేమో రిజిస్ట్రారు ఎదుటజరిగింది. మళ్లీ ముహూర్తం, తిథి, వారం, నక్షత్రం, లగ్నం - ఏమిటోయి?"

"దానికేముంది - శాంతం! ఒక్కటి పద్ధతి - రెండోది సాంప్రదాయం! ఇద్దరు జాతకాలు వేయించి, ముహూర్తం నేనే పెట్టించాను చిట్టి గూడూరు నరసయ్య సిద్ధాంతిగారిచేత. ఇంతకీ పూర్వాచారం పాటించడంవల్ల మనకేం నష్టంలేదు. వస్తే మంచి రావచ్చు - లేకపోతే లేదూ.నమ్మిచెడినవాడులేడు-నమ్మకచెడిపోలేపొయ్యేరు!" అన్నాడు.

"జానక్యాః కమలాంజలిపుటేయాః - అన్న శ్లోకంకూడా అచ్చువేయించలేక పోయావూ శుభలేఖలమీద?"అన్నా.

"ఆ శ్రీరామచంద్రమూర్తి జానకీదేవి శిరస్సు పై తలంబ్రాలు పోయుచూం డగా..." అనిరాగం తీయడం మొదలెట్టాడు.

"చాలు - చాలు! అంతటితో అగు - యీ ధోరణిచూస్తే కారు చెట్టెక్క గలదు" అన్నా. నవ్వుతూ ఇంటికిచేరుకున్నాం.

# 70

## అతడు

నన్ను పెళ్ళి పెద్దనిచేసినందుకు - అంతా అతి దివ్యంగా జరిగిపోయింది ! చెన్న పట్నం అంతా అక్కడేవుంది. రాజులు - జడ్జీలు - వకీళ్లు - ఉద్యోగస్థులు - కాంగ్రెసు పెద్దలు - సత్యాగ్రహులు - వర్తకులు - ఛేంబరు ఆఫ్ కామర్సు ధొరలు - ధొరసాన్లు - పేరెన్నికగల వాళ్ళందరూ - వచ్చారుకదా. మోటారుకార్లేమిటి - ఇలా తిరగబడి పోయాయికదూ. పోలీసుబందోబస్తుకూడా చాలా బాగా వుండెను - సుబ్బయ్య రెండు సార్లు జైలుకు వెళ్లాడా - అంచేత పోలీసు పెద్దలందరూ అతనికి పరిచయస్థులే.

అంతా నిమిషాలమీద నడిపించాను. సరిగ్గా సుముహూర్తం వేళకి - రేడి యో గ్రీన్విచ్చి గంటకొట్టింది - రిజిస్ట్రారుముందు సంతకాలైపోయాయి. కాల మానంలో ఒక లిప్తపాటు వ్యత్యాసరాకుండా చిట్టికూడూరి సిద్ధాంతిగారిచేత పెట్టించాను లగ్నం. సంతకాలు అయాయోలేదో - యాభైమంది పండితులు - "శతమానం భవతి శతాయుః" అని ఆశీర్వచనం చెప్పారు - అక్షింతలు కురిసేటట్టు - చిన్న ఎలెక్ట్రిక్కుమర వకటి అమర్పించేను. అందరూ చప్పట్లుకొట్టేరు...

బండ్లవారితోట - మంచి ఆవరణ - ఒక చోట భరతనాట్యం - ఒక పందిరకింద పాటకచ్చేరీ - మరోషామియానాకింద - కవి సమ్మేళనం - మరో పర్ణశాలలో హరికథ - ఒక పాకలో కాఫీ ఉప్మా ఫలహారాలు - పెద్ద మర్రిచెట్టుంటె దానిక్రింద ప్రిజిడెయిర్ చిన్నకాక్ టెయిలు బార్ ప్రత్యేకంగా ధొర్లు ధొరసాన్లు మనలో పెద్దవాళ్ళకి. ఇంక కాంగ్రెస్‌వాలంటేరు జట్టుందిగా - వాళ్ళకి గంగాళాళ్ళతో పానకం - కాస్త ఇలాంటి అలాంటి వాళ్ళందరికి బీడీలు - పెద్దవాళ్ళందరికీ దిండిగల్లు చుట్టలూ త్రీకాసిల్సు సిగ రెట్లున్నూ - ఇంకా పెద్దవాళ్ళకీ జమీందార్లకీ హుక్కాలు. చెట్లకింద - కుర్చీలు - సోఫాలు - తివాచీలు - బాలీసులు. మధ్య పెద్ద జంబుఖానామీద భాగవతశ్రవణం.

తీర్థప్రజే ! తెల్లధొర్లు - నల్లధొర్లు, తెల్లధొరసాన్లు - నల్లధొరసాన్లు - గాంధీ టోపీలు - డిన్నరుసూట్లు - ఖద్దరు పంచలు - మల్లుధోవతులు - ఇంగ్లీషు - సంస్కృతం - పాశ్చాత్య పద్ధతులు - హిందూసాంప్రదాయం - ప్రాచ్యప్రతీచీ - మహాతమాషాగా మిళితంచేశాను. ఆ ఏర్పాట్లకి మెచ్చుకోనివాళ్లు లేరుకదా !

కాంగ్రెసు చిన్న పెద్దలందరూ " శాస్త్రిగారూ! సుభాష్‌చంద్రబోసు కలకత్తా కాంగ్రెసు నడిపించినట్టునడిపించారండీ !" అన్నారు.

జమీందార్లు, రాజులు, గవర్నమెంటు ఉద్యోగులు: "హార్డింజి - ఢిల్లీదర్బారు జ్ఞాపకం తెప్పించారండీ!" అన్నారు.

సర్ ఆర్థరు యంగు-లేడీ ఆబెరీస్మిత్తు అన్నారు ఇద్దరూ ఒక్క గుక్కతో: "క్వీను ఎలిజిబెత్తు-హాంప్టన్‌కోర్టు లాగుందోయి! శాస్త్రీ." - వీరిపొగడ్తే నాకు బాగా నచ్చింది.

లేడీ అయ్యంగారు అంది పాపం నాతో: 'శాస్త్రిగారూ! నాకు పెళ్ళి' కావటం - మావారి దగ్గిర మీరు జూనియర్‌గా ప్రవేశించడం - వక్కమారే జరిగేయి. అప్పటినుంచి ఇప్పటివరకు - సుబ్బయ్యతప్ప - మీరొక్కరే నాకు నిజమైన స్నేహితులు. అంచేత యీ పెళ్ళిభారం అంతా మీరే మీదవేసుకొని చేయించాలి!" అంది. 'మంచి చాకచక్యం గల వ్యక్తి. చురుకైన మనిషి. అందకత్తె. పాండిత్యం లేకపోయినా తెలివిగలది. కాంగ్రెస్సంటే ఆవిడకి అవగింజంతైనా అభిమానం లేక పోయినా ఇప్పుడు సుబ్రహ్మణ్యాన్ని పెళ్ళి చేసుకున్నానని చెప్పి కాంగ్రెసులో చేరదు. అటువంటి పట్టుదల మనిషి. ఆవిడ అంటే నాకు మొదటినుంచీ సరదా వేసు.

సరే - కిట్టనివాళ్లు - ఆవిడని కులుకూ - వొయ్యారం - అని తెగబారెడు అంటారుగాని నాజూకూ, సరసం ఆవిడలో ఉట్టిపడుతున్నాయి. శాంతంతో తైఫాకు వెయ్యడంకాదు గాని - లేడీ అయ్యంగారు ఎదురుగా వుంటే - ఒక మోస్తరు వసంతకాలపు వెన్నెలలాగుంటుంది. శాంతాన్ని కనుక నేను మొదట కలుసుకో పోయుంటే లేడీఅయ్యంగారిని పెళ్ళాడి వుందును - ఇప్పుడు ఆవిడకి పెళ్లి అయి పోయింది కనుక- గట్టిగా అనుకున్నా తప్పులేదు. అంతకంటె ఆవిడని పొగడ్డానికి నాతరం కాదు!

సుబ్రహ్మణ్యం అదృష్టవంతుడు. శాంతం లాఠీ ఛార్జీలలో దెబ్బలు తిన్నరోజుల్లో అతడిని చూస్తే నాకు అతి కోపం వచ్చేది. అతడిని రక్షించడానికే గదా శాంతం సత్యాగ్రహంలోకి దిగడం - నా ఎడ్వకేటు జనరల్ గిరీ పోవడం. నిజంగా సుబ్బయ్యే అందుకు కారణం. మొన్న శాంతం జబ్బులో రెండు మూడు మాట్లు ఆమెని ఆస్పత్రిలో చూడడానికి వెళ్లేడు. నాకు కొంచెం అనుమానం వేసిందికూడాను. అయితే అతని వెంటనే లేడీ అయ్యంగారు వుండడంచేత నాలో నేనే చంపలు వేసుకున్నాను.

లేడీ అయ్యంగారు సుబ్రహ్మణ్యం హాయిగా కాపురం చేస్తారనడానికి ఏమీ సందేహం లేదు. సంసారం నడుపుకోడానికి కాస్త పొత్తూ ప్రేమ వుంటే చాలు. మొత్తంమీద రాజీ మార్గాన్నే పోతుండాలి. అంచేతే నేనూ శాంతం హాయిగా పోతున్నాం...

...ఆ కుసుమ హరినాథుడు రెండు వరాలు ప్రసాదిస్తే నాకంతే చాలు. వంశం నిలబెట్టుకోడానికి కొడుకు - డబ్బు కూడబెట్టుకోడానికి అడ్వకేటు జనరల్ గిరీ.

ఇద్దరం ఇంటికొచ్చేటప్పటికి పన్నెండైపోయింది. మారిసన్సు బట్లరు కాక్ టెయిల్సు మహా బాగా కలిపేడు! జడ్జీగారితోను, మంత్రిగారితోనూ వకమాటు పుచ్చుకున్నాను. రెండోమాటు మిసెస్సు సిల్వియాథార్క్ డైకుతోను ఊర్వసీ మిత్రతోను పుచ్చుకున్నాను. మూడో మాటు పుచ్చుకోడానికని వెళ్లేను - కాని ఎక్కడనుంచి వచ్చిందో - శాంతం - చెయ్యి పట్టుకుని పిలుచుకొని పోయింది. వాడి తస్సాదియ్యా - మహా గొప్ప బట్లరండీ! అమృత హస్తం!

## 71

### ఆమె

శాస్త్రిలో పెద్దమార్పు వచ్చేస్తోంది. కారుడ్రైవరు దేవిడ్డు భార్యకి యీ మధ్య పురుడువచ్చి జబ్బుచేసింది. ఇప్పుడెలాగుందో కనుక్కుందాం అని అతనితో మాట్లాడుతూ యేదో ప్రసంగవశాత్తూ:

"ఏమిటోయి! మన ప్యాకార్డు మరీ పెట్రోలు మింగేస్తోంది - పదిమైళ్లేనా రావడంలేదు?" అన్నా.

అంటే: "అవును అమ్మగారూ! అయ్యాగారు మరీ మెల్లిగా పోనీయమంటారు. అందుగోక్కీ రెండు నెలలై రోజుకిముప్ఫై నలభైమైళ్లు సవారీ అవుతూంది. రోజూ కోర్టునుంచి తిరువత్తియూరు కోవిలకి వెళుతున్నారు అయ్యాగారు. చెవ్రలెట్టు వాడుదాం అంటే వద్దంటారు" అన్నాడు.

ఏమిటి దీని అర్థం అని నేను అట్టేఆలోచిస్తూంటే - రాత్రి క్లబ్బునుంచి ఇంటికి వచ్చి: "శాంతం! నేను రాత్రి భోజనంచెయ్యను - క్లబ్బులో ఫలహారం చేశాను. మ-రి-గం-టే - రేపు మా నాన్న తద్దినంకూడాను" అన్నాడు శాస్త్రి.

నేను తుళ్లిపడి "ఇదేమిటి? యీ పదేళ్లాయిలేని తద్దినం ఇప్పుడు పెట్టడం ఏమిటి?" అన్నా. "పదేళ్లాయి పెట్టకపోయినా కాలదోషం అంటూ లేదులే!

ఇప్పుడు పెట్టకూడదని 'ఎస్టాపెల్లూ' లేదూ!" అన్నాడు. అంటూ: "నువ్వు ఏం ఇబ్బంది పడనక్కరలేదు. నీవంతు "ప్రాక్సీ" నాకుందిగా, ఏర్పాట్లన్నీ నేను చేసేశానులే. భోక్తలని నలుగురూ, మంత్రంచెప్పే పౌరోహితుడూ, సాయంత్రం ఆరు గంటలకే మనయింటికి వచ్చి హాజరై రాత్రి ఇక్కడ పడుకునేటట్టు ఏర్పాటు- లేకపోతే వాళ్లు రాత్రి సుష్టీకృత్తుగా భోంచేసి- పొద్దున్న ఇడ్డెనులు, కాఫీ సేవించి యే పదిగంటలకో వస్తారు. మనఇంటిదగ్గిరే పడుకునేటట్టుచేస్తేనే పవిత్రంగావుంటారు" అన్నాడు. వంటిపూట అయిందేమో బ్రాహ్మర్లకి - పాపం - సూర్యోదయం అవగానే మొదలుపెట్టేశారు. సరిగ్గా తొమ్మిదికొట్టగానే బెంగుళూరు హోటేలువాళ్ళ కారు - ఇద్దరు బ్రాహ్మణకుర్రాళ్లు- ఒక నాయరు, నాలుగు కూరలు- నాలుగు పచ్చళ్లు నాటుచారు - బక్షణం - గారెలు పరమాణ్ణం - చద్ది - వబ్బట్టు - పెరుగు - ఉప్పు - పంచదార - నెయ్యి - నూనె - పచ్చిమిరపకాయలు - పట్టుగుడ్డ చుట్టిన ఏడు పెద్ద టిఫిన్ కారియర్లతో పాటు - ఏడు అరిటాకులు - నలుగురు భోక్తలు - మంత్రంచెప్పే అతను - శాస్త్రి - దేముడికి విస్తరి - చిన్నకారియర్లో పారణానికి "ఎకస్ట్రా". పదకొండూ కొట్టేసరికి - అంతా పూర్తి అయిపోయింది. సైకిళ్లమీద బ్రాహ్మర్లు మోటారు వేనులో హోటేలువాళ్లు - ప్యాకార్డుమీద శాస్త్రిసిస్త - అందరూ ఎవరి మాన్నవాళ్ళు వెళిపోయారు!

నాకేం పాలుపోకుండావుంది. యీ తద్దినం పెట్టడమేమిటి - నమ్మకం వున్నట్టా - లేనట్టా? అసలుప్రశ్న - మతం సంస్కారం - ఇంత సులువుగాను లాంఛనప్రాయంగానూ చేసేస్తే - అసలు ఆర్యసంస్కృతే పోతుందేమో? ఛాందసం- నిష్ట - నియమం - ఇవి అర్థంచేసుకోగలను. కాని గిరీశం "ఆల్జీబ్రా మేడ్ డిఫికల్టు" లాగు - ఈ "రిలిజన్ మేడ్ ఈజీ" పరమ దగాకోరుతనంకింద తయారవుతుందేమో?-

అని ఇలాగు తర్కించుకుంటున్నాను - ఇంతట్లో శాస్త్రి క్లబ్బునుంచి ఇంటికొచ్చేశాడు - టెన్నీసు కమీజు, వులెను స్వెటరు, బ్లేజరు, తెల్లఫ్లానెలున్సు, క్యాన్వాసు జోడు, టెన్నీసు రాకెట్టున్న "శాంతం" అంటూనే మేడమీదకి వెళిపోయాడు. మరో పదినిమిషాల్లో కల్లా - స్నానంచేసి క్రిందికొచ్చేశాడు. చూదును - పిఠాపురం కోరా ఖద్దరు నూటు - తిరుపూరు ఖద్దరు కమీజు! నేను నిశ్చేష్టురాలై చూస్తున్నాను. నన్ను ముద్దుపెట్టుకొని:

"నన్ను సర్ ఛున్నీలాల్ మాధవజీన్ని, సర్ రిచర్డు బ్లాకుస్టోనున్నూ మద్రాసు క్లబ్బులో భోజనానికి పిలిచారు. చాలాముఖ్యమైన విషయం. నన్నాశీర్వదించి సాగనంపుమీ!" అంటూ నవ్వుతూ కారెక్కి వెళ్లిపోయాడు.

ఇంతట్లో గుమ్మంలోకి ఎవరో వచ్చినట్టయింది. "ఓహో! రామస్వామిగారా! దయచేయండి!" అని లోపలికి. తీసుకు వచ్చాను. సత్యాగ్రహం రోజులైపోయాక రామ

స్వామిని రెండు మూడు మార్లు కలుసుకున్నా. సంవత్సరం అయి చూడలేదు. కుశల ప్రశ్న లయింతరువాత అతనన్నాడు. "నేను సంవత్సరం అయి రైతుసభలను యేర్పాటు చేస్తున్నాను. కార్మికవర్గాన్ని జాతీయోద్యమంలోకి లాక్కువచ్చినట్టు కర్షకవర్గాన్ని కూడా మనం తయారు చెయ్యాలి. జమీందార్లకి భయపడి ఎవ్వరూ దీనిగురించి అంత పూనుకోవడంలేదు. నేనూ మరికొందరు సత్యాగ్రహులం తంటాలు పడుతున్నాం అనుకోండి. మీరుకూడా ఇందులోకివచ్చి పనిచేస్తే బాగుంటుంది" అన్నాడు.

"నేను జబ్బు మనిషిని అయపోయానండీ, రామస్వామిగారూ! అంచేత ఉడతా భక్తిగా చాటునుండి సాహాయ్యం చెయడం తప్ప ముందుకువచ్చి పనిచేయ లేనండీ క్షమించండి !" అన్నా.

"సరే దానికేం గాని - అసలు మరోసంగతి మీతో మాట్లాడానికని వచ్చాను. ఎన్నికలు మరినాలుగు నెలలలో జరగబోతున్నాయి. వచ్చేనెలలో కాంగ్రెసువారు అభ్యర్థులను ఏర్పరుస్తారు. అప్పుడు మనశిబిరంలో వున్న సత్యాగ్రహులందరం మొన్న కలుసుకుని స్త్రీలస్థానానికి ఒకదానికి మీరు నిలబడితే బాగుంటుంది అని అనుకున్నాం నాయకులతో చెప్పాం. మీరు నిలబడితాం అంటే తప్పకుండా మీపేరే సూచిస్తాం అని వాగ్దానం చేశారు. అందుకు మీఖరారు తీసుకుందాం అనివచ్చాను" అన్నాడు.

"నాపేరు సూచించినందుకు మీకూ, మన స్నేహితులందరికీ నా వందనాలు చెప్పండి. నాలుగైదు రోజుల్లో ఆలోచించి మీకు ఖబురుచేస్తా" అన్నా ఆయన వెళ్లిపోయాడు.

నాకేం తోచడంలేదు. రాజకీయాలకి దూరంగా వుందాం అంటే మీదకొచ్చి పడుతూందే. శాస్త్రి భవితవ్యానికి ఏమేనా అడ్డువస్తూందేమో ? సంసారం చేస్తూ - రాజకీయంలోకి దిగగలనా ? ఎసెంబ్లీలో కూర్చోవడంతో సరిపోను. రేపు పొద్దున్న మళ్లీ - స్వతంత్రయుద్ధం ఏవిధంగా పరిణమిస్తుందో ? అప్పుడు వెనక్కి తగ్గకూడదు. నాలక్ష్యం ఎప్పుడూ "సహవీర్యం కరవావహై !" నా మటుకు నే నాలోచించుకుని, తరువాత శాస్త్రితో చెపుతాను.

# 72

## అతడు

నా రొట్టె నేతిలో పడ్డట్టే! నేను మద్రాసు క్లబ్బులోకి వెళ్ళేసరికి సర్ మాధోజీన్నీ, సర్ రిచ్చర్డ్సన్ను నాకెదురుగుండా వచ్చారు. హిందుస్థాను నేషనల్ స్టీల్ కంపెనీకి వీళ్లిద్దరూ పెద్దలు. వీరికంపెనీకి లండనులోవున్న మిస్ లెండు స్టీలుకంపెనీకి లావాదేవీల్లో తగాదాలు వచ్చాయిట. వీళ్ళ పుస్తకాల ప్రకారం ఇరవైలక్షలు రావాసివుందని వీళ్ళంటూన్నారట. మాకే రావాలి - పదిలక్షల చిల్లరవరకూ అని వాళ్ళంటూన్నారట. చివరికి వీళ్ళే దావా వెయ్యడానికి నిశ్చయించారట.

“మొన్న స్వదేశీ ఐరన్సు కేసులో అవతలవేపు గ్రాండున్ను, నరసింహాయ్యంగారు వున్నా - మీరు అతి చాకచక్యంగా వాదించి వాళ్ళపక్షం గెల్పించారు. మేం అందరం మహా మెచ్చుకున్నాం. మా వకాల్తీకూడా మీరే పుచ్చుకోవాలి సుమండీ! బొంబాయినుంచి బారిష్టరుని మేం పెట్టినా మీరు జూనియర్‌గా నేలెండి. మీ ఖర్చులు పోను ఇరవైవేలు ఇస్తాం. మా సొలిసిటర్లు మీపేర రేపు ఉత్తరం రాస్తారు. మనం ముఖస్తంగా మాట్లాడుకుందాం!” అన్నారు.

శాంతం వీరి ప్రసంగం వింటే ఎంతో సంతోషిస్తుంది. రేపు అంతా పూసగుచ్చినట్టు చెప్పాలి. ఎడ్వకేటు జనరలు గిరీ పోతే అట్టేపోయే - ఇల్లాంటి కేసు నాకొచ్చిందంటే ఇక కావలసిందేవుంది? గెల్చినా - ఓడిపోయినా - యీకేసు తప్పకుండా ప్రీవీకౌన్సిలుకు వెళ్లుతుంది. అప్పుడు శాంతాన్ని తప్పకుండా లండను తీసుకెళతాను. ప్రీవీకౌన్సిలులో వాదించేటప్పుడు వేసుకోడానికి నల్లఖద్దరు సూటు కుట్టించుకోవాలి - శాంతాన్ని సంతోషపెట్టడానికి. జమీందారీకేసులు, మాగనాలికేసులు, అంటే శాంతానికి గిట్టవు కాని ఇలాంటి కేసులంటే ఆమెకు సరదావేను.

వీళ్లిద్దరూ తగిన వుజ్జీలు! మాధ్వాడికి తగినవాడు స్కాటిషువాడు. ఏదేనా - దొరలతో కలిస్తేనే కాని మనం దేశంలో పరిశ్రమల్ని స్థాపించలేం. అమెరికావాడితో కంటె బ్రిటిషువాడితోనే మనకి బాగా కలుస్తుంది. నాకు ఇంగ్లీషువాడన్నా ఇంగ్లండన్నా అభిమానం చెప్పొద్దూ! హిందూదేశంలో వున్నంతసేపూ - ఇంగ్లండు ఎప్పుడు వెళదామా అని వుంటుంది. హృదయంలో అంతా ఆంధ్రబ్రాహ్మణ రక్తం - మేధస్సులో అంతా పాశ్చాత్య రక్తమేమో! అంచేత బారిష్టరీజేస్తూ - కాక్‌టైల్సుపుచ్చుకున్నా జంధ్యం వేసుకుని తద్దినాలు పెట్టినా నాకు ఏం వ్యతిరేకం కనిపించడంలేదు. రెండూ బాగా సమన్వయం జేశాను.

ఈ సమన్వయం దేశానికేగాదు - వ్యక్తి జీవితంలోకూడా వక పెద్దసమస్యే! భాష - వేషం - ఆశయాలు - ఆలోచనలు - చివరికి భోజనంకూడా - మారి పోతుంది. జాతీయతఅంటూ వకటి రాజకీయంగా రావటంచేత - ఇంగ్లీషు వాడికి పోటీగా మనవాళ్ళు హిందూ ధర్మం, హిందూ సాంప్రదాయం - అంటూ వీట్లనీ ముం దుకు పెట్టుకువస్తున్నారుకాని మనకి ఎప్పుడు స్వాతంత్ర్యం వచ్చి - ఇంగ్లీషువాడిని మనం పంపించేసిననాడు - దైనందిన జీవితంలో నేం - వేషభాషల్లో నేం - చివరికి - నైతిక జీవ నంలోకూడా - పూర్తిగా పాశ్చాత్య నాగరికత నవలంబించేస్తాం.

వుత్తరాజకీయంగాజాతీయత వుంటుందికాని - సాంఘికంగా - ఇంగ్లీషు అమెరికా ధోరల్లాగైపోతాం. ఇంగ్లీషువాళ్ళంటే నాకంత అభిమానం అంచేత అదీమనబాగుకేను. మనం ముందుకు రావాలంటే - ఇంగ్లీషువాడిని అనుసరించి తీరాలి - ఇంగ్లీషువాడిని ఆశ్ర యించితీరాలి. వాడికి మనకీ పుస్తెముడే. యీవేళ ఇది బ్రహ్మముడి. రేపు ఏ విప్ల వమోవచ్చి అది జారుముడి కావచ్చు. కాని బ్రాహ్మణవివాహం అయినా గంధర్వ వివాహం అయినాఆముడి ముడిలాగే వుంటుంది. దాన్నెవ్వడు విప్పడు - మనమే విప్పనీయంకూడా! అది మనమెడకే ముడి అని మనపురాళ్లు కొంతమంది అరిచినా ఇంగ్లీషువాడికీ మనకీ ఆకొంగుముడి ఆచంద్రార్కంస్థిరం. శాంతం ఎదురుగామాత్రం ఇలావాదించడానికి నాకు ధైర్యం చాలదు!

క్లబ్బునుంచి ఇంటికి వస్తూన్నంతసేపూ - బ్లాకుస్టక్ చిమ్మన్‌లాల్ వాళ్ళ మా టలే చెవులో వినుపిస్తున్నాయి! లండనులోనూ బొంబాయిలోనూ లావున్నుండగా - నాకేవళాల్తీ ఇవ్వడం చూస్తే - బాగాపైకివచ్చేస్తున్నానన్నమాట. శాయిబాబా కుసు మహరనాథు కృపవుండి నాకారెంకువరాలు లభిస్తే - మరి నాకు కోర్కెలు లేవు.

...వక ఆలోచన తట్టుతూంది. శాంతం అందుకు తగ్గిన దోహదం ఇచ్చిందంటే. ఇక చెప్పేదేముంది! రేపు బెంగుళూరు వెళ్ళేముందు చెపుతాను - ఉపోద్ఘాతం - చిలవల పలవలు - లేకుండా - టక్కుని చెపుతాను. శాంతానికి ఆశ్చర్యం - సంతోషం కలిగేటట్టు!

# 73

## ఆమె

మనసులో చాలా కుమిలిపోతున్నాను. పది సంవత్సరాలు కష్టంలోను సుఖం లోను - మంచిలోను చెడ్డలోను - కలిసివున్న శాస్త్రినా అనిపించింది! స్వార్థం కొంత వరకు అర్థం చేసుకోవచ్చు - సరి కొంతవరకూ సహించొచ్చు. అంతకు మీరితే - ఎవరితరం? బెంగుళూరు వెళ్లడానికి కారు ఎక్కుతూ - నవ్వుతూ అన్నాడు:

“శాంతం! రాబోయే ఎన్నికల్లో నాక్కూడా అందరితో బాటూ కాంగ్రెసు తరఫున నిలబడాలని ఆశ పుట్టింది. నువ్వు కనక నాయకులతో నాగుకించి గట్టిగా సిఫార్సులు చేస్తేనా - వాళ్లు నీమాట తోసివెయ్యలేక నన్ను నిలబెడుతారు - నువ్వు తల్చుకుంటే అవుతుంది! నేను బెంగుళూరునుంచి అవతల ఎల్లుండివచ్చేటప్పటికి - నువ్వు నీ శిబిరం స్నేహితులతో మాట్లాడి - అంతా సిద్ధం చెయ్యాలి” అంటూ - ముద్దు పెట్టుకుని వెళ్ళి పోయాడు...

ఎప్పుడూ లేని భక్తి యీవేళ యెలా కుదిరింది కాంగ్రెసుమీద? యీ నాటకం ఏమిటి? మీగులమిక్కిలి నన్ను సిఫార్సు చేయమనడం ఏమిటి? సత్యాగ్రహాంరోజుల్లో తను కాంగ్రెసుని ఆడిపొయ్యని రోజులేను - గవర్నమెంటుని పొగడని రోజులేదు. ఇప్పుడు తనని సిఫార్సు చెయ్యడానికి-నా నాలుక ఎలా తిరుగుతుంది? నా ఆత్మగౌరవం ఏంగాను? నేను మొదలు దగ్గిరనుంచీ చెపుతునేవున్నాను-దేశానికి దూరం అయిపోతున్నావు - మన ప్రజకి దూరం అయిపోతున్నావు - నీ వృత్తి గొప్పదే - బీదలకి - హరిజనులకి-కూలివాళ్లకి - రైతులకీ - సాయంచెయ్యి - అని. గవర్నులవెంట - రాజాలవెంట - కోటీశ్వరులవెంట తిరిగేడు.

నిన్నకాక మొన్న - ఆ మైదవోలు నీటి తీరువా అప్పీల్లో - జమీందారు తరఫున కేసుపట్టి - ఎప్పటిదో - 1773 సంవత్సరంనాటి ఈస్టిండియా కంపెనీ ఇచ్చిన సనదు ఆధారంచేసుకుని - మూడువేల హరిజనరైతులని వాళ్ల కుటుంబాలిని జమీందారుకు బలి యిచ్చేశాడు - ఎనిమిదివేలు ఫీజు పుచ్చుకున్నాడు. అటువంటిది - ఏమని తను ప్రజలపక్షం నిలబడతానంటాడు? ఉత్తగా - ఆత్మవంచన - కాకపోతే ఏమిటి మధ్యని నామీద పెట్టాడేమిటి?

...నే నేనో రెండేళ్లకిందట లాఠీ ఛార్జిలో దెబ్బలుతింటే - అందుకు ఇప్పుడు వాళ్లతో చేరమా - మావారిని ఎన్నికకు నిలబెట్టించండని? నేను తిన్నదెబ్బలు - నేను పడిన బాధ - లంచమా ఏమిటి కాంగ్రెసుకి? దేశభక్తులని జనం పూజిస్తూన్నవాళ్లం దరూ మాత్రం మడికట్టుకున్నారా - అంటే ఆ వాళ్లకీ నాయకులకీ సంబంధించినది.

అలాగని చెప్పి - ఎప్పుడు దేశం కోసం త్యాగం అన్నదే తలపెట్టని మనిషిని - నాపెని మిటి కదా అవి చెప్పి - నేనే మోహంతో వాళ్ల దగ్గిరకెళ్లను ?

ఇలాంటివాళ్లు పదిమంది కనక కాంగ్రెసులోకీ గవర్నమెంటులోకీ పెరటిదారిని ప్రవేసిస్తే - ఇక సత్యాగ్రహంయొక్క ప్రవిత్రతే పోయిందే! ప్రజాఉద్యమం అయాక - మంచివాళ్లూ - చెడ్డవాళ్లూ - అందరూ వస్తారు. కాశీకి వెళ్లిన వారందరూ పండితు లేనా? చూస్తూ తెలిసి అలాంటి వాళ్లని గౌరవస్థానాల్లో ఎలాకూచోపెట్టగలం? ఎడ్వొ కేటుజనరల్ గిరీకి - ఇదొక మెట్టు అనా? ఏకంగా "లా" మంత్రే అయిపోదాం అనా? తెలివితేటలు గలవాడు - అవినీతి పరుడు కాడు - పెళ్లాం పిల్లలు అంటే ప్రేమ - దుర్మార్గుడు కాడు. అయితే-ఇంత స్వార్థం వుందే-ప్రజాద్రోహం దేశాన్ని అమ్మేయడం క్రిందకే వస్తుందేమో ?...

నాకేం తోచడం లేదు. శాస్త్రిమాటలు - అతని ఆశ - తల్చుకుంటే - కదు పులో చెయ్యిపెట్టి కలికేసినట్టు అవుతూంది. అతని మొహం చూడడానికే నాకు బుద్ధి పుట్టడం లేదు. పరాయివాళ్లయితే సహించొచ్చును - నావాడవవడంచేత మరీ అస హ్యంగా వుంది ... సరే - ఇక్కడనుంచి వెళ్లిపోయి - కొన్ని నెలలపాటు దేశాటనం చేస్తాను - అప్పటికికాని మనసు కుదుటపడదు. కొంత తిరుగుతే - శాంతి కుదురుతుంది...

...శాస్త్రిపేర వుత్తరం వ్రాసి అని బల్లమీద వుంచుతాను! నా మనస్సు అతను గ్రహించాలి. అంతేనేకాని - ఏ చికిపికయ్యానికో - అలిగి తనను వదిలేసి వెళ్ళిపోయా ననుకోకూడదు. నా మనస్సులో - ఎంతో బాధపడి - విపరీతమైన ఆందోళన పడి - వెళ్లిపోతున్నానని వ్రాస్తాను. మనసు కుదుటు పడగానే ఇంటికి వచ్చేస్తాను.

కొన్నాళ్ళపాటు - కొంత దూరంపాటు - అఖండ గౌతమీ, వశిష్ట గోదావరీ చీలిపోయి - దేనిదారిని అదే ప్రవహించాలి.

## 74

### అతడు

రైలునుంచి ఇంటికొచ్చాను. అలవాటు చొప్పున రాగానే కచేరీ చావడిలోకి వెళ్లాను. బల్లమీద వుత్తరంవుంది తీసి చదువుకునేసరికి - ఇకేముంది - శాంతం వుత్తరం! మొదట నాకేం అర్థంకాలేదు - కళ్లతో అక్షరాలు చూశాను - పెదవులతో చదివేను-

బుర్రలోకి మాత్రం వెళ్ళలేదు. మళ్ళీ చదివేను. మూడు తావులు వ్రాసింది. అక్షరం అక్షరం కూడబలుక్కుని చదివేను. లక్ష్మినీ శుభనీ తీసుకుని వెళిపోయానని వ్రాసింది.

"ఏం గాభరా పడవద్దు - నేను అన్ని ఏర్పాట్లు చేసుకున్నాను. నాదగ్గిర డబ్బు పుష్కలంగా వుంది. నా క్షేమం గురించి నువ్వేమీ ఆదుర్దా పడకు. పుట్టింటికి వెళుతున్నానని - నువ్వు నేను ఇదివరకే దీని గురించి అనుకున్నాం అనీ - నెల్లాళ్ళలో మళ్ళీ వస్తాననీ - తాయారుతోనూ డ్రైవరుతోనూ చెప్పాను - నువ్వూ అలాగే చెప్పు..." అని వ్రాసింది.

వుత్తరం మళ్ళీ చదువుతున్నాను. కోపావేశం మీద వ్రాసినట్లు లేదు. జాగ్రత్తగా ఆలోచించిన మీదటే వ్రాసివుండాలి. మాటలన్నీ తూచివేసింది. ఎన్నికలకు నిలబడాలని నాకు ది - నువ్వు కాంగ్రెసు వారితో సిఫార్సు చెయ్యి - అని నే ననడం తన మనసుకు చాలా బాధకలిగించిందట. నాది రుజుప్రవర్తన కాదంది.

"నేను సత్యాగ్రహం రోజుల్లో తిన్న దెబ్బలు - కాంగ్రెసు స్నేహితులకు నామీదవుండే గౌరవం - ఇవి నువ్వు నీ స్వంత మూలధనంగా పెట్టుకుని - జూదం ఆడి - లాభం పొందించాలని - నువ్వు వోట్ల యెత్తువేశావు. నలుడు దమయంతి - అయింది నాపని...

"ఈ మధ్య నువ్వు సక్కగా పుట్టాన్ని సనాతన హిందువయిపోతున్నావు. లక్ష దీపానికి తిరుపతి వెళ్ళావు. నెల్లూరు వంశాని గోపాలస్వామివారికి బంగారపు కిరీటం చేయించావు. క్లబ్బులో దొరలతో షాంపేను విందులు - ఇంటికొచ్చి వీభూది పూసుకుని తులసిమాలవేసుకుని సాయి బాబా భజన - కాషాయి బట్టలు ధరించి - దండలు బంగారపు పూజలు కట్టుకుని - గౌరంగ పూజ! ఎందుకీ పూజలూ పురస్కారాలూ? దేనుకీ కానుక లెందుకు? కాంగ్రెసుకీ లంచా లెల? ... పట్నంలో పోస్యగాం పరుగెత్తున్న గుర్రంమీద నిలబడి నిలవాలనికోరుస్తు సూరుస్తూంటాడు. నీ ప్రవర్తన అలాగేవుంది. ఎందుకీ మొగ్గలా పల్టీలున్నా? ... నీ లక్ష్యం ఏమిటో - అందుకు నువ్వు చేసే సాధనాలు ఏమిటో ఆలోచించుకో. రెండూ సమన్వయం చేసుకోవడమే - వ్యక్తిధర్మం - రాజధర్మంకూడాను ... నీ మీద కోపం వచ్చి కాని - క్రోధం పెట్టుకుని కాని నేను లేచి వెళిపోవడం లేదు సుమా - అని మాత్రం మనస్ఫూర్తికి నమ్ము. నిన్ను ప్రేమిస్తున్నాను కాబట్టే - నీవనుదురుసులు నన్ను నరనరాల బాధిస్తున్నాయి. నీ మొక్క పూనరవిల్లి మార్పులు నాకు వాతలు పెట్టినట్టు అవుతూంది ... నా మనశ్శాంతి కోసం వెళిపోతున్నాను. నా వెంట పడకు. నా కోసం వెతుక్కో వద్దు. ప్రతీవూరునుంచి నా క్షేమం నీకు తెలియజేస్తూంటాను. మనసు కుదిరాక నేనే నీ దగ్గరకు వస్తాను. అంతవరకూ ఓపిక పట్టు..."

...శాంతం వెళ్ళిపోయి అప్పుడే రెండురోజులైపోయింది. ఎక్కడ వుందని వెతకను? ఎవరితో చెప్పను? ఎన్నాళ్లు కనిపెట్టుకుని వుండను? నౌఖర్ల ఎదుట నేను, ధైర్యంగా వుండాలి.

నేనేం తప్పుచేశాను? ఉపకారం కోసం ఉద్యోగంకోసం యెందరు యెందరిని ఆశ్రయించడం లేదు? కుర్రవాడికి పరీక్షలలో మార్కులకనీ - కూతురికి కాలేజీలో ప్రవేశానికనీ - తెల్లవారిలేస్తే ఎంతమంది పెద్దమనుష్యులకి నేను సాయం చెయ్యడంలేదు? అదంతాకూడా అవినీతే అంటే ఇంక బతకడం ఏలాగు? కాలానుగుణ్యంగా పోవడం తప్పా? అప్పుడు ప్రజలచే దూషింపబడినవారు ఇప్పుడు ఆప్రజలచేతనే భూషింపబడడంలేదా?

ఒక విధంగాచూస్తే నాదితప్పే. శాంతాన్ని నావిషయం సిఫార్సు చేయమనడం పొరపాటే. అంతకఠినంగా ఆలోచిస్తుందని నేనెన్నడూ అనుకోలేదు. భార్యని ఆమాత్రం సహాయం చెయ్యమనడం తప్పులేదనుకున్నాను. నాకీ తాపత్రయం అంతా ఎందుకు? శాంతం కోసం - పాపాయికోసం - రేపొద్దున్న బాచిగాడు అంటూ వుంటే వాడికోసమే కదా? లేకపోతే ఎసెంబ్లీ సభ్యుడనై నేను యేం నిర్వాకం నిప్పెట్టాలి? ఆ హోదాపురస్కరించుకుని కాస్తముందుకు రావచ్చును అనేకదా? ఒకప్పుడు ఎవరినేనా మనం దూషిస్తే ఎల్లకాలం వాళ్లతో శత్రువుగానే వుండాలా? వాళ్లు మంచి వాళ్లవకూడదా? వాళ్లతో స్నేహం చెయ్యకూడదూ?

ఈమధ్య ఎలాగేనా నాకు కొంత సనాతనం అబ్బింది.

ఏవిధంగానేనా దేవుడిదగ్గరనుంచి రెండువరాలు సంపాదించాలని కోర్కెపుట్టింది. శాంతం తిట్టిందంటే తప్పులేదు- ఆవేళ టీ పార్టీనుంచి రాగానే దేవీపూజలో దిగిపోవడంలో కొంత అపభ్రంశంవుంది. ప్రొద్దున్న శృంగేరివారికి ఇంట్లో భిక్ష - సాయంత్రం గిండీలో గార్డెన్ పార్టీ! ఆవేళా అంతే - ఇంట్లో తద్దినం - సాయంత్రం - బ్లాక్‌స్టన్‌తో డిన్నరు! ఇదంతా శాంతానికి కంటకంగానే వుండేను. కాని ఇంత మనసులో పెట్టుకుంటుందని నాకేమాత్రం అనుమానం తట్టినా - ఈ ఉపవాసాలూ - భజనలు వదులుకొని వుందును. వాటిమీద నాకేం అంత నమ్మకం వుండికాదు. వస్తే ఏదేనా కలిసివస్తుంది- లేకపోతే పోయేదిలేదు అని కాని.

ఇప్పుడు ఏం చేయను? ఎంతఏడ్చి ఏంలాభం? "గ్యారంటీ పశ్చాత్తాపానికి- ఇరవై నాలుగు గంటలుచాలు" అన్నాడు గిరిశం. ఓపికపట్టి వుండాలి శాంతం రాకకోసం. ఒంటరిగాణ్ణయి పోయాను.

టెలిగ్రాం వేస్తానంది. ఏదీ లేదు. ఎక్కడ ఏం ప్రమాదం జరిగిందో? జరిగితే తెలియకుండా వుంటుందా? ఏఖబురూ లేకుండా వుంటే మంచి ఖబురే అనుకోవాలి...

నిజంగా నాకు మతిపోయింది. నాకేసులు గొడవేమిటో - నావకార్తీలు గొడవేమిటో - వీటితో సరిపెట్టుకుంటే పొయ్యేది. అనవసరంగా తెచ్చి పెట్టుకున్నాను - యెన్నికల గోల - తద్దినం కొనుక్కున్నట్టు!

పాపాయి నవ్వులంటూ మళ్లీ ఎప్పుడేనా వింటానా అనిపిస్తూంది.

## 75

### ఆమె

కలకత్తా వచ్చి నాలుగురోజులైంది.

యీ మహా పట్నం చూస్తే గాభరాగావుంది. ఎక్కడ బసచెయ్యడానికీ తెలియదు. శాస్త్రి ఎప్పుడో ఒకమాటు చెప్పాడు- తను కలకత్తాలో రాయల్ హోటేలులో దిగేవని. టాక్సీచేసుకుని అక్కడికి వెళ్లేను.

చాలా దర్జాగావుంది. కాని-అంతా ధొరలసజ్జు. చాకిరీచేసేవాళ్లందరూ నల్లవాళ్లు- చేయించుకుని అనుభవించేవాళ్లందరూ తెల్లవాళ్లు! భోజనం అతి కష్టంగా వుంది. వంట పేరంతా ఫ్రెంచి భాషలో - చేసినదంతా మంసాహారం. మన హిందూదేశంలో హోటేలు - ధొరలు అతిథులు - శాఖాహారం దొరకదు - ఎంత అసందర్భం! నాకోసం ప్రత్యేకం ఏర్పాటు చేయించుకునేసరికి బ్రహ్మాండం బద్దలయింది! మన దేశమేనా అనుపిస్తోంది!

శాస్త్రి పేర క్షేమం టెలిగ్రామం వేశాను.

పాపాయికోసం ఆయాని పెట్టేను - నేపాళం మనిషి. పాపాయి సుభనియీ మూలంగా కొంచెం ఉత్తరాది హిందీ నేర్చుకుంటారు.

మనసు నిశ్చలం చేసుకోవడానికని ఇంటినుంచి వచ్చేశాను. కాని ఏమీ తోచడం లేదు.

పాపాయిని సుభని చిడియాఖానాకు తీసుకువెళ్లేను. సింహాలని, కోతులని- రామచిలకలనిచూచి వాళ్లదే సంభరపడడం! ఎంత స్వల్పవిషయాలతో చిన్న పిల్లలు సంతోష పడతారో!

బేలూరు మఠానికి వెళ్లాను కాని నాకేమీ శాంతికలగలేదు.

ఆదివారం బ్రహ్మ మందిరంలో ఉపాసనకి వెళ్లేను. ఆదిబ్రహ్మం - కేశవబ్రహ్మం - రెండూ అసాధారణంగానే కనిపించేయి నాకు. ఆ సంగీతం కాని ఆ ఉపన్యాసం కాని నాకు అర్థం కాలేదు. శిల్పం కూడా పరిసరాలతో మేళవించక వికృతంగా కనిపించింది నా కంటికి.

జైనమందిరానికి వెళ్లాం. కాళీఘట్టం చూశాం. పాపాయి కాళీ బొమ్మ కావాలంది. మట్టిబొమ్మ కొని యిచ్చాను. తండోప తండాలుగా జనం వచ్చి పోతున్నారు పుదుచ్చేరీ సరువణ్ణామలైలో శ్రోతృకులు జ్ఞాపకం వచ్చారు. వాళ్లకీ వీళ్లకీ ఎంత తారతమ్యం!

...రోజులు గడిచి పోతున్నాయి. యీ మహాపట్నంలో నాకు స్థానం లేదని పిస్తూంది. అయినా ఇంకా కొన్నాళ్లు ఇక్కడ వుండాలనే వుంది. యీవేళ నే నొక్కర్తెనే బయలుదేరాను. ట్రాము, బస్సు, రైలు, కొంతదూరం నడక - జనపనార మిల్లులలో పనిచేస్తూవున్న బస్తీలు చూడడానికని.

ఏమి కఠోరమైన దృశ్యాలు - ఏమి చెత్త - ఏమి ఇళ్లు? బస్తీకి నడిమధ్యగా పారుతుంది మురికి కాలువ. పిల్లలు - చూస్తే - ఆనప తుంబలలాగ కడుపులు - కళ్లలోనుంచి పైకొచ్చిన గుడ్లు - పాలిపోయిన చర్మం. స్త్రీలు కట్టుకున్నవి జీర్ణించి పోయిన చింకిపాతలు - అసలు ఇక్కడ వాళ్లు కట్టుకునేదే ఐదు మూరలు - అంచుకూడా నోచుకోలేదే! వీళ్ల కోకలలాగే వీళ్లబతుకులుకూడా అతుకుల బొంతలే! బస్తీ కంతటికి - పట్టుమని పదికుళాయిలు లేవు. ఇత్తడి దుఖాణాలలో బిందెల దొంతర్లలాగు - కుళాయిల దగ్గిర తపేళా ముంతలతో కనిపెట్టుకుని కాపలా కూర్చున్నారు ఆడవాళ్లు. రిత్తగా ఆసమయంలోనే మరుగుదొడ్లు వూడ్చి - వొళ్లు కడుగుకోవడానికని వచ్చాడు ఒకతను - ఆకుళాయి దగ్గరకే. ఆ వాసన నేను భరించలేక పోయాను.

ఈ పరిస్థితుల్లో - దైనందినం సంవత్సరాల తరబడిని - జీవితం ఆసాంతం - జన్మం అంతా ఎలా గడుపుతున్నారు వీళ్లు? నాలాంటి స్త్రీలే వీళ్లూను. - మానవతులు - శీలవతులు. కంపెనీలవారు ఇచ్చారుట ఇళ్లు! ఇవి ఇళ్లు కావు - కొంపలూ కావు - బొమ్మరిళ్లు! నాలుగు రూపాయిలు అద్దె అని చెప్పింది ఒక ఆమె నాలుగు వేళ్లు చూపించి. నాకు బాష తెలీదు. తెలిసిమాత్రం నేను ఏం సానుభూతి చూపించగలను? నాసానుభూతి ఫలితం ఏమిటి? మొసలి కన్నీళ్ళని వీళ్లు ఏవగించుకోరా? బంగాలీ స్త్రీలు - గంజాంనుంచి ఓఢ్రస్త్రీలు - విశాఖనుంచి ఆంధ్ర స్త్రీలు! ఆమూరెడు ఇంటిముందర జానెడు జాగా అలికి ముగ్గుపెట్టుకున్నారు. రంగుల ముగ్గులు, అల్పొన, గుమ్మడి పువ్వులు, గొబ్బి పువ్వులు! దరిద్రంలోకూడా కళా సక్తి!

ఇళ్లల్లో కంచు కంచాలు తళ తళ మెరుస్తున్నాయి.

అబ్బబ్బ! బీదతనం కంటే వేరే పాపం లేదు. మైళ్ళకొద్దీ వున్నాయి యీనరక కూపాలు - బరానగరు - కమరహట్టీ - కంకినార - ఉలుబేరియా - అగ్గర్ పాడా - శ్యామ నగరం - టిటాఘుర్ - గౌరీపూర్ - నద్దీయా!

గంగానది అవతల వర్ధనవున్నాయి మిల్లుయజమానుల మహాసౌధాలు - బెల్ విడీరు - బారక్ పూర్ - అల్లిపురం - ఉత్తరపరా - బాల్లీగంజి. ఏమిసౌధాలు - ఏమినరక కూపాలు?

ఈ తల్లక్రిందులు ఎప్పుడేనా మారుతాయా? మారకపోతే మోక్షంలేదే! మార్పు తెచ్చేవాళ్లెవరు? రేపు శాసనసభల్లోకి వెళ్ళబోయే శాస్త్రి - లేకపోతే సర్వ సుఖాలూ అనుభవిస్తూ చోద్యం చూడడానికి వచ్చిన నేనా? ఎప్పుడో వకసారి నాలాగు ఆవేశం చేత రణరంగంలో దెబ్బలు తినడం వేరు - రోజుకు ఇరవై నాలుగు గంటలూ యీ పరిసరాల్లో బతుకుతూ సాహసం చూపించడం వేరు. ఈ సాహసవంతులే విజయాన్ని సాధించాలి. వాళ్ల అసంతృప్తే వాళ్ల ఆయుధం. వాళ్ళ సహసమే వాళ్ళ శక్తి. వాళ్ళ ఐక్యతే వాళ్ల ముక్తి. వాళ్ళ శక్తివల్లే రావాలి శాంతి - ప్రపంచ కానికి ... వాళ్లకీ — నాకన్నూ ...

సూర్యాస్తమయం అయింది. కిడ్డరుపూరు దగ్గర ఆపేసింది బస్సు.

రేవుద్వారాలనుంచి వచ్చేస్తున్నారు లక్షల ప్రజ! అన్ని రంగులవాళ్లు - అన్ని దేశాలవాళ్లు. చైనావాళ్లు - ఇంగ్లీషువాళ్లు - గ్రీకులు - నీగ్రోలు - చిట్టాగాంగీయులు - జపానీయులు - జర్మనీవాళ్లు - ఇటాలియనులు - పోలిషువాళ్లు ...

అక్కడేవున్నాయి కల్లుదుకాణాలు - అక్కడే వున్నాయి విలాసగృహాలు. గృహాలేమిటి! - గుడిసెలు. ఆ స్త్రీలనుచూస్తే వళ్లు తరుగుకు పోయింది. లోతుకు పోయిన బుగ్గలు - కళ లేని కళ్లు - కృశించిన శరీరాలు. నోట తాంబూలం — ముఖాన్న తెచ్చిపెట్టుకున్న నవ్వు - వికృతమైన వయ్యారం. వస్తున్నారు వెళుతున్నారు - ముష్కరులు - దండలు తిరిగిన పహిల్వానులు ఆజాను బాహులు. ఈ స్త్రీలు ప్రాణాలతో ఎలా బతికివున్నారు? ...

ఇద్దరు పురుషులు నన్ను పలుకరించారు. మరి వకడు ఈలవేసి కనుసైగ చేశాడు. నాకు భయంవేసి కాళ్ళు వణకడం మొదలెట్టాయి. గబగబ నడవడం ప్రారంభించాను. నా గాభరా చూచి వాళ్ళు చప్పట్లు కొట్టారు. నా వెంటెక్కడ వస్తారో అని తోచి గుండె ఝల్లుమంది. పది ఇళ్లు దాటాక — బస్సు వకటి కనిపిస్తే దాన్లో ఎక్కాను. ప్రాణాలు కుదుటబడ్డాయి.

సుభ మాయింటికి రావడం — శాస్త్రి చికాకుపడడం జ్ఞాపకం వచ్చాయి.

అప్పుడు సుధ నాదగ్గిర తలదాచుకుంది - నే నెక్కడ దాచుకుందును? పాపం - యీ స్త్రీ లందరూ - మరో విధంగా జరుగుబాటులేక ఇందులోకి దిగవలసి వచ్చిందే! అర్థం-ప్రాణం-నీతి - అని కలిగివున్న వాళ్లు ఎన్నే నాచెప్పవచ్చు.

మునుపు - జ్ఞానం, పాండిత్యంవున్న బ్రాహ్మడికి వక నీతి చెప్పారు. ఆయుధ బలం - భుజబలంవున్న క్షత్రియుడికి - మరొక నీతి అన్నారు. డబ్బున్న కోమటికి వేరేనీతి ఏర్పరచారు. చమటోడ్చి కష్టించే వారికి మరో నీతి వర్తిస్తుందన్నారు. బానిస జనం పట్ల యే నీతీ పాటించ నక్కరలేదు అన్నారు.

పరిశ్రామికయుగం వచ్చాక - సులభం అయిపోయింది. యజమాని చేసినదల్లా నీతే - పేదవాడు ఏదిచేసినా - చేయకపోయినా నేరమే.

.... గడియారం చూస్తే తొమ్మిదైంది! బస్సు అల్లిపురంలో ఆగిపోయింది. అక్కడినుంచి డాల్ హౌసీ స్క్వేరుకు ట్రాము మీద వెళ్ళాలన్నారు.

ట్రాములో జనం కిటకిట లాడుతున్నారు. యెక్కడమే కష్టం అయిపోయింది. పాపం వకాయన సాయం చేస్తే ఎక్కగలిగేను - లేకపోతే చీరలో కాలు తొట్రుపడి-ట్రాముక్రిందపడి పోయేదాన్నే. అతను అందంగా వున్నాడు. బంగాళీదుస్తులు తీరుగా కట్టుకున్నాడు.

"మీరు వూరు కొత్తకాబోల్సు? శనివారం - గుఱ్ఱపు పందేలు - అంచేత ఈ తొక్కటం. అదుగో! కండక్టరు వస్తున్నాడు-డాల్ హౌసీకి వెళుతారు కాబోలును? పావలాతీసి సిద్ధంగా వుంచండి. రూపాయి ఇస్తే - మరి మీరు చిల్లర ముట్టదు - దగాకోర్లు సుమండీ!" అన్నాడు.

నాకు నవ్వువచ్చింది. చేతి సంచీలో చిల్లర కనిపించలేదు. కండక్టరుచేతిలో ఐదురూపాయిలనోటు పెట్టాను. టిక్కెట్టూ నాలుగురూపాయిల ముప్పావలా నాకిచ్చి వెళిపోయాడు కండక్టరు. నేను నవ్వుతూ నాచేతి సంచీలో డబ్బు వుంచేశాను.

ఆసమయంలో సంచీలోనుంచి నాచేతిరుమాలు క్రిందపడిపోయింది. "మీరు శ్రమ పడకండి నేను తీసియిస్తాను!" అంటూ చేతిరుమాలు తీసి ఇచ్చాడాయన. రుమాలు అందుకుని సంచీలో పెట్టబోతున్నాను - రుమాలు మడతలో నోటు వకటి కనిపించింది. నేను నిర్ఘాంతపోయి అతని వేపు చూశాను.

అతను నవ్వుతూ: "మరేం అనుకోకండి! మీరు వక్కరే యీ వూరులో వున్నారని మీరన్నారుకదూ - ఇందాక. అంచేత మీకు చిన్న కానుక సమర్పించేను. మీకు తీరికగావుంటే రేపు రాత్రి సినిమాకు వెళుదాం. మీరు ముందుగా తొమ్మిది గంటలకు మినర్వా రెస్టారెంటు దగ్గిరకు రండి - అక్కడ కలుసుకుందాం!" అన్నాడు.

నేను గ్రహించాను.

ప్రత్యుత్తరానికి బదులు - కొంటెతనంగా నవ్వేడు.

ఆయన కన్ను గీటేడు.

నేను ట్రాము దిగిపోయాను.

... హోటేలు హాలులో గడియారం పదిగంటలు కొట్టింది. పాపాయి, సుధ బెంగగా కనిపెట్టుకుని నాకోసం గదిలో కూచున్నారు. వాళ్ళని సముదాయించి పడుకో పెట్టాను. ఆచేతి రుమాలు మడతలో వున్నది ఏమిటో అని ఆతృతతో చూశాను. నూరు రూపాయిల నోటు! నవ్వుకున్నాను. కడుపునిండా భోంచేశాను.

... పొద్దున్నే లేచి - నూరు రూపాయలనోటుని - జాగ్రత్తగా పరీక్షించాను. అచ్చు - సంఖ్య - మొహరు - సంతకం - నీటిజాడలు - అన్నీ బాగున్నాయి. కాయితం ఫెళఫెళ మంటూ కంజిర చర్మంలాగుంది.

సరే అని - నోటుని వక కవరులో పెట్టి - "శ్రీ కొచ్చెర్లకోట రామస్వామిగారు ఆంధ్ర రైతు సంఘం - 36 బలరామదాసు వీధి - కొండితోపు - చెన్నపట్నం" అని వ్రాసి పోష్టులో వేశేశాను.

"పతివ్రత? - పవిత్రత? - పతిత?" - అనుకుంటూ - నవ్వుకున్నాను.

మధ్యాహ్నం తుఫాను మెయిలులో ఢిల్లీ వెళిపోయాం. ...

రైలు కూడా "పతివ్రత - పవిత్రత - పతిత" అంటూ - గుప్పుగుప్పుమని చప్పుడుచేస్తూ - సాగిపోయింది!

## 76

## అతడు

పదిహేనురోజులై - ఇంట్లో వక్కడనే అయిపోయాను. కాంతపాపాయి లేక పోవడం-ఇల్లు మనసు చీకట్లు కమ్మినట్టేవుంది.

ఏకాంతం - ఏకాంతం అంటారు. నాకు వక్కడనే వుండడం అంటే తోచదు. తోచదు సరికదా - గాభరావస్తుంది -గుండె ఝల్లు మంటుంది. ఆ నిశ్శబ్దం అంతా ఒక

పెనుభూతంలాగు నన్ను ఆవరించి మింగేస్తుందేమో అని పెద్దదిగులు. మరా ఇంగ్లీషుభావ కవులు, తెలుగుభావకవులు ఏకాంతం మీద అదే కవిత్వం చెప్పిపోతూరు! వాళ్లు లండనులోను, వీళ్లు చెన్నపట్నంలోనూ మకాంవేసుకుని పద్యాలు అల్లేరేమో అనిపిస్తుంది.

నేషనల్ స్టీలుకేసులో జస్టిస్ సుపిలామణి నాపక్షమే తీర్పుచెప్పాడు. నూట ముప్పైఆరు పేజీలు! కాని - ఆతీర్పు చదువుతూంటే - కాళిదాసు, షేక్స్పియరు, బెర్నార్డ్షా - ముగ్గురుకలసి నాటకం వ్రాసినా - అరక్తి కట్టదనిపించిపోతే - ఇంకేమిటి! ఖాయిదాకొట్టులో లాభం - మధ్యవర్తి రుసుం - స్వంతవ్యాపారంలో ఆదాయం - వీటిగురించి చెప్పిపోయాడూ తీర్పులో - వింటూంటే తన్మయం అయిపోయాను. నా వాదనలన్నీ - చివరికి శాంతం సలహామీద నేను క్లేటను గ్రంథంలోనుంచి ఉదహరించిన వ్యాసం పేజీతో సహా - వర్ణించేసి - వాటికి శంకరభాష్యం చెప్పేశాడు. ఆ హైకోర్టుఛాంబర్సులో ఆయన తీర్పు చదువుతూంటే - నాకు నిర్వికల్పసమాధిలో వున్నట్టే అనిపించింది. ఆయన గొంతుక ఆగిపోయింది - నేను స్థూల ప్రపంచకంలో పడ్డా.

పడడమేమిటి? చేతిలో పదివేలరూపాయిలకి చెక్కుపడింది! బ్లాక్స్టోను - ధోర - అమాంతంగా నన్ను కాగలించుకుని - చెక్కు చేతిలో పెట్టాడు!......

మనసులో ఆనందం లేదు. శాంతంవుంటే ఎంత సంతోషించివుండును!

మరొక ఆశాభంగంకూడాను. తీర్పుచెప్పడం అయిపోయింది - అవతలవాళ్లు ప్రివీ కౌన్సిలుకి అప్పీలుచెయ్యడానికి అనుమతి అడుగుతారేమో అని కనిపెట్టుకుని చూస్తున్నా - అమిల్లరూ, సంతానకృష్ణను - ధంగెత్తిపోయిలేవందే. కొంపతీసి అప్పీలు దాఖలు చెయ్యడం మానేస్యారు కదా? అవతలవాళ్లులండను కంపెనీఆయె - అంతపొరపాటు చేస్తారా? వాళ్ళ సొలిటర్లు చెయ్యనిస్తారా?

రాత్రిపూట క్లబ్బుల్లోనూ, స్నేహితుల ఇళ్లలోనూ భోజనంచేసి కాలక్షేపం చేస్తున్నా. యీవేళ ఎక్కడా జారంలేదు. ఇంటికొచ్చి గదులన్నీ పచారు చెయ్యడం మొదలెట్టా - ఏది చూసినా - ఎక్కడచూసినా - శాంతమే కనిపిస్తోంది. "యెందు కలడెందులేడని సందేహముకలదు"...దేవుడు - భక్తుడు, ప్రకృతి - పురుషుడు, ప్రియుడు - ప్రేయసి...మళ్లీ అక్కడికే వస్తాం.

ఒకరి నొకరం ప్రేమించి, మోహించి, పెళ్లిచేసుకున్నాం. ఇద్దరమూ-కొద్దో గొప్పో చదువుకొన్నవాళ్ళం. ధర్మేచ - అర్థేచ - కామేచ - కలిసే సంసారం ఈడ్చుకు పోతున్నాం. మొదట్లో కలతలూ, గిల్లికజ్జాలూ వచ్చేవి. ఆ ప్రణయకలహాలు సరిపెట్టుకోవడమే పరమానందంగా వుండేది. సరిపెట్టుకుని ఆనందించేవాళ్ళం. తరవాత - అభిప్రాయ భేదాలు - తర్జన భర్జనలువచ్చినా - అప్పుడూ సర్దుకునేవాళ్లం.

ఆ సర్దుకుపోవడమే వక సంతోషంగా వుండేది. ఖద్దరూ - సత్యాగ్రహం- అందులోకూడా ఏదోవక మోస్తరు సంసార పక్షంగానూ సరదాగానూ రాజీపడ్డామూ అనుకునేసరికి -మళ్లీ నేనే యీ ఎన్నికలలో నిలబడడం వకటి లేవదీశాను. ఇప్పుడు నీతి - సత్యం - ధర్మం - లక్ష్యం - సాధనం - అని ఇవన్నీ తీసింది శాంత !

నాదేపొరపాటు. నేనిప్పుడీచట్టసభలోకూర్చోకపోతే నాకొచ్చిన లోటేమిటి? బ్యాంకీలో పదిలక్షలున్నాయికదా - తండియార్పేటలో కొబ్బరితోట - త్యాగరాయ పేటలో బంగాళా - ఎంత దచ్చుధరలుకట్టినా - రెండులక్షలకి తక్కువచేయవుకదా ! భీమా లక్షరూపాయలూ పాపాయిపేర వ్రాసేశాను. ఇకపోతే - ఆరంబాక్కం దగ్గర అగ్రహారం మొన్న శాంతంపేర కొన్నాను - సాలుకి పదిహేనువేలువస్తుంది. ఇక నాకెందుకు లేనిపోని తాపత్రయం ?

నేనా సైదపోలు కేసు పట్టకపోతే తీరిపొయ్యేను. నాకీ జాగీరుదారులంటే అసలు అసహ్యాం పుట్టుతూంది! మొన్న పెరియనాన్నూరురాజు పదివేలిస్తానని ఐదు వేలెగనామం పెట్టాడు. ఇక - తెల్లవాడు ఎంత న్యాయంగా మనని పరిపాలిస్తున్నా- మనదేశంలో భాషా భేధం, కుల గోత్రాభిమానం వున్నంతకాలం - నాలాంటివాడికి ఉద్యోగాలూ పదవులు దక్కనివ్వరన్నది శిలాక్షరం.

ఇక బాచిగాడి మాటా - దేముడిమీద భారంవేసి - మనస్సులోనే - సుపుత్ర వరంకోసం - తపస్సుచేసుకోవాలి. కర్మఫలం దైవాధీనం !

......చిన్న విస్కీసోడాపుచ్చుకుని -బర్మా ఛెరూటుకాలుస్తూ పొగచక్రాలు వూదుతూ వసారాలో కూచున్నాను.

ఇంతట్లో - ఫోర్డు మెర్క్యూరీ - టూసీటరు - అందులో ఊర్వసి మిత్రా ప్రత్యక్షం. యీమధ్య ఊర్వసి రెండుమూడుసార్లు నావెంటపడుతూ వచ్చింది. బారు రూములో అందరూ : "ఊర్వశీ నిత్యయవ్వనం!" అంటారు.

"శాంతం రాజమండ్రీ వెళ్ళిందిటగా? ఎవరో నిన్న టెన్నీసుక్లబ్బులోఅంటూంటే విన్నా. నేను వచ్చినపనా ? అబ్బే! పనియేమీ లేదులెండి. మొన్న ఊటీలో దేవయాని భోజనానికి పిలిచింది. ఆవిడ పెనిమిటి - కున్హికణ్ణన్ - యేదోమాటలో అన్నాడూ : 'శాస్త్రి ఎన్నికలలో ఎందుకు నిలబడకూడదు ? నిలబడ్డాడా-గెలుపుతప్పదు-ఇప్పుడున్న వాళ్ళందరిలోనూ నిజంగా ముందుకురావలసినవాడు!' - అన్నాడు. సిమ్లా ఢిల్లీలోనూ, వైటుహాలులోనూ అతనికెంత పలుకుబడుందో మీరుతెలుసుగదా. ఆమాట మీచెవిని పడేద్దాం అనివచ్చా" అంది.

"కున్హికణ్ణన్‌కి నామీద అంతఅభిమానంవుంటే మొన్న బిరుదుల జాబితాలో రావు బహుద్దూరో- కాకపోతే - మొన్న రాజద్రోహం కేసులో స్పెషల్ ప్రాసిక్యూటరీవో- యిప్పించలేకపోయాడా? ఉత్తదండీ - వీళ్ళు ! ఇంతకీ - నన్ను ఏపక్షంవాళ్ళు నిలబెడతా రండీ?" అన్నా.

ఆవిడందీ : "సరి—శాంతం తల్చుకుంటే అదెంతపనండీ శాస్త్రిగారూ ? వాళ్లతో కొంచెం సూచనచేస్తేచాలు. 'నేనెప్పుడూ అధికారం చేతిలో వుండేవారి పక్షంగదా - శాంతాన్ని సిఫార్సు చెయ్యమనడం ధర్మమా - నీతివిరుద్ధంకాదా - శాంతం సిఫార్సు చేస్తుందా ? - సిఫార్సుచేస్తే మాత్రం ఫలితం వుంటుందా' - అనిమీరు అనబోతున్నారు- నేనప్పుడే గ్రహించా."

ఆపాళంగా నాచేతిమీద చెయ్యివేసి : "మీరింత సత్యకాలపువాళ్ళేమిటండీ? మీరిద్దరూ భార్యాభర్తలు. ఇది రాజకీయం - అన్ని అస్త్రాలు ప్రయోగించాలె! ఇంతకీ తన్నుమాలిన ధర్మం ఎక్కడుంది? వాళ్ళసలు - శాంతం అడగడం తరువాయిగా - వున్నారు సరే - అనడానికి! నాకెప్పటిసంగతులప్పటికి తెలుస్తూనే వున్నాయిగా!" అంది.

నేనన్నా: "నాకేమిటో ధర్మంఅని తోచడంలేదుసుమండీ. నాకేం పెద్దఆశలులేవు. చిన్నలక్ష్యం ఒకటి పెట్టుకున్నా - అది న్యాయంగా సాధించడానికి ప్రయత్నిస్తున్నా. ఇంతకీ ఏపక్షంవాళ్లేనా నన్ను ముఖస్థంగా వచ్చి కోరుతే అప్పుడు చూద్దాం."

ఊర్వసి అందీ : "లక్ష్యం-సాధనం-అంటారేమిటండీ? ఏదిఏదో ఎవరండీ నిర్ణయించేది ? ఈవేళ లక్ష్యం రేపు సాధనం. ఎక్కడికక్కడికే. తిలక్కు "గీతారహస్యం" చదవండి. జాన్‌మార్లే "కాంప్రొమైజు" చదవండి. హిట్లరు "మైన్‌కాంఫ్" చదవండి. యీ విషమసమస్యలు పెట్టుకోని వుండకపోతే - మీరీపాటికి - యేగవర్నరో అయి వుందురు! నేనేకాదు - అందరూ అలాగే అనుకుంటున్నారు!"

నామనసులో వున్న ఉద్దేశాలే! శాంతం తెచ్చిన అద్దుసవాళ్ళన్నింటికి - నేను చెప్పినట్టే జవాబు చెప్పింది. పాపం! ఊర్వశిని అందరూ అన్యాయంగా అంటారు. మంచిమనిషి!

ఆమె అంది: "ఒక చిన్నవిషయం - శాస్త్రిగారూ! ఆవేళ మనంఇద్దరం కాళికామ్మవారి గుడినుంచి నాకారులో వస్తూంటే - 'బంగాళీ సాహిత్యం అన్నా బంగాళీ సంగీతం అన్నా బంగాళీవాళ్ళన్నా నేను చెవికోసుకుంటాను. నాకు బంగాళీ భాష నేర్పరా ?'-అని అడిగేరు మీరు. మీ కోర్కె చెల్లించడానికి వచ్చాను అంది...... ఆవేళ మందిరానికి వెళ్ళేముందు క్లబ్బులో 'డాన్సుపార్టీ' వుండెను. ఆ సోమరసావేశంలో ఊర్వశితో కారులో ఏమన్నానో జ్ఞాపకంలేదు. ఆగాజుబొమ్మని ముట్టుకుంటే యెక్కడ చితికిపోతుందోఅన్నట్టు మాత్రం వుండెను - అదొక్కటే జ్ఞాపకం.

'గురువు ప్రత్యక్షంఅయి ప్రసాదాన్ని అందిస్తూంటే శిష్యుడు తిరస్కరించడమే?' అన్నాను నేను. "ప్రసాదం సేవించేముందు-శిశ్రూషచేసి - గురుదక్షిణసమర్పించండి!" అంది. 'శిశ్రూషచేస్తూనే పాఠంనేర్చుకోవడం - తరువాతే దక్షిణ!' అన్నా నేను.

'సరే! ఇదివరకే మీరు ఇష్టదేవతా ప్రార్థన - గురుస్తుతి చేశారుకాబట్టి - ఇక ఓనామహాలు మొదలెడుదాం! ఇదిగో మొదటిపాఠం!' అంటూ వకగీతంపాడింది... శాతంగానంచేస్తూంటే - చల్లని దక్షిణపుగాలి వీస్తూన్నట్టు - బొగడపువ్వుల తేనెతో- మందారపువ్వుల ప్రప్పొడతో - వసంతగాలి - హృదయంలో ప్రవేశించినట్టువుంటుంది. ఊర్వశిపాడితే - కార్చిచ్చులమంటలు నన్ను మింగేస్తున్నట్టు - ఎడారిసుడిగాలి నా ఉడుకురక్తాన్ని పీల్చేస్తున్నట్టు - వుంటుంది...తనుపాడిన గీతానికి - అభినయంచేస్తూ అర్థంచెప్పింది. ఊర్వసి కొంటెపిల్ల - నెరజాణ!

అ - అనగా అనగా - 'అనురాగం'-
మన పెదవుల - పూర్ణానుస్వారం!
ఆ - ఆదిగ - 'ఆకారం'-
ప్రేమావేశముకొల్వును - నీరూపం!
ఇ - ఆ - అ - ఇ - 'ఇచ్ఛ'-
అంజలి నర్పించెద - నాశ్వేచ్ఛ!
ఈ - ఈజగతికి ఆధారం - 'ఈశ్వర్'-
నీవె కావా - నా హృదయేశ్వర్!
ఉ - ఉచ్చరించుము - 'ఉపయోగం'-
లచ్చివరాలైనవద్దు - ఈ ప్రేమవియోగం!
ఊ - అ - ఆ - ఇ - ఈ - ఉ - ఊ - 'ఊర్వశి'
ప్రియతమా!- తాళజాలదింక - నీప్రేయసి!

...ఎంతశ్రావ్యమైన గొంతుక! ఎంతకోమలమైన శరీరం! మీనుల్లాంటి కళ్ళ నుండి ఆమె వేడిచూపులు హృదయంలో చిచ్చువెట్టి - వెర్రిఆశలని రేకెత్తిస్తూన్నాయి. ఊర్వసిదగ్గర పాఠాలునేర్చుకోవలనే వుంది!

"వచ్చేనెల - నాగేరక్షణనిధికోసం - టాగూరు నాటకం 'చిత్ర' వేస్తున్నాం. మీవంతు నూరురూపాయలు సాయంచెయ్యాలి" అంది...చెక్కు తనపేరే వ్రాయించుకుంది. లక్ష్యం సాధనం బాగాజోడించి - నన్ను పొగిడి - నూరురూపాయలు వసూలు చేసింది! చమత్కారంఅయిన మనిషి - నిజంగా ఊర్వసే!

ఊర్వశి వెళ్ళిపోయాక - శాంతం జ్ఞాపకంవచ్చింది. ఎక్కడవుందో? కలకత్తా చేరినట్టు టెలిగ్రాంవచ్చి ఈవేళకి నాలుగురోజులైంది. ఎందుకు తెచ్చిపెట్టుకున్నాను ఈ యెన్నికల చిత్తక్షోభ? గొప్పలూ గోట్లూ - పదవులూ - హోదాలూ - నాకు వద్దు. మనశ్శాంతివుంటే చాలు. శాంతం చెప్పినట్టే నడచుకుంటాను...

# 77

## ఆమె

కాశీస్టేషనులో రైలు ఆగింది.

నేను ఢిల్లీకి టిక్కెట్టు తీసుకున్నా. కాని "కాశీ" అన్నమాట చెవినిపడగానే దిగవలెనని మనసులో కోరికపుట్టింది. ఆపాళంగా దిగిపోయాను. ఎక్కడ బసచెయ్యడం? హోటేళ్ళు ఎక్కడున్నాయో నాకు తెలియదే? ముందు ఏర్పాటు చేసుకోకుండా దిగిపోయానే అని గాభరాపడ్డాను.

కాని-ఇంతమంది స్త్రీలు - వృద్ధులు, ముగ్ధలు, పసిపిల్లలు, పడుచులు-ఇక్కడ నిర్భయంగా యాత్రచేసుకోడానికి దిగారా-నే నెందుకు భయపడాలి అనిపించింది. సాక్షాత్తు కాశీ అన్నపూర్ణ క్షేత్రం - మున్నూట అరవైఐదు అన్నసత్రాలువుండే మహాపుణ్యస్థలంలో బసకి భోజనానికి నాకేంభయం అనుకున్నా. దశాశ్వమేధ ఘట్టందగ్గర వక ధర్మశాలలో దిగేను. మా ముగ్గురికీ వకగది పుచ్చుకున్నాను. ధర్మశాల శుభ్రంగా లేదు. చీకటి తడితడిగాను జారుజారుగాను చెమ్మచెమ్మగానూ వుంది. సత్రంలోనే భోంచేశాం. సుధ అసలే తినలేకపోయింది.

కాశీవిశ్వేశ్వరుని మందిరం! లక్షాది యాత్రికులువచ్చి దర్శనంచేసుకుని పోతున్నారు. వెయ్యి వరహాల పువ్వులు - కుప్పలు తిప్పలు! భక్తులపూజ - పురోహితుల అల్లర - యాత్రికుల కోలాహలం - బ్రాహ్మణుల మంత్రోచ్ఛారణ - ప్రార్థన గీతాలు- అన్నిటినీ ఆవరించిన ఆ విశ్వేశ్వరుని ఘంటానినాదం - ఓంకారం!

నాలాంటి స్త్రీలు-అసంఖ్యాకులు-ఎంతమంది చిత్తశాంతికోసం-సంసారంనుండి ముక్తికోసం - జన్మతరించడానికోసం -యీ గంగామాతను పూజించడానికి వచ్చారో? అనాదినుండి ఎందరు యాత్రోవని నడిచారోకదా? దశాశ్వమేధం - మణికర్ణిక - ధృతరాష్ట్రుడు - హరిశ్చంద్రుడు - మహారాజుల ఐశ్వర్య భోగాలు, యమకింకరుల పరిపాలన మృత్యుదేవత, శ్మశానం! అన్నపూర్ణ నిరతాన్న ప్రదాయిని, జీవకారిణి! విశ్వేశ్వరుడు కాలభైరవుడు!

ఆ యాత్రికులతో నేనుకూడా కాశీ వీధిలలో తిరుగుతూంటే-సింధునదీ జలంతో సూర్యుడికి అర్ఘ్యంఇచ్చి-తూర్పు దిశబట్టి, వలసపోయి, ఆర్యావర్తంలో కాలుపెట్టి, అలసిపోయి, సొలసిపోయి, గంగాతీరాన్ని చేరి సేదదీరి తృప్తిపొందిన ఆర్యకన్యనే అనుకున్నాను-ఒక్కనిమిషం!

కేదారేశ్వర మఠం, శంకరాచార్యుల పీఠం, అహల్యాభాయి ఘట్టం, మెట్లు ఎక్కేను - మెట్లుదిగేను. పంచగంగాయీ-కబీరు కుటీరం - వేణీ మాధవం - సీతాకుండం - చూచాను.

నేనెందుకు యీ కాశీ క్షేత్రానికి వచ్చాను అని ప్రశ్న వేసుకున్నా.

జ్ఞానం-ముక్తి-మోక్షం-ఆనందం? కాదు ఆత్మశాంతికోసం. ఒకవైపు దారిద్ర్యం-అన్యాయం-క్రౌర్యం-ధనాపేక్ష - ఒకవైపు ప్రేమ-సర్వమానవ ప్రేమ - సంసారం ఒకవైపు దేశం ఒకవైపు - ఈరెంటిమధ్య నా విముక్త ధర్మం ఏమిటి? ఇది గ్రహించడం కోసం. కాని నాకు అగ్రాహ్యం.

ధర్మశాలలలో నిద్రపట్టలేదు. రాత్రి భజనలు తెల్లవారున వేదపారాయణ —

జావుర్‌పూరు వెళ్లేను. మహమ్మదీయ సంస్కృతి. సూఫీ హాఫీజ్ కవిత్వం. పారశీకపు మర్యాదలు. ఓమార్ ఖయ్యాము. మౌల్వీ ఉలేమాలా గోష్ఠి. ముషైరా చందన తాంబూలాలు, అత్తరు పన్నీరులు. సంగీతపు శెల్లు, దేవదాసులు, అంతఃపురం-తంబూరా, దిల్‌రూబా, నృత్యం, చందమామ జిలుగు తెరలు, వాటివెనుక నేను - నూర్జహాను, జేబఉన్నీసా! జుంకాలు, మామిడి పింజలు, రామచిలుకలు, నెమళ్ల నాట్యం, చదరంగం, జలక్రీడలు, గులాబిపువ్వులు. కాశీ - గంగాతరంగాలు - పశ్చిమాద్రిని మార్తాండుడు. ఔరంగజేబు సామూహా మశీదు. సాయంసంధ్య. నమాజుకు మౌజన్ పిలుపు - అక్బరు చక్రవర్తి మానవమందిరం, సర్వమానవమతం....? సాహృదయతంత్రులు మూగపోయాయి.

ప్రొద్దునేలేచి సారనాథం వెళ్లేను.

బౌద్ధయాత్రికులు అనేకులు అనేక దేశాలనించి వచ్చారు - సింహళం, చీనా, సయాం, బర్మా, జపాను.

మూలగంధకూటి విహారం! పువ్వులు, ప్రమిదలలో దీపాలు, కాగితపు లాంతర్లు, అగరువత్తులు, స్తూపాలచుట్టూ ప్రదక్షిణ.

— నేనుకూడా ఒక బౌద్ధ భిక్షువును. కాషాయము కట్టుకున్నాను. లుంబినీ ఉద్యానవనం. సిద్ధార్థుడు పావురాన్ని రక్షించాడు. లేడి పిల్లని కాపాడేడు. నాముందర మఠంవేసుకుని కూచున్నాడు. ధ్యానస్థ బుద్ధుడు. సుందరమూర్తి ప్రజ్ఞాపరిమితుడు. పరాంతపుడు, కృపామయుడు, పద్మాసనాసీనుడు. అభయమూర్తి. తథాగతుడు, బోధిసత్వుడు — యశోధరని వదలిపెట్టేసి వెళ్లిపోతున్నాడు. కన్నబిడ్డని - భోగవిలాసాలని - రాజ్యాన్ని - ప్రపంచాన్ని - వదలిపెట్టేసి - మారుని మాయలోకంనుంచి - కామక్రోధాలనుంచి - సుఖదుఃఖాల్నుంచి నడిరాత్రి అంధకారంలోకి వెళ్లిపోతున్నాడు.

పోయిపోయి గయదగ్గిర-నదీతీరాన్ని - గంగ రావిచెట్టునీడని - సేదదీర్చుకుంటున్నాడు కన్ను మాతపడింది. జ్ఞాన సమాధి. తేజోవంతమైన ముఖవర్చస్సు. నిర్వాణన సమాధి. ఆ కన్నులు కలువరేకులు. కరుణ కృప దయ ఉట్టిపడుతూంది. ఆనంద భాష్పాలు రాలుతున్నాయి.

నందలాలుబాబు చిత్రం నాకళ్లె ఎదుట నిల్చింది. అజాంతా శిల్పం ప్రత్యక్షం అయింది. — సిద్ధార్థుడు హృదయంలో జ్ఞానం ప్రవేశించింది. రాజకుమారుడు తలపై నవరత్నములు అమర్చబడిన కిరీటం. చేతిగులాబిపువ్వు. అభంగముద్ర. బుజాన జంధ్యము. ప్రక్కనిలబడిన యశోధర రూపలావణ్యరాసి పుష్పాంజలి సమర్పిస్తూంది. బోధిసత్వులు పూజలు అర్పిస్తున్నారు. బోధివృక్షంమీద వాలిన యక్షులు, కిన్నరులు, గంధర్వులు ఆనందగానం చేస్తున్నారు. ఇదిగో ఇక్కడ అతని మొదటి సందేశం! యీ విహారం యొక్క ద్వారం ముందరనే ఈ తోరణం క్రిందనే ఆ పుణ్యస్థలం! ఆచంద్రతారార్కం బోధిసత్వుని ప్రేమచిహ్నం నిలబడిపోయేటట్టు అతని శిష్యుడు అశోకవర్ధన పియదాసి-నిర్మించిన శిల! తేజోవంతమైన సింహాలు, సుందరమైన తామరపువ్వు, కర్మచక్రము, కాలచక్రము, ప్రేమచక్రము!

శాస్త్రిని వదిలేసివచ్చాను. ఇల్లువదలేసి వచ్చాను. కాని ప్రపంచాన్ని విడిచిపెట్ట లేను. పాపాయిని వదలిపెట్టలేను. అది నోరులేని పావురపు పిట్ట. సుభని వదలిపెట్ట లేను. అది పాపపుణ్యం తెలియని లేడిపిల్ల. శాస్త్రిని వదలిపెట్టడం? సంసారజ వదలి పెట్టడం - పాపాయిని, సుభని వదలిపెట్టడం? వదిలిపెట్టి —? కన్నదేశాన్ని వదలి పెట్టి ఎక్కడికి పోతాను? సన్యాసమా - పిరికితనమా? శాస్త్రి అంటే నాకు అపరిమిత ప్రేమ. అతనికోసం మనసు వాచిపోతూంది. కాపురం వదిలిపెట్టాలని లేదు సరికదా - ప్రేమ సౌఖ్యం అసలు ఇంకా రుచిచూడనేలేదని పిస్తూంది—

అన్నపూర్ణ సత్రానికి వెళిపోయాను! త్రోవలో అడుగ అడుగిక్కి ప్రతివ్రతల తులసి కోటలు - సహగమనపు సమాధులు — అబ్బ! అబ్బ! శ్మశానం - చితినిప్పులు కక్కుతూంది - బ్రాహ్మణులు మంత్రాలు ఘోషిస్తున్నారు - శాస్త్రి - అతన్ని కౌగ లించుకుని నేను - కారుచిచ్చులు నన్ను ఆవరిస్తున్నాయి - అగ్నిజ్వాలలు నన్ను మింగేస్తున్నాయి—

నేను ఈత్రోవని నడువలేను. సుఖందుఖం - ప్రేమయడబాటు - చావు పుట్టుక - పువ్వులు - నవ్వులు - నాకు కావాలి—

సత్రం అరుగుమీద బ్రహ్మచారులు సాయంసధ్య చేసుకుంటున్నారు. నడుం వంగిన ముసలివాళ్లు గంగాస్నానానికి వెళుతున్నారు. పడుచులు అన్నపూర్ణకు పసుపు కుంకుమ తీసుకెళుతున్నారు. పాపాయి సుభ నూరువరహాలు పువ్వులతోను బిల్వదళాలతోను ఆడుకుంటున్నారు. నేను వాళ్లని చూసి కౌగలించుకున్నాను.

## 73

### అతడు

రెండురోజులై పెద్ద గుమాస్తాగారు రావడంలేదు. చాలా చికాకుగావుంది. చిన్న గుమాస్తా కాగితపు కట్టలు సరిగ్గా అందివ్వలేకుండా వున్నాడు. నార్కేడిమిల్లివాళ్ల పంపకపు దావాలో ఆస్తి వివరాల పట్టీని టైపు చేయించమంటే పాచివెంట తనఖా దస్తావేజు బాపతు షెడ్యూలు టైపు కొట్టించాడు.

ఏమయ్యా అని అడిగితే భార్యకి జబ్బుగా వుంది - అంచేత రాత్రి నిద్రలేదు. తలపోటు తనకి అంటాడు. గుమాస్తాలు ఇప్పుడు సంఘం ఒకటి పెట్టుకుంటున్నారు! ఇహ - రేపు పొద్దున్న డాక్టరుదగ్గిర పనిచేస్తూన్న కాంపౌండర్లుకూడా సంఘం పెట్టుకుంటే - అక్కడికి సరిపోతుంది! పార్టీలదగ్గిరనుంచి - సాక్షి పట్టీలు దాఖలు చెయ్యడానికి ఖర్చులనీ, అమలు మోశను కిరుసుం అనీ, సువర్ణ మంత్రపుష్పాలు లాగుతూనే వున్నా పోనీ - యేగాడికింద బొక్కవలసిన పందికొక్కుని అక్కడే బొక్కనీ - అని నేను కలుగజేసుకోనే కలుగజేసుకోను. సరే - సంఘాలు పెట్టుకోండి - వాలంటరీలు మాత్రం ఆడక్కండి అని కడిగేసిన జీతపురాళ్లు ఇస్తే - అక్కడికా నీలుగుకట్టిపోతుంది. నాకు భలేకోపం వస్తూంది.

కాతం వెళిపోయాక - నాకు అన్నీ ఇలాగే వస్తున్నాయేమిటి!

నాలుగు రోజులై కొత్తగా జూనియరు ఒకతను వచ్చాడు. భావ్యాం సిఫార్సు చేశాడు - మేనత్తకొడుకు పినమామగారి అల్లుడు తమ్ముడని. మందిచేరితే మఠానికి చేటు ఇహ నాలుగోవాడుకూడా చేరేడంటే - మాకు మేజాలమీద ఇలెక్ట్రిక్ పంకాలు కావాలి - ఫౌంటెను పెన్నులు మీరేకొని సరఫరాచెయ్యాలి - అని మొదలుపెడుతారు జూనియరులు.

ఈకొత్త అతన్ని మధిరవాడ జమీతాలూకు పాతబిలుమక్తాకౌలుకదపాలు చదువమన్నాను - వెట్టి చాకిరీలు మేము విధిగా జమీందారుగారి దివాణంలో చేయగల వారము అని. రైతులవద్దనుంచి అని వ్రాయించి పుచ్చుకున్నారేమో చూదాంఅని తెలుగునే వున్నాయి కాగితాలు - "రామునితోక - పివరుండిట్లనియె" - అన్నట్టు చదివేడు.

"ఏమిటండీ - మీరు చదువుతున్న భాష?" అని అడిగేను.

"గొలుసు కత్తుదస్తూరీ అండీ - పాలకొండ శిష్టికరణం ఎవడో వ్రాసిఃట్టున్నాడు" అన్నాడు!

అక్కడితో అయిందా ? నే నేదో వ్రాసుకుంటూంటే - పనికట్టుకునివచ్చి:
"బారిష్టరుగారూ! 'స్పెస్-సక్సెస్ ప.నిస్' అన్నాడు - స్పెల్లింగు తప్పా - అచ్చుపిశాచమా - ఏమిటండీ ఇది ?" అన్నాడు.

ఏమిటి అనడం ? రేపు స్వరాజ్యం వస్తే శాస్త్రకారులూ వీరే - న్యాయాధిపతులు వీరే! నేను రామయ్యంగారికి జూనియరుగా వున్నప్పుడా-వేళ్లు అరిగిపోయినట్టు వ్రాయించేవాడు కదూ - పిటీషను లేమిటి, షెడ్యూళ్లేమిటి, ప్లెయింటు లేమిటి - చిన్నతనంలో ఒవాహవాలు ఇటికెగుండలో దిద్దిదిద్ది వేళ్లు అరిగిపోయినట్టు! ఇక - తెలుగు వైపు మెషీనులు వస్తే మాబావిగారు గుణితంమే వద్దంటాడు !—బావిగారు అంటూ మాకుంటే !

కట్టు తీసి జూనియరు తయారుచేసిన తాత్పర్యం చదివేను.

"తల్లి ఆస్తిలో కొడుక్కి ఎంత హక్కుందో, దాయాదికికూడా అంతమాత్రమే హక్కు. ఇది పైవాళ్లకి వ్రాసిఇవ్వడానికి కాని హక్కు విభక్తం చేయడానికి కాని వీలు లేదు. విధవ స్త్రీ మరణించిన తరవాతనూ, ఆమె మరణాంతరం దాయాది బ్రతికి వుంటేన్నూ అతనికి యీహక్కు ప్రాప్తం అవుతుంది. నామకాగా యీహక్కును మరి వకరికి త్రిప్పి వ్రాయడంగాని వదులుకోవడంకాని చెల్లదు. కాని ఇటువంటి హక్కును బదిలీచేయడం కుటుంబ ఆస్తుల పారీఖత్తూలప్పుడుగాని, ఒక ఆస్తి విషయమైన తగాదాలో రాజీ పరిష్కార మప్పుడుగాని జరిగినయెడల తప్పనిసరిగా చెల్లదు అని చెప్పడానికిమాత్రం వీలులేదు"

రెండోమాటు చదివేను కొరకబడలేదు. ఇదేమిటి - ఏకసంతగ్రాహిని అంటారే నన్ను - బుర్రలోకి ఎక్కడం లేదేమిటి ?—పొరుగువారింటికి సంగీతాచార్యుడు ఇప్పుడే రావాలా ? "సస-రిరి-గగ్గమ-సరిగ-సరిగ"—అహోరాత్రం మొట్టు నాతలమీద సమ్మెట్టులాగుంది — ఆ! అదేమిటి ? ఓహో చిన్నమ్మాయిగారి గాత్రం తరువాత పెద్దమ్మాయిగారి వీణగానం!-"శాంతమూ లేక సౌఖ్యమూలేదూ-సారసదళనయనా !"

శ్రీరామచంద్రమూర్తీ! - నాకు మనసులో శాంతం లేదోయ్ ! ఏం చెయ్యమన్నావు ? ఎక్కడ వెతకమన్నావు ? కలకత్తానుంచి బెలిగ్రాంవచ్చి వారంరోజులు పైగా అయిపోయిందే! ఎక్కడ కలకత్తా - ఎక్కడ చెన్నపట్నం ? ఆదేశం వేరు - ఈదేశం వేరు. ఆభాష వేరు - ఈభాష వేరు. ఆతిండి వేరు - ఈతిండి వేరు. శాంతానికి గులాబీజాము తప్పితే మిఠాయి అంటే కిట్టదు. అరసగోలా - సందేషు - సాయిస్తుందో లేదో ? వాళ్లు తిళ్లు బంగారంగానూ - పెరుగులో పంచదార పోసుకుంటారు ! ...యేమువులోనుంచి అపభ్రంశంలోకి దిగిపోతున్నానే !

శాంతం మాత్రం ఎక్కడికి వెళుతుంది? ఎన్నాళ్లు వెళుతుంది? నా బ్యాంకీ చెక్కులన్నీ సరీగానే వున్నాయి. నగలన్నీ ఇక్కడే వదిలేసింది. తన ప్రావిడెంటు ఫండు మొత్తం తన బ్యాంకులోనుంచి తీసి పట్టికెళ్లివుంటుంది. ఎన్నాళ్లొస్తాయి - ఐదువేలు? అందులోకీ ముగ్గురు మనుష్యులాయె? పరాయి దేశం పరాయివాళ్లు అంటే అసలు భయం శాంతానికి. ఎంతసేపూ నేనుండాలి దగ్గిర!

అప్పుడా లాఠీఛార్జితో ఎలా జొరబడిందో? ఆవేశంతో చేసినపని అది. ఆ స్త్రీలందరూ ఇప్పుడు ఇళ్లలో యథాస్థానం అలంకరిస్తున్నారు. ఆడవాళ్లకి ఆర్థిక స్వతంత్రం వుండాలి - అని ఒక పూతపదం అయిందాయింది శాంతానికి., ఇప్పుడు తిరిగి రానీ తెలుస్తుంది! చదువుకున్నది శాంతంకూడా యీ మూర్ఖమే. నన్నడిగితే - స్త్రీల అభిప్రాయం తీసుకుంటే - నూటికి తొంభైతొమ్మిదిమంది ఇల్లాలు: "మాకు స్వతంత్రం వద్దూ ఏమీ వద్దూ ఇంట్లో పడివుండని నిద్దురూ"-అంటారు. ఇంగ్లండులో నేను ఎరుగుదును గదా! స్త్రీకి ఆర్థిక స్వతంత్ర్యం అంటూ స్త్రీలని మభ్యపరిచి - మగవాడిని ఆడదాన్నికూడా మిల్లుల్లో బానిసలుగా చేసేశారు - ఇంగ్లండులో పెట్టుబడిదార్లు. సరి - రష్యాలో చెప్పనక్కరలేదు. ఆడది ఉమ్మడి ఆస్తి అన్నారు! మనుష్యులో - రాక్షసులో - సరి! ..."రాజాధిరాజు - సంపదకలిగిన - శాంతములేక సౌఖ్యములేదు - సారసదళనయన." సిరి సంపదలకి ఏంలోటు - శాంతానికి? బంగారంతో తులాభారం తూగవచ్చు. నిక్షేపంలాగు - మూడు కార్లు. రత్నంలాంటి కూతురు. మహారాజులాంటి పెనిమిటాయె. ఎందుకు వెళ్లిపోయినట్టు? ఏదో పంతానికి నాలుగురోజులు పుట్టింటికి వెళ్లి వస్తూందనుకున్నా - ఆ వుత్తరం చదివినప్పుడు. నాలుగు రోజులల్లా - పదిహేనురోజులు అయిపోతూంది. ఆడబ్బు ఖర్చంత అయిపోయాక వచ్చేస్తుంది. ఇహ ఎన్నాళ్లో అక్కర్లేదు.

నాకు కోపం వస్తూంది - శాంతమీద - నామీద నాకేకూడాను. శాంతం అంటే నాకు అపరిమితపు ప్రేమ. కాని నాపని ఇప్పుడు - ముండా కాదు - ముత్తైదువ కాదూ - లాగుంది.

కోపం వుపశమించడానికి - భాష్యం లేడీఅయ్యంగారు దగ్గిరికి వెళతాను వెళితే వాళ్లు అన్నీ ప్రశ్నలు వేస్తారు. నాకు ఏడుపు వస్తూంది. వెళ్లను. ఎవరి ఖర్మం వాళ్లే అనుభవించాలి నావృత్తివుంది. నాల్గారిపోర్టు లున్నాయి. నాకోర్టు కట్టలున్నాయి. వాటితో నే-మునగానాం - తేలానాం. నాకంతే రాసిపెట్టాడు దేముడు. శాంతం మళ్లీ నాకళ్లబడేవరకూ!

# 79

## ఆ మె

ఢిల్లీ: కాష్మీరీ దర్వాజా - కాట్రా రుచీరాం గల్లీలో ఈ హోటేలులో దిగేం-హోటేలేమిటి? పూటకూళ్ళ ఇల్లు!

కాశీలో రైలెక్కాం ప్రొద్దున్న సత్రంలో భోజనంచేసి మూడవతరగతి ప్రయాణం - అబ్బ? ఒళ్లు హూనం అయిపోయింది. పాపాయి నలిగి ముద్ద అయిపోయింది ఆ తొడితొక్కిడిలో సుభ వెనక్కి దగడిపోయింది. నోటిలో నాలుకవున్న పిల్ల కనుక-హిందీ కాస్త తెలిసి వుండడంచేత బండీ అంటుకుంది.

పాపం - మార్వాడీ ఆవిడ చంటిపిల్లలతో ప్రయాణం. మగవాళ్లు సామానంతనీ ఆవిడనీ ఆడవాళ్ళపెట్టెలో ఎక్కించేశారు. ఉబ్బస-దాంతోడు చంటిపిల్ల రాగాలు. ఆవిడ మొహం - ఏమి సర్దుతుంది? అందరూ ఆదరుచూసి చింపుకోవడం! పాపాయిని ఆవిడ తెచ్చిన పాతరసామాను బస్తామీద కూచోపెట్టి - నేనూ సుభ సర్ది పెట్టాం - మూడు ఇనపపెట్టెలు - రెండు రాగి హండాలు - రెండు బాల్చీలు-నాలుగు పెద్ద లోటాలు - మిఠాయిలతో రెండు కిరసనాయిలు డబ్బాలు - పెద్దమూటం పసుపు చుట్ట - ఒక పీకదాను - గంగాజలంతో అన్న పూర్ణచెంబు!

పిల్ల ఏడుస్తూంది. పూరుకుంటుందేమో అని - సుభ చెప్పరింటి బిళ్లలు రెండిచ్చింది. "బిలాయతీసకో - " వద్దు - అంది. అలాగే దగ్గుతో రొజుకుంటూ బొజ్జ కదుల్పుకుంటూ - చెంగున వెండితాళాల గుత్తితీసి కిరసనాయిలు పెట్టెలోనుంచి-అరడజను దూద్ ఫేడాలు - బర్ఫీలు - గుప్పెడు కేవిడీలు - పది నవాతు పొంగులు-నాలుగు హల్వా అచ్చులు - పిడికెడు పిస్తా - అక్రోటు - ఆల్ బొఖారా - ఇంత సాలామిశ్రీ-ఒక సీసాడు గుల్కంధు-తీసి ఇచ్చింది! "బహిణ్ జీ-ఖావ్!" అ ది. నాకు తీపి సాయించదు. అందులోకి సుచి శుభ్రం? ఆవిడని చూసి భయంవేసింది కాని-ఆవిడ ఎంతో ఆప్యాయంగా ఇస్తోంది - తన ధన్యవాదం తెలపడానికి. సుభ కళ్లు పెద్దవి పెట్టుకుని నోరు లొట్టలేస్తూంది. సరే - ఇదీ అన్నపూర్ణప్రసాదమే - అనుకుని తిన్నాను. పాపాయి వేళ్లూ-మూతీ-ముక్కూ- మొహం అంతా ముద్దచేసేసుకుంది.

ఆవిడ పిల్లా మహారణ్ పూరులో దిగిపోయారు. దిగిపోయేముందు - మళ్ళీ కిరసనాయిలు డబ్బాతీసి - అరవీసెడు పటిక బెల్లం - బాదం గింజలు - జీడిపప్పు - యాలక్కాయలు - పొట్లంకట్టి ఇచ్చి మరీ దిగిపోయింది! పరాయిమనిషి - పరాయిభాష - అయితేనేం - ఇద్దరిదీ ఆడజన్మే - ఇద్దరం గంగా మాయిపిల్లలమే!...

అప్పుడే ఒకరాత్రి ఒక పగలు గడిచిపోయింది. జారు. చమ్మ. చీకటి. మేడ మీదికి ఎక్కుపురాతి మెట్లు నిచ్చనలాగున్నాయి. నిత్యకృత్యాలకి కష్టంగా వుంది. భోజనానికి ఫరవాలేదు - మీగడపాలు - పుల్కాలు - సబ్జీ - షాక్ - అల్లప్పచ్చడి - వూరబెట్టిన పచ్చిమిరపకాయలు. అబ్బా - వీళ్లు కూడా ఇంత ఖారం తింటారూ!

కాని వూరులో తిరగడానికి భయంవేస్తుంది; నాకు తలమీద ముసుకువేసుకోవడం అలవాటులేదు - తలలో పువ్వులు పెట్టుకు చేసేకాని తోచదు - ఇక్కడ ఇవి మహాతప్పట! విజయనగరం పెద్దాపురం బొబ్బిలి పిఠాపురం - వీటికి ఆంధ్రరాజుల సాంప్రదాయం ఇప్పటికీ ఎలా అంటుకుపోయి వుండిపోయిందో - అలాగే యీ ఢిల్లీకి ఆ మొగల్ దర్బారు వాసన ఇలా అంటుకుపోయి వుండిపోయింది. పూర్వసువాసన!

ఢిల్లీ! సూర్యుడు చొరబడడానికి సందు లేదు. ఇందులోనే ఎడ్లబళ్లు - బరువులుమోసే కూలీలు - బుడ్డిదీపం పెట్టుకుని మిఠాయి రథాలు - ఒంటెలు లాగేబళ్లు - చెత్తకుప్పలలో మూతులుపెట్టి అరటాకులు లాగి తింటూవున్న ఆవులు - గుఱ్ఱపు ఎక్కాలు - పీళ్లకాళ్ళలోపడుతూ ఆడుకుంటూన్న పిల్లలు!...

ప్రొద్దున్న చూచాను - రెండుగల్లీల తరువాత - పెద్దకోఠీ. సుప్రసిద్ధుడైన యూనానీ వైద్యుడిదిట. శుక్రవారం. జుమ్మా బిచ్చం అందుకోడానికి బారుసలుతీర్చి దర్వాజా ఎదురుగా కూచున్నారు - బిచ్చం అడుక్కునేవారు - గుడ్డివారు - కుంటివారు - గూండాలు - సోమరిపోతులు. సింహద్వారంలోనుంచి కనిపిస్తుంది - చక్కని తోట - గులాబీలు చేమంతులు - జాజిలు - మల్లెలు - ముద్దగన్నేరు - పారిజాతం - నానిమ్మ పువ్వులు. జిలుగులు చెక్కిన చలువరాతి వసారాలు - [illegible] జాలుగుమ్మీలు - బాలసూర్యుని కిరణాలలో మెరుస్తూన్న నీటిధారలు. లోపలి దర్వాజాలో నిలచివున్నాయి - నాలుగైదు పెద్దకారులు.

"లా అల్లా - రసూల్ - ఉల్లా! అల్లా ఇన్‌షల్లా! లా అబ్దులుల్లా - లాఅల్లా!"

తురకల భోగము - తురకల దరిద్రము! దర్వాజాబైట - దర్వాజా లోపల ఎంత వ్యత్యాసం! నాకు వుండ బుద్ధిపట్టలేదు నేను హిందూ స్త్రీని అని మర్చిపోయాను - నా స్థానం కూడా దర్వాజా వెలుపలనే అనిపించింది.

చాందినీ చౌకుకు వచ్చాను. హనుమంతుని కోవెల. బైట చలివేంద్ర. ఒక బైరాగి ఇనుపగొట్టంలోకి నీళ్లు పోస్తున్నాడు. దోసిళ్ళతో దాహం త్రాగుతున్నారు హనుమంతోపాసకులు. వాయుదేముడి కొడుకు- అంజనీదేవి వ్రతంవల్ల పుట్టినవాడు - రామబంటు. అతను మయలబడిపోతాడు - వీళ్ళందరూ కోవెలలోపలికి వెళితేను, బైటవుండే సింధూరం తిలకం పెట్టుకుని పోతున్నారు పాపాయి బొట్టుపెట్టమని

ఏడ్చింది. నేను పెట్టలేదు. గాంధీమహాత్ముడు దిగ్విజయానికి బయలుదేరేటప్పుడే తిలకం పెట్టుకోవడానికి ఒప్పుకున్నారట!

— ఆడది ఒంటిగా వీధులమ్మట తిరగడం వీళ్ళందరికీ విడ్డూరంగా వుంది!

వీళ్ళందరి చూపులు నామీదే వాలుతున్నాయి. నా కాళ్ళు తొట్రుపడుతున్నాయి. చలి వణికిస్తూన్నప్పటికీ ముఖం అంతా చమట. హల్వాయి దుఖాణం కనబడితే- పిల్లలిద్దరితో లోపలికెళ్ళి బల్లదగ్గర కూచున్నాను. ఆతని జీవితంలో ఎప్పుడూ ఇటువంటి అనుభవం ఎటస్థపడ నట్టుంది. ఆ పాదపుస్తకం నన్ను తేరిపార చూశాడు. సలసల మరుగుతూన్న కోవాపాలను కలపడం మర్చిపోయాడు. మిఠాయిమీద వాలుతూన్న కందిరీగలను ఈతరొమ్మతో తోలడం మర్చిపోయాడు అతని నవుకరు. తమలపాకులని నాలికతో అందుకుని పోయింది దారిమ్మటపోయే ఆవు - ఆవుని తోలడం మర్చిపోయాడు గిన్నెలు కడిగే కుర్రాడు.

పాపాయికి సుభకి పాలు కావాలన్నాను. సావుభర్ పాలు రెండు గాజు గళాసులలో ఇచ్చాడు. బూరాపంచదార వేసి పుర్వాలో ఇమ్మన్నాను. నేను రెండు గులాబీజాములు తిన్నాను.

గులాబీజాములు తింటూన్నంతసేపు శాస్త్రి జ్ఞాపకం వచ్చాడు. అతనికిప్పుడు ఫలహారంవేళ - తప్పకుండా పాలబారి వుంటుంది. నేను తనను తలుచుకున్నానని అనుకుంటాడు. నా ఆవేదన అతనికి అర్థం అయిందో లేదో! కోపంవచ్చి వెళిపోయానను కుంటాడు. నాకు కోపంలేదు. ప్రపంచాన్ని తేరపారి చూడడానికి నాకు భయం. గడుసుదనం - లౌక్యం - వ్యవహారసరళి - ఆనుమాయతలు - నాకు తెలియవు. వాటిని సహించలేను. "నొప్పింపక తానొవ్వక తప్పించుకు తిరుగువాడు" — అంటే నాకు కిట్టదు ..అందరి స్నేహితుల మధ్యవున్నా శాస్త్రి వంటరిగానే వుంటాడు - పాపం!

నేను ఈ "లస్సీ" త్వరగా త్రాగి ఇక్కడనుంచి వెళిపోతేనే మంచిది - నన్ను చూడడానికి జనం మూగుతున్నారు! సిగ్గు బిడియం విడిచి యీ స్త్రీ ఇంత బరిదిగిపోయి బహిరంగంగా విచ్చలవిడిగా తిరుగుతూందే - అనుకుంటున్నారు! ఒక్కొక్క దేశం - ఒక్కొక్క మర్యాద - ఒక్కొక్క నియమం - ఒక్కొక్క కాలం - ఒక్కొక్క నీతి ఆధునికం మధ్య యీ సనాతనం - పురాతనం మధ్య నేను నూతనం.

...వీళ్ళ దృష్టికి నిలబడలేకుండా వున్నాను. దృష్టి తగలడం అంటే ఇదేనా ఏమిటి? నా వరాలబలం అంతా అడ్డుకుపోయింది- గడ్డిపోచలాగున్నాను మావెంట వస్తూన్నారు పల్లెపిల్లలు - గుంపులు...అదిగో యీ దుఖాణంముందు త్రివర్ణపతాకం ఎగురుతూంది. ఖాదీ భండారం ఇందులోకి వెళితే ఈ అల్లరిగుంపునుంచి తప్పించుకో వచ్చు.

# 80

## అతడు

చిళ్లపాళయం శ్రోత్రియందారు రామయ్యంగారి క్లయింటు. నేను రామయ్యంగారి క్రింద పని నేర్చుకుంటూన్నప్పుడు శ్రోత్రియందారుగారికీ ఆయన భార్య ఆండాళ్లమ్మగారికీ ఏవో గృహచ్ఛిద్రాలువచ్చి పొత్తూ కుదరలేదు. గృహచ్ఛిద్రాలేమిటి? ఆయనది. పూర్వకాలం అంతసానుల ఠీవి సదా! ఏమైనా ఆయన ఆవిడ రెండేళ్లపాటు వేరుపడిపోయి - ఆవిడ పుట్టింటికి వెళిపోయింది.

తరువాత సర్దుకుని - ఆవిడ మొనిమిటి దగ్గిర కొచ్చేసింది. అప్పుడు ఉభయపక్షాల వకీళ్లు మధ్యవర్తులుగావుండి రాజీ పత్రం వ్రాయించారు. అందులో షరతులక్రింద యీ ప్రకారం ఉదహరించేరు “మళ్లీ ఈ రాజీదరిమిలా భార్యాభర్తలు వేరుపడినపక్షమందు, ఫలాన సర్వే నంబరున్న ఇన్ని ఎకరములు ఇన్ని సెంట్లు విస్తీర్ణములు గలవన్నీ అయినటువంటి ఫలానా శ్రోత్రియములనుండి వచ్చే భూఫల సాయం కేటాయింపుచేసి భార్య మనోవర్తి నిమిత్తంగాను ఆమెకు నేను ఇవ్వగలవాడనూ” - అని. రాజీ పత్రం స్టాంపు కాగితంమీద వ్రాసి రిజిస్ట్రీ చేయించుకున్నారు. సరి - మరి రెండేళ్లు గడిచేక మళ్లీ ఆయన యథాప్రకారం నృత్య కళని అభినయ కళని పోషించడం ఆరంభించేరు. ఆవిడ మళ్లీ కన్నవారింటికి వెళిపోయింది.

అప్పుడే ఎనిమిదేళ్లయింది. ఖరారునామా ప్రకారం ఆవిడకి ఇవ్వవలసినది ఇవ్వనన్నారు శ్రోత్రియ దారుగారు. ఇప్పుడు ఆవిడ తనకు రావలసిన పైకం అసలు వాయిదాలతో గుజస్తు తారీఖునుంచి లెక్కకట్టి వడ్డీ మింజుమలై ఇరవై ఎనిమిదివేలకిన్నీ, రాజీపత్రం షరతులు అమలుపరచడానికిన్నీ దావా పడేసింది. సబు కోర్టులో ఆవిడ డిక్రీ పొందింది.

మొదటి దగ్గిరనుంచీ నాకీ వ్యవహారం తెలిసివుండడంచేతనూ ఇతరత్ర ఆయన కోర్టు వ్యవహారాలు నేనే చూస్తూండడంచేతనూ - అప్పీలు పడేయమని మొన్న ఆయన నాదగ్గిర కొచ్చారు. సరే కాగితాలుచూచి చెబుతానన్నా. ఈవేళవచ్చి కూచున్నాడు. క్రిందికోర్టు వకీలుగారినికూడా ఆయన వెంటేసుకొచ్చాడు.

“అప్పీలు పడేయకండి” - అని నేను సలహా యిచ్చాను.

వకీలు అన్నాడు: “అదేమిటండీ - అలా సలహా యిస్తున్నారు? డబ్బుకి ఆశపడి ఆవిడ భర్తనుంచి లేచిపోయింది. రాజీ షరతులు సంసారాన్నీ విచ్ఛిన్నం చేస్తున్నాయి.

కాబట్టి ప్రజా నీతికే వ్యతిరేకం - అందుచేత అసలు రాజీ పత్రమే చెల్లదు - అని మనం ఎందుకు అనకూడదు? మొదలు నరికితే వేరుతో పోతుంది కందండీ? అసలు రాజీనే చంపేదాం!"

అందుమీద నేను: "మీరు విషయం గమనించండి! రాజీపత్రం మొదట ఎందుకు పుట్టింది? వేరుపడిన భార్యా భర్తలను దగ్గిరచేసి సంసారాన్ని నిలబెట్టడానికే గా? అంచేత న్యాయ సమ్మతం నీతి సమ్మతంకూడాను" - అన్నా. యీ చెట్టుక్రింద వక్కీళ్లతో యేమి వాదిస్తాం? వీళ్ల పిడుగురాళ్ల పద్ధతులు హైకోర్టుముందు చెబితే పేడ నీళ్లేసి కొడతారు ముఖాన. అయితే ఏం చెయ్యను? శ్రోత్రీయందారుగారికి అలాంటి సలహాలే నచ్చుతాయి!

వకీలుగారు నాతో వాదన. "రాజీ షరతులు అమలుపరచడానికి క్రింది కోర్టుకి అధికారం లేదని మనం వాదించకూడదా?" అన్నాడాయనగారు.

"వెనక శ్రోత్రీయందారుగారూ రైతులూ తగాదా పడినప్పుడు కోర్టువారు ఈ రాజీ న్యాయసమ్మతమే అని రాజీ పత్రాన్ని నమోదు చేసుకున్నారు. అట్టి సందర్భంలో అమలుజరిపే కోర్టుకి అధికారం ఎక్కడినించి వస్తుంది - రాజీ పత్రం న్యాయ సమ్మతం అని తీర్పు చెప్పడానికి?" అన్నా.

ఆయన వూరుకుంటాడూ? శ్రోత్రీయందారి ఎదుట తన పాండిత్యం చూపించవద్దూ?

"అలాగైతే - క్రిందకోర్టుకి అసలు జ్యూరిడిక్షనే లేదని వాదించొచ్చుగా?" అన్నాడు.

"వీల్లేదండి! మీరు ఆవిషయం సబుకోర్టులో ఎత్తితే జ్యూరిడిక్షను వున్నదీ అని తీర్పు చెప్పారు. అంచేత ఇప్పుడు 'రెస్ జ్యూడికేటా' కిందకి వచ్చేస్తూంది" అన్నా.

"బారిష్టరుగారూ! ఈ విషయంలో నేను చాలా పట్టుదలతో వున్నా. మీ సలహా అటుంచి - అప్పీలు తప్పక పడేయండి" అన్నాడు శ్రోత్రీం యందారుగారు.

"మీరు అలా సెలవిస్తే - మరెవరిదగ్గరకే నా వెళ్లవలసిందే అప్పీలులో బలం లేదని తోచినప్పుడు ససేమిరా - నేను కాగితం పడేయను!" అన్నా.

ఇంకేం వుంది - దాంతో ఆయనకి నామీద చెల్లు! నిక్షేపంలాంటి కోర్టు పక్షిల వదులుకున్నానే అనిపించింది. పక్షి అన్న పక్షా? రాజహంస! ఇలాంటి రాజహంసని కోడా పట్టివుంచే చాలు - సాలీనా పదిహేనువేల రూపాయల ఆదాయానికి! కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్టు-అన్నానే!

శాంతంవుంటే యెంతో సంతోషించును - నేను నమ్మిన మాటమీద నిలచినందు కున్నూ-ధర్మానికి కట్టుబడి వక స్త్రీ తరఫున మాట్లాడినందుకున్నూ! నేను యెల్లప్పుడూ క్లయింటు చిత్త ప్రకారం పోయేవాడినే? శాంతం ఆత్మ నాలో ప్రవేశించి నన్ను మాట్లాడించిం దేమిటి చెప్మా? శాంతం ఇంట్లోవుంటే నాకు కంచుకోటలో వున్నట్టే. ఆ మధ్య స్త్రీయను ఇన్స్యూరెన్సు కేసులో - వారీనామా పట్టీకన్నీ సరాంగు శాస్త్రీ రశీదు కిన్నీ వున్న తేడా-తరవాత దైవికంగా కలిగే నష్టాలు సంభవించేటప్పుడు సరుకు తెప్పించుకున్న వర్తకుడికి వుండే ఆస్తి హక్కు - పనసపండు వొలిచి చేతిలో పెట్టినట్టు - ఎంత చక్కగా బోధపర్చి చెప్పింది నాకు? చెప్పడమేమిటి - గ్రిప్ఫిత్సు అంతు గాడు వ్రాసి పంపించిన ప్లెయింటు తల్లకిందుల మార్చేసిందికదూ? గ్రిప్ఫిత్సు అడిగేను: "పెన్సులుతో దిద్దుబాట్లు ఎవరివి-శాస్త్రీ? ఎవరికో నారీరత్నంయొక్క దస్తూరీలాగుంది-ముత్యాలకోవలు?" అన్నాడు. క్వీన్ మేరీసులో వెనక విదేశీ వర్తకం వ్యాపారం పాఠ్ఫె పెరున్న-ఇప్పుడు నా అర్ధాంగి—అన్నా. ఢంగుపోయాడు కదూ!

...శాంతం వెళిపోయిం దగ్గిరనుంచీ గులాబీ చెట్టు పూయడమే మానేసింది. పాపాయి లేకపోవడంచేత చందమామ వెన్నెలకి చల్లదనమే పోయింది. ఇంట్లో యిల్లాలు వుంటే - కడుపులో చల్ల కదలకుండా - అన్నీ అమర్చిపెట్టినట్టు జరిగిపోతాయి - అవిడ లేకపోయే సరికల్లా - ఎక్కడలేని లోటూ కనిపిస్తుంది - బతుకే వకకల్ల భయానక మైన కల!

శాంతం వెళిపోయిం దగ్గిరనుంచీ - గొంతుకలోకి మెతుకులు దిగడంలేదు. ఆచారి వంట అలాగే యేడుస్తూంది. ఈరాత్రి - అనపకాయ ముద్ద తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అంటూన్న పెరుగుపచ్చడి - తద్దినం చారు-కడిశంపట్టిన మజ్జిగ...

చిలకలు చుట్టి తాంబూలం ఇచ్చేది-"నాన్నా నాన్నా"-అంటూ పాపాయి!... ఎన్నాళ్ళో ఇలాగు?

## 81

### ఆమె

పురాణా ఖిల్లా - పాండవుల కోట - తుగ్లకాబాదు - ఫిరోజిషా కోట్లా-హుమయూను గోరీ - నయాఖిల్లా - కుతుబ్ మినార్ మీదనుంచి ఆర్యావర్తపు చరిత్ర అంతా సింహావలోకనం!

యీ సిధిలాలు చూస్తే నామనసు క్రుంగిపోతుంది. నిస్పృహ వస్తుంది.

హిందూ మహోదయంలో ఎంతసేపు - రాజులూ - ప్రజలూ తగాదాలు. మహమ్మదీయ మహోదయంలో ఎంతసేపూ పాలకులు - పాలితులు సంఘర్షణలు. "భూమి పాడుపాడి - ఫలసాయంలో భాగం పెట్టు" అని! ఎప్పుడూ పన్నులు వసూలు చెయ్యడం - ఖజానా నింపడం - ఫౌజుని దండయాత్ర కంపించడం - కొల్లగొట్టడం. తురకల పరిపాలన అంటే శిస్తులు పిండే పిశాచమే - అంతకి తప్పితే యేముంది? రదో శనం కాదు - మహసూలు పోగుచేసే మారణ యంత్రం. ఖామందులు ఇటులాగ - రైతులు అటులాగ. సరి - బ్రిటీషువాళ్లు! పాలకులు - పీడితులు. సత్యాగ్రహ సమరం! ఇతిహాసం అంతా ఇదేకదా - ఆర్థిక శక్తుల పెనుగులాట! అల్ప సంఖ్యాకులు బలవంతులు - అధిక సంఖ్యాకులు బానిసలు- ఆర్థికంగాను, మానసికంగాను, నైతికంగాను!...

కానట్టు సర్కస్‌లో కనిపించింది - బాగా యీ బానిసత్వం!

ఒక్కడుగాని ఒక్కతెగాని ఖద్దరు వేసుకున్న పాపాన్ని పోలేదుకదా! స్త్రీలు కట్టుకున్న దుస్తులు - వేసుకున్న నగలు - పూసుకున్న రంగులు - రాసుకున్న పరిమళాలు - చివరకి నోటవచ్చే భాష - అంతా విదేశీయమే! స్వదేశంలో వున్నానా- పరదేశంలో వున్నానా అనిపిస్తే - ఇంకేమిటి? దీపాలు పెట్టేవేళకి - ఆ బజార్లలో కొనడానికి వచ్చే యే లెక్కమంది ధనికులో. కొనడానికి రాగిడబ్బు లేకపోయినా - కొలువుపెట్టిన వస్తువులను చూసి ఆనందించడానికీ - ధనికులను చూసి మురిసిపోవడానికీ వచ్చిన సామాన్య జనం! "తన వెంటన్ సిరిలచ్చి వెంట" అన్నట్టు వారివెంట వీరు-వీరివెంట వారు - హడావుడిగా ఆ కానట్టు సర్కసుచుట్టూ - కమలాపండుమీద చీమల పుట్ట తిరుగుతున్నట్టు!

"ఏంతవాడవయ్యా - నీవెంతవాడయ్యా! వింతైన నీ మాయజంతరంబులో నన్ను - బంతివలె దగిలించి ఏంత గంతులు వేయింతువయ్యా" - అన్న పరవస్తు వారి కీర్తన అప్రయత్నంగా పాడేను మనసులో! ఎంతవాడు - బ్రిటీషువాడు అనిపించింది. "మాకొద్దు యీ తెల్ల దొరతనము" అన్నాం. తెల్లదొరతనం తప్ప మరొకటి కద్దు అంటున్నారు-వీళ్లు. వైస్‌రాయి గృహం-సేనాధిపతి భవనం-మహారాజుల మేడలు-వారి తాబేదార్ల ఇళ్లు - వారి గులాముల గుడిసెలు! కౌన్సిలు భవనం - ఎస్సెంబ్లీ మందిరం-నాకు చూడ బుద్ధే పుట్టలేదు. యీ నూతన ఢిల్లీ చూస్తే - ఇక్కడవుండే వాళ్లకి గాంధీగారు కాని, కాంగ్రెసుకాని - త్రివర్ణపతాకం కాని - హిందూదేశం అంటూ ఒకటిగాని వున్నట్టు వీళ్లకి తెలియనే తెలియదా ఏమిటి? - అనిపిస్తుంది.

అదిగో - ఆ వజ్రాల వర్తకుడి దుఖానంలోనుంచి వస్తున్నారు-నలుగురు స్త్రీలు! ఎత్తువల జోళ్లు జార్జెటు చీరెలు - వలగుడ్డ రవికెలు - దొండపండురంగు పెది మద

మేలు - వీళ్లందరూ ఊర్వశి మిత్రలాగేన్నారు. ఈ హోటేలులోనుంచి బైటికి వస్తూన్నారే - మగవాళ్లు పదిమంది - ట్వీడు సూట్లు - ధొర టోపీలు - పేటెంటు తోలు జోళ్లు - అచ్చంగా ప్రతివాడు ఒక్కొక్క శాస్త్రి! ఆ ముఖాల్లో - నిండు కడుపులోనుంచి వచ్చే హాయి - అధరాల్లో అహంభావం - నవ్వుల్లో డాబుదర్పం - జేబుల్లో నోట్ల కట్టలు!

క్రోసెడు దూరంలో అమోరీ దర్వాజా దాట్టూవున్న కందకాల్లో - ఆ కోటగోడ కానాలలో - నివశిస్తున్నారు - బీదజనం - అనాథపశులు. కానా వక్కొంటికి రెండేసి కుటుంబాలు. చిరిగిన గోనె పరదాలు - పుచ్చిపోయి విరిగిన వెదుళ్లమీద నిలబెట్టిన తుప్పతో చిల్లుపడ్డ డబ్బా రేకులు! ఆ జానెడు మూరెడు స్థలంలోనే - పుట్టుకలు చావులు - ప్రణయం - సరసం - విరహం - కొట్లాటలు కూనీలు. వకచాటూ మాటూలేదు - మరుగూ ఆరుగూలేదు. అదే ఇల్లు అదే వాకిలి. అదే జన్మభూమి అదే పితృభూమి. దరిద్రనారాయణుడూ మృత్యుదేవత వివాహమొందినట్లుంది అక్కడ!

నాకు రోతపుట్టింది. వీళ్లుకూడా నాలాంటివాళ్లే - వీళ్లు తాగేదీ నేను త్రాగేదీ - గంగా గోదావరి నీళ్లే - వీళ్ల వంట్లోనూ నా వంట్లోనూ భరతమాత రక్తమే ప్రవహిస్తూంది. వీళ్ళనీ-నన్నూ-శాస్త్రినీ-నూతన ఢిల్లీలో ప్రజానీకాన్నీ-అందరినీ-తరింప జేయడానికే కదా - గాంధీగారు స్వరాజ్యం సాధించారు! అంతలా అనుకున్నా - నేను వీళ్ళ దగ్గిరకి వెళ్లలేకుండా వున్నాను. అసహ్యపడుతున్నాను యీ మోటుతనం కళ్లు-కంపు-ఈగలు-రొంపి-గజ్జికుక్కలు - పుసికళ్ళ పిల్లలు - రోగాలతో వున్న స్త్రీలు - తప్ప తాగిన మగవాళ్లు-మూల బొంతమీద మూలుగుతూన్న ముదుసలులు.

కాస్త డబ్బువుంటే వీళ్ళూకూడా పాంకులనుండి మానవ జన్మహక్కులని దబాయించి పుచ్చుకోగలరు కదా! బురదలోకి నీళ్లు వెళితేనే గదా - తామరపువ్వు! తామరపువ్వులోనుంచి కదా పుట్టింది - లక్ష్మి - మంగళ దేవత!...ఎన్ని అనుకున్నా నిలబడలేకుండా వున్నాను - దుర్గంధం! అప్పుడు మాలపల్లెలు తుడిచేం - కాని ఇప్పుడా ఉత్సాహం ఉద్రేకం లేదు. స్వరాజ్యం సమరంలో విజయం వల్లనా?

హోటేలుకి వెళ్లి చెప్పాను - రాత్రి రైలుకు లాహోరు వెళిపోతానని. హోటేలు వాలాని నేను ఇదే చూడడం పాతికేళ్ళ యువకుడు. ముతుక ఖద్దరు ధోవతి ముతుక ఖద్దరు లాల్చీ. కళ్లు మెరుస్తూన్నాయి. ముఖంలో అసంతృప్తి ఉత్తేజం కనిపిస్తున్నాయి.

“క్షమించండి! మీ ఖద్దరు బట్టలుచూసి అడుగుతున్నాను. కాంగ్రెసువారా?” అన్నాడు.

“అవును” అన్నా.

“స్థితప్రజ్ఞులా?” అని అడిగేను.

"కాదు-నాలుగణాల సభ్యురాలిని-సామాన్య స్త్రీని" అన్నా

"రాజకీయ యాత్రికులా?" అన్నాడు.

"బనియన్న పిల్గ్రిమ్!" అన్నా.

"బైరన్ను చైల్డుహారల్డు అనుకున్నా" అన్నాడు "ఎక్కడనుంచి రావడం-సింక్లర్ లెవిస్ మెయిన్ స్ట్రీటునుంచా-ఛాసర్ కేంటర్బరీనుంచా?" అని ప్రశ్నించేడు.

"శ్రీనాథుడి కాశీఖండంనుంచి-కల్హణుడి కాశ్మీరానికి!" అన్నా.

నేను ఇక మొదలుపెట్టా ప్రశ్నించడానికి!

"మీరు కాంగ్రెసేనా?"

"అవునూ-కాదూ!" అన్నాడు.

"ఆడ పెయ్యా-మొగపెయ్యా. చాటపెయ్య ఏంఖర్మం?" అన్నా.

అతను నవ్వలేదు! "గమ్యస్థానం పక్కటే. పావలా టిక్కెట్టుకొన్నాను. ఆశేళ్ళ కిందట రావీ నదివొడ్డున. బస్సు నడవటంలేదు. దిగిపోదామా అనుకుంటున్నాను" అన్నాడు.

"నడిస్తే దూరం" అన్నా.

"డొంక తిరుగుడుకంటే ముళ్ళదారే దగ్గిరేమో?" అన్నాడు.

"దారి చూపించేవాళ్ళెవరు?" అని అడిగే.

"గుడ్డివాడికి కుంటివాడు. నలుగురు ముందడుగువేస్తే అదేదారి" అన్నాడు.

"అందుకు తర్ఫీదు?"

అతని జవాబు: "కాశీ విశ్వవిద్యాలయంలో ఏం. యే-ప్రపంచానుభవంలో-ప్రెమెచురీ."

"ఢిల్లీ వాస్తవ్యులా?" అన్నా.

"క్విన్సువేవాలని-కాదు - అంతర్జాతీయుణ్ణి-భారతీయుణ్ణి" అన్నాడు.

"పూర్ణ స్వరాజ్యమే లేదుకదా - అంతర్జాతీయం ఎక్కడ? ఉట్టికి ఎగురలేని అమ్మ స్వర్గానికి ఎగురుతుందా?" అన్నా.

"చావుకి పెడితే లంకణానికి దిగుతుంది. గెలుస్తే యావత్ప్రపంచం - వోడితే పోగొట్టుకునేవి మన సంకెళ్లే!" అన్నాడు.

"మీ లక్ష్యం?" అని అడిగే.

"రామరాజ్యం" అన్నాడు.

"మీ సాధనం?" అని అడిగా.

"నాకు తెలియదు - అగమ్యగోచరం" అన్నాడు. కొంచెంసేపు వూరుకుని: "మీరు వెళ్లేది రాత్రిబండికే కదా. ఇప్పుడే సూర్యాస్తమం అయింది. నాతో వూళ్ళోకివస్తే మేం విప్లవవిత్తులు ఎలా నాటుతున్నామో చూపిస్తాను. వస్తారా?" అని అడిగేడు. అతన్ని చూస్తే నాకు భరవసా కలిగింది. "నాపిల్లలు వంటరిగా వుంటారే!" అన్నా. "మాఅమ్మ క్వీన్సువే భవనంలో నివాసం. ఆమెకు ఫోను పంపిస్తా. ఆమె కారులో వాళ్ళని సరాసరి రైలుకి పంపిస్తుంది" అన్నాడు...

చాలా దూరం నడిచి వెళ్లాం.

మోచీ దర్వాజా నుంచి సాబ్జీమండీ సందులుదాటి బాగ్ హింమాయతుపేట అన్నీ ఫ్యాక్టరీగొట్టాలే. ఆపొగల్లో సూర్యుడు అంతర్ధానం అయ్యాడు. ఫ్యాక్టరీకి ద్వారాల్లోనుంచి ప్రజాప్రవాహం - మగవాళ్లు, పిల్లలు, ఆడవాళ్ళు. పనుల్లోకి ఎక్కే వాళ్ళు - పనుల్లోనుంచి దిగేవాళ్ళు. ఇంకవేస్తే రాలదు ఆ సమ్మర్దంలో. బట్టల యంత్రాగారాలు - పిండిమరలు - పంచదారమిల్లులు - బిస్కెట్టు ఫ్యాక్టరీలు - ఇనుప కర్మాగారాలు - కమ్మరం కార్ఖానాలు - ఒకదానిమీద వకటి. కూలీజనం. కుళ్ళు గుడ్డలు. కుమిలిపోయిన ముఖాలు కళాకాంతులు లేని శరీరాలు. కృశించిన అవయవాలు.

ఆ మూకలో ఒక కోమలమైన స్త్రీ - ఖద్దరుచీర. చురుకైన ముఖం. నా స్నేహితుడిని చూచి నమస్కరించింది. అదిగో - ఆ కూలీలజట్టులో యువకుడు - యూనివర్సిటీ విద్యార్థి లాగున్నాడు - ఇతడు కూడా నమస్కారం పెడతున్నాడే! నేను నాలుగువేపులా చూశాను. ఆయిదారుగురిని లెక్కపెట్టాను - యువతులు యువకులు - యీ కూలీలలో కలిసి మెలసి పోయారు...రాత్రి - ఆ యంత్రాల మోతలో యీ కృశించిన అస్తిపంజరాల్లో - యీ అయ్యవార్లంగార్ల నట్టిళ్ళలో - యీ కష్టించిన కూలీల హృదయాల్లలో నిశ్శబ్దం ఎక్కడిది?...

అక్కడనుంచి - మళ్ళీ నడక మొదలెట్టాం...

అజ్మీరీ దర్వాజాలోనుంచి - ఖరీబావులీ వీధుల్లోనుంచి- చౌకీబజారు దఖాణాల ముందరనుంచి - జమ్మామసీదు పోటిద్వారం దాటి - సీతారాం కట్రా గల్లీలలోనుంచి - కచ్చాహవేలీరామ్ సందులో - ఒక కోఠీలో కెళ్ళాం.

ఉంటేఉన్నాయి లేకపోతే లేదు గుడ్డిదీపాలు. అంగడం వకటి దాటాం. మూడు అంతస్తుల మెట్లు ఎక్కాం. తలుపుదగ్గిర వక యువకుడు కాపలా నిలబడి వున్నాడు. అతడు "హరిబోల్!" అన్నాడు. అందుకు నా స్నేహితుడు జవాబుగా: "జండా ఊంఛా రహే హమారా!" అన్నాడు. కాపలాఅతడు నమస్కరించి, తలుపుతీశాడు

...లోపల యేమి జరుగుతూంది? బాంబు ఫ్యాక్టరీవా - ఆయుధ కర్మాగారమా - రహస్యపు కవాతుతాలింఖానావా - చట్టవ్యతిరేకపు ముద్రణాలయమా - మాయరూపాయిలు చేసే టంకశాలా - విప్లవవీరుల రహస్యపు గోష్ఠియా? నాకు భయం వేసింది. కాళ్ళు వొణికేయి. వెన్నుపూసని చెమట...

తలుపుతీశాడు. గుండ్రటి మేజాబల్ల - బల్లమీద లాంతరు - బల్లచుట్టూ కుర్చీల మీద పదిమంది యువకులు యువతులు ఖద్దరు వస్త్రధారులు - పుస్తకాలు - పత్రికలు - హిందీ - ఇంగ్లీషు - ఉర్దూ - గురుముఖి - చదువుతున్నారు తదేకదీక్షతో. చూసిన ముఖాలు - అవును - ఇందాక ఫ్యాక్టరీ జనంలో కూలీమధ్య! నాజూకైన వ్యక్తులు మృదువైన శరీరాలు - సున్నితమైన ముఖాలు ధనికుల బిడ్డలు ఓహో! విప్లవ మార్గాన్వేషణ!- పదినిమిషాలు నిలబడ్డాం. ఎవ్వరూ ముఖాలేనా ఎత్తలేదు.

తరువాత నా స్నేహితుడు కాలు నేలనికొట్టి: "నమస్తే! నిర్బలకే బలారామ్!" అన్నాడు.

అందరూ లేచి - కాళ్ళు నేలనికొట్టి: "నమస్తే! ఇన్‌కిలాబ్ జిందాబాద్!" అన్నారు.

నా స్నేహితుడు నేను బైటకు వచ్చేశాం. వారి ఉత్సాహం - తదేకధ్యానం - స్వార్థరాహిత్యం - ఆత్మబలి - దేశభక్తి - విప్లవకాంక్ష! యువకులు విప్లవాన్ని అదుపు అజ్ఞలో పెట్టి నడిపించ ప్రయత్నం!...

నా స్నేహితుడు నన్ను రైలెక్కించాడు. రైలు కదిలింది. "ఇన్‌కిలాబ్ జిందాబాద్!" అని నమస్కరించా. "నిర్బలకే బలరామ్!" అని నమస్కారం అందుకున్నాడు.

## అతడు

## 82

కాశీ చేరినట్టు శాంతం టెలిగ్రాం వేసింది

నేనెప్పుడూ అనేవాడిని శాంతంతో: మనది హిందూ సంప్రదాయం. బ్రాహ్మణ జన్మ. అంచేత వక చిన్న మాలక్ష్మీపీట. లేకపోతే లక్కపిడతంత కాశీ చెంబుతో ఉగ్గుగిల్లంత గంగాజలం. అవీ కాకపోతే చిన్న వెండి ప్రమిదెలో ఆవునేతి దీపం. యేదో వకటి అనుమాయకు తప్పకుండా మన యింట్లో వుండాలి"అని. వింటుందా! "నాకు దేముడిమీద దైవ్యంమీద నమ్మకం లేదని నీకు తెలుసుకదా. యెందుకు నన్ను చంపుతావు? నావంతుమాడా నువ్వే అన్నీ చేస్తున్నావుగా నిత్యమున్నూ - స్నానమూ

సంధ్యా, బ్రహ్మయజ్ఞం, వైశ్వదేవం, దేవతార్చనా, అతిథిపూజా—అన్నీ కూడానూ!" అనేది. ఈ సాక్షి సంపన్నాలతో—వాదివాంగ్మూలాలతో - ముద్దాయి సంజాయిషీలతో—క్రాస్‌ఎగ్జామినేషన్లతో కొట్టుకుంటూ—గృహకర్మలకే నాకు వేళలేకుండావుంటే—నిత్యకర్మలక్కూడా నాకు తీరుబడి యెక్కడచచ్చి?" అని అనేవాడని.

అందుకు కొంటెతనంగా : "మాంపాహి అన్నపూర్ణ—నిరజదళ నేత్రి—భక్తుల పాలించే భువనసుందరి-జయజయ!" అంటూ ఆనంద భైరవి కీర్తన - "నమో భక్తసుర తరులతే దేవిలలితే" అని కాళిదాస శ్లోకం—లేకపోతే "మాణిక్య వీణాముపలాలయన్తీం। మదాలసాం మంజుల వాగ్విలాసామ్। మహేంద్ర నీలద్యుతి కోమలాంగీం। మాతంగ కన్యాం మనసాస్మరామి॥ దగ్గిరనుంచి "దేవీతుభ్యం నమోదేవీతుభ్యంనమః। శ్రీ కాళిదాస మహాకవి ప్రణీతం శ్యామలా దండకం సంపూర్ణం॥" వరకూ గుక్క తిప్పకుండా చదివేసేది! ఇంత విద్య జ్ఞానం వున్నందుకు కాస్త దైవభక్తి వుంటేనో! ఏమో ఆ భక్తి అన్నపూర్ణ క్షేత్రంలో కుదురుతుందేమో? అందుకోసమో ఆ కాళ్లు అక్కడికి యీడ్చుకుపోయాయేమో?...

షిల్లాంగునుంచి అన్నయ్యవచ్చాడు అనుకోకుండా—మెడికల్ బోర్డు సమావేశం వుండట ఇక్కడ. "శెసిలీ వొదినని తీసుకురాలేదేం? అన్నాను.

"దొరసానులు మనం చెప్పినట్టు వింటారురా? మహాబలేశ్వరంలో కమాండరన్ ఛీఫుగారి తోట వుందంటే అది తప్పడానికి వీల్లేదని అక్కడికి వెళ్ళింది. "అన్నట్టు—మరదలు పిల్ల, పాపాయి కనిపించలేదే?" అన్నాడు.

"ఆఁ! పుట్టింటికి కెళ్ళింది. అక్కడనుంచి కాశీ ఢిల్లీ వెళతానంది. ఏముంది-కాంగ్రెసు రోజులూ కాన్ఫరెన్సుల రోజులూ!" అన్నా చలోక్తిగా—ఎందుకేనా మంచిదని.

"ఆ సభలూ సన్మానాలూ మన కెందుకుగాని—నువ్వు బల్లకట్టి పదేళ్ళవుతూంది. యేమాత్రం వెనకేశావురా తమ్ముడూ-ఐదారులక్షలేనా వుంటుందా?" అన్నాడు.

"అబ్బే—అంత వుండదన్నయ్యా! యేదో జరుగుబాటుకి లోటులేకుండా నాలుగు పైచిలుకు వుంటుందిలే. నువ్వేమాత్రం గడించావు అన్నయ్యా? పది పదిహేను లక్షలుంటుంది అనుకుంటాను. వైద్యులు మీకేమిటి—రక్తం చూపించి గడిస్తారు!" అన్నాను.

"ఏం గణనరా చిదంబరం! పెద్దాళ్ళిద్దరూ సీమలో వున్నారాయె. కుర్రది కంటి వైద్యానికి వియన్నా వెళతానని మంకుపట్టు పట్టుక్కూచుంది. యాభై అరవై వేలు వీళ్ళ చదువులకిందే అయిపోయింది. మూడోవాడిని వచ్చే సంవత్సరం ఈటన్ పంపించడానికి మీ వదినె నిశ్చయం చేసేసింది. ఆవిడదే రాజ్యం—నే మారుమాటాడ్డానికి వీలులేదుకద! వీటన్నింటికీ ఖర్చు కేటాయించగా—నువ్వన్నంత వుంటుందేమోలే!" అన్నాడు.

అంటూ ఇంకా అన్నాడు: "అయినా వైద్యంలో రామికూడా మునపటిలాగు లేదురా! మునపటి రోజుల్లో డబ్బున్న రోగి మాలాంటి పెద్దవాళ్ల దగ్గిరకొస్తే - మేంయంత అడిగితే అంతా పారేశేవాళ్లు. 'ఇప్పుడేంవుంది? ఇంటికో వైద్యుడు! రోగులుకూడా మందుల షాపులకి వెళ్లనూ - ఇంజక్షనులు కొనుక్కొని కంపౌండర్లచేత పొడిపిం చేసుకోనూ. వీళ్ళ తస్సాదియ్యా! ఆయుర్వేదం ఆచార్యుల వారుకూడా - స్టెతస్కోపు, థర్మామీటరు, ఇంజక్షను పిచికారీతో తయారవుతూంటే - మా ఇంగ్లీషు చదువు లెందుకురా - తగలెట్టను! అంచేత రోగిని బల్లమీద పడుకోబెట్టి, సహం శస్త్రంచేసి మరీ బేరం చెయ్యవలసొస్తోంది. 'రొక్కం అక్కడ బల్లమీద పెడితేనే కుట్లు కుట్టేది - లేకపోతే సప్తకట్లే' అని! అంత వరకూ దిగలేదనుకో ఇంకా - మాట వరసకి చెప్పా! మొన్నేమయింది? సికందరాపూరు పెద్దకొడుక్కి టైఫాయిడ్. పదివేలకిబేరంకుదిర్చేడుమాఅసిస్టెంటు సర్జను. పేరా టైఫాయిడ్ అని మేం చెప్పలేదనుకో. కీడెంచి మేలెంచమన్నాడు మరి! దానిమీద వంటినిండా పేతలాగు పోసింది. ముసలాడు భయపడ్డాడు. కుర్రాడిది సుకుమారమైన వొళ్ళుకదూ - నెల్లాళ్ళు మంచం పట్టడంచేత చర్మం వొరిసి బొబ్బ లెక్కింది. నా అసిస్టెంటు సర్జను భలేవాడులే! 'ఇది నయం చెయ్యడానికి రెండువేలు అదనం' అన్నాడు. మళ్ళీ జ్వరం తిరగబెట్టిందనుకున్నాం - థర్మామీటరు వక డిగ్రీ తప్పు చూపించడంవల్ల. కుర్రాడు బాగైపోయాడు. పారితోషికం ఇచ్చేవేళకల్లా ఎనిమిదివేలకే చెక్కు పంపించి వూరుకున్నాడు. ప్రపంచంలోకూడా - నీతీ జాతీ పోయిందిరా అబ్బీ!" అన్నాడు అన్నయ్య.

"గవర్నమెంటు వుద్యోగంలో వున్నావు. నీకేమి టన్నయ్యా! నాలాగు కంఠశోష చెమట వూడ్చడం నీకు లేదుగా. నెలా అయేసరికి దవ్వ బిళ్ళల్లా చేతిలో పడతాయి రెండువేలున్నూ!" అన్నా.

"అలా గనుకుంటున్నావు గావును! ప్రయివేటు ప్రాక్టీసు లేకపోతే ఎలా గడుస్తుందిరా? అది కాస్తా వుండబట్టే - వేడినీళ్ళలో చన్నీళ్ళూ - పులగంమీద పచ్చి పులుసూ! దాల్లోనేనా యింతపోటీ అనుకున్నావు? మన ఆడవాళ్ళ చీరెలలోనూ మీవదినె గౌన్లలోనూ నిమిషం నిమిషానికీ నూతనం ఎల్లా బయలుదేరుతూందో - మందుల్లోనూ చికిత్సల్లోనూ అంతే అనుకో. ఈ వైద్యుడు ఎక్సరే బొమ్మ తీశాడూ అంటే - పొరుగు వైద్యుడు: 'అదేమి వైద్యం అండీ - ఎల్ట్రావైలెట్టు ఇవ్వాలిగానీ!' అంటాడు. నువ్వు క్వైనెను ఇచ్చావురా అంటే నేను ఎటెబ్రిను ఇచ్చి తీరాల్సిందే. లేకపోతే రోగే నన్ను తట్టా బాజా కట్టేస్తాడు. కడుపులో పాములబాధ పడుతూంటే - నువ్వు ఇంత శాంటొనిను - ఆముదం పుచ్చుకో మంటూ - 'ఇదేమి పల్లెటూరి వైద్యం అండీ' అని అంటూ పెరటి వీధిలో వైద్యుడి దగ్గిరకెళ్ళి సల్ఫాలు ఇంజక్షను పొడి

పించుకుంటాడు. నాలాంటి గడుసువైద్యుడవుతే రోగిని కనిపెట్టి-డొక్కలో నాలుగు మాట్లూ తుంటిమీద నాలుగుమాట్లూ - ఇంతసెలైనో కోసకి కుశాయి నీళ్ళో ఇంట్రా వీనసు పొడిచి పాతికరూపాయలు సంపాదిస్తాడు!"

"అన్నయ్యా! అయితే మీవైద్యశాస్త్రంలో యిన్ని పరిశోధనలు జరుగుతున్నాయి కదా - అవన్నీ చదవడానికి నీ కెక్కడ తీరుబడి వుంటుందో!" అని అడిగే. అన్నయ్య ఫక్కున నవ్వేడు. "నువ్వు వుత్త సత్యకాలపు వాడివిరా చిదంబరం! మీరు దేశాయి డిసెన్నియలు డైజెస్టులూ సంజీవరావు ఆలిండియా కేసులూ తెప్పించుకొని యెలా పుటలు తిరగేస్తారో-మేమూ కేటలాగుల్లో బొమ్మలన్నీ చూసి కొత్తకొత్త మందులు తెప్పించి ప్రయోగిస్తూంటాం. ఇంతకీ తమ్ముడూ - ఏం పరిశోధనలు లెద్దూ? పడిశానికి మందులేదు. తలనొప్పికి పట్టులేదు. కడుపునొప్పికి మాత్ర లేదు. ఆయుష్షుంటే-అల్లపురసం అమృతం-సొంఠి కషాయం సంజీవి. ఆయుష్షులేకూ-ఆ గుండెకాయని డిజిటాలిస్ యిచ్చి పిచికారీతో పొడిచినా పడుకుంటుంది!" అన్నాడు

"అద్భుతమైన శస్త్రచికిత్స వెటుకుని నీలాంటివాడు కూడా అలా అంటే ఎలాగు అన్నయ్యా?" అన్నా. "నీ పిచ్చి! యుద్ధంలో మొండి కాళ్ళనీ మొండి చేతులనీ రంపాలతో కోసి బాడిదెలతో చెక్కే వాళ్ళమి-ఏమనుకున్నావో? మొన్న మీ సెసిలీ వదినె సర్జను జనరలుతో జింఖానా క్లబ్బులో డాన్సు చేస్తూంటే కాలుజారి పడింది. అందరూ చుట్టూ మూగేరు. ఇదన్నారు అదన్నారు. మోకాలు వాచి నాలుగు రోజులు వుష్టం. రహస్యంగా మా వోఢ్ర మంగలాడిచేత రెండు పూటలుతోమించేసరికల్లా-మూడోరోజుకి తయారు మీవదినె టెన్నీసు కోర్టులో! నేనొక్కటే నిశ్చయించాను. పింఛను పుచ్చుకున్నాక-విష్ణురథంలాంటి రోల్సురాయస్ కారొకటి-వైనతేయంలాంటి చిన్న ఏరోప్లేను వకటి-కొని వాటిమీదే ప్రయాణం రోగులని చూడడానికి. అంత డాబుగా వెళితే రోగులకి యెంత ఆనందం అనుకున్నావు! ఒక డబ్బీలో కస్తూరి మాత్రలు బాలారిష్టాలాలకి. మరో డబ్బీలో మకరధ్వజం మొగాళ్ళ రోగాలకి. మూడో డబ్బీలో వసంత కుసుమాకరం ఆడాళ్ళ జబ్బులకి! చూతువుగాని-ఏమి టనుకున్నావో-వీటితోనే సాలీనా నేను పది వేలు ఇన్కమ్టాక్సు చెల్లించకపోతే-నాపేరు చింతామణి కాదనుకో!" అన్నాడు.

అన్నయ్య పంచి అదృష్టవంతుడు. కాని-అంత డబ్బుకక్కుర్తి అంత నిర్దాక్షిణ్యాం వుండకూడదు. సరి-అన్నయ్యని మించింది వదినె-అందులో ధొరసాని! శాంతంవుంటే అన్నయ్య మాటలుకి నిమండిపోను. లేకపోవడమే మంచిదైంది. అన్నయ్యమాత్రం - మరదల పిల్ల-మరదల పిల్ల అని-అపేక్ష పడతాడు!

## ఆ మె

## 83

రైల్లో రెండవ తరగతి ప్రయాణం. సదుపాయంగా వుంది. ఆడవాళ్ల పెట్టె. సుభవల్లో పడుకుంది పాపాయి. "తధికిణతోమ్-తధికిణతోమ్" అని రైలు లయవేస్తూంటే జోకొట్టినట్టే వుండి రైలు కదిలిన వెంటనే నిద్రపట్టిపోయింది...

...కురుక్షేత్రం...సైన్యాలు బారులుతీర్చి వ్యూహాలుపన్ని విడిసివున్నాయి... ఇటుప్రక్క ఖాకీదుస్తులూ ఇనుప టోపీలు...అటుప్రక్క తెల్లటి దుస్తులూ తెల్లటి టోపీలు...రెండు వైపుల ఫిరంగుల మోత...తధిక్కిణతోం - తధిక్కిణతోం...పైన ఆకాశాన రెండు పక్షాల విమానాలూ-తాధుం-తాధుం-తాధుం-అంటూ ఒకదాన్నొకటి వెన్నంటి వేటాడుతున్నాయి...మరఫిరంగులు ధిమికిటతాధుం-ధిమికిటతాధుం-ధిమికిట తాధుం-అంటూ నిప్పులు రగుల్చుతున్నాయి ..ఇద్దరు వీరులు మల్లయుద్ధం చేస్తున్నారు. ఖాకీదుస్తులవారు ఈలలువేసి చప్పట్లుకొడుతున్నారు...తెల్లదుస్తులవారు "హరిబోల్-బోల్ హరి-నిశ్చలకే-బలారామ్" అని జేగంటలు కొడుతున్నారు...నేను ఆకాశాన్న రంగనాథస్వామివారి నీలవేణి గుర్రాన్నెక్కి-వకచేత త్రివర్ణపతాకం-రెండవచేత హనుమ ధ్వజం-మూడవచేత ఆత్మశక్తి అస్త్రం-నాల్గవచేత ప్రకృతిశక్తి అస్త్రం ధరించి-శ్వేతాంబరులని విజయోన్ముఖంగా నడిపిస్తున్నాను...శాస్త్రి దేసింగురాజులాగు విష్ణునామం ధరించి శ్వేతాంబరుల పక్షాన్ని నిలబడి వాడిని వేదాధ్యయనంతో ఉత్తేజపరుస్తున్నాడు...నీలవేణికదంతొక్కుతూంది - తధికిణ-తధికిణ - తధికిణ...నీలవేణి రూపం మారి బులాకీపిట్ట అయిపోయింది...బులాకీపిట్ట-తధికిణతోం - తధికిణతోం-తధికిణతోం అని పాడుతూంది...బులాకీ రూపంమార్చి మళ్లీ నీలవేణి అయిపోయింది...నారద తుంబురులు "వందేమాతరం" గీతం పాడుతున్నారు...యక్షులు గంధర్వులు కిన్నరులు వీణాగానం చేస్తున్నారు ఝండా ఉంఛారహోహైహామారా" అని...మునిగణములు రఘుపతిరాఘవ స్తుతి చేస్తున్నారు. ఖాకీదుస్తులవారు పలాయనం-ధిద్ధుం-తధికిణతోం-తాధుం-తధిక్కిణతోం...శ్వేతాంబరులు విజయభేరీ మ్రోత-తధిక్కిణతోం-తధిమికిట తోం-ధిద్ధుం-ధిమికిటతోం-తధికిణతోం-తదికిణ-తది-కిణ-తోమ్-తో-మ్...

రైలాగిపోయింది. నాకు తెలివొచ్చేసింది.

హరిద్వారం! లల్లాభాయి షూస్‌వాలా ధర్మశాలలో బస.సావడి రోడ్డువైపున

అహోబిలంనుంచి వచ్చిన ఇద్దరు పుణ్యస్త్రీలు - తెలుగు మధురులు. మహాశివరాత్రి వరకు ఇక్కడే వుంటారుట. పిల్లలినిద్దరినీ వారికి వప్పచెప్పి ఇప్పుడే వస్తానని ధర్మశాల బయటకు వచ్చాను.

సూర్యోదయం కాలేదు. తెల్లవారుతూంది. గంగోత్రివడ్డునే నడిచి వెళ్ళాను - నల్లగా నేలమీద వొలికిన సిరా - వలెవుంది! భారతవర్ష పు ఇతిహాసంమీద నల్లని గీత. ఆర్యావర్తపు నేలమీద నాటిచాలు. భారతీయుల వంశధార. భరతమాత నుదుటిపై బ్రహ్మదిద్దిన వ్రాత...

సూర్యోదయించాడు గంగోత్రి - సాదరసపు ధారలా మెరుస్తూంది. నల్లని అడవులు. నల్లని కొండలు. తెల్లటి శిఖరాలు. శిఖరాల చుట్టూ పట్టుగొడుగుల్లాగు తెల్లని మబ్బులు అంటివున్నాయి...

గంగ పన్నగిలింది. కరగబోసిన వెండి సెలయేరు - అదిగో గంగావతంణం! దూరాన కైలాసగిరి కానవస్తూంది. ఇరుప్రక్కల నందదేవీ కాంచనగంగలు. కైలాస గిరి చుట్టూ ఛత్రఛామరాల్లాగు తేజరిల్లుతూన్న మబ్బులు రూపంమారి - కాలసర్పం పడగపట్టినట్టుంది!

అదిగో! లక్ష్మణఝూలా - వైతరణిమీద వారధిలాగు! ఆ గడ్డిత్రాటిని పట్టుకుని దాటితిమా - మానసరోవరమే! బదరీనారాణం బ్రహ్మకపాలం అమరనాథం నడచి పోతున్నారు యాత్రికులు. ఈ చలిలో - ఈ మంచులో! శేషునాగం సతీ సరోవరం- మృత్యుంజయం - మహామేరువు!...

"ఆత్మానాం సర్వభూతానాం బ్రహ్మధిపతి బ్రహ్మణోధిపతి బ్రహ్మ-శివమే అస్తు సదాశివోమ్..."

ప్రకృతిపూజ - ఊహాగానం - వేదపఠనం - మంత్రోచ్ఛారణ-ఉపనిషద్వాక్యం- అద్వైతం - పరమాణువుశక్తి - పరమాత్మశక్తి - పరబ్రహ్మశక్తి...

ఝూవల్ పుర్ శివారు వరకూ నడిచివచ్చాను. క్రోసెడు దూరం. త్రోవ యేమీ బాగులేదు గతుకులు. గండెలు. గుంటలు. బండరాళ్లు. మాఘశివరాత్రికి లక్షాది జనం ఈ తోవని రావాలికదా? ఎంత కష్టం! వీరి ఇబ్బందులు గవర్నమెంటువారి కేల? ఇన్నికష్టాలకోర్చే మనవాళ్లు హిమాలయాన్నే కరగింపగలిగే - కదలింపగలిగే - భక్తి

క్షమ కలిగినవారు - దారిద్ర్యాన్ని దైన్యాన్ని దాస్యాన్ని ఎందుకు వదలించుకోలేకుండా వున్నారు చెప్మా ?...చేత గడియారం చూసుకుందును - ఎనిమిదైంది! పాపాయి సుభ ఎక్షప్తికివచ్చారు. తొందరగా నడిచాను. "శివదీక్షాపరురాలను" అనుకుంటూ నటకు రంజిలో పాడుకుంటూ ధర్మశాల చేరుకున్నాను...

నేను మూఢభక్తి భ్రమలోనూ అర్థంలేని అద్వైతంలోనూ పరమార్థంలేని కృతి పూజల్లోనూ పడిపోకూడదు.

...ఆ చలిలోనే ముగ్గురం గంగలో స్నానం చేశాం. ఈవేళ మార్గశిర బహుళ త్రయోదశి. శివరాత్రి. సక్కూభాయమ్మగారూ గోజాభాయమ్మగారూ ఉపవాసం. రేపు వారికి వేదనిధి దినం. రెండురోజులూ వరుసని యెలా వుపోష్యం చేస్తారో! కృష్ణాష్టమినాడు - జలియనువాలాబాగ్ దినంనాడు - స్వతంత్ర దినంనాడు- నంటిపూట ఉపవాసం చెయ్యడం కష్టం అనిపించేది - రోజల్లా తలనొప్పే!

మేము ముగ్గురం మహారాజుజీ దుఖాణం అరుగుమీద కూర్చుని వేడివేడి పూరీలు, ఆలూదామ్, పాలక్ తిన్నాం. పాపాయి సుభ రుచిగా తిన్నారు. రాబిడి పాలు త్రాగేం...ధర్మశాల అరుగుమీద ఎవరో మర్చిపోయారు కాబోలు - ఇంగ్లీషు దినపత్రిక పడివుంటే తరువాత చదువుదాం - అని తీశాను. బళ్లారీ కంబళీ పరచి తలగడాలు వేసుకుని ముగ్గురం నడుమువాల్చాం. పాపాయిని జోకొట్టుతున్నా. గోజాభాయిగారు శివానందలహరిలో శ్లోకాలు చక్కగా చదువుతున్నారు. సక్కూభాయిగారు శ్యామశాస్త్రిలవారి కీర్తన - "సరోజదళ నేత్రి హిమగిరి పుత్రి" అని శంకరాభరణంలో పాడుతున్నారు. భక్తి శ్రావ్యం - రెండూ వుండెను..."పరాకు సేయక వరదాయకి - నీ వలె దైవము లోకములో గలదా - సురాణి-ముఖవాణి - మధురవేణి - సదాశివునికి రాణి" అంటూ ఆదితాళం లయవేస్తూ నిద్రపోయాను.

సాయంత్రం మహారాజుజీ దుఖాణం వద్ద పాలు త్రాగి గంగవడ్డుకు వెళ్లాము. యాత్రికు లందరూ గంగలో స్నానాలు చేస్తున్నారు. సూర్యమండలం క్రుంగిపోతూంది. ఆ నీరెండలో హిమాలయం నెమిలికంఠం రంగు ధరించివుంది. లేట అయిన నీలిరంగు లిగివున్నాయి గంగనీళ్లు. నీటి అడుగున కోటానుకోట్ల సాలిగ్రామాలు. వాటిపై ప్రవహిస్తూంది గంగ జలజలమంటూ.

నిన్నటిరాత్రి రైలులో కల జ్ఞాపకం వచ్చింది. నే నింటి నుంచి బయలుదేరిన తరువాత - ఇదే మొదటిసారి - శాస్త్రి కలలోకి రావడం... గ్రీసులో డెల్ఫీ దేవతావాణి కోసం ప్రార్థన. రోములో జ్యోతిశ్శాస్త్రజ్ఞుల వల్ల భూత భవిష్యత్తులు. మన పల్లెటూరిలో ఎరుకలవాని దగ్గర సోది. పట్నాలలో ప్రొఫెసర్లచేత - అమెరికాలో స్వామీజీలచేత - సాముద్రికం. యూరపులో ఫ్రాయిడియన్ తర్కంవల్ల 'లిబిడో' రహస్యాలు! ప్రపంచం మారడంలేదు - పోకడలే మారుతున్నాయి!... కలకి తలలేదు తోకలేదు. అయినా - నే కన్న కలకూడా నా వ్యక్తిత్వంలో ఒకభాగమే కదా! కల తల్చుకున్నాను. మనసుకి సంతృప్తి కలిగింది. ఒక విధమైన భరవసా నిబ్బరం కలిగింది.

ఇంట్లో శాస్త్రి కచేరీ గదిలో లండను సిగరెట్లు కంపెనీవారి అభివందనముతో అచ్చువేసి పంచి పెట్టిన పార్వతీ పరమేశ్వరుల రంగులపటం జ్ఞప్తికి వచ్చింది. కైలాసగిరి తళుక చూశాను. తంజావూరి నటరాజ విగ్రహం కళ్లముందు కొచ్చింది. రవీంద్రుడి "కైలాసశివుడు" చిత్రం - నికోలాయి రోరిచ్ హిమాలయ పర్వత పంక్తులు - ఎదుట నిలిచాయి... నా ఊహలో - త్రిమూర్తులలో - బ్రహ్మ అంటే గోఖ్లే - విష్ణు అంటే గాంధీగారు - మహేశ్వరుడు అంటే తిలక్కు!... కలకీ నిజానికీ అట్టే తేడాలేదు!

ధర్మశాలలో రాత్రి గుడ్డిదీపం వెల్తురుని పత్రిక చదివేను: "ఫైజుపూరు కాంగ్రెసు - 451 అనుకూలురు - 62 ప్రతికూలుర వోట్లతో వర్కింగుకమిటీ తీర్మానం అంగీకరింపబడుట రాష్ట్రములలో పదవీ స్వీకారము గూర్చి అంతిమ నిర్ణయము ఏ. ఐ. సి. సి కి వదలి వేయబడుట... జర్మనీలో హిట్లరు యూదులను చిత్రవధ చేసి చంపుట... ఆస్ట్రియాను కంబళించుటకు హిట్లరు రహస్యతంత్రములా?... స్పెయినులో ప్రజాసేనల పరాజయము... చీనా జపాను యుద్ధసూచనలు..."

# 84

## అతడు

అన్నయ్య నిన్న వెళ్ళిపోయాడు. రేపు వెళ్ళకూడదా ?- అన్నాను. "బుధేగురౌ పశ్చిమ కార్య సిద్ధిః - అని పెద్దలన్నారు. అంచేత గురువారం తప్పితే వారసూల" అన్నాడు. "ఈవేళ నిర్ణ్యంపెట్టి రేపు వెళ్లు" అన్నాను. "తోలుపెట్టెలో బట్టలు మీ దొరసాని వదినె సర్దింది. బట్లరు ముండావాడు పసుపు కట్టేడు. అంచేత పొత్తిగుడ్డ పట్టుకు రావడం పడింది కాదురా !'' అన్నాడు. "పోనీ — పట్టునూలు పొరుగు వాళ్లింట్లో పెడదాం" అన్నా. "వద్దురా నాయనా. ఆ డిన్నరునూలు వాళ్లుకాజేస్తే రేపు మోసానిక్ విందుకి దేవతావస్త్రాలతో వెళ్లాలి !" అన్నాడు.

అన్నయ్య ఇక్కడికొచ్చిన మనునాడే శెసీలీ వదినె దగ్గిరనుంచి టెలిగ్రాము: అన్నయ్యకి క్వెట్టాలో జాయింటు సర్జను జనరలు పని అయిందని. ఇక్కడే కనక వుండి పోయి వుంటే నే మూడో సర్జను గానో, లేక పోతే జిల్లా సర్జనుగా యే మారు మూలనో బూజుపట్టి వుండి పోయేవాడు. ఇతర రాష్ట్రాలకి వలస వెళ్లిపోయాడు కాబట్టి ఆంధ్రుడైనందుకు రాణించాడు.

అన్నయ్య గౌరవార్థం బ్రిస్టలు గ్రిల్లులో విందుచేశాను. సుబ్రహ్మణ్యం లేడీ అయ్యంగారూ—డాక్టరు-వెల్లాకూ అతని భార్య - డాక్టరు కనక సుందర వడివేలు అతని పెళ్లాం - నేషనలు మెడికల్ కాలేజీ ప్రిన్సిపాలు గిరీషు చంద్రమజుందారు - ఊర్వసీ మిత్ర - హైదరాబాదు ప్రిన్సిపల్ జడ్జి పుండరీకాక్షుడుగారు - బర్మా హైకోర్టు అటార్నీ జనరలు వరదన్ అతని పెళ్లాం - వీళ్లని పిలిచాను. విందు చాలా సరదాగా జరిగిందింది. శాంతం లేకపోయిందని అందరూ అనడమే. మరేమీ అనలేక "ఫెయిజుపూరు కాంగ్రెసుకి వెళ్లిందండీ" అన్నాను!

అన్నయ్య అందరినీ పొట్ట పగిలిపోయేటట్టు వూపేసి నవ్వించి వదిలి పెట్టేశాడు. ఊర్వసి అంది నవ్వుతూ: "ప్రఖ్యాతులైన మీలాంటి సర్జనుల చేతుల్లో పడితే ముక్క ముక్కలకింద కోసేసి క్రైమా చేసేస్తారేమో అని భయం వేస్తుందండీ!"

అన్నయ్య అన్నాడు: "అక్షరాల నిజం! నిరుడు మోళ్మేనులో ఫలానా నవాబు గారి పెళ్ళానికి సిజేరియను చేస్తూ ఏమైందనుకున్నారు? శస్త్రం అంతా చేసేశాను. కుట్లుకూడా కుట్టేశాను. తీరా ఆర్టరీ ఫార్సెప్సు లెక్క పెట్టేసరికి - ఒకటి తక్కువ! బేగమ్‌గారి శరీరంలో వుండిపోయింది కదా - ఎక్కడికి పోతుందనుకున్నాను. మొన్న మళ్ళీ ఆవిడ శస్త్రానికి వస్తే-బిడ్డనీ ఫోర్సెప్సునీకూడా బైటకు తీసేశాను-గుప్‌చుప్‌గా!" అందరం పొట్టుబ్బిపోయేటట్టు నవ్వేం. "ధియేటరు మేట్రన్ని బర్తరఫుచేసే లేక పోయారా?" అన్నాడు వెబ్బాకు. "అమ్మో! సర్జను ఖ్యాతి అంతా మేట్రను అర చేతిలో వుంటుంది. వాళ్లది కాలసర్పం పగ! ఆవిడ నోరు కట్టేయడమే మంచిదని - వెంటనే ఆవిడని స్టోరు అధికారిగా ప్రమోషను చేసేశాను!" అన్నాడు. అందరం నవ్వేం. డాక్టర్లు మాత్రం ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు.

ఊర్వసి అంది: "అయితేనేం! మీ ఖాయినాకింద - కత్తులూ కత్తెర్లూ అంత పరిశుభ్రంగా స్టెరిలైజు చేస్తున్నారన మాట!" అన్నయ అన్నాడూ: "అభ్యంతర మేమి? నేను సంవత్సరానికి అధమం నూరు హెర్నియాలేనా శస్త్రం చేస్తాను - నోటి నుంచి సిగరెట్టు తియ్యకుండానే. ఒక్కటీకూడా యింతవరకు చీము పట్టలేదు."

"పట్టితే?" అంది ఊర్వశి. "పట్టితే ఏముంది? వాడిఖర్మం! గుండె ఆగిపోయి వూపిరి ఆడక చచ్చిపోయాడని కాగితం వ్రాసియిస్తాం! అంతే కదండీ వడివేలు గారూ?" అన్నాడు అన్నయ్య - అందరూ ఫక్కున నవ్వు!

ఊర్వసి అందీ: "డాక్టరుగారూ? మీ రీమధ్య యేదో గొప్ప కపాలశస్త్రం చేశారని పత్రికల్లో చదివేనండీ. యేమి అద్భుతం!"

"అద్భుతం అని మెల్లిగా అంటారు! ఇప్పుడు మేం వైద్యులం బుర్రలు తీసి బుర్రలు పెడుతున్నాం - ఒకళ్లలాగు!" అన్నాడు అన్నయ్య. డాక్టర్లూ వారి భార్యలూ పడ నవ్వేరు.

అన్నయ్య ఈ మధ్యనే జర్మనీ వెళ్ళొచ్చాడు. అంచేత: "హిట్లరుని చూశారా- డాక్టరుగారూ?" అని అందరూ అడగడమే. "చూడడమేమిటి? ఆ యూనిఫారము మెడల్సు అడ్డుపటకా వేసుకుంటే - సాక్షాత్తూ శుక్లాంబరుడై యజ్ఞోపవీతం వేసుకుని కౌస్తుభమణిమయ కేయూరహారములు ధరించిన విష్ణుమూర్తి దర్శనమే! ఎదుట అతను ప్రత్యక్షం అవుతే-ఆ సూర్యతేజస్సుకీ ఆ బ్రహ్మ వర్చస్సుకీ నిలబడగలమండీ? సమ్మోహనాస్త్రమేగా!" అన్నాడు అన్నయ్య. "ఓహోహో! ఏం అదృష్టం అండీ మీది- అంతటి మహానుభావుడి దర్శనం లభించడం!" అన్నారు స్త్రీలందరూ వక్క గొంతుకతో-స్త్రీ లేమిటి-అందరమున్నూ.

"వైద్యశాస్త్రపరిశోధన అంటే జర్మనీదే కదండీ అగ్రతాంబూలం?" అంది మిస్ స్నేవెల్లాకు. అందుమీద మజుందారు: "హిట్లరు తల్చుకుంటే ఏది కాదండీ! ఇక్కడ ఎనాటమీ చెబుదాం అంటే కళేబరాలే దొరక్కపోయె? ఇహ పరిశోధన యెలా చస్తుంది?" అన్నాడు.

"ఉగ్రనరసింహామూర్తి లాగు హిట్లరు ఛత్రచామరాలతో సింహాసనంమీద కూర్చుని యేకఛత్రాధిపత్యం యేలుతూంటే కళేబరాలకి కొదవేమిటండీ! నిండు ప్రాణాలతో వున్న యూదులమీదనే వైద్యశాస్త్ర పరిశోధనలు చెయ్యమని ఫర్మానాజారీ చేశేశాడు!" అన్నాడు అన్నయ్య. అందరం: "ఓహోహో" అంటే "ఓహోహో" అన్నాం.

అన్నయ్య అందుకున్నాడు: "అంతేనా హిట్లరు చేసినది? ఈ చీడపురుగుల సంతానం వృద్ధికాకుండా- వాళ్ళని యేకంగా జవచ్ఛవాలని చేసెయ్యమని ఫత్వా మంజూరు చేశాడు!". వెల్లాకు అన్నాడు: "పీడ వదిలిపోయింది ప్రపంచానికి. వక్క దెబ్బతోనే శాస్త్రపరిశోధన- యూదుల నాశనం. ఏమి రాజకీయవేత్తండీ!" "ప్రచండ మార్తాండుడండీ! అలా దయాదాక్షిణ్యం లేనివాడు మన దేశంలో కూడా వకడు బయలేరాలండీ." అన్నాడు కనకసుందర వడివేలు. "దేశద్రోహులని చీల్చిచెండాడి త్రాహి త్రాహి అనిపించే వాడక్కడున్నాడు కాబట్టే మనం ఇంకా ఇక్కడ నిలబడి వుండగలిగేం!" అంది లేడీ అయ్యంగారు. పుండరీకాక్షుడుగారు అన్నారు: "అలాంటి చండశాసనుడు మనకి కూడా రావాలి! సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారమే గనుక అతను వైరిపై శంఖుచక్రగదా ఖడ్గచ్ఛాపములును ప్రయోగించినా తప్పులేదు" అన్నాడు మార్తాండమూర్తి. "హిట్లరీకి జై!" అంది ఊర్వసి. అందరం "జై!" అన్నాం.

వరదన్ భార్య అంది: "రామలక్ష్మణులలాగు అన్నదమ్ములు మీరిద్దరూ- ఒకరు 'అనాయాస మరణం'- వకరు 'వినాదైన్యేవజీవనం' లోకానికి ప్రసాదిస్తున్నారు!"

అంది. "అవునండీ! మావాడు క్లయింట్లకి ముదనష్టపు ఆస్తులు సంపాదించిపెట్టి 'వినా దైన్యేన జీవనా'నికి ఆసామికి కల్పిస్తున్నాడు. నాచేతి మాత్ర వైకుంఠయాత్ర అని నేను నా రోగులకి 'అనాయాస మరణం' కలుగజేస్తున్నాను." అన్నాడు. "డాక్టరు గారూ! మీరు అన్నిటికీ హాస్యమే చేస్తారండీ!" అంది ఊర్వశి.

అన్నయ్యన్నాడు: "ఈమధ్య నాదగ్గిర కొకడొచ్చాడు. జీర్ణకోశంలో వ్రణం. దానికి మరి మందులేదు. ఆ జబ్బున్నవాళ్ళకి దీర్ఘ ఆయుష్షు ఆయువున్నంతవరకూ బాధ అనుభవించవలసిందే. నేనిదివరకే రంగునీళ్ళిచ్చి రెండు వేలు పుచ్చుకున్నాను. ఇంకేం చికిత్సచేయడమా అని ఆలోచించాను"

వెబ్లాకు అన్నాడు "ఆ వ్యాధి కుదిరేదికాదులెండి. రోగిదగ్గిర డబ్బున్నంతవరకూ చికిత్స చెయ్యడమే మన ధర్మం కదా. అయినా- డైఎథిల్- బీటాప్రొపొనిల్- ఐసోపెరిడిన్- అయొడైడ్- నూరు గ్రెయినులు ఇంజక్షను ఇస్తే- రెండుగంటలకి ఒకపర్యాయం వచ్చి పదిహేను నిముషాలు వుండేబాధ- నాలుగుగంటల కొకసారి వచ్చి అరగంట వుండి తగ్గిపోతుంది. నేను బి. ఎం. జి. లో వ్రాశాను చదవండి!" అన్నాడు.

"ఎమ్.ఎల్.జే.లోనా?" అని అడిగేము మేము వకీళ్ళం అందరం అప్రయత్నంగా.

"బైరాగీ చిటికెలుతీసి అట్టేపెట్టండి! దవకమందులమీదే గిట్టుబాటు! ప్రియం మందులిచ్చి రోగులనేంతిని బతకమంటారు? అసలీ రోగానికి చికిత్సేలేదు లెండి. అయినా- "విటమిన్స్- ఎర్సప్లస్-వై మాత్రలు కొత్తవి వచ్చాయి- అవి యిస్తూరూ. పలుగులతో పొడిచేబాధల్లా దబ్బలంపోట్లకిందకి మారిపోతుందీ!" అన్నాడు మజుందారు.

అన్నయ్య: "అంతెందుకండీ! నేనేం చేశాననుకున్నారు? మరో వెయ్యి రూపాయిలు వాడిదగ్గిరనుంచి పుచ్చుకుని - జర్మనీవాడు కొత్తమందు కనిపెట్టాడు-'విష మిక్స్- గరళమిక్స్' అని - అది పదిచుక్కలు ఇచ్చేసరికి- బాధనుంచి ఒకసారే విముక్తి అయ్యాడు. నా ఉపకారంవల్ల అతనికి ఉత్తరక్షణంలో అనాయాస మరణం ప్రాప్తించింది!" అన్నాడు.

...ఒక్కమాటు అందరం నిశ్చలం - అంతా నిశ్శబ్దం-అయిపోయింది...రోగానికి మందులేదు-బాధకి చికిత్సలేదు. వైద్యుని ఉపకారం-బాధనుంచి విముక్తి. అనాయస మరణం...విషప్రయోగమా? ఖూనీకేసా? న్యాయసమ్మతమైన హత్యా? ధర్మశాస్త్రం అంగీకరిస్తుందా?...అందరం గాభరపడ్డాం. అన్నయ్యమాత్రం చెక్కు చెదరకుండా నవ్వుతున్నాడు. ఒక్కనిమిషమే-కాని నాకొక యుగం అనిపించింది...

ఊర్వసి మాత్రం అందరికంటే ముందు కుర్చీలోనుంచి లేచి-అందరికీ షాంపేను అందిచ్చింది. అమృత బిందువులు! దాంతో మళ్లీ యథాప్రకారం - నవ్వులు-నృత్యం - ప్రారంభం!

నాలుగుసార్లు డ్యాన్సులు అయ్యాక లేడీ అయ్యంగారు: "డాక్టరు చింతామణి గారూ! అంతర్గత ఎలెక్ట్రిక్కు కిరణాల చికిత్సంటే మీ అభిప్రాయం యేమిటండీ?" అంది. "అభిప్రాయం యేమిటి? రోగులూ వైద్యులుకూడా ఎలెక్ట్రిక్కు - ఎలెక్ట్రిక్కు అని రామస్మరణ చేస్తుంటే! మొన్న కౌన్సిలు మెంబరుగారి భార్య - "డాక్టరుగారూ! కడుపు నొప్పిగావుంది. ఎలెక్ట్రిక్కు కార్డియల్ కావాలండీ!" అంటూ నాదగ్గిర కొచ్చింది నేనీ రామస్మరణలో పడి ఆవిడ దేహస్థితి మర్చిపోయి నాలుగు రోజులు 'బేరియంమీలు' ఇచ్చాను తరవాత ఫొటోతీద్దాం అని అప్పుడు జ్ఞాపకం వచ్చి - రెండు మోతాదులు గెలెక్ట్రిస్ కార్డియల్ యిచ్చి - ఎందుకేనా ఆవిడ తృప్తికోసం మూడు మాట్లు ఫిల్ములేని ఎక్సురే ఫొటో దగ్గర నిలబెట్టాను. మరి ఆరునెలలకల్లా నిక్షేపంలాగు మొగచిన్నవాడిని కన్నది! ఆవిడా ఆవిడ పెనిమిటికూడా 'డాక్టరు చింతామణిగారు ఎక్సురే వైద్యంచేసి పుత్రదానం చేశార'ని అందరుతోనూ అతిగొప్పగా చెప్పుకున్నారు." అన్నాడు. అందరం నవ్వు గగ్గోలు చేసేశాం.

...ఇంటికొచ్చాక అన్నయ్య అడిగేడు: "ఎవరురా తమ్ముడూ ఊర్వశిమిత్రా? మంచి చమత్కారంగా మాట్లాడిందీ! నన్ను గేలంవేసి లాగేసింది. వలలో పడిపోతానేమో అని భయం వేసిందిరా! అన్నిసార్లు ఆవిడతోనే వాల్ట్జ్ - షిమ్మీ-ఫాక్స్‌ట్రాట్-టేంగో-రంబా డ్యాన్సుచేశాను! వశీకరణం వుందా యేమిటిరా ఆ స్త్రీ దగ్గిర? నువ్వు మాత్రం జాగ్రత్తగా వుండేం. చిదంబరం! నీ జన్మనక్షత్రం రేవతి మూడోపాదం. రాహు కేతువులు తొమ్మిదింట గురుణ్ణి చూస్తున్నారు. నీజన్మలగ్నం సింహం. పదింట చంద్రుడు నీకు అశుభుడు. ఈ అమావాస్య వెళ్లేవరకూ ఆవిడ కంటపడకుండా జాగ్రత్తగా పోతూండు" అన్నాడు అన్నయ్య.

ఎన్నికలలో నిలబడమన్నావా అని అన్నయ్యని సలహా చేశాను. "ఇండిపెండెంటు పక్షాన్ని నిలబడి గెలుస్తానని ధైర్యంవుంటేనే నిలబడు గెలిచేక-ఏ పక్షంలో నీకు లాభకరంగా వుంటుందో ఆపక్షంలో చేరడానికి చిక్కువుండదు. ఇంతకీ - ఈవిషయంలో మరదలు పిల్ల యెలాగు చెప్పితే అలాగు చెయ్యి. నే నెప్పుడూ ఉద్యోగ విషయంలో మీవదిన నోటిమీదే నడుస్తూంటాను" అన్నాడు అన్నయ్య.

రైలెక్కుతూ: "తమ్ముడూ! నాన్న యెప్పుడూ అనేవాడుగా-'పెళ్లాం సలహాతోనే యేపనేనా చెయ్యి. రాబట్ట వలసిన చోట్లల్లా అణా పైసలతో రాబట్టు' గోచార

ఫలమూ అష్టమశనీ చూసుకుంటూ నడుచుకో' అని. నేను నీకిచ్చే సలహా కూడా అదే మరదలు పిల్లకీ, పాపాయికీ ఆశీర్వచనాలు వ్రాయేం! మీ వదినెని చాలాచాలా అడిగి నట్టు చెబుతానులే! ' అన్నాడు...

తాజా : ఊర్వశి ఇప్పుడే వచ్చి వెళిపోయింది.

"శాస్త్రిగారూ! ఎన్నికలలో నిలబడ్డం గురించి యేం నిశ్చయించారు? నేను మా పక్షంవారితో మాట్లాడేను. ఖర్చులు మావాళ్లే భరాయించేటట్టు వ్రాయించి తీసుకు వచ్చా. వక్కమాటమాత్రం మీతో చెప్పాలి" అని దగ్గిరకొచ్చి నాచెవిలో "తవాప్యర్ధం మమాప్యర్ధం! ఇకమీరు సంయ అంటే సంయే!" అంది ఊర్వశి.

అన్నయ్య సలహా జ్ఞప్తికి తెచ్చుకున్నా. త్వరగా లెక్కపెట్టా... ఈ వేళ ఉత్తరాషాఢ ఓహో! - మనకి విపత్తార. అందులోనూ ప్రథమపాదం. చిత్తినీ జాతిస్త్రీ ఘోరవిపత్తుమూడే టట్టుంది! ఇప్పుడు మనం ముందుజాగ్రత యెంతపడ్డా మనచేతి డబ్బు వదలక మానదు. తంవంతుకి మొదటే నాదగ్గిర అణా ముక్క మీద వ్రాయించుకుంటుం దేమో కూడాను! అసలు నేను ఎన్నికలలో నిలబడతా ననడమే శాంతానికి ఆగ్రహ కారణం అయింది. శాంతం సలహావే ఉత్తమం.

"ఊర్వశిగారూ! క్షమించండి. ఎన్నికలలో నిలబడనని నిశ్చయం చేసేశా!" అన్నాను.

"పోనీలెండి దానికేం! బల్లమీద వున్నది తెల్లగుర్రమా ? పెద్ద ఉగ్గుగుల్లడున్నూ చిన్న పోడాన్నూ మిశ్రమంచేసి ఇలాయివ్వండి." అని పుచ్చుకుని తినకారెక్కి వెళి పోయింది!...

శాంతం దగ్గిరనుంచి కాశీవెళ్లాక ఖబురులేదు. నేను ఎన్నికలలో నిలబడడంలేదు అని తనకి తెలుస్తే ఇంటికి తక్షణమే వచ్చేస్తుంది అని నాకు ధైర్యంవుంది. కాని - ఎక్కడికని టెలిగ్రాం నేసేది? అయ్యో!...

...నేను లండనులో వుండే రోజుల్లో - సర్, జాషువా రెయినాల్డ్సు "సబ్బు బుడగల" చిత్రంమీద - పాటపాడే వారందరూ. ఆపాట జ్ఞాపకం వస్తూంది:

"నిరంతరము నే వూదెడు బుడగలు
రమ్యసుందరమైన నీటి బుగ్గలు
చేపట్టును ఆకాశమార్గము
చేరజాలవు స్వర్గద్వారము
అవని వీధుల అంతర్ధానము
నే కన్నకలలు - నేసృష్టించెడి బుడగలు
మిథ్యలు - మాయలు-మృగతృష్ణలు!"

# 65

## ఆమె

గుల్మార్గు - కాష్మీరు: ఢిల్లీలో రెండురోజులు, లాహోరులో రెండురోజులు వున్నాను కాని కాష్మీరు వచ్చేవరకు తోచలేదు. వచ్చి పదిరోజులులైంది.

యీ తెల్లటి మంచుకొండలు-నల్లటి యీ దేవదారు అడవులు-ప్రశాంతమైన యీ వితస్తానది-అద్దంలా మెరసిపోతూన్న యీ సరస్సులు-వీటిని చూసేవరకూ నాకు ఉండబట్టలేదు. చూశాక మనస్సుకు నెమ్మది కలిగింది. వెచ్చటి ఎండలో హిమగిరి పాదాల దగ్గర పడుకుంటే-వెనకటి తీపివెన్నెల రోజులే జ్ఞాపకం వస్తాయి. పార్వతీ పరమేశ్వరులు భూసంచారం చేయడానికి ఇక్కడికే వస్తారంటారు మనవాళ్ళు. పదేళ్ళ కిందట-శాస్త్రీ నేను-నూతన దంపతులం-ఇక్కడికే వచ్చాం-ఒకరి నొకరం ఇక్కడే తెలుసుకున్నాం!

పదేళ్ళు! పదేళ్ళంటే ఎంత? అసలు మన ఆయుష్షెంత?

అనంతంలో ఒక చిటికె - సృష్టికల్పంలో ఒకలిప్త. అనంతకోటి శక్తులలోనుంచి వచ్చాం మనం. అవన్నీ మనందరిలోనూ-శాస్త్రిలోనూ - నాలోనూ-పాపాయిలోనూ-ఇమిడివున్నాయి. ఆ శక్తులను మనం ప్రజ్వలింపజేసుకోవాలి. ఏలాగు అన్నదే ప్రశ్న. అంతే కాదు-వ్యక్తిగతంగా-నేను-ఎలాగు చేయగలను-అన్నది మరీ ముఖ్యమైన ప్రశ్న.

పాపాయి సుఖ సరదాగా ఆడుకుంటున్నారు.

ఈ ప్రశాంతంలో యీ జిజ్ఞాస మర్చిపోదాం అనివుంది.

...శాస్త్రికూడా ఈ విషయాలే ఆలోచిస్తున్నాడేమో?

కాని-ఐలౌక్యం-స్వార్థం-ఆ గడుసుతనంలో-అంతా సరిగ్గానే కనిపిస్తుంది అతనికి. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీంమ్మహీశాః గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యంలోకాస్సమస్తాసుఖినోభవంతు-కాలేవర్షతి ప్రద్యున్నః-పృథ్వీ సస్యశాలినీ-దేశోయం క్షోభరహితో - బ్రాహ్మణాస్సంతు నిర్భయః-అపుత్రా పుత్రిణస్సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః-అధనాస్స ధనాస్సంతు జీవంతు శరదాంశతం." అని రోజూవర్లిస్తాడు అంతకంటె మనం చేసేదేముందంటాడు. అక్షరాల-తనుకంఠతో పెట్టిన మాంచెస్టరు లిబరలిజమ్!

దేశంలో పాడిపంటలు లేవు-పండితులకి ఆదరణ లేదు-బీదలకి డబ్బులేదు - పిల్లలకి చదువుల్లేవు-యువకులకి ఉద్యోగాల్లేవు-తల్లితండ్రులకి సౌఖ్యంలేదు.

ఎందుకని అనే ప్రశ్నకి జవాబే చెప్పడు.

శ్రీనగరం: నాల్గురోజులైంది ఇక్కడికొచ్చానని శాస్త్రి పేర టెలిగ్రాం వేశా... డాల్ సరస్సులో - పడవమీద పడుకుని - ఆకాశంవేపు - మంచు కొండలవేపు - చూస్తూంటే - ఇదివేరే ప్రపంచకం అనిపిస్తుంది. మళ్లీ - యీ ప్రజ - వీళ్ళ దరిద్రం - వీళ్ళ అధోగతిచూస్తే దిగ్భ్రమ కలుగుతుంది. వేలకొలది ధనవంతులు ప్రపంచం నాలుగు మూలలనుంచి యేటావచ్చి డబ్బునీళ్ళలాగు ఇక్కడ విరజల్లి పోతున్నారు. మహారాజేమో స్వర్గ సుఖాలతో తులతూగుతున్నాడు. యీ గడ్డమీదపుట్టి యీగడ్డ మీద గిట్టేవీళ్ళు-అనాథలుగా వున్నారు.

చెన్నపట్నంలో హరిజనసేవ చేసేటప్పుడు ఆ చేరీలుచూసి గుండె జల్లుమనేది. కలకత్తాలో బస్తీలు చూస్తే భయం పాడలు పుట్టింది. ఢిల్లీలో మొహల్లాలు చూస్తే మతి పోయింది. పోనీ - అక్కడంటే పారిశ్రామిక నాగరికత అనుకుందాం. ఇక్కడేం లేదే! నేలని గీచి జీవిస్తున్నారే వీళ్ళు-వీళ్ళగతీ అలాగే నిరర్థకంగా వుందే!

ఆగర్భ శ్రీమంతులు అలాగు-ధాత్రీ పుత్రులు ఇలాగు! దున్నినవాడిదే భూమి-పండించినవాడికే ఆహారం-కష్టించినవాడికే ధనం-అని యెందుకనకూడదు?

ఇందుకు జవాబు ఏ ఆర్థిక శాస్త్రిమూ చెప్పదే!

మన జీవితంలో-మానసికం, రాజకీయం, ఆర్థికం-అంతా మిళితం చెయ్యాలి. మన స్వాతంత్ర్యానికి - మన స్వరాజ్యానికి - అప్పుడు కాని అర్థం వుండదు. గాంధీగారి రామరాజ్యంలో అచ్చంగా యెలాగుంటుందో యెవ్వరం చెప్పలేక పోయినా-ఇప్పటి మటుకు ఆయన న్యాయకత్వం క్రింద వెళితేనే మనకి స్వతంత్రం - సోషలిజం-చక్కా మాటే సంపాదించటానికి అవకాశం వుంటుందేమో?

ఈ రెండింటిలో - యేది లక్ష్యం - యేది సాధనం? సోషలిజం లక్ష్యం - స్వతంత్రం అందుకు సాధనం - అని తోస్తోంది నాకు. మనదేశ సంప్రదాయం, మన సంస్కృతి-వీటిని అనుసరించే సాధనాలు తయారుచేసి ఉపయోగించారు గాంధీ గారు.

కాని - యీ ఎన్నికల రభసమా స్తే, అరచేతి మోక్షంలాగుంది! ఇప్పట్టిలాగే - యీ తరవాతకూడా - అసలు రాజ్యాధికారం చలాయించేవారు - ఏకొద్దిమంది తెల్లవాళ్ళో అవుతారని అనిపిస్తూంది నాకు. తెల్లవాడు తుసిపూసి నేరేడుకాయ చేస్తాడు. మాయదారి సోషలిజమూ - కల్లిబొల్లి స్వతంత్రం-కాకుండా గాంధీగారు చూడాలి. అయినా మహాత్ముడు వున్నంతకాలం ఆ భయం వుండకూడదు మరి.

శాస్త్రిని లాలన పాలన మీదనే మెల్లిగా నావేపు తిప్పుకోవాలి!

స్వరాజ్యం అంటే ఇప్పుడిప్పుడు ముఖం తిప్పడం పెదిమె విరవడం మానేస్తున్నాడు. కాని - సోషలిజం అంటే బెదురుతాడు! చమటోడిచి కష్టించేవాడికి రాజకీయం యెందుకంటాడు. "ఇంగ్లండులో కార్మికుల గవర్నమెంటే - రైళ్ళనిగాని-బొగ్గుగనులనిగాని - ఉక్కు - ఇనుము పరిశ్రమలనుగాని - విద్యుచ్ఛక్తి ఉత్పత్తినిగాని-నూలు పరిశ్రమనిగాని - జాతీయపరం చెయ్యలేదు - మూలధనంమీద పన్ను వెయ్యలేదు - జమీందారీలని రద్దుచెయ్యలేదు - రాజకుటుంబానికి స్వస్తిచప్పలేదు కదా - ఇంగ్లీషు కార్మికవర్గానికే సోషలిజం పనికిరాకపోతే - మనదేశానికా పనికొస్తుంది? కందకి లేనిదురద బచ్చలికేల?" అంటాడు.

ఈమధ్య మరొకటి మొదలెట్టాడు—"మనదేశంలోకూడా హిట్లరంటూ వకడు బయలుదేరితే బాగుండును" అని. "అటువంటి వాడికింద నాజీ సోషలిజంవస్తే నాకు అభ్యంతరం లేదు" అంటాడు. నాజీ-రాజీ-అని శాస్త్రికి ఇదొక ఊతపదం అయిపోయింది. నాతోడి సత్యాగ్రహులే యంతోమంది హిట్లరుని దేవుడిలాగు చూస్తూ నిత్యం పూజచేస్తున్నారు! అతడు చేస్తున్న దౌర్జన్యాలు చదువుతూంటేనే భయానకంగా వుంది! మనం ఉద్యమంలో పడ్డబాధలు వాటిముందు ఎంత? అబ్బబ్బ!...

శాస్త్రితో తొందరపడి లాభంలేదు. అతనికి ఇంగ్లీషువాళ్ళపైవుండే భక్తి - నావైవుండే ప్రేమ - యీ రెండింటిమీదనే అతన్ని జాతీయ ప్రవాహంలోకి నడిపించాలి! ఇద్దరం కలిసే ఈ ప్రవాహంలోకి దిగాలి!...

ఈవేళకి అప్పుడే మూడువారాలైంది-శాస్త్రినిచూసి. అతన్ని వక్కమాటు చూస్తేనేకాని తోచడంలేదు. శాస్త్రి నాదగ్గిరలేకపోతే నాకంతా శూన్యం - నా హృదయం మేఘావృతం - కళ్ళముందు కారుమబ్బులు...

రమ్మనిమని టెలిగ్రాం వేద్దునా? రాకపోతే—?

తాజా: ఇలాగు అనుకుంటు నేవున్నా - పాపాయి పరుగెత్తుకుంటూ వచ్చి: "అమ్మా! నీకీవుత్తరం ఇమ్మని ఇచ్చాడే - హోటేలు బంట్రోతు - "అంటూ టెలిగ్రాం నాచేతికిచ్చింది. ఆ పచ్చని కవరు చూడగానే నాగుండెలో రాయి పడింది. తప్పకుండా శాస్త్రి దగ్గిరనుంచే అని అనుకున్నాను. "శ్రీమతి శాంతం శాస్త్రి - మెడోస్ హోటేలు - శ్రీనగరం - " అనివుంది! నా చిరునామా శాస్త్రికి ఎలా తెలిసింది? నేను తెలియజెయ్యలేదే. తనెవెన్నెలరోజులు అనకింకా బాగా జ్ఞాపకం వున్నాయన్న మాట. అప్పుడు యీ హోటేల్లోనే దిగాం అన్నమాట మర్చిపోలేదు. నేనంటే ఎంత ప్రేమ!

టెలిగ్రాం విప్పడానికి భయం వేస్తూంది. పాపాయిని దగ్గిరికి పిలిచి వళ్ళో కూర్చొపెట్టుకున్నా. కవరుచించి చదివేను.

"మల్లేశ్వరం జమీను రైతుల తరఫున ప్రీవీకౌన్సిలుకు వకాల్తీ పుచ్చుకున్నాను. ఫీజుకాని ఖర్చులుగాని పుచ్చుకోవడంలేదు. పదిరోజుల్లో బొంబాయినుంచి లండనుకు బయలుదేరాలి. మన ముగ్గిరికీ సుభకీ స్టీమరు టిక్కెట్లుకొన్నాను. మిగతా అన్ని ఏర్పాట్లుచేశాను. బొంబాయిలో తాజమహాలు హోటేల్లో బస. నీ ఖర్చుల కోసం హోటేలువారిపేర వెయ్యిరూపాయలు టెలిగ్రాంద్వారా పంపించాను. వెంటనే బయలుదేరండి. విక్టోరియా టెర్మినస్‌లో శుక్రవారం ప్రొద్దున్న ఎనిమిది గంటల బండికి కలుసుకుంటాను, ప్రేమతో—శాస్త్రి."

...గంగా యమునా మళ్ళీ కలుసుకున్నాయని సంభరపడుతున్నాను. పాపాయిని గట్టిగా కౌగలించుకున్నాను.

---

## ౨౯

## అతడు

కుచ్చర్లకోట రామస్వామి నిన్న ఆదివారం ప్రొద్దున్నే వచ్చాడు - నా దగ్గిరకి మాట్లాడడానికని. శాంతంతో కలిసి ఆతనూ సుబ్బయ్య దెబ్బలు తిన్నాక, ఇతన్ని రెండుమాట్లో మూడుమాట్లో చూశాను. ఈమధ్య రైతు సభలంటూ లేవదీసి రైతులని జమీందార్లమీద ఉసికొలుపుతున్నాడు. నెల్లాళ్ళక్రిందట శాంతదగ్గిరకి వచ్చాడు. ఎందుకోమరి ? ఏదో చందా వసూలుచేసుకొని పోపడానికే !

వంటిమీద ఉత్తరీయం వేసుకోడు. చప్పిదవడలు- గోతుల్లాగు కళ్ళు- తుప్పల్లా కనుబొమ్మలు- మనిషి వుత్తదుంపరాష్ట్రం, అతన్ని చూస్తేనే నాకు భయం వేస్తుంది.

"శాస్త్రిగారూ ! మీతో ముఖ్యమైన పనివుండి వచ్చా. మల్లేశ్వరం రైతుల కేసులో ప్రీవీకౌన్సిలుకు అప్పీలు దాఖలుచేశాం. నెల్లాళ్ళలో విచారణకొస్తుంది. పెద్ద వాళ్ళనుకునే వాళ్ళందరి దగ్గిరకీ వెళ్ళేం. ఎన్నికలమూలాన్ని ఇప్పట్లో వారెవ్వరూ దేశాంతరం వెళ్ళడానికి ఇష్టపడడంలేదు - హోదాలు పదవులూ పోతాయేమోనని. అంతేకాదు - బీదరైతులం ఖర్చులు తప్ప ఫీజు ఇవ్వలేం అనికూడాను లెండి."

ఒక్కనిమిషం ఆగి నావేపుచూస్తూ "జమీందారీ కేసులో మీరు ఘనులు. మీరు మాపక్షాన వకాల్తీపుచ్చుకొని, లండను వెళ్ళాలి. శాంతంగారువుంటే ఆమెచేత సిఫార్సు చేయించుకుందాం అనుకున్నాను. ఆమె లేకపోవడంచేత నేనే ముఖస్తంగా మాట్లాడుదాం అనివచ్చా. నేను ఇంక చెప్పవలసిందేం లేదు. బీదరైతులమీద అభిమానించి మాకు లోకోపకారం చెయ్యాలి. మీకు రాబడి వుండకపోయినా- ఆచంద్రతారార్కం కీర్తి వుండిపోతుంది. వేలాదిప్రాణులని కాపాడిన వాళ్ళవుతారు. వందలాది రైతులూ- కంబర్లూ మిమ్మలిని స్మరించుతారు. దస్తరం ఇక్కడి వదలి వెళు తున్నాను. బుధవారం మళ్ళీ మీదగ్గిరకి వస్తా. ఆరోజున మీ నిశ్చయం చెప్పండి !" అంటూ వెళ్లిపోయాడు.

...ఈవేళప్పుడే మంగళవారం.

కాగితాలు చదివాను. శివరామకృష్ణయ్య హైకోర్టులో రైతులవేపు వాదిస్తూ - జమీందార్లకి కంపెనీ తరఫున శిస్తులు ఇజారా పొందుకుని వసూలుచేసుకోవడమే తప్ప శిస్తులు పెంచే అధికారం వాళ్ళకి లేదూ-అన్నాడు. కాని ఆవాదన సొంతంగా చేశాడు కాడు. నూచావాచాగా అంటే ఏంలాభం? నేనప్పుడే అనుకున్నా - ఇతను పప్పులో కాలువేశాడురా - అని. ఈ విషయం మీదనే వాదనంతా పూర్తిగా ఆధారంచేసి - పెర్మనెంటు సెటిల్మెంటునాటి శిస్తులే ఖాయం - వీళ్ళ చిత్తంవచ్చినట్టూ వాటిని హెచ్చించి వసూలు చేసుకోవడానికి కంపెనీ యిచ్చిన సనదులలో ఎక్కడా అధికారాలు లేవు - అని తిప్పికొట్టాలి.

గెలుపుతప్పదు. చరిత్రాత్మకం అయిన కేసు అయిపోతుంది. దేశం అంతా గగ్గోలెత్తిపోతుంది. మీసంమీద నిమ్మకాయ! బస్తీకే సవాల్! ప్రీవీకౌన్సిలు జడ్జీలు కూడా గుండె బాదుకోవాలె - శాస్త్రి అంటే!

...భయంవేస్తూందే! నేనింతవరకూ ఎన్నడూ జమీందార్లకి వ్యతిరేకంగా దావాలు పట్టిఎరగను. ఇంత ముఖ్యమయిన దావా రైతులపక్షం పట్టి గెలిపిస్తే- రేపటి నుంచీ జమీందారీ ఖాతాలన్నీ నాకు సున్నా అనమాట. ఇహ జరుగుబాటు ఎల్లా? అసలు నా ప్లీడరీ దుఖాణమే ఎత్తివేసుకోవాల్సొస్తుందేమో? ధనికులందరూ నాకు శత్రువులైపోతే నాపనేంగాను?

...ఇంతటితో తీరిపోతుందా? ఈ తీర్పుతో శిస్తులు పడిపోతాయి - అసలు చెల్లించడమే ఎగగొడతారు రైతులు - జమీందారీపద్ధతే రద్దుఅయిపోతుంది. అటువంటప్పుడు అగ్రహారాలు మాత్రం నిలుస్తాయా? అప్పుడు నామాటేంగాను? కడుపులో చల్ల కదలకుండా కాలుమీద కాలువేసుకుని - సాలీనా పదిహేను వేలు వొళ్ళో పడుతున్నాయి. భూమిశిస్తు పద్ధతే తల్లకిందులైపోతే - డబ్బువిలువే పోతుంది. ఇక మిగిలింది - సోషలిజమే! నా వేలితో నాకంటినే పొడుచుకుంటున్నానే ఖర్మం!...

నాకేం మతి పోతుందా యేమిటి? అప్పే ఎంత సోషలిజమైనా — భూములు లాగుకుని డబ్బు యివ్వకుండా వుంటారా? యే ధర్మశాస్త్రమూ - యేపద్ధతీ వొప్పుకోని పని యెలా చేస్తారు? అంత అరాచకానికి బ్రిటిషువాళ్ళు వప్పుకోరు - గాంధీగారు అంతకంటే వప్పుకోరు. అసలు స్వరాజ్యమేలేదు - సోషలిజం ఎక్కడ? అసలు ఇదంతా జాగ్రత్తగా వకమెట్టు తరువాత వకమెట్టు — వ్యూహాలు పన్ని - నడిపించుకున రావాలి. హిట్లరులాంటి వాడే — తొందర పడకుండా - మీన మేషాలు లెక్కపెట్టి - పంచాంగం జ్యోతిషం చూసుకుని మరీ వెళుతున్నాడు.

మనదేశానికి సోషలిజం అంటే కిట్టదు. నేను ఇంగ్లండులో ఎకానమిక్సు చదువుకున్నా. నాకు కిట్టుతుందా? నాలాంటివాళ్ళే అంటకున్నా. మన పెద్దవాళ్ళందరూ

ఇంగ్లండులో చదువుకున్నవాళ్ళే - ఇంగ్లీషు పద్ధతులను వరవడి దిద్దేవాళ్ళే - అలాంటి వుపద్రవం రాకూడదు. అథవా వచ్చిందీ అంటే ఆ వుపద్రవం వచ్చే లోపుగానే ఆస్తులు పాస్తులు చక్కబెట్టుకోవచ్చు. నేను మరీ బెదురు గొడ్డునై పోతున్నానే!

దావా కాగితాలు చదివితే మాత్రం చాలా ఉత్సాహంగావుంది. దావా గెల్పించి తీరాలనే పట్టుదల వకటి లోపలిసుంచి పుట్టుకొస్తూంది. ఇది గెలిస్తే - రేపు పొద్దున్న స్వరాజ్యంవారే నన్ను సుప్రీము కోర్టు న్యాయమూర్తిగా వెళ్ళమని బలవంతం చేస్తారేమో కూడాను!

అదటుండగా — శాంతం చాలా సంతోషిస్తుంది. సంతోషించడ మేమిటి? నన్ను కళ్లకద్దుకుంటుంది. ఇదివరకు నన్నాడిన వెటకారాలు తల్చుకుని పశ్చాత్తాప పడుతుంది. ఆమెను సంతోష పెట్టడం కంటేను-ఆమె ప్రేమని నిలబెట్టుకోవడం కంటేను—నాకు పరమావధి యేమిటుంది? నిజంగా ఆమె ప్రేమకి పాత్రుడను కావాలంటే-నాకు స్వార్థంలేదు - బీదవాళ్లంటే కనికరం వుంది - అని ఆమెను నమ్మించాలి.

ఫీజు ఇవ్వలేం అని రామస్వామి అన్నాడు మాత్ర ముప్పిడి లేకుండా. శాంతం వుంటే - ఖర్చులుకూడా నన్నే భరించమని అని వుండును. ఖర్చులు భరించడం అంటే మాటలా? పదివేలన్నమాట...! నేను ఎప్పుడేనా ఇంగ్లండు వెళితే నిన్ను తప్పకుండా తీసుకు వెళతానూ-అని అన్నా. ఇప్పుడు—ఇద్దరం అల్లా — ముగ్గురం అయాం-సుభతో నలుగులం! శాంతంతో ఖరారు తప్పకూడదు. అంతా లెక్కవేస్తే - యూరపులో నాలుగు దేశాలూ తిరిగి రావాలంటే - అర్థలక్షం అనుకోవాలి.

అమ్మయ్యో! అయితే, నేం — ఇది నా జీవితంలో క్రొత్తప్రకరణం ఆరంభం! శాంతం మెచ్చుకుంటుంది! నిశ్చయం చేసుకున్నా - ఇక మరి వెనక తియ్యను.

...శాంతం పేర టెలిగ్రాం వెయ్యాలి. శ్రీనగరం వెళ్ళినట్టు నిన్ననే తంతి వేసింది. కాబట్టి ఇంకా అక్కడే వుంటుంది. గృహనౌక యేదేనా వకటి అద్దెకు పుచ్చుకుని వుందో — లేకపోతే అప్పటి రోజుల్లోలాగు హోటేల్లో వుందో! అప్పుడు మెడ్డోక్స్ హోటేల్లో దిగేం. ఆసంతోషమైన రోజులు జ్ఞాపకం తెచ్చుకుని తప్పకుండా అక్కడే బసచేస్తుంది. శాంతంది చాలా సున్నితమైన మనస్సు. ప్రేమ - అనురాగం - ఆమె మనసులో ఒకమాటు ప్రవేశించాయంటే - మరి అవి వేళ్లతో పాతుకుని పోయాయన్నమాటే. ఆ హోటేలు చిరునామాకే టెలిగ్రాం వేస్తాను...

శాంతం నీ మీదనే నా ఆశ అంతా పెట్టుకున్నాను — తప్పకుండా మనం బొంబాయిలో కలుసుకోవాలి సుమా!...

## ఆమె

## 87

జమ్మూ... పఠాన్‌కోట... అమృతసరం... ఇంకా మూడురోజులు ప్రయాణం వుంది!

పాపాయి అడుగుతూంది సుభని: "సుభక్కా! మనం యెప్పుడూ యీ రైలులోనే వుండిపోతామేమిటే?"

సుభ జవాబు చెబుతూంది: "అబ్బే! యీ వేళళ్లా అయిపోయాక - రేపల్లా అయిపోయాక - యెల్లుండి పొద్దున్నే కాఫీ తాగేక - అప్పుడు నాన్న వస్తారూ - దిగిపోతాం!" ...రైలు నడుస్తూంటే కనిపించిన వాళ్లందర్నీ చూసి "నాన్న-నాన్న!" అంటూ పాపాయి నవ్వుతూ చప్పట్లు కొడుతూంది!

తల్చుకుంటే ఆశ్చర్యం వేస్తుంది - జమీందార్లకు వ్యతిరేకంగా శాస్త్రి రైతుల పక్షాన ప్రివీ కౌన్సిల్లో వ్యాజ్యం పట్టడం - దమ్మిడీ పుచ్చుకోక పోవడమేకాకుండా ఖర్చులుకూడా తనే భరించడం! ఇంతమార్పు అతనిలో యెల్లా వచ్చిందో - చిత్రం! పరకాయ ప్రవేశమా - ప్రాయోపవేశమా - వేదాంతమా? లేకపోతే నన్ను సంతోష పెట్టడానికా? యేదేనా కానీ - మనసులో స్వార్థరాహిత్యం అంటూ ప్రవేశిస్తే మనిషి అన్నవాడు తప్పకుండా మారిపోతాడు.

నేనుమాత్రం మారలేదా? ఎల్లకాలం వక్కలాగే వుండిపోయానా? పన్నెండేళ్లు వచ్చేటప్పటికే - దీనికి పెళ్లి చేసేయ్యాలి - దీనికి పెళ్లి చేసెయ్యాలి - అంటూ భీమశంకరం మామయ్య శతపోరుపెట్టి అమ్మని వేధించుకుని తినేశాడు. "తోటి పిల్లలందరూ చదువుకుంటూంటే దీని కొక్కర్తికేమాత్రం యేమొచ్చిందిరా తొందర?" అని అమ్మ సమాధాన పెడుతుండేది. నాలుగో ఫారం చదువుకుంటున్నప్పుడు యెప్పుడేనా మార్కులు ఫైలంటూ ప్యాసవగలుగుతానా అని బెంగ పెట్టేసుకునేదాన్ని. అనర్సు పరీక్షలో అందరికంటె మొదటిగా ప్యాసయినందుకు ఆంధ్ర సమితివారు బంగారు పతకం యిచ్చినప్పుడు పరిపూర్ణ పాండిత్యం సంపాదించి గండపెండేరం సింహతలాటం తొడిగించుకున్నట్టే సంతోషించేశాను!

పరీక్షల్లో ఉత్తీర్ణులవడానికీ పాండిత్యం సంపాదించడానికీ యెంత తేడా వుందో-పాండిత్యానికీ జ్ఞానానికీ అంతకంటె సహస్రాంతం తేడావుంది. నేను ప్రతీ సంవత్సరారంభమప్పుడూ అనర్సు తరగతికి యిచ్చే ఉపన్యాసంలో చెప్పేదాన్ని: "పాండిత్యం అనే మహా సౌధంలో మీరు మొదటి మెట్టున వున్నారు - నేను మీకంటే మరి వక్క మెట్టు పైగావున్నాను. ఇతిహాస శక్తులూ మనుష్యానుభవం అనే నిత్య నూతనమైన కెరటాలతో నిరంతరం మార్పుచెందుతూ వుంటుంది జ్ఞానాంబుధి. ఆ మహా సముద్రంలో మీరు చదువుకున్నది వక నీటిచుక్క. నేను చదువుకున్నది వక కాకిరెట్ట. మీకూ నాకూ అంతే తేడా!" అది విని నా కాలేజీ పిల్లలు: "మా ప్రొఫెసరుగారిది యేమి నమ్రతండీ!" అని గొప్పగా చెప్పుకొనేవారు...వయస్సువచ్చి ప్రపంచంలో తిరిగేటప్పటికి అనుభవంమీద తెలిసింది - వేదాంతశాస్త్ర అధ్యాపకులు చెప్పే మెట్ట వేదాంతమున్న అర్థశాస్త్రజ్ఞులు చెప్పే తప్పుడు అర్థశాస్త్రము యెందుకో అని-నిజాన్ని మరుగుపరచడానికిన్ని నాలాంటి ఉపాధ్యాయులు 'నోట్సుపుస్తకాలు' వ్రాసి నాలుగు డబ్బులు సంపాదించుకోవడానికిన్నీ !

పాపాయి చదువుమాట ఆలోచించాలి. ఇప్పటికే శాస్త్రి నన్ను చీవాట్లు పెడుతున్నాడు-ఐదో యేడు వచ్చింది యింకా అక్షరాభ్యాసం చెయ్యలేదని. మొన్న దక్షిణాయన ప్రవేశం కాగానే-ద్వాదశీ శుక్రవారం శ్రవణ నక్షత్రం - అక్షరాభ్యాసానికి బాగుంది-పసుపుకొమ్ము పట్టించి బియ్యంలో ఓం నమశ్శివాయ సిద్ధంనమః అని వ్రాయించేసి తరువాత సత్యనారాయణవ్రతం చేసేస్తే తీరిపోతుందన్నాడు.

"లాంఛనం సంస్కారం తీరిపోవడానికేముంది ? నేనెలాగూ దానికి గజేంద్ర మోక్షం, రుక్మిణీ కల్యాణం, బాలరామాయణం పద్యాలు నేర్పిస్తున్నానుగా" అన్నాను.

"ఓహో! అష్టదిక్పాలకుల్లో వకరిని చేసేస్తావాయేమిటి పాపాయిని?" అన్నాడు.

"అష్ట దిగ్గజాలని కాదూ నువ్వన్నది?" అన్నాను.

"అవును-అవును" అన్నాడు నవ్వుతూను.

"అవి మగ యేనుగులు! అభ్రమవు, కపిల, పింగళ, అనుపమ, తామ్రపర్ణి, శుభదంతి, అంగన, అంజనావతి వాళ్ల భార్యలు" అన్నాను.

"చదువుకున్న భార్యలవుతే అష్ట దిగ్గజాలు చచ్చారన్నమాటే!" అన్నాడు నవ్వుతూను.

"కృష్ణదేవరాయల ఆస్థానంలోని దిగ్గజాల భార్యలెవరూ విదుషీమణులైనట్టు చెప్పబడలేదులే!" అన్నాను కన్నుగీటుతూ.

"అదికాదుగాని—పాపాయిని యే లీలావతో, యే ఝాన్సీ లక్ష్మీభాయినో, యే సరోజినీనో చేసెయ్యాలి మనం!" అన్నాడు ఉత్సాహంగా... కుమ్మరిమొల్ల-పల్నాటి వీరాంగన-పేరూ వూరూలేని దేశసేవిక? యేదైనా సరే!... పాపాయి పెద్దదయేసరికి దేశం కాలం మారవా?

వయసొచ్చింది-మంచి అందం వస్తూంది-సుధ ఒక సమస్యకింద తేలింది. మూడేళ్లు సదవానికి పంపించాను కాని చదువు అబ్బలేదు. పుస్తకం పట్టుకోవడం అంటే గిట్టదు. సంగీతంలోను నాట్యంలోనూ ప్రవేశంవుంది కాని శ్రద్ధ ఓపికలేక వాటికి స్వస్తి చెప్పేసింది. హిందీ-ఇంగ్లీషు తప్పుఅయేది తడక అయేది, తణుకు బెణుకు లేకుండా మాట్లాడేస్తుంది. యేం చెయ్యడమో తోచడంలేదు. ఇప్పుడే ముదర వంకాయ మాటలు నేర్చుకుంటూంది. మొన్నంది: "అమ్మా! నేను నాయిష్టం వచ్చిన వాడిని పెళ్లాడొచ్చుకదూ?" "ఏం అలా అడుగుతున్నా?" వన్నా. "యేం లేదూ. మనవూళ్లో నువ్వు నాన్న నేను బర్మాశాండో సినిమా కెళ్లాంకదూ. అప్పటినుంచీ అతన్ని పెళ్లాడదామని వుండేను. కాని మొన్న ఢిల్లీలో హూటేలువాలాని చూసిన దగ్గరనుంచి అతన్నే పెళ్లాడదాం అని వుందమ్మా!" అంది. "మరి-అతనితో మాట్లాడావా?" అనడిగే. "బర్మా శాండోని బొమ్మల్లో తప్ప మరెప్పుడూ చూడలేదు. ఆవేళ కారులో స్టూడియో ప్రక్కనించే వెళ్లేను కాని, లోపలికెళ్లి అతన్ని చూడ్డానికి భయం వేసింది-తీరా అతనేమంటాడో అని. ఢిల్లీలో హూటేలువాలా కళ్లు యెంత అందంగా వుండేను? నా ఆకళ్లు నన్ను పిలుస్తూన్నట్టే అనిపించింది! రెండు మూడుసార్లు అతన్ని పలుకరించాను కాని - అతను నన్ను వినిపించుకున్నాడేకాడు!" అంది. సుధమనస్సులో యేం ఆలోచనలు పుడుతున్నాయో!

నాకీ వయస్సులోనే బాలచంద్రరావుతో పరిచయంఅవుతా. తరవాత మొదటిసంవత్సరం పనిచేస్తున్నప్పుడు-సనాతనధర్మ కాలేజీలో అధ్యాపకుడు మార్తాండమూర్తి-అతని వుత్తరాలన్నూ! ఒక్కొక్క వుత్తరం-ఒక్కొక్క దండకం-అచ్చతెనుగున అదన్నీ! ఈమాటు వుత్తరంలో మొగలిరేకులు పెట్టిపంపించితే-వచ్చేమాటు మంచిగంధపుపొడివుంచి పంపించేవాడు! శృంగారానికి తోడు పరిమళం! మొగలిరేకులని తలలో పెట్టుకొనేదాన్ని. గంధంపొడి నీళ్ళలో కలిపి మెడకి రాసుకొని - వుత్తరాలను మాత్రం నీళ్ల పొయ్యిమంటలో పడేసేదాన్ని! తరవాత...శాస్త్రి - మన్మధావస్థలూ ... పెళ్లి... కాశ్మీరం...సంసారం...పాపాయి...కాంగ్రెసు...అవ్యక్తం...కాశ్మీరం...

...కాలేజీలో పనిచేస్తున్న రోజుల్లోనేమి, సంసారం కొత్తలోనేమి, ప్రపంచంలో గొప్ప - బీద, పస్తు - విందు, సౌఖ్యం - దరిద్రం, యీ వ్యత్యాసాల గురించి తలచుకునేదాన్ని కాను. నా మనస్సులో సంతోషం, హాయి, తృప్తి, శాంతి వుండడం చేత కాబోలు - మిగతా ప్రపంచం గురించి పట్టించుకునేదాన్ని కాను. మానవసంఘం పుట్టుకతోనే యీ భేదాలు మొదటినుంచి వుంటూవచ్చాయి - కొసవరకూ వుండవలసిందే కాబోలు - అనుకునేదాన్ని. ఉద్యమంరోజుల్లో ఆ బడబానలపు ప్రచారంలో "స్వజాతి స్వరాజ్యం స్వతంత్రం" అని వరవడి వల్లించడం తప్ప, యీ సాంఘిక దురన్యాయాల గురించి ఆలోచించేదాన్ని కాను. సత్యాగ్రహంలో లాఠీదెబ్బలు తిని ఆస్పత్రిలోపడి బాధపడుతూన్న రోజుల్లో అథవా వీటిగురించి శాస్త్రితో యిప్పుడైనా ప్రస్తావిస్తే: "యీ విభేదాలు వైరుధ్యాలు నువ్వూ నేనూ కల్పించినవి కావు. జాతిభేదం వర్ణభేదం లాగే వర్గభేదం కూడా దైవసృష్టిలో అంతర్గతమై వుంది. మనం రమ్మనమంటే వచ్చినవి కావు. పొమ్మనమంటే పోనూ పోవు. ఇవి శాశ్వతం అని తెలుసుకునే కౌటిల్యుడు ఆడంస్మిత్తు వీటి మార్పు గురించి యెత్తుకోనేలేదు. అంచేత అక్కరలేని జిజ్ఞాసలు తర్కమీమాంసలు మనకేల? మనకున్న చీకాకులు, చిత్తక్షోభలు చాలు!" అని నా నోరు నొక్కేసేవాడు... చికాకులు చిత్తక్షోభలు? పొద్దున్నే లేచి పళ్లు తోముకోవడం తరువాయిగా గొంతుకలో కాఫీ పడకపోతే - వారంరోజులై ఆకలితో మలమల మాడుతున్నట్టే బాధ! పదిగంటల భోజనానికి పెరుగుబిళ్ల కాస్త పలచగా వుండేసరికల్లా - "ఛీ! నీళ్లుకారుతూ యేంటండి? ఇంతకంటె పస్తుంటేనయం!" అని శాస్త్రికి ఆగ్రహం! రెండుపూటలూ సుష్టుతృప్తంగా భోంచేసి రాత్రి తాంబూలంలో యాలగ్గింజ లేకపోయేసరికి: "పంటిశుద్ధేనా కాకుండా యెందుకీ వంటపట్టని మెతుకులు?" అని సణుగుడు! తెనాంపేట బంగాళానుంచి ట్రిప్లికేను యింటికి మారితే: "యీ నాలుగ్గదులూ యేంసరిపోతాయి - భగవంతుడా? ఈ యిరకటం కంటె చెట్టుకింద కాపురం నయం!" అని నేను చికాకుపడడం! నెలకి రెండువేలు ఆర్జిస్తూ - మరో వెయ్యి ఆర్జించలేకపోతున్నానే అని: "ఛీ! యీ దరిద్రం కంటె మాధవకోళం దండుకుంటే మేలు!" అని శాస్త్రి తన్ను తనే తిట్టుకోవడం!...ఎన్నడేనా ఆకలిబాధ అనుభవించి యెరుగుదునా? మానం కాపాడుకోవడానికేనా చాలని చింకిపాత కట్టుకుని సిగ్గువిడిచి నలుగురిలోనూ మెసలవలసిన గతి నాకెప్పుడేనా పట్టిందా? హోరుమని చలిగాలి లోపలికి కొడుతూ - భోరుమని ఎండ లోపలికి వచ్చేస్తూ - వర్షపునీళ్లు ధారలుగా కప్పునుంచి కారుతూన్న - గుడిసెలో కాపురం చెయ్యడం అంటే నాకేమిటో తెలుసునా? యీ

బాధలు తెలియనంతసేపు - న్యాయం, ధర్మం, సత్యం, నీతి - అని నేనూనమ్మేను, నేనూ బోధించేను. రాయపురం రైలువంతెన చేరిలో నాలుగు రోజులై అన్నంమెతుకంటే యేమిటో యెరక్క పడుకున్న ఆ ఆరుగురుపిల్లల తల్లికి-ఆదిసత్యాలు ఉపదేశిస్తే ఆమె కేం అర్థంఅవుతుంది? కిద్దరుపూరులో రెండుసంవత్సరాలై యెఱ్ఱనియేగాన్ని కళ్ళారా చూచిన పుణ్యం కట్టుకోక - పనికోసం రోడ్లల్లా వెతికి, యెక్కి గుమ్మంయెక్కి దిగే గుమ్మందిగి, వీధులల్లా తిరిగివేసారి సాయంకాలానికి వుత్తచేతులతో యిల్లుచేరి ఆలుబిడ్డలని చూడడానికి ధైర్యంచాలని ఆయుష్కరుడికి పరమప్రమాణాలు బోధిస్తే యేంప్రయోజనం? ఢిల్లీ దర్వాజా దగ్గిర తీసురేకు గుడిసెలో క్షయతో తీసుకుంటూన్న వెనిమిటికి మందు కొనడానికోసం సెక్రిటేరియట్టు బస్సులదగ్గిర బిచ్చం అడుక్కుంటూన్న ఆ స్త్రీతో అనాశ్రిత ధర్మాలని పాటించమని కతపోరుతే ఆమెకేమేనా పాలుపోతుందా?... నేనే ఆస్థితిలోవుంటే యెలాప్రవర్తిస్తానో? సిగ్గులజ్జలు మర్చిపోయి చెయ్యిచాచి పరాయి వాళ్లని అడుక్కోవడానికి సిద్ధపడతానా? లేకపోతే - గుండె రాయిచేసుకుని జేబు దొంగతనానికో రాత్రి కన్నంవెయ్యడానికో తయారవుతానా? లేకపోతే - దుఃఖాన్ని మింగి తిట్లుపడి యెవరింట్లోనో చాకిరీకి బయలుదేరుతానా? లేకపోతే - చాకలివాని దగ్గిర పసుపు గుడ్డలు అద్దెకు తెచ్చుకుని - కోమటి దగ్గర అప్పు బతిమాలి పసుపు కుంకుం అత్తరు పన్నీరు రాసుకుని - మానం మరచి - బిడియం విడచి - శీలాన్ని బలి యిచ్చి - దేహాన్ని అమ్ముకుని...అబ్బబ్బ! తల్చుకొంటేనే కళ్లు చమ్మగిలి వళ్లు జలదరించి గుండె కొట్టుకొంటూందే! బతుకు తీపి - ఆకలి బాధ - వెనిమిటి పిల్లలపై ప్రేమ - యీ అగ్ని పరీక్షకి నా సత్యాగ్రహం నిలుస్తుందా?... చెప్పలేను! శాస్త్రి శాక్యం - ఊర్వశి కుతంత్రం - అభినాషుబాబు వాంఛ - స్త్రీపురుషుల కక్కుర్తులు- దొరల రాజ్యకాంక్ష - స్నేహితుల పదవీ వ్యామోహం - ధనికుల పరపీడన - దేశంలో దరిద్రం - ఇవన్నీ చూస్తూంటే - యీ ప్రపంచంలో ఆదిసత్యాలు అనాశ్రిత ధర్మాలు పరమ ప్రమాణాలు - ఉంటూ వున్నాయా అని నాకే సందేహం కలుగుతూంటే - అప్పటికీ యిప్పటికీ నేనెంత మారిపోయానన్నమాట!

సుభని ఇంగ్లండు తీసుకెళుతున్నాం. అక్కడ అమాంతంగా యే 'లార్డుని' వరిస్తుందో - యే బస్సు నడిపేవాడిని మోహిస్తుందో - లేకపోతే యే నాటకం వాళ్లతో వెళ్లిపోతుందో? సత్యకాలం - దానికింకా యేం తెలీదు. నేనే చెప్పాలి - తల్లి బాధ్యత నాదే. పాపాయిసుభ - నాకు రెండు కళ్లలాగున్నారు. శాస్త్రితో చెబితే గాభరా పడతాడు. నేనే జాగ్రతగా వుండి వెయ్యికళ్ళతో కాపాడాలి.

...ఇంగ్లండు - ఫ్రాంసు - జర్మనీ - ఇటలీ - పోలెండు - రష్యా! యుద్ధోన్మాదుల వికటాట్టహాసపు పిచ్చి చేష్టలు మితిమీరిపోతున్నాయి. రణభేరీ మ్రోగుతూంది. శంఖారావం వినిపిస్తూంది...మన యెన్నికల హడావుడి - మన మంత్రాంగపు

హంగామాకూడా ఆరాబోయే మహా సంగ్రామంయొక్క మొదటి నాందీ ప్రస్తావనో అనిపిస్తూంది నాకు! లేకపోతే - మొదటి అంకంలోనే పక పిల్ల సమ్మేరియా - తెర వెనుక ముసుగులో గుద్దులాటా?...దీని తరువాత - బ్రిటిషువాడికీ మనకీ - పాలకులకీ పీడితులకీ - కలిమివున్నవారికీ లేమివున్నవారికీ-అన్నదమ్ములకీ అన్నదమ్ములకీ అంతర్యుద్ధం-మరో కురుక్షేత్రం-తప్పనిసరి అనిభయం వేస్తూంది నాకు...

నేను పిరికిపందనై దేశాన్ని వదిలి పారిపోవడంలేదు. రాబోయే యుద్ధానికి తర్ఫీదుపొంది తయారుగా వుండడానికే నేనీ ఇంగ్లండు ప్రయాణాన్ని వినియోగించాలి. యీసారి గోడమీద పిల్లివాటంగా కాకుండా శాస్త్రిని నావేపు నిలబడేటట్టే చేయ్యాలి. అర్జునుడికీ కర్ణుడికి యుద్ధం. కాని-అర్జునుడికీ సుభద్రకీ యుద్ధమా?... ఆవేళ రైల్లో కలలే జ్ఞాపకం వస్తూంది!

...ఈ పరిగెడుతూవున్న టెలిగ్రాఫు స్తంభాలూ-కిందికీ మీదకీ తేలిపోతూండే తీగెలూ, నడుస్తూన్న చెట్లూ పారిపోతూన్నయిళ్లూ - వీటిలాగే - నా మనస్సులో ఆలోచనలూ తలంపులూ జ్ఞాపకాలూ పకదానివెంట మరొకటి పందేలు వేసుకొని తరుముకొస్తున్నాయి! యెందునా పొందకుండా పకదానితో వకటి సంబంధం లేకుండా ఇవన్నీ శరీరంలో యేమూల దాక్కునివుంటాయో - మెదడులోనా - హృదయంలోనా - మనస్సులోనా - ఆత్మలోనా - అంతఃకరణలోనా!...

...లక్కమామిడి పిడత మూత తియ్యగానే అందులోనుంచి పాము వచ్చినట్టు "ఔరా! నాస్వామి యిటు చూడరాదాయెరా!" అన్నజావళీ ఆకృతిలేని రూపంతో అప్రయత్నంగా దానంతటదే పాడుకుంటూవచ్చి నా బుర్రలో తిరుగుతూంది! నరసింహేశ్వరపుర సంస్థానాధీశ్వరుడైన ప్రతాపరెడ్డి ఆనందకృష్ణవర్మ యుణిం వారిని కృతిభర్తగా చేసి అభినయించి నర్తకి చింతామణి పాడిన జావళీ... "ధాపమగ - రిమపనిధ - మపధపాధ - సరిమ - సరిమగరిసనిధప - పాధసారి - ధరిసనిధ - రిమపధరిసా - నిధపధపా మగరి - పమాగరిస - రిమామగరిసరీమా..."

చింతామణి కాజావళీ నేర్పిన గోపయ్యగారే జ్ఞాపకం వస్తారు! నే నా రోజుల్లో చాలా చిన్నదాన్ని. నాన్నకి ఏకేశ్వరోపాసన అంటేను బ్రహ్మసమాజం మీదను చాలా గురి. జావళీలు నోట పలికితే ఆడపిల్లలకి యెక్కడ చెడుబుద్ధులు పుడతాయో అని ఆయనకి భయం! అంచేత జావళీలు కాదుకదా తానవర్ణాలుకూడా నన్ను నేర్చుకోనిచ్చేవారు కారు. గోపయ్యగారు కాశీయాత్ర వెళుతూ మాయింట్లో మజిలీ చేశారు. అప్పుడు ఆజావళీ నాకాయన స్వయంగా నేర్పారు. సాహిత్యం విని నాన్నకి కోపంవచ్చింది. కాని అతిథిని యేమనుగలరు? అందులోనూ - తిక్కలోనూ

సంగీతంలోనూ నారద సమానుడైన గోపయ్యగారినే? ...ఆయన వీణముట్టుకోవడమే అరుదు. ఆయనసంగీతం యెప్పుడు వింటామా అని ఆ వూరిలో ఆబాలగోపాలం ఆయన గుమ్మంలో పడిగాపులు కాసేవారు! ఆయనకి లోపలనుంచి పుట్టుమ వస్తేనే ఆ వీణని ధరించడం. లేకపోతే - మహారాజులు ప్రార్థించినా ససేమిరా - అంతే! వకరోజు తెల్లవారు ఝామున ఆయన భూపాళ రాగం వీణమీద ఆలాపనచేసి పూర్తి చేసేసరికి వక ఘడియ ఆలస్యంగా అయిందిట సూర్యోదయం! ఆనాటి నుంచి ఆరాగం మరివాయించనని ఆయన శపథం చేశాడు! మరోనాడు ఒకరింట్లో శృంగేరీ వారికి బిక్ష జరుగుతుండగా పొరుగు లోగిట్లో గోపయ్యగారు "శాంతము లేక సౌఖ్యము లేదు" అని శ్యామరాగంలో కృతి వాయిస్తూండేసరికి - అదివిని స్వాముల వారు నిర్వికల్ప సమాధిపొందగా - అప్పుడు సాక్షాత్తూ విశ్వకవే ప్రత్యక్షమయాడని ప్రతీతి! యేటేట గోపయ్యగారు దేవీ నవరాత్రులు చేసేవారు. ఆఖరు రాత్రి ఆయన "త్రిపుర సుందరినే వెలుసు కుంటి" అని వీణాగానం చేస్తూంటే అక్కడున్న వారందరికీ అంబాత్రయ సాక్షాత్కారం లభించేదట! కాని - ఆ సంగీత జ్ఞానం ఆయనతోనే అంతరించి పోయింది. ఆయన ఒక్కడే తరించాడు కాని మరెవ్వరికీ అందజేశాడు కాదు మరెవ్వరికీ ఉపకారం చేశాడు కాదు. నాదబిందుకళని మరీ స్వామి భవవేద్యం చేసేవాడాయన ...జావళీమీద నాన్న విముఖత గ్రహించి గోపయ్యగారు వీణమీటించి "శ్రీసుబ్రహ్మణ్యాయనమస్తే!" అన్న దీక్షితుల వారికృతి శ్లేషగా నాన్నని సంబోధించి పాడేసరికి - నాన్న తన్మయం అయిపోయారు! ఆ కృతికూడా గోపయ్యగారు నాకప్పుడే నేర్పారు.

...కాశ్మీరం రోజుల్లో శాస్త్రి ఇంగ్లీషు పాటొకటి పాడేడు:

యీ పుడమిలో
నీవక్కర్తవే నాస్త్రీ - నీవక్కడవే నా ప్రియుడవు
అటులైతే ప్రపంచం యెటులైనా కానీ!
అనాదినుంచీ
ఆదెమ్మరు మల్లె - ఆదయ్యాకు మల్లె
నవ్వులతో పువ్వులతో సరసంతో సంసారం!
యీ ప్రపంచం
వక కందర్పవనం - మన కిద్దరికోరకే ప్రత్యేకం
ఆశలు పూగులు కోర్కెలు శేపించే యీ లోకం!

మన్మథ పట్నం

మకరపతాకం మధురా రాగం - మన సంతోషం హాయి నిరాకటం
మన సయ్యాటలు పాటలు నీటులు నిరాఘాటం!
యీ మేదిని
నీవే-నా వలపుల రాణివి - నా మదనకామరాజువు నీవే
రాజుగ రాణిగ మనదే-మారుని రాజ్యం!
వెన్నెల పండుగలో
పాడెదనా ప్రేమ గీతికనీ చెవిలో-వికసించును నీ నవ్వులు నాయెదలో
మన ప్రణయం మన కాపురం పంచపక్ష పరమాన్నం!
అటులైతే
మన కింకేం కావాలి? - ప్రపంచం తల్లక్రిందులు కానీ
భూచక్రం యెటులైనా పోనీ!

ఆపాటకు జవాబుగా నేను: "కమలాక్షి నిన్నే కోరియున్నది కరుణింప మంచి సమయము స్వామి!" అని వర్ణం పాడితే—శాస్త్రి "ఇదేమిటి సానిపాట?" అని ముఖం తిప్పేశాడు — నాన్నలాగే శాస్త్రికూడా!

...యీ మధ్య సినీమాలో విన్న సంగీతమే జ్ఞాపకం వస్తూంది. సంగీతం వింటూంటే మత్తుమందు చల్లుతే మైకం కమ్మినట్టు నిద్దర-వచ్చేసింది. సంగీతం యింపుగా వున్నా - యేదో అవ్యక్త భావలీల తప్ప నవరసాల్లో యేరసం కూడా మనస్సుకి స్ఫురించలేదు - చిత్తానికి యేయితివృత్తమూ తోచలేదు. మన సంగీతానికి గొప్పసాంప్రదాయం వున్నా - వకవైపే వొరిగిపోయిన తాటి చెట్టులాగు కేవలం ఆధ్యాత్మికంగా పెరిగిపోయింది... శాస్త్రితో కలిసి నేను త్యాగరాజు కృతులు పాడి సంతోషిస్తాను. అతను లేనప్పుడు అతన్ని తలుచుకుని గీతగోవిందం పాడి ఆనందిస్తాను. కాని - దైనందిన కష్ట సుఖాలతో కాని పనిపాటలతో కాని, నా జీవిత ఆశయాలతో కాని, నేపాడే సంగీతానికి యేమాత్రమూ సంబంధం లేకుండాపోయింది. సంగీతం పాడి సంతోషించడమే కాని నరనరాల అనుభవించి ఆనందించడంలేదు. ఎంచేతో మరి? యీ పారిశ్రామికయుగం వచ్చాక మన సంఘం - మన రాజకీయం - మన జాతీయ జీవనం - మన దినచర్య - అంతా తల్లక్రిందులై పోయింది. సంగీతం మాత్రం కాలమానం అనుసరించకుండా - యే మార్పు పొందకుండా అలా నిల్చిపోయింది భక్తులచిత్తంలోనూ భాగవతుల చేతుల్లోను వుండిపోవడం చేతకాబోలును - మరీ వ్యక్తిగతంగా పరిణమించి నాబోటి సామాన్య ప్రజకి దూరం అయిపోయింది... హార్మోనియం గ్రామఫోను సినీమా రేడియో వచ్చాక కూడా - మన హావ భావాలని కాని మన ఆదర్శాలని కాని మన జాతీయతని కాని మన స్వతంత్రకాంక్షని కాని కళారూపంగా మన సంగీతం నిర్వహించలేక పోయింది. పరేకదా

చివరికి సత్యాగ్రహ సమరంయొక్క ఉత్సాహాన్ని ప్రతిధ్వనించే వృత్తాన్ని ఒకదాన్నైనా సృష్టించలేకపోయింది! మన పాటకజనం యొక్క గేయాలు పదాలు గానాలు ద్విపదలు పాటలు - వీట్లలోనుంచి సారం పటుత్వం గ్రహించి - ఆ సాంప్రదాయంమీదనే మన సంగీత కళని నిర్మించి వుంటే యెలా అభివృద్ధి పొంది వుండునోమరి!... సంగీతం అంటే సహజంగా పడిచచ్చిపోతాం మనం! అటువంటిది - సంగీతం యొక్క లక్ష్యమే మర్చిపోయి- మన భాగవతుల స్వరకల్పన కసరత్తులు - తీగలు మీటించే చమత్కారాలు- హిందుస్తానీ మట్లుల మెరుగులు - అపూర్వరాగాలకి ప్రాముఖ్యత యివ్వడం - పాత రాగాలకి కొత్తపేర్లు పెట్టడం - యిలా వృత్తవిద్వాంసుల పాండిత్యం క్రిందకీ లాక్షణికుల పరిశోధనల కిందకీ నగిషీచెక్కి జిలుగువెట్టే పనివాడితనంకిందకీ - దిగిపోతుందా? మన సంగీతమంతా సాంప్రదాయ సిద్ధమైన ప్రయోగాలతో కట్టుబడి పోవడం చేత రసాస్వాదన యే కొద్దిమంది "రసికుల" గుత్తధనంగానో మారుతోందా? పాట కచ్చేరీలకీ గానసభలకీ కాలక్షేపాలకీ డబ్బున్నవాళ్లు వేలాది వెళుతున్నా - కూలినాలి చేసుకునే సామాన్యప్రజ వాటికి దూరంగా వుండిపోతున్నారు - వాటినుంచి తప్పించుకు పోతున్నారేమో అనికూడా అనిపిస్తూంది నాకు! మన లలితకళలు అభివృద్ధి పొందాలంటే సామాన్య ప్రజే వాట్లని పోషించాలి - అంటే వాళ్ళ ఆర్థికస్థితి బాగుపడాలి. అంటే పూర్ణస్వరాజ్యం రావాలన్న మాట. శాస్త్రి ఇదంతా విప్లవం అంటాడు. రాజ పోషణ వుంటేనే కళావికాసంవుంటుంది - ప్రభుత్వపోష వుంటే కళ స్తంభించి పోతుంది - పామర ప్రజాపోషణ క్రింద కళ అసలే నశించి పోతుందంటాడు—అతను! మాయిద్దరి దృక్పథాలు యెంతవేరుగా వున్నాయి! ..

...సాహిత్యంకంటే స్వరమే ప్రధానం - అంచేతే సంగీతం సర్వమానవభాష అంటారు. అది నిజమే కనక అవుతే - నాకు పాశ్చాత్య సంగీతం అర్థం కాక పోవడమేమి?...హిందూ దేశంలో పుట్టి హిందూదేశంలో పెరిగిన శాస్త్రికి మహాబలేశ్వరపు చెక్కడాలు భువనేశ్వరపు ఆలయాలు అజంతా చిత్రాలు రామారావుగారి బొమ్మలు- అర్థంకాకపోవడమేమి?... నేను యూరపులో పాశ్చాత్య సంగీతం విని ఆ నియమాలు తెలుసుకుని ఆ సంప్రదాయాలు అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తాను. బాఖ్ మొజార్టు - బేథోవెన్ - బ్రామ్సు - వాగ్నరు - ఎల్గార్ - యీ సంగీత విద్వాంసుల పేర్లు ఎప్పుడూ ఇంగ్లీషు పుస్తకాల్లో చదువుతునే వుంటాం. వీళ్ల కళని బోధపర్చుకోవాలి. అంతేకాదు - పాశ్చాత్య దేశపు సంగీతవిద్వాంసులు కొంతమంది వాళ్ల దేశాల జాతీయతని జాతీయభావాలని జాతీయ ఆశయాలని జాతీయసంస్కృతిని శాశ్వతంగా సంగీతకళలో నిరూపించారని ఆ దేశాల చరిత్రలోను వాఙ్మయంలోను చదువుతాం - ఇటలీలో వెర్డీ, టోస్కానీనీ - పోలెండులో షోపిన్ - హంగేరిలోలిస్టు - రష్యాలో మూసార్గస్కీ, గ్లింకా, చైకోవ్‌స్కీ - చెకోస్లావాకియాలో స్మెటానా,

డోవ్రాక్ - ఇంగ్లండులో ఇథెల్ స్మిత్, వాన్ విలియమ్స్, రట్లాండుబౌటన్ - వీళ్ళభావాలు విశిష్టత నేను ముఖ్యంగా తెలుసుకోవాలి . . .

. . పాపాయికి పదేళ్లువచ్చాక అప్పుడు దానికి సంగీతం నేర్పించడం మొదలెడుతాను. నాకింకా నాలుగుబర్లగుణింతం వచ్చిందో లేదో అప్పుడే నాన్న నాచేత సంగీతం మొదలెట్టించారు. నాన్న తెల్లవారుఝాము మూడుగంటలకే నన్ను నిద్రలోనుంచి లేపేసి చన్నీళ్లతో ముఖం కడుక్కోమనేవారు అమ్మ కుంపటి రాజేసి వేడినీళ్లు యిస్తానంటే—చలికణుకులో కంఠానికి మంచి వొడుపు వొస్తుంది - వేడినీళ్లు ఇవ్వవాటం కాదనేవారు నాన్న! గడియారం దగ్గర పెట్టుకుని నేను సాధకం చేస్తున్నంతసేపు ధరణా కూచునేవారు - ఆయన జపం చేసుకుంటూ మళ్లీ ఆరుగంటలకి ఆయన మడి స్నానానికి లేచేవరకు! నాకేమిటి యీ కఠినశిక్ష అని యేడ్చుకునేదాన్ని! సాయంకాలం నాలుగు గంటలకి బడినుంచి రాగానే సంగీతం గురువుగారు ప్రత్యక్షం. నా కంటికి ఆయన యముడిలా కనొచ్చేవాడు. ఫిడేలు పెట్టెని చూస్తే నల్లగా దయ్యం లాగే కమాను యమపాశంలా వుండేది. అపస్వరం నానోట వస్తే గురువుగారు కమానుతో చురుకు చరిచేవారు. పాఠం నేర్చుకుంటూన్న రెండుగంటలూ నరకూపం-యమయాతన అనుభవించేదాన్ని! రాత్రి పడుకోబోయేటప్పుడు - తెల్లవారుఝామున చలిలో లేవాలే భగవంతుడా - అని యేడుస్తూ నిద్దరోయేదాన్ని. రెండు మూడు సార్లు - "నాన్న నన్ను చితకకొట్టేసినా సరే యిక సంగీతం నేర్చుకోవడం మానేద్దాం" అని నిశ్చయం చేసేసుకున్నాను కూడాను. సంగీతంలో నాకేమాత్రం అభిరుచి తక్కువగా వున్నా స్వస్తి చెప్పేసేదాన్నే. సంగీతపాఠాలన్నా సాధకం చెయ్యడం అన్నా అంత కష్టంగా వుండేది. పాపం - నా పదోయేటకే చచ్చిపోయారు నాన్న అమ్మ మాత్రం - యెందరేమన్నా - చదువూ, సంగీతం కొసవరకూ చెప్పించింది! . . . పాపాయి అల్లా కాదు. ఇంట్లో అది కాగితాలు చించుతూన్నప్పుడూ, పెన్సలుతోనూ, సుద్దముక్కలతోనూ గీతలు పెడుతూన్నప్పుడూ బొమ్మలతో ఆడుకుంటూనప్పుడూ మెల్లిగా సంగీతం వాయిస్తూంటాను. కిండరు గార్టెనులో నృత్తం చెప్పినప్పుడూ కసరత్తు చేసినప్పుడూ వెనక వాయిద్యం లయ వుంటునేవుంటుంది. దానికి పదేళ్లొచ్చే వరకూ సంగీతం చెప్పించకుండానే - మంచి సంగీతం దాని చెవిని పడేటట్టు గ్రామఫోనూ రేడియో పెడుతుంటాను. అప్పటికి తెలిసిపోతుంది దానికి సంగీతంలో సరదా వున్నదీ లేనిదీ. పిళ్లారి గీతాలు చెప్పించి నాలుగు నెలలపాటు సంగీతం ఆపుచేస్తాను. దానికి నిజంగా ప్రవేశమే గనుకవుంటే అదే నన్నడుగుతుంది: "సంగీతం నేర్చుకుంటానే అమ్మా!" అని. "బడిపాఠాలకి అడ్డుగస్తుందేమో అని సంగీతం గురువుగారిని మానిపించేశానే" అంటాను. "అదేమిటే! సంగీతంకంటే బడిపాఠాలే ముఖ్యం అని యెవరు చెప్పారే? సంగీతం నేర్చుకోకపోతే నేను వుండలేనే!" అని అదే అవాలి . . సంగీతంలో

అభిరుచి వుండాలి. నేర్చుకుందాం అన్న సరదా వుండాలి సాధకం చెయ్యడానికి ధ్యాస్నం పట్టుదలా వుండాలి. రెండు గంటలసేపు కూచుని పాడడానికి తగిన ఆరోగ్యం వుండాలి. అన్నింటికంటే ముఖ్యం - సహజమైన ప్రవేశం వుండాలి. సరిగమలు పాడినా సరళీ స్వరాలుపడినా - పిళ్లారి గీతాలు పాడినా - వర్ణాలు పాడినా - కృతులు పాడినా - తిల్లానం పాడినా - రాగం ఆలాపనచేసినా - సంతోషం ఉత్సాహం వుండాలి. ఇవన్నీ వుంటేనే సరస్వతీ ప్రసన్నం!

ఝూన్సీ...రైలు ఆగింది. ప్రయాణీకులు కొందరు బండి దిగి ఫలహారపు దుఖాణానికి వెళుతున్నారు...వకతను పూరీ బంగాళాదుంపకూర కొనుక్కొని ఆసమ్మర్దంలోనించి బైటపడి వస్తూండగా - పాపం అతని చేతిలోనుంచి ఆ వస్తువులని గద్దవకటి తన్నుకు పోయింది. అతను యెంతో చికాకుపడ్డాడు. ఆ దృశ్యం గయోపాఖ్యానంలో పద్యం జ్ఞప్తికి తెచ్చింది. "జలనిధులింకుగాక - కులశైలము లేడును గ్రుంకుగాక..."

అది శపథం కాదు. జీవ శక్తుల ఘోష. పరిణామశక్తుల ప్రవచనం!..

...అర్బుద అవ్యయ అచింత్య అమేయ పరార్థాల పూర్వము - పృథ్వి ఒక దేశకాల అవిరతిక నిరంతరం. ఆపస్సాక అవ్యక్తశక్తి తాండవం. తేజస్సాక మహో గ్రతాపకాంతి వాయు వోకవిశ్వకిరణ తరంగం. ఆకాశం వక తారాగ్రహద్రవ్య మేఘం. ...మహాశంఖ మహానిధి పరార్థాలు గతించాయి. విశ్వాంగం వక చతుర్థావిస్తృత ప్రదేశం. గగన పథాన్న గ్రహగోళాల చెండ్లాట. నక్షత్రకోటి రాశికోటి సూర్యకోటి ప్రచండవేగ భ్రమణం - ధూమకేతు బృహత్తారల సంఘాత నిర్ధూమధామం... అచ్యుతకోటి కల్పాలు గడిచాయి. ఇరవైయేడు నక్షత్రాలు - ద్వాదశరాసులు - నవగ్రహాలు అస్తమించాయి. అష్టదిక్కులు అంతర్ధానం అయాయి. భయంకర ప్రళయం. ఊర్ధ్వలోకాలూ అధోలోకాలూ మునిగిపోయాయి. అష్టవర్ష పర్వతాలు కూలిపోయాయి. నవవర్షాలు మాయం అయాయి. దుస్సహమైన శీతలం. సర్వం హిమాచలం ..అనంతకోటి అవ్యయకోటి శతాబ్దాలు అంతరించాయి. విశ్వమొక బడబానలం. శతకోటి సూర్యులు భూతలంపై విద్యుత్తాగ్ని వర్షించారు. హేమాద్రి కరిగిపోయింది. మంచు బెరళ్లు జలపాతములైయాయి. పుణ్య నదులు పొంగిపోయాయి. పర్వతాల్లాంటి కెరటాలతో సముద్రం మథనం అయింది...మహాభూరిపరార్థాలు పూర్తిఅయాయి. ప్రహాండమైన భూకంపం. అగ్ని పర్వత పంక్తుల రౌద్రజ్వాలాలు. పంచభూతాల కోలాహలం. ఝంఝూమారుతం. ప్రచండ ప్రళయ భీభత్సం. భూగోళం బ్రద్దలైంది. భూపటలం పటాపంచలైంది. బ్రహ్మాండంనుంచి వసుధ ఉద్భవం. సప్తపర్వతాలు వసుధ గర్భంలోనుంచి పుట్టుకొచ్చాయి. సప్తద్వీపాలు సప్తఖండాలు సృష్టిఅయాయి. సప్త సాగరాలు యేర్పడ్డాయి...మహా పర్వ సాగరయుగాలు నడిచాయి. ప్రాణ పరమాణువు. జీవ బిందువులు. క్రిమికీటకాలు. నాచులు, పాచలు, మహారణ్యాకి

కారణ్యాలు, మీనులు, తిమింగిలాలు, ఫణిరాజులు పక్షిరాజులు, నాగపతులు, గండ భేరండములు, భయంకర మకరములు, మహిషాసురులు, గజరాజేంద్రులు, హనుమంతులు, వానరులు, నరవానరులు, వానరనరులు, నరులు ... ఒండొరుల పోరాటం. ఒకరి నొకరు వేట - సంఘాతం - సంచారం - సమరం - మరణం - వినాశం ... ఇదే జీవశక్తి లీల - ప్రాణశక్తి క్రీడ - చైతన్య శక్తికేళి - పరిణామశక్తి పురోగమనం.

వేదవాక్యం: "ఆకాశాః ద్వాయుః - వాయోరగ్నిః - అగ్నేరాపః - అద్భ్యాం పృధివై - పృధివై ఓషధయః - ఓషధేభ్యో అన్నః - అన్నాత్పురుషః" ... పరిణామ శక్తుల పురోగమనక్రమమా? లేక పరిణామ శక్తుల వికటాట్టహాసపు పట్టీలు అంతర్లన్నా? పురుషుడికీ-అన్నానికీ, పురుషుడికీ - ప్రకృతికీ, పురుషుడికీ జీవకోటికీ, పురుషుడికీ-పురుషుడికీ, సంచలనం - సమరం - పోరాటం - బలవంతుని విజయం. సామరస్యం ? శాంతి ?

...శాంతి యెక్కడవుంది? పంచభూతాలకి పంచప్రాణాలకి అది అంతంలేని సంకుల సమరం. జ్ఞానేంద్రియ పంచకానికీ పంచేంద్రియపంచకానికీ యెడతెగని పోరు. ప్రభు శక్తిఅయుధశక్తి అర్థికశక్తులొకవైపు-ఉత్సాహశక్తి మంత్రశక్తి ప్రజాశక్తులొకవైపు. యీ శక్తిత్రయాల రెంటికినిరంతరవైషమ్యం-బలాబలాలపోరాటం. మల్లయుద్ధంలో పేచీలు. పేచీ లకీ పేచీలకీ మధ్య - దమ్ములు తీసి - ఊపిరి బిగించి - సత్తువ కూడవేసుకోవడానికి-లిప్త పాటు శాంతిసమయం! త్రాసులో యే తక్కెడ బరువైనా శాంతికి భంగమే - యుద్ధమే. యీ వూగిసలాటలో ఆ త్రాసుముల్లుకి నిలకడేది - శాంతేది ? ప్రజకూ ప్రభువుకూ - సత్వానికీ రజోతామసాలకీ - యుద్ధం జరుగుతూండ వలసిందే...

శాంతియుత పరిణామం?... జీవశక్తి పురోగమనం?... వానరలు - నరవాన రులు - వానరనరులు - నరులు - నరోత్తములు - నరనారాయణులు...?! మానవ శక్తికి సాధ్యము! తథ్యము!... అంతర్జాతీ జానపదపరిపాలన? దరిద్రం దాస్యం పరపీడనం లేని మానవసమాజం? తరగతులు నశించిన నూతన నాగరికం?... ఇదే ధర్మ సంస్థాపన. "పరిత్రాణాయ సాధూనాం - వినాశాయచదుష్కృతాం - ధర్మసంస్థా పనార్థాయ - సంభవామియుగేయుగే" ... ధర్మసంస్థాపనతోనే శాంతి. అంతవరకూ ప్రపంచానికీ - ప్రజకీ - వ్యక్తికీ - ఆత్మకీ - శాంతి వుండదు.

...నేను మనశ్శాంతికోసం దేశ ద్రిమ్మరినై తిరిగేను. కాశ్మీరంలో చూసిన దృశ్యాలు కళ్ళముందర కొస్తున్నాయి: కష్టించి నేల దున్నేవాడివీ - వున్ని కంబళ్లు పాష్మీనాలు నేసి బతికే సాలివాడివీ - కాగితం ముద్దతో కళాకౌశలం వినియోగించి జీవించే కలంకారివీ - ధనికుల ఆనందకోసం జబ్బకష్టంతో తెడ్డువేసే పడవవాడివీ -

అందరిదీ ఒకటే అధోగతి! ధారాపాతంగా కురిసే కుంభవృష్టిలోనూ - హేమంతంలో పడే మంచు వర్షంలోనూ - అందరూ ఆ మట్టి బొరియల్లోనే తల దాచుకోవాలి!... చెన్నపట్నం చేరీలలో - కలకత్తా బస్తీలలో - ఢిల్లీ మొహల్లాలలో - నిత్యం చూస్తున్న సంగతులే జ్ఞాపకం వస్తున్నాయి... వేలాదివేల కుటుంబాలు రాజమార్గపు చపటాలమీదే కాపురాలు. రహదారులే వాళ్ళకి పట్టుపాన్పులు. మెట్లింగురాళ్లు కంకర గుట్టలే వాళ్లకి హంసతూలికా తల్పాలు మచ్చుకైనా ఒంటిమీద నూలుపోగు లేని పిల్లలు చెత్తకుప్ప నుంచి కుళ్లిన మాంసపు ముక్కలని - యీగలుముసిరిన చేపతునకలని - పుల్లిస్తరాకులో మెతుకులని - యేరుకుని తింటున్నారు... పొద్దుగూకులూ కష్టించితే అర్ధరూపాయి ఆర్జన! పదిరూపాయలు వీళ్లకి పెన్నిధి. పట్టెడన్నమే బ్రహ్మ స్వరూపము! యేమి బతుకు - యేమి జన్మ! నేను సత్యాగ్రహ సమరంలో దెబ్బలు తిన్నది - నా శాస్త్రి నా పాపాయి కోసమా - లేకపోతే వీళ్ల కోసమా? వీళ్లందరు భారతమాత సంతానమే! "సుజలం – సుఫలం - మలయజ సీతలం – సస్య శ్యామలం" ? వీటన్నిటికీ - రత్న గర్భయైన భరతమాత ఐశ్వర్యానికీ – వీళ్లుకూడా నాతోను నా శాస్త్రితోను నా పాపాయితోను సమాన వారసులే! వారి వారసత్వాన్ని యెవరు అపహరించారు? నేనా... నాలాగు ఇహ సౌఖ్యాలు అనుభవించే వాళ్లందరూనా ?...నా సానుభూతి వీళ్లకేమి వుపకరించ గలదు? జాలిగుండె పడే వేదన రోదనలు - మొసలి కన్నీటి వరదలు - చేతకాని ఛీత్కారం - వీట్లలోనుంచి పుట్టే దరిదాపులేని నిరర్థకమైన భావలోలత్వపు వూబిలోను - వేదాంతంయొక్క యెడారి యిసుకలోను - ఇబ్బెను స్పిందుబెగ్గుల నిస్పృహా నిరాశ నిస్సహాయత రొంపిలోను - పడిపోకే - నేను మరి కార్యరంగంలోకి తేలలేను. దరిద్రమే మహా పాతకం - దరిద్రంవల్లే మూర్ఖం క్రూరత్వం అధోగతి అజ్ఞానం. దరిద్రాన్ని నాశనంచెయ్యాలి. దరిద్రాన్ని నిర్మూలం చెయ్యాలి...

నేను మానశ్శాంతికోసం దేశాటనం చేశాను. శాంతి యెలాగ లభిస్తుంది? ఆకాశానుంచి అమృతం వర్షించినట్టు - మగ్గిన మామిడిపండు వళ్లోపడినట్టు - శిష్యుడి చెవిలో గురువు పంచాక్షరీ మంత్రం వూదినట్టు - లభించదు శాంతి. ముప్పై మూడు కోట్ల సోదరప్రజకిలేని శాంతి నా కెలాగొస్తుంది? వాళ్లను యీపూట రెక్కాడితే నేకాని కుండనిండదు. వాళ్లకి గంజే పానం - అంబలే అమృతం. బురదనీళ్లే కర్పూర నీరాజనం దినం వకగండం. నిత్యమూ సమరం. ఆ సమరంలోనే యేమి శాంతి అనుభవించినా! వాళ్ల మధ్యనే వున్నాను నేను. వాళ్లలాగు నేనూ కష్టజీవిని - బానిసని- భరతమాత కడుపున పుట్టిన దాన్ని. సమర భూమిమీద - వకప్పుడు సొంపుసిరులు పొంగిన యీ జీవగడ్డమీద - యీ నాడు పరులకు బలియై దాశ్యరక్తంతో నింకిన భారతమట్టిమీద - నా కాళ్లు రెంటిపైని స్థిరంగా నిలబడి - స్వాతంత్ర్యంకోసం రామ రాజ్యంకోసం - శాంతికోసం - అంతిమ సత్యాగ్రహం సాగించాలి. నేను ఇంగ్లండులో పర్యటించే టప్పుడు అరమరుక లేకుండా-యేమరుపాటున కూడా యీ మాట

మర్చిపోకూడదు. బహుపరాక్కున పడిపోతే దేశద్రోహినై పోతాను. భారత ప్రజానీకానికే శత్రువునై పోతాను...

కల్యాణ్: దూరాన్న బొంబాయి కానొస్తూంది. ఇనుప పరంజీల అడవులు - ఉక్కు స్థంబాలతో రాగితీగెలతో పద్మవ్యూహాలు! అగ్నిపర్వత పంక్తుల్లాగు-పొగలు కక్కుతున్న వేలాది ఫ్యాక్టరీ గొట్టాలు! ఆ నలుపులో బాలసూర్యుడికి గ్రహణంపట్టింది! ఆ కారు పొగల్లోనుంచి - తళుతళుకుమంటూ వజ్రాలూ బంగారపు కాసులూ - నల్లటి చమట చుక్కలూ - యర్రని రక్తబిందువులూ - నేలని రాలుతున్నాయా?...

సామానులు సర్దుకోవాలి. పెట్టె. పరుపు. అంతే రెండు నిమిషాల పని. సామాను బెడద లేదు. కాని - నేను బైరాగిని కాను. నాకు వైరాగ్యము లేదు. అష్టసిద్ధులు పొందలేదు. స్థితప్రజ్ఞత్వం కుదురలేదు. సరేకదా - అందుకు నేను పాటు లాడనూ లేదు. అందరి మనుష్యమాత్రుల్లాగే నేను సామాన్యస్త్రీని ఈ సామాన్యప్రజే భారతమాతకి వెన్నుపూస. వాళ్లకష్టసుఖాలే ఆమె కష్టసుఖాలు - నా కష్టసుఖాలున్నూ. వాళ్లలాగే నేనూ రాగద్వేషాలని విడువలేదు - విడువను కూడాను. వాళ్లలాగే నేనూ సంసార సౌఖ్యంకోసం దేవుళ్లాడుతాను. సర్వసుఖాలకోసం ఆశపడుతాను. నాకు దేశంమీద భక్తి - సంసారం అంటే సంతోషం - సుభమీద వాత్సల్యం - పాపాయి అంటే ప్రేమ - శాస్త్రిమీద మోహం. ఆనందమైన మనుగడ భ్రమకాదు - ఇహం - భ్రాంతి కాదు - ఇదే వాస్తవం... అయినా - స్వార్థత్యాగులు - విరాగులు - అతీతులు - అయిన నాయకుల క్రింద పనిచేయడమా అని అనుమానం కాని అభిజాత్యంకాని నాకు లేదు. "ఎందరో మహానుభావులు - అందరికీ వందనములు!" మహానుభావులందరిలోనూ మహానుభావుడైన మహాత్మునికి సాష్టాంగనమస్కృతులు అర్పిస్తున్నాను. ఆయన నామం స్మరిస్తూనే దెబ్బలుతిన్నాను.

...సామానులు కట్టేశాను. మరోగంటయింకా వ్యవధివుందని చెప్పినా వినకుండా పాపాయి సుభ శాస్త్రికోసం రైలు కిటికీలోనుంచి తొంగిచూస్తున్నారు! నేనూ వుండలేకుండా వున్నాను - అతని కంఠస్వరం చెవినిపడేదాక - అతని ప్రేమలోలీనం అయిపోయేదాక - అతని కౌగిట్లో కరగిపోయేదాక...!

[illegible]

## అతడు

ఆదివారం బొంబాయి చేరుతూన్నట్టు శాంతం టెలిగ్రాం వేసింది. అబ్బ ఇప్పటికి నాకు బెంగ తీరింది!

ప్రయాణం ఖర్చులకోసం పదివేలున్నా యూరపులో ఖర్చులకోసం యాభై వేలున్నా మొత్తం అరవై వేలకీ చెక్కు వ్రాసి బ్యాంకునుంచి డబ్బు తీసేసరికి ప్రాణం చివుక్కుమంది! కష్టార్జితం అలాఅనిపిస్తుంది. నాలుగు రోజులై వకటే వీడ్కోలు విందులు అన్నిటి గురించి శాంతంతో పూసగుచ్చినట్టు చెప్పాలి. ఈ యెన్నికల కుతంత్రాలు - యిప్పటినుంచీ రాబోయే మంత్రివర్గాన్ని కూడ కట్టేందుకు మంత్రాంగం - యీ సమయంలో నేను వుండక పోవడం నాకు చాలా కష్టంగా నేవుంది. కాని నా స్నేహితులకి అమిత సంతోషంగా వుంది - వకపోటీ దారుడు తగ్గినా తగ్గడవేమే నని! ఆ విందుల్లో అంతరార్థమే అది!

షెవర్లెట్టు కారు టాక్సీ కంపెనీకి అమ్మేశాను. ఫ్యాకార్డు పురుషోత్తమం వాడు కొనుక్కున్నాడు. వెనక తను రైతులమీద క్రోధం కొద్దీ పెట్టిన కేసుల్లో గెలిపించినా నా ఫీజులో రెండువేలు ఎగగొట్టి నా నోట్లో నే కరక్కాయ కొట్టినందుకు - ఆ రెండు వేలు యీ కారు అమ్మకంలో లాగేశాను! వీళ్లకి మనుష్యుల మీద మోజుండదు - యెంత సేపూ కార్లమీదే మోజు. కృతజ్ఞత అంతఃకరణ లేని వాళ్లు. తగిన శాస్తిచేశాను! బంగాళా అద్దెకిచ్చేశాను - మళ్లీ ఆ సినీమా వాళ్లకే. తారలు యిద్దరూ కళంకం వొచ్చి కాబోలు కొంచెం వెలవెల బోతున్నారు. బ్రహ్మచారి దర్శకు లిద్దరూ ముదిరిన బెండ కాయలయారు!

...నన్ను సాగనంపడానికి అందరూ సెంట్రలు స్టేషను కొచ్చారు. భాష్యం తన కారుమీద నన్ను స్టేషనుకి తీసుకొచ్చాడు. సుబ్రహ్మణ్యం లేడీ అయ్యంగారూ శాంతాన్ని మరీ మరీ అడిగేమని చెప్పమన్నారు. యీ నూతన దాంపత్యం వచ్చాక అతను ఉత్స విగ్రహం లాగున్నాడు! ఆవిడ సౌందర్యం మరీ కొట్టొస్తున్నట్టుంది! కళ్ళని పొడుస్తూంది అవిడ వొయ్యారం! రైలు కదలుతూంటే: "భారసాల వేళకల్లా శాంతం మీరూ రావాలి సుమండీ శాస్త్రిగారూ!" అంది. శాంతంతో యీ విశేషం చెప్పాలి!

రామస్వామి - పదిమంది మల్లవరం కంబార్లు - రైలు కొచ్చారు. "ఈ అనాథ పశువుల ప్రాణాలు మీ చేతిలో వున్నాయి. వాళ్ళని రక్షించాలి సుమండీ!" అని నమస్కరించి "మా సిబిరం వారందరి తరఫున శాంతం గారికి నమస్తేలు చెప్పండి - గాంధీ మహాత్మాకు జై!" అన్నాడు. హరిజన రైతులు పదిమందీ నా కాళ్ళమీద పడ్డారు. "తాత ముత్తాతల కాలంనుంచి మా చమట చుక్కలతో ఆ మడి చెక్కలని తడుపుతూ కవిపెట్టుకున్నాం - బాబూ! యేలినవారు మమ్మల్ని నా మట్టిమీద నిలబెట్టించాలి!" అంటూ వాళ్లు వాళ్ళ చేతులతో నా జోళ్లు కళ్ళకద్దుకునే సరికి నా వొళ్లు జజ్జరిల్లిపోయింది. "యేం పరవాలేదు! నే నున్నానుగా-మీకేం భయపడకండి!" అని వాళ్ళకి అభయం యిచ్చాను. పాపం ఆ అనాథ ప్రేతలని చూసి జాలేసింది.

నా జూనియర్లు అశ్వద్ధ నారాయణమూర్తి, రామన్, కురువిళ్ళ, తీర్థగిరి - పెద్ద పువ్వులదండ వకటి మోసుకొచ్చి నా మెడలో వేశారు. అంతటితో వూరుకున్నారా! పదిపదిహేను గళాసుల్లో సోడాలు పోసి-జేబుల్లోనుంచి చిన్న హోమోపతీ సీసాలుతీసి-దాంలో నించి ఒక్కొక్క చుక్క సోడాల్లో పోశారు. "ఏమిటది?" అన్నా. "సోడాలోని కల్మషాన్ని శుద్ధి చేయడానికి జాన్ ఎక్షావారి ద్రాక్షాసవం!" అన్నాడు తీర్థగిరి. అశ్వద్ధ నారాయణమూర్తి తన గళాసులో రెండు చుక్కలు నేలమీద పోసి- "ఓం! సుమిత్రియాన ఆపఓషదయ స్సంతు - దుర్మిత్రియాః తస్మైస్సంతు!" అంటూ అందరికీ గళాసులు అందజేశాడు. దాంతో కురువిళ్ళ: "కాబోయే సుప్రీము కోర్టు జడ్జి గారికీ జై!" అంటూ గడగడ త్రాగేశాడు. వీళ్ళందరికీ నేనంటే యెంత అభిమానం!

ఊర్వశికూడా వచ్చింది. చక్కని చుక్కలాగు తయారై - నన్ను సాగనంపడానికి! నే నిన్నాళ్లున్నా గమనించలేదు - ఊర్వశి బుగ్గని చిన్నలొత్తుంది. "సెక్కిట సిన్నిమచ్చ - సెప్పితే సాలదు లచ్చ" అన్నట్టు ఆమె నవ్వితే యెంతో అందంగా వుంది! దగ్గిరకొచ్చి అంది: "మీరు నిరాకరించిన స్థానానికి మాపక్షం వాళ్లచేత మరి వకరిని నిలబెట్టించాను"

"ఎవరిని?" అని అడిగే.

"నామధేయం-ఊర్వశిమిత్ర. వృత్తి-మెరీనామీద పర్యటనం! సాకీను-రాయపేట మద్రాసు!" అంది.

సోడా పుచ్చుకొని చెవిలో అంది: "శాస్త్రిగారూ! ఇక అంతా మామూ పృథగమే!" అమ్మామ్మా! గడుసుదనం అంటే అలాగుండాలి! రాజకీయం అంతా లావాదేవీ క్రింద మార్చేసింది. చాకచక్యం—చాకచక్యానికి తోడు అదృష్టం - కలిపి రావాలి!

"శాంతానికి నా ప్రేమ తెలుపండేం!" అని కేకేసింది - రైలు కదులుతూంటే చేతితో ముద్దులు విసురుతూను!

...రైలు రాయచూరు దాటింది. ఇంకా రెండురోజులు ఓపికపట్టి వుండాలి శాంతాన్ని చూసేదుకు! శాంతం యీ పాటి డిల్లీచేరుకుని సాయంత్రం బయలుదేర తుంది బొంబాయికి... శాంతానికి ఇంగ్లండంతా చూపిస్తాను. లండనులో బ్రిటిషుపార్లమెంటు భవనానికి తీసుకెళ్లి ప్రజాస్వామ్యంయొక్క జన్మస్థానం చూపిస్తాను. నిజంగా చూస్తే - కన్సర్వేటివు ప్రభుత్వం క్రిందే సోషలిజం జయప్రదంగా ముందుకు నడుస్తూంది. తన కళ్లతో తనే చూస్తే శాంతానికి తెలుస్తుంది. సత్యాగ్రహం - సత్యాగ్రహం అని బండతనం పట్టం పనికొస్తుందా? రాజకీయంలో అన్నిటికీ తయారయి వుండాలి. అందుతే తల - లేకపోతే కాళ్లు! యీ రహస్యం శాంతం బోధపర్చుకోదు! బ్రిటిషువాడి చేతిలోనుంచి అర్ధస్వరాజ్యం యెలాగ లాగేలాగేం. ఆ మిగిలిన సగమున్నూ అవలీలగా కడుపులో చల్ల కదలకుండా హస్తలాఘవంచేసి లాగేయ్యాలి అంటే - దొంగ వాకిట్లో మంచం వేసినట్టు - వాళ్ళు అవలంబించిన పంధానే మనమున్నూ అవలంబించాలి. అంటే - పార్లమెంటు, కామన్సు, లార్డ్సు, మంత్రివర్గం, కాబినెట్టు, సెక్రెటరీలు, లార్డుఛాన్సలరు, ప్రీవీకౌన్సిలర్లు, సోలిసిటర్ జనరలు, అటార్నీ జనరలు, - మనంకూడా అన్నిటికీ నకనకలు తయారు చేసి రంగంలో పెట్టాలి. అప్పుడు మనని మెచ్చుకుని వాడే పారేస్తాడు పూర్ణ స్వరాజ్యం.

...శాంతానికి షేక్స్పియరు పుట్టిన వూరు చూపిస్తాను. స్కాట్లండులో మెల్రోజు అబ్బేకి తీసుకెళతాను యేకాంత సరస్సుల దృశ్యాలు చూపిస్తాను. లండనులో ఓల్డు విక్ - శాడ్లర్సువెల్సు - లిటిల్ థియేటర్లకి వెళతాం. సిబిల్ థారన్డైకు, జోసెకాలిన్సు, నోయల్ కవర్డు, సి. బి. కాక్రేన్ - వీళ్ల నాటకాలని చూపిస్తాను. గిల్బర్టు అండు సల్లివన్ను నాటకాలకి తీసుకు వెళ్లి పొట్ట చెక్కలయేటట్టు నవ్విస్తా! మా ప్రేమ శాంతాన్నీ నన్నూ ఎలా బంధించేసిందో సంగీతాభిమానంకూడా మమ్మలినిద్దరినీ అలాగే బంధించేసింది. నాకదొక గొప్ప సంతోషం! క్వీన్సుహాలు ప్రోమినేడు కచేరీలకీ ఆల్బర్టుహాలు కచేరీలకీ కలిసి వెళుతాం. ఆ ఇంగ్లీషు వాగ్గేయకారులని - బీచాము, వుడ్సు, సార్జెంటుగార్లని - చూసి శాంతం ఆశ్చర్యపడక మానదు! కవెంటుగార్డెను గ్రాండు ఓపెరాకి వెళుతాం! ఒక్కసారి వెయ్యిమంది గాత్రజంత్ర సమ్మేళనం వింటే శాంతం తన్మయం అయిపోతుంది. క్రైస్లరు - పాడెరెవ్స్కీ - కరూసో - సాలియాపిన్ - హైఫెట్జు - మెనుహిన్ను - వీళ్ళ సంగీత కాలక్షేపాలకి తీసుకువెళతాను. క్రాయిట్జరు సొనాటాయొక్క రాగచ్ఛాయలు - మూనులైటు సొనాటాలోని ప్రేమతరంగాలు - బాఖ్ భక్తిరస గానామృతం - బేథోవెన్ను తొమ్మిదో సింఫొనీలోని నాదభావాల జిలుగు అల్లికలు - షూబర్టు ప్రణయ గీతాలతనాలు - మోజార్టు సంగీత ప్రబంధాలు - వాగ్నరు విప్లవ గర్జన స్వరాలు - స్ట్రాసు నాదశబ్దస్వర భీభత్సం - డీబుస్సీ వెండిమువ్వల స్వరజతులు - గర్ష్విన్ నీగ్రో కూనిరాగాల గమకాలు - వీటిని వింటే - శాంతం త్యాగరాజుగారినీ

దీక్షితులవారినీ శ్యామశాస్త్రిలవారినీ మరి మూలపెట్టేసి గుంటపెట్టి గంటవాయించేస్తుంది! ఆ ఉత్సాహంతో మన సంగీతంలో కొత్త మార్పులు నూతన ప్రయోగాలు ప్రయత్నిద్దాం అంటుంది తప్పకుండా... ఒక్క జాతికే చెందిన రెండు మూడురాగాలు కలిసి పాడితే యెలాగుంటుందో? ఒక్క రాగమే వేరువేరు స్థాయిల్లో యేక సమయంలో నలుగురు పాడితే యెలా ధ్వనిస్తుందో? సాంప్రదాయం అంటే చెవి కోసుకునే వాడిని నాకే యీ విప్లవ బుద్ధులు పుడుతున్నాయే! అయినా నేను మొదటిదగ్గిరనుంచీ- తెలుగువాడిదీ తెల్లవాడిదీ -న్నింటిలోనూ మిళితం చెయ్యాలీ అని చెవికోసిన మేకలాగు అగుస్తునే వున్నాను. కాని నాగోడు వినేవాడెవడు - ఈ ఉద్యమం రోజుల్లో? మీదుమిక్కిలి నన్ను దేశద్రోహి అని తిట్టిపోశారుకూడాను! ఎప్పటికేనా-నా దారికే వచ్చితీరాలి. లేకపోతే మన కళలకీ మనకీకూడా మోక్షం లేదు...

...సంగీతం చక్కగా యెరిగినటువంటి వాళ్లు పాడుతుంటే కానీ ఖర్చులేకుండా ఆనందం పొందొచ్చు - కళనీ అభివృద్ధి చెయ్యొచ్చు. అయితే - నాకూ శాంతానికీ యిచ్చినట్టు - దేముడు అందరికి గాత్రం యిచ్చాడా? సుభ కేదానా వాద్యం కొందాం అని శాంతం నన్ను బలవంతంచేసి మౌంటురోడ్డు యీడ్చుకుపోయింది. ముప్పాతిక కొత్త ఫిడేలు ఒక మోస్తరుది ఎనభై రూపాలకి తక్కువ లేదన్నాడు దుకాణదారుడు. రెండు వందలకి లోపు వీణే లేదన్నాడు. అదైనా పురమాయిస్తేనట - బంగీరవాణా ఖర్చులు అదనం అన్నాడు. ఇంత ధరలుపోసి ఆపాటి యీపాటి సంసార్లు యెవరు కొనగలరు? నేను పెదిమవిరగడం కనిపెట్టి: "హార్మోనియంకొనండి - ఇరవైరూపాయిలకి జంటస్వరాలది పెద్ద పెట్టె యిస్తాను" అన్నాడు కొట్టుఅతను. శాంతం వద్దుఅన్నా సంగీతపు పెట్టె కొనేశాను - చక్కగా కావిడి పెట్టెఅంతవుంది. అంతచవకగా వుండి అందరి అందుబాటులో వుండబట్టే - హార్మోనియం సర్వజనామోదంగా వుంది. అయినా మానసంగీత విద్వాంసులు కళారాధకులు వకవైపు హార్మోనియాన్ని ఉపహ్యించుకుంటూనే - మరోవైపు సాక్సోఫోనుని ట్రోంబోనునీ మానసంగీతంలో వాడుక చేస్తున్నారు. హార్మోనియాన్ని ఏవగించుకోవడం మానేసి - జనసామాన్యం యొక్క ఆర్థికస్థితిని తెలుసుకుని - అందరికీ అందుబాటులో వున్న యీ వాద్యంకోసం ప్రత్యేకంగా సంగీతాన్ని సృష్టించివుంటే సంగీతకళని సామాన్యులకి అందించివుందురు... మరోకటికూడా నాకనిపిస్తూంది. ఒక్కొక్క వాద్యంలో వుండే ఉత్కృష్టత విశిష్టత చూపించేందుకు - పాశ్చాత్య శాస్త్రజ్ఞులు - పియానోకోసం, ఫిడేలుకోసం, క్లారియోనెట్టుకోసం, ఆర్గనుకోసం, బ్యాండుమేళంకోసం - ఒక్కొక్కదానికి ప్రత్యేకంగా సంగీతం వ్రాసినట్టు - మన విద్వాంసులుకూడా - హార్మోనియంకోసం ప్రత్యేకంగా సంగీతాన్ని వ్రాస్తే యెంతో బాగుంటుంది. అప్పుడేకదా. నిజంగా కవిత్వంకంటే సంగీతమే అతీతం అవడం.

...శాంతాన్ని ముఖ్యంగా పారిశ్రామిక కేంద్రాలకి తీసుకెళ్ళి ఇంగ్లండుయొక్క సిరిసంపదలని చూపిస్తాను. లాంకషైరులో ఉన్నిపత్తి మిల్లులని చూస్తే ఖద్దరు వెర్రి

కొంత తగ్గుతుందేమో శాంతానికి. బస్సులో కూచున్నంతసేపు టిక్కెట్టు జాగ్రత్తగా వుంచుతాం. బస్సు దిగిపోయాక టిక్కెట్టు పారేస్తాం. అలాగే స్వరాజ్యం వచ్చిందాకా ఖద్దరుధారణ సబబుగానే వుండొచ్చు స్వరాజ్యం వచ్చాకకూడా యెందుకు ఖద్దరు వేసుకోవడం? సీమలోకూడా ఖద్దరే వేసుకుంటానికి మొండిపట్టు పట్టుకద? నేను సీమలో నాన్న తద్దినం పెడతానంటే ఎంత లచ్చనంగా వుంటుందో - తను సీమలో పల్నాడు గుడ్డ కడతానంటే అంత లచ్చనంగా వుంటుంది. ఆ గుడ్డలేకనక కట్టుకుంటే ఆవిడతో నేను నలుగురిలో యెట్లా తిరిగేది? ఇంగిత జ్ఞానంవున్న మనిషి కాబట్టి మనసు కొంత మార్చుకుంటుంది - శాంతం స్వభావం నాకు తెలుసుగా!...అన్నట్టు - లాంక షైరులో బట్టలు మిల్లులలో ముప్పాతిక మూడువంతులు తాళాలు పడిపోయి ఆ జిల్లాల్లో నిరుద్యోగం ప్రబలంగా వుందిగా. పోనీ - మిడ్‌లాండ్సులో బొగ్గు పరిశ్రమని చూపిస్తా - పాశ్చాత్య నాగరికత బొగ్గు మీదేకదా ఆధారపడివుంది. అదీ వీలులేదే - బొగ్గు వ్యాపారం అంతా స్తంభించిపోయి - పనివాళ్లందరూ అతి దరిద్రంలో మునిగి వున్నారే! అయితే మాంచె - యార్కుషైరులోను వేల్సులోను ఛషైరులోను వున్న ఊర్లు ఇనుం పరిశ్రమ చూపిస్తా-ఇంగ్లండు గొప్పతనం అక్కడేగావున్నది? అక్కడా అదే కథగా - పొయ్యిల్లో నిప్పులేదు - బోయిలర్లలో ఆవిరిలేదు - గొట్టాల్లోనించి పొగ రావడంలేదు. పనివాళ్లు కూలినాలిలేక పెళ్లాం పిల్లలూ పస్తులుంటున్నారు. అయితేనేం - నౌకా నిర్మాణాశ్రయాలని చూపించొచ్చుగా - గ్లాస్గోలోనూ, న్యూకాసిలులోనూ, హల్లులోనూ, సండర్లాండులోనూ! అన్నట్టు - అక్కడకూడా పనులు మందగించి ప్రజలు మలమాడిపోతున్నారే! అసలు - పరిశ్రామిక నాగరికతలో వున్న విశేషమే అది - వాణిజ్యవలయం - బీద-మునగనూ గొప్ప తేలనూ - లాభాలు అధిక లాభాలు - పస్తూ సహంపస్తూ - గిరాకీ సగఫగా - పోటీలు దివాళాలు - బేరాలు సారాలున్నా - దయాదాక్షిణ్యాం లేకుండా - యథావిధిగా-జరగవలసిందే! అయినా-యీ దరిద్రం చూసి శాంతం అడ్డు ప్రశ్నలువేస్తే నేను జవాబు చెప్పలేను నాయనా! పామరులకి చెప్పొచ్చుకాని పండితుల నెవ్వ రొప్పించగలరు?

తిండి గుడ్డ కొంప డబ్బు సిరిసంపద - వీటి పంపకం అందరికీ యెందుకు సమానంగా జరగడం లేదూ - అని యక్ష ప్రశ్న వేస్తుంది శాంతం. ఎందుకు జరగాలి?-అని నేను అడ్డు ప్రశ్న వేస్తే తనకి కోపం! దేశంలో వున్న ధనం అంతా ముప్ఫై మూడు కోట్ల దేవతలకీ పంచేస్తే యేముంది? - మనిషికి పట్టుమని పది అర్థలుకూడా రావు. యీ పంపిణీ యెవడికి వుపకారం చేసినట్టు? అన్నయ్య ఇరవై లక్షలు గడించాడు. అతని తరువాత వదినె పిల్లలు నలుగురు వేరుపడిపోతే ఒక్కొక్కరికి చెరో నాలుగు లక్షలేనా రావు. యేం సుఖపడగలరు? యెప్పటిలాగు దర్జాగా గడుస్తుందా? ఆహితాగ్ని పాకయాజి వాజిన్యాజి సోమయాజుల వంశం కొంచెం సంకరం అవడంచేత - అన్నయ్య గారి పిల్లలకి మేధాసంపత్తి రాకపోయినా - పిత్రార్జితం వుంటుంది కాబట్టి ఉద్యోగాలు చెయ్యడం చేతకాకపోయినా - రక్వొర్ష్ఠపడకుండా వాళ్లు కాలక్షేపం చెయ్యొచ్చు. ...పొడుగు పొట్టి - లావు సన్నం - యెత్తూ పల్లం - కొండ లోయ - శిఖరం అఖా

తం - యెగుడు దిగుడు - గొప్ప పేద - ధనం దరిద్రం — విందూ పస్తూ - నవ్వూ యేడుపు - వుంటేనే అందం చందం! లేకుంటే - చదును చేసిన గచ్చునేలలాగు - చప్పిడి తిండిలాగు - కవితలేని నోళ్లలాగు - మొద్దు మనుష్యుల బండ జీవితం తయారవుతుంది దైవసృష్టికీ మూలప్రకృతికీ వ్యతిరేకంగా వెళుతాం అంటే యెలాగు? పాకీవాడికి పండితుడికి, పాచిపని చేసేవానికి సినీమా తారకి, వైస్రాయికి సైసుకి, సర్వసేనానికి సిపాయికి - వకటే జీతం అంటే యేడ్చినట్టే వుంటుంది. ప్లీడరు గుమాస్తాకి ప్రీవీ కౌన్సిలు జడ్జీకి వకటే జీతపురాళ్లు అంటే - నేనుప్లీడరు గుమాస్తా పనేచేస్తాను - అక్కరకు మాలిన కంఠశోష చిత్తక్షోభన్ను?... ఆఁ? పాతిక రూపాయిలే జీతం ముట్టినా ప్రీవీ కౌన్సిలు జడ్జీపనే చేస్తాను - నా తెలివి తేటలకి నా అఖండ ప్రజ్ఞకి మంచి అవకాశం వుంటుంది! గౌరవం - హోదా - అధికారం - పలుకుబడి - ఇవి వుంటే ఇక కావలసినదేముంది? జీతం యెందుకు? పూరికే చేస్తాను. నాకు నచ్చిన పని దొరికినప్పుడు - నా ప్రతిభ ప్రదర్శించడాని ప్రోత్సాహం కలిగినప్పుడు - మనస్సుకు యెంత ప్రశాంతంగా వుంటుంది! దేముడు వ్యక్తులందరికీ శక్తి ప్రపత్తులు వక్కలాగే యిచ్చాడా? నాలాంటి అన్నయ్యలాంటి యే కొద్దిమందికో యిచ్చాడు. వాళ్లు పైకివచ్చి మానవసేవ చెయ్యాలీ అంటే - రాబడిలో తారతమ్యం చూపించాలి. అప్పుడు యీ అతిరథులు మహారథులు దానకర్ణులు మాంధాతలు రాత్రిం బగళ్లు కష్టపడి, వ్యవహారం పకడబందీగా నడిపించి, వ్యాపారంలో చాకచక్యం చూపించి, లావాదేవీలు పొదుపుగా జరిగించబట్టే - వాళ్లు బొక్కసాల్లో కాస్త డబ్బు కూడబెట్టి - మిగిలినదంతా అందరికోసం సద్వినియోగం చేయగలుగుతున్నారు... ఇంగ్లండులోను అమెరికాలోను కుబేరులుండబట్టే నూటికి తొంబై తొమ్మండుగురు గర్భదరిద్రులున్నా ఆ దేశాలు అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నాయి. మన దేశంలోకూడా మహారాజాధిరాజులు కోటీశ్వరులూ బలిచక్రవర్తులు వుండబట్టేకదా - యెన్నో కోట్ల విలువగల భోగవిలాస వస్తువుల ఉత్పత్తి పరిశ్రమ వర్తకం సాగుతున్నాయి? యెన్ని సౌధాలు క్రీడా విహారాలు, యెన్ని గుళ్లు, గోపురాలు, యెన్ని మఠాలు, సత్రాలు, యెన్ని విద్యాపీఠాలు, ఆసుపత్రులు, యెన్ని సినిమా మందిరాలు, పందెపు రంగాలు - కట్టించి నడిపించి - కోట్లకొద్ది అద్దెలిచ్చి, లక్షలకొలది పన్నులు చెల్లించి, వేలాదివేల జనానికి జీతాలిచ్చి ఉపాధులు కల్పించి, దానాలు ధర్మాలుచేసి భృత్యుకోటికి లక్షాది దాసదాసీ జనానికి యింత గంజిపోసి పోషిస్తున్నారు? అంచేతే ప్రపంచంలో మనంకూడా మనుష్యులమే అని తలయెత్తుకుని తిరగ్గలుస్తున్నాం! దేశ సౌభాగ్యం అంతా అందరిమీద పంపిణీ చేసేస్తే - అందరం పేదరికం అనుభవించ వలసిందేకదా. అప్పుడు వీళ్లందరినీ పోషించేవాళ్లెవరు? ఇందరికీ నిరుద్యోగం ప్రాప్తించవలసిందేకదా?

భాగ్యవంతులందరూ రాకాసులు దుర్మార్గులు మదాంధులు కసాయివాళ్లు - అని గుమ్మెత్తిపోయడం వకవాడుకైపోయింది. ఆ రోజు పుదుచ్చేరిలో ఆ మిల్లువాళ్లని రాక్షసులు సైతానులనే తిట్టింది శాంతం! అన్నయ్యకి ఇరవై లక్షలున్నాయి - నాకు పది లక్షలున్నాయి. అన్నయ్య దుష్టుడా-రాక్షసా? నేనుదుర్మార్గుణ్ణా మదాంధుణ్ణా?

వద్దు మొర్రో - అంటూ తో సెస్తూన్నా - డబ్బు వాళ్లో కచ్చి పడుయుంటే - యేం చెయ్యం? అసలు ముప్పైవేలు రొక్కం బ్యాంకిలోనంచి తీసి యీ సీమ ప్రయాణం కోసం ఖర్చు పెట్టడమంటేనే పీక పిసుక్కున్నట్టుంది కదా నాకు - అటువంటిది నా కష్టార్జితం అందరికీ పంచి పెట్టేయమంటే నాకెంత యేడుపుగా వుంటుంది!... మొన్న బెంగాలులో బొగ్గుగని పేలి పదిమంది కూలివాళ్ళు అందులో కప్పడిపోయి చచ్చి పోయారు. ఆ బొగ్గుగని ఫణీంద్రబోసుది. ఫణీ నేను లండనులో కలసి చదువు కున్నాం. ఫణీ యెంత మంచివాడంటే - అంత మంచివాడు. వక దోమనికాని నల్లిని చంపడానికి అతనికి చెయ్యరాదు. శ్రీమంతుడని చెప్పి అతన్ని దుర్మార్గుడు క్రూరుడు అంటే న్యాయమేనా? ...శాంతం లాఠీచార్జీలో దెబ్బలు తిన్నప్పుడు పెరుమాళు మొదలియారు అధికారి. వెన్నలాంటిది అతని హృదయం. దేవేంద్ర పాళీయం ముఖాసాదారుకొడుకు, ఆగర్భశ్రీమంతుడు. బ్రాహ్మడు కాకపోయినా నాచునీచు వేలు వేసేనా ముట్టుకోడు. కొసకి వుల్లిపాయకూడా కాశీలో వదిలేశాడు. సిగరెట్టు పొగ తగిల్తే వాంతి చేసుకుంటాడు. మరావేళ ఉద్యోగరీత్యా కఠినమైన ఉత్తరవు యివ్వ వలిసొచ్చింది. ఆవేళే అతని భార్యా నీళ్లాడిందట, యేమున్నాసే ఇచ్చానని చెప్పాడు నాతో తరవాత పాపం! అతని గుండె రాయిరా పాషాణం అని - అతను మనిషికాడు మృగం అని తిడితే యెలాగు-అని నేనే అతన్ని వెనకేసుకొస్తాను!... శైలేంద్ర బారువ వున్నాడు. నాతోనే మిషిల్ టెంపిలులో చేరాడు - నాతో నే ప్యాసయ్యాడు. ఇద్దరం ఒక్క బసలోనే వున్నాం మూడేళ్ళున్నూ. లక్ష్మణుడు సీతమ్మవారి పాదాలనే చూసే వాడుట. అలాగ్గా శైలేంద్రుడు పరస్త్రీని కన్నెత్తి చూసి యెరగడు-మాస్తే యెక్కడ మతి చలించి పోతుందో అని. అంత పవిత్రమైన మనస్సు అతనిది. అస్సాములో వాళ్ళ కెన్నో తేయాకు తోటలున్నాయి. అతని కంతుడు సాలీనా నలభై వేలొస్తాయి. తోటల్లో కూలివాళ్ళు మగ ఆడ పిల్లజెల్ల వకొక్కక్కరు నెలకి యేడెనిమిది రూపాయలు గడించుకుంటూ హాయిగా వుంటారు. కాని - పాపం-వాళ్ళ వక్కరితోటల్లోనే సంవత్స రానికి రెండు మూడు వందల కూలీలు మలేరియా జ్వరంతో బాధపడి చచ్చిపోతారు. అలాగని చెప్పి-వీళ్ళందరి చావుకీ యితనే కారకుడు - వాళ్ళ రక్తాన్నితడు పీల్చేస్తు న్నాడు - నరహంతకుడు అని ఆడిపోస్తే న్యాయమేనా ?

...జర్మనీలోనూ ఇటలీలోనూ నిరుద్యోగంలేదు — అక్కడ పరిస్థితులు మంచి ఉత్సాహంగా వుంటాయి. అక్కడ చూపిస్తాడు శాంతానికి పారిశ్రామిక నాగరికత యొక్క మహిమ సంపదాన్ను!... లండనులో కూడా కొన్ని స్థలాలు చూపించ కూడదు శాంతానికి. ఈస్టెండు - డాక్ ల్యాండు - పోప్లరు-కేననుస్ట్రీటు-ఆ దుర్గంధం— కుళ్లు — దరిద్రం—భండాలం — అధోగతి-చూస్తే-ఎవరికేనా నిరుత్సాహమే వేస్తుంది... లండనులో బ్రిటిషు మ్యూజియం-వెస్టెండు-రీజంటుస్ట్రీటు - పిక్కడిల్లీ-భూమి అడుగున రైలు-రాత్రిపూట అప్సెఫర్డు సర్కసులో ఎలెక్ట్రిక్కు ఎడ్వరుటైజుమెంట్లు-బాండు స్ట్రీటులో షాపులు రెస్టారెంటులు హోటేళ్ళు రాజ భవనాలు - ఇవి చూస్తే - శాంతం

గుమ్మైపోతుంది. "మరెక్కడకీ వెళ్ళొద్దు-శాశ్వతంగా ఇక్కడే కాపురం వుండిపోదాం అంటుందేమో కూడాను! ...శాఖాహారవ్రతం మంచితీర్థం నియమం-శాంతంతో గట్టి చిక్కు వచ్చిపడింది. అక్కడమాత్రం వ్రతభంగం అవుతుందని సత్యాగ్రహం చెయ్యకుండా చూడాలి! నేను యేర్పాట్లన్నీ బహుజాగ్రత్తగా చెయ్యాలి .. నా పాత స్నేహితురాండ్రు యిప్పుడు ఎవరున్నారో అక్కడ? మేరీగార్డను యింకా ఆ సిగరెట్టు షాపులోనే వుంటుందా? సౌందర్యానికి నిజంగా సత్యభామే కాని - ఆ టక్కరి తనానికి మళ్లీ రెండో చిత్రాంగే! నేడీమించిన యింకా వైటుహాలులో టైపిస్టుగానే కూమంటుందీ? యే సెక్రెటరీనో యెరపెట్టి వలలో పడేసుకుని వుంటుంది. అచ్చు మంథరే - గడుసు భడవ! జీను హేంఘ్సు యీ పాటికి హోటేలు మేనేజరై పోతుంది. ఆ వేళ రిచ్చిమండు పార్కులో నన్ను వెర్రెత్తించేసిందిగా-సంగనాచి; మార్జిసింగిల్టన్కు నేనింకా జ్ఞాపకం వుంటానా? కాలేజీలో నా ప్రక్కనే కూర్చునేది చాపకింద నీరు లాగుండేది-అటువంటిది ఆవేళ వాటర్లూలో పదిమందిముందర నన్ను ముద్దు పెట్టుకుంటే బెంబేలెత్తి పోయాను. రూపంలో రంభతో సమానం అయినా సత్యకాలపుర్రది పాపం – ఎక్కడుందో? ఆ ఉలూచి డివన్ షైరులోనే వుంటే – అటువైపే వెళ్ళకూడదు నేను. వెళితే మళ్ళీ చుట్టుకుంటుంది. ఎందుకొచ్చిన ఘోష! అయినా. వీళ్ళందరినీ శాంతానికి చూపించేదేమిటి? పాపం- వేరాజాన్సుస్టన్ చచ్చిపోయింది! శాంతానికి ఆ అమ్మాయి సమాధి గోల్డర్సు గ్రీనులో చూపిస్తాను.

ఇటలీ వెళితే హేన్నీని కలుసుకోవాలి! కౌంటెస్సు కనా - శాంతానితో పరిచయం చేసినా తప్పులేదు-అందులోకీ యీమధ్య ముస్సోలినీ క్రింద మంత్రి కూడా అయాడు – హెన్నీ పెనిమిటి! అన్నట్టు బొంబాయినుంచి హెన్నీకి టెలిగ్రాం వేసి బ్రిండిసీ దగ్గిర కలుసుకోమనాలి - ఇటలీలో మనకి ఖర్చు కలిసొస్తుంది! మంత్రిగారి దగ్గిరనుంచి వుత్తరాలు తీసుకు వెళితే- జర్మనీలో మనకి బ్రహ్మరథం పడతారు. మనకు కానీ చేతిది తగులదు కూడా! హిట్లరుజర్మనీని చూసిందంటే - అప్పుడు బోధపడి పోతుంది శాంతానికి-నాజీ సోషలిజానికిన్నీ, నకిలీ సోషలిజానికిన్నీ వున్న తేడా! అసలు ఇంగ్లండులోనే కొందరు హిట్లరుని చూసి మెచ్చుకొంటూంటే - మనం వాళ్లని చూసేనా నేర్చుకోవద్దా?.. శాంతం హిట్లరుని చూడనంటుందేమో? ..అన్నట్టు అశ్వద్ధ నారాయణమూర్తీ తీర్థగిరి యిద్దరూ సుభిమీద కన్నువేసినట్టుంది. కరటకదమనకులు - వీళ్ళిద్దరూ దాంతో యీమధ్య తరుచుగా బాతాఖానీ చెయ్యడం కనిపెట్టాను. పరాయివాళ్లు అని నయం భయం లేకుండా వాళ్ళిద్దరితోనూ తణుకూబెణుకూ లేకుండ ఇంగ్లీషున మాట్లాడేస్తూంది. దాంతో మాటలాడడానికి వాళ్లకేం సంగతులుంటాయో? ఏముంది వకటే సంగతి - వకటే పల్లవి- వకటే రాగం! తమాషా - మనకి ఇంగ్లీషు రాజభాషే కాకుండా మన్మథ భాష కూడా అయిపోయింది! శుభ యవ్వనం యీ కుర్రవాళ్ల కళ్ళకి మిరుమిట్లు గొలుపుతూంది కుర్రాళ్లేమిటి -పెద్దాళ్లేమిటి-యీ అమ్మాయి యింట్లో తిరుగుతూండడం చూస్తూంటే - హనుమంతుడికే మతిపోతుంది. భీష్ముడి చిత్తమే చిత్తయిపోతుంది! వేరాజాన్స్టన్-హెన్నీ సల్లివన్-లేడీ అయ్యంగారు-ఊర్వశీమిత్ర-వీళ్ళందరినీ

దూరంగా వుంచగలిగేను. అసలు పిరికి వాడిని కాబట్టి నాకు ఫరవాలేదు. శాంతం అంటే అది వేరేకథ. శాంతం అపరంజి! చింతామణి! కామధేనువు! కల్పతరువు! సంజీవి! నేను మొదటే అన్నాను శాంతంతో-మనకేనా మంచిదికాదు-ఎదిగినపిల్లని యింట్లో పెట్టుకుంటే-లోకానికీ వ్యగ్రతగా వుంటుందీ-అని. శాంతంతో చెప్పి యీ కుర్రాళ్ళ నిద్దరిని కొంచెం ప్రోత్సాహం చేస్తే - యెవరో వకరు సుభని చేసేసుకుంటారు - దాంతో వక చికాకు తీరిపోతుంది. యిద్దరూ స్మార్తులేకుడాన్ను! శాంతం ప్రావిడెంటు ఫండు ఐదువేలున్నా తను సుభ వొంటిమీదకి చేయించిన జవాహిరీ ఐదువేలున్నా కట్నం కింద యిచ్చి సాలంకృత కన్యాదానంచేస్తాం అంటే మొగ్గలేసుకుంటూ పందేలు వేసుకుని పరుగెత్తుకొస్తారు. అందులోకీ - యూరపు వెళ్ళి వచ్చిందంటేను - ఆ ఇంగ్లీషు మాటలకి తోడు ఫ్రెంచి ముక్కలు నాలుగు జతచేసి మాట్లాడిందంటేను - యే ఇంపీరియలు సర్వీసు వాడో కోరి చేసుకుంటాడు. మనం పెట్టిన డబ్బు గిట్టుబడి అవుతుంది — ఇంపీరియల్ సర్వీసు అల్లుడు దొరికితే!

అప్పుడే హాట్టీదాటిపోయాం. ఈ సీమ ప్రయాణం అంతా సరిగ్గా జరిగిపోతే బాగుండును. సరిగ్గా అంటే - వకటి: ఈ ఐదారునెలలూ శాంతంతో హాయిగా సరదాగా గడపడం - రెండు: యీ వ్యాజ్యం గెలవడం. దాన్లో నాకు సుతరాం సందేహంలేదు. నా వాదవలని విష్ణుమూర్తి సహా పాంచజన్యం పూరించి సుదర్శనాన్ని త్రిప్పికౌమోదకిని విసరి నందకంతో సాముచేసి శార్ఙ్గ్యాన్ని వదలినా ఖండించడానికి వీలులేదు. మూడు: నేనీ వకాల్తీ పట్టడంలో చూపించిన స్వార్థరాహిత్యం — చాణక్య తంత్రం — యుగంధరయుక్తీ-సఫలీకృతం కావడం. యీ రాజకీయం చూస్తూంటే యేదియేలాగు తేలుతుందో అగమ్యగోచరంగా వుంది. బ్రిటిషువాడిదే కనక క్రిందిచెయ్యి అయిపోతే వాడుకాళ్ళ బేరానికొచ్చేసి - యీ మహారాజులనీ రాజాధిరాజులనీ చల్లగా జార్చేస్తాడు. వీళ్ళ ప్రాపకం నేను అప్పుడు వదలుకుంటే మునిగిపోతూన్న నావని ఎలుకలు వదిలేసినట్టు బయలుపడి పోతాను. స్వార్థత్యాగం చూపించి యిప్పుడేగనక మనం యిటువైపు మొగ్గితే గొప్ప దేశభక్తి చూపించి బీద రైతులని వెనుక వేసుకొచ్చిన వాళ్ళల్లో జమ అవుతాను. యీప్రాయశ్చిత్తకర్మతో వెనకచేసిన పాపాలన్నీ కొట్టుకుపోతాయి. దేముడు మేలుచేసి-రైలుదగ్గిర కురవిళ్ళ అన్నట్టూ రేపు స్థాపించబోయే ఫెడరల్ కోర్టు బెంచి మీదే కూర్చోవచ్చు! అథవా తెల్లవాడిదే పైచెయ్యి అవుతుందీ - "లా"లో నా తెలివి తేటలూ నా ఏలేశ్వరోపాధ్యాయత్వం గ్రహించి వాడే నన్ను పిలిపించి: 'అబ్బాయీ - నువ్వు ఉపద్రుడవు-మాకు పక్కలో బల్లెంలాగున్నావు. నీకే వరం కావలిస్తే ఆ వరం ఇస్తాం - కోరుకో!' అంటారు. అప్పుడు నేను యేకంగా — హనుమంతుడు ఒక్క గెంతున వారధిదాటి లంకాపట్నంలో పడ్డట్టు - హైకోర్టు ఫెడరల్ కోర్టు సుప్రీముకోర్టు అన్నీ వక్కలఘువ్వలో దాటేసి ప్రీవీకౌన్సిలు బెంచి మీదే - మత్స్యేతిష్ఠతి మాధవః అన్నట్టు - బైటాయించొచ్చు! అప్పుడు శాంతంమాత్రం యేమంటుంది? శభాష్ అని మెచ్చుకుంటుంది!

రైలు అట్టడవిలోనుంచి పోతూంది. కికారణ్యం. దండకారణ్యం. సెలయేరు. యేటి మధ్యని చాపరాయి. విశ్వనాథవారి కిన్నెరసాని పాట జ్ఞాపకం వచ్చింది: "వనములను దాటి - వెన్నెల బయలుదాటి - తోగులునుదాటి - దుర్గమాద్రులను దాటి-పులులయడుగుల నడుగులు కలుపుకొనుచు రాళ్ళవాగుదాటి పథాంతరములుదాటి"... పాటతల్చుకుంటే కళ్ళంట నీళ్ళొస్తున్నాయి. శాంతం - నేను! పదేళ్ళయింది-కోరివరించి పెళ్ళిచేసుకొని. కష్టం సుఖం అనుభవించాం. వకరి ప్రేమకు వకరం పాత్రులంఅయాం. కొంగు కొంగూ పట్టి సరిగంగ స్నానాలు చేశాం - సంసారం యీదుతున్నాం - యీ జీవయాత్ర చేస్తున్నాం...ఈ ఇంగ్లండు యాత్ర మళ్లీ రెండో తేనె వెన్నెలరోజుల్లాగు అనుభవించాలి! ....

ధాణాస్టేషను దాటిపోయాం! ఇంకేముంది - మరో గంటకల్లా బొంబాయి - మరో అరగంటకల్లా - శాంతం! ... ... ...

......స్టీమరు "మూరిటేనియా": చీకటి పడిపోయింది. చీకటిలో హిందూదేశం మాయం అయిపోయింది. నడిసముద్రం. వెచ్చనిగాలి. వసారాఅంచున ఇనుపస్థంభాలని ఆనుకుని నిలబడ్డాం. శాంతం నాచేతిలో తనచెయ్యి వేసింది. ఆ చెమ్మగాలిలో-శాంతం తల వెంట్రుకలు నామెడని పెనవేసుకుంటున్నాయి. సముద్రం ప్రశాంతంగా కొల్లేరు సరస్సు లాగుంది. మత్స్యకన్యలు తళుకు తళుకు మని మెరుస్తూ జలకం ఆడుకుంటున్నాయి. మా ప్రక్కనుంచి స్టీమరొకటి వెళ్లింది.

వేరాజాన్‌స్టన్ ఎప్పుడూ పద్యం వకటి చదివేది. అదే జ్ఞాపకం వచ్చింది. శాంతం చెవిలో చెప్పా:

"నడిరేయి నడి సముద్రంలో కారుచీకటిలో నౌకలు రెండు కలుసుకున్నాయి. అంధకారంలో రెండు నౌకలూ కనుసైగచేసుకున్నాయి. మిణుగురు దీపాలతో ఒకదాని నొకటి పలుకరించుకున్నాయి. ఒక్కక్షణమే. రెప్పపాటే. తిరిగి చీకటిలో లీనమై పోయాయి."

శాంతం వక గీతం పాడింది:

"అనంతసముద్రం అట్టడుగున ఆణిముత్యాలు జోడు
సముద్రపుటొడ్డున ఆల్చిప్పలజత
కాలవాహినిలో పిల్లకెరటాలజంట
సూర్యరేఖలో రెపరెపలాడే రేణులు రెండు
తామరకొలనున తలలూచే తెల్లకలువ ఎర్రకలువ
గగనపథాన్న మెరుపులు మెరసే తారాద్వయం
యీ విశ్వరూప ప్రపంచంలో - నువ్వు నేను!"

---

